గే॥ ఏదితెలిసికొని యశుభంబుల
నెల్ల పీవిడువగలవో
అతిరహస్య మనుభవజ్ఞాన
మంత తెలిపెదపూర్తిగా
అసూయా రహితుడవగు పార్థా
ఆలకింపుము శ్రద్ధతో
అని కిరీటికి ॥శ్రీహరిని

2) శ్లో॥ రాజవిద్యా రాజగుహ్యం
పవిత్రమిద ముత్తమమ్
ప్రత్యక్షావగమం ధర్మ్యం
సుసుఖంకర్తు మవ్యయమ్

ప.వి. రాజవిద్యా, రాజగుహ్యం, పవిత్రం, ఇదం, ఉత్తమం, ప్రత్యక్షావగమం, ధర్మ్యం, సుసుఖం, కర్తుం, అవ్యయం.

టీ॥ ఇదం - ఈబ్రహ్మజ్ఞానము, రాజవిద్యా-విద్యలలో శ్రేష్ఠమైన దియును, రాజగుహ్యం - రహస్యములలో నతిరహస్యమైనదియును, ప్రత్యక్షావగమం - ప్రత్యక్షానుభవముచేత తెలియదగినదియును, ధర్మ్యం-ధర్మమును తప్పనిదియును, కర్తుం-చేయుటకు, సుసుఖం-మిక్కిలి సులభమైనదియును, అవ్యయం-నాశములేనిదియును

గ॥ అర్జునా యీ బ్రహ్మజ్ఞానము, విద్యలలోకెల్ల శ్రేష్ఠమైనది, అతిరహస్యమైనది, మిక్కిలి పవిత్రమైనది, సర్వోత్కృష్టమైనది, ప్రత్యక్షముగ తెలియదగినది, ధర్మయుక్తమైనది, నాశరహితమైనది, సులభముగా అభ్యసించుటకనుకూలమైనది

ప॥తే॥ అతిరహస్యముత్తమమునౌ-అన్నివిద్య
లందు, శ్రేష్ఠంబు, పావన-మైనయదియు
స్వానుభవముచేత, తెలిసి-కొనదగినది
అవ్యయము ధర్మయుక్తంబు-నభ్యసింప
చాలసులభమీ జ్ఞానము-సవ్యసాచి

గే॥ పరమశ్రేష్ఠము పరమగోప్యము
పావనంబగు జ్ఞానముగా
అతిసుఖబోధక మవ్యయంబు
నభ్యసింపగ సులభమై
ధర్మయుక్తంబైన దానిని
మర్మమెరుగుము తెలిపెదగా
అని కిరీటికి ॥శ్రీహరిని

3) శ్లో॥ అశ్రద్దధానాః పురుషా
ధర్మస్యాస్య పరంతప
అప్రాప్యమాం నివర్తంతే
మృత్యుసంసార వర్త్మని

ప.వి. అశ్రద్దధానాః, పురుషాః, ధర్మస్య, అస్య, పరంతప, అప్రాప్య, మాం, నివర్తంతే, మృత్యుసంసారవర్త్మని

టీ॥ పరంతప-ఓయర్జునా, అస్య-ఈ, ధర్మస్య-ధర్మముయొక్క-అశ్రద్దధానాః-శ్రద్ధలేని, (సంశయాత్ములైన) పురుషాః-పురుషులు, మాం-నన్ను, అప్రాప్య-పొందక, మృత్యుసంసారవర్త్మని-మృత్యు రూపమైన సంసారమార్గమందు, నివర్తంతే-మరలుచున్నారు ..

గ॥ అర్జునా నా ఆత్మజ్ఞానరూపమైన ఈధర్మమును, విశ్వసింపని మనుష్యులు, నన్నుపొందక, మృత్యురూపమైన సంసారమార్గమందు మరలుచున్నారు

ప॥తే॥ ఇట్టి ధర్మంబునమ్మని-యీ పురుషులు
పొందజాలకనను, వీరు-పుట్టి, చచ్చి
మరణరూపమౌ సంసార-మార్గమందు
తిరుగుచుందురు ఫల్గునా-తెలివిలేక

గే॥ ఆత్మధర్మము విశ్వసింపక
అజ్ఞులైనను పొందక
మృత్యురూప సంసారత్రోవల
మునిగితిరుగుదురర్జునా
అని కిరీటికి ॥శ్రీహరి॥

4) శ్లో॥ మయా తతమిదంసర్వం
జగ దవ్యక్తమూర్తినా
మత్‌స్థాని సర్వభూతాని
నచాహంతేష్వవస్థితః

ప.వి మయా, తతమ్, ఇదం, సర్వం, జగత్, అవ్యక్త మూర్తినా, మత్‌స్థాని, సర్వభూతాని, న, చ, అహం, తేషు, అవస్థితః..

టీ॥ అవ్యక్తమూర్తినా-ఇంద్రియగోచరముగాని స్వరూపముగల మయా-నాచేత సర్వం-సమస్తమైన. ఇదంజగత్-ఈజగత్తు. తతం-వ్యాప్తమైనది. సర్వభూతాని-సమస్తప్రాణులు. మత్స్థాని-నాయందున్నవి. అహంచ-నేనన్ననో. తేషు-ఆభూతములయందు. నఅవస్థితః-ఉన్నవాడనుకాను

గ॥ అర్జునా ఇంద్రియగోచరముగాని స్వరూపముగలనాచేత, యీ సమస్త జగత్తు వ్యాప్తమైయున్నది. సమస్త భూతములు నాయందున్నవి నేనాభూతములయందున్నవాడనుకాను

ప॥తే॥ ఇంద్రియాలకు గోచర-మెపుడుగాక
అఖిలజగములవ్యాప్త-మై-యలరుచుండు
అన్నిప్రాణులకాశ్రయ-మగుదునేను
వానియందున, లేకుందు-నేనుయెపుడు

గే॥ అవ్యక్తమగు, నారూపమున
అఖిలజగములు, భూతముల్
నిలిచియుండునాలో నెపుడు
నేనుయుండను వానిలో

అని కిరీటికి ॥శ్రీహరిని

5) శ్లో॥ నచమత్స్థాని భూతాని
పశ్యమే యోగమైశ్వరం
భూతభృన్నచ భూతస్థో
మమాత్మా భూతభావనః ....

ప.వి. న, చ, మత్స్థాని, భూతాని, పశ్య, మే, యోగం, ఐశ్వరం, భూతభృత్, న, చ, భూతస్థః, మమ, ఆత్మా, భూత భావనః

టీ॥ భూతాని-భూతములు (ప్రాణులు) మత్స్థాని + న + చ-నాయందుండునవికావు. మే - నాయొక్క, ఐశ్వరం - ఈశ్వరసంబంధమైన, యోగం-యోగమును, పశ్య-చూడుము, మమ-నాయొక్క, ఆత్మ-స్వరూపము, భూతభృత్-భూతములను (ప్రాణులను) భరించునదియును, భూతభావనః + అపి-ప్రాణులను పుట్టించు రక్షించునదియునైనను, భూతస్థః* + న + చ-ప్రాణులయందుండునదికాదు

* భూతభావనః-భూతలను ఉత్పత్తిచేయు అనియు అర్థమున్నది.

గ॥ అర్జునా సమస్త భూతములు నాయందుండునవికావు, నాయొక్క యీశ్వరసంబంధమైన యోగమహిమను చూడుము, నాయొక్క ఆత్మ భూతములను భరించునదియు, రక్షించునదియునైనను ప్రాణికోట్లయందుండునదికాదు

ప॥తే॥ భూతములులేవు నాయందు-భూతములను
పుట్టజేయును నాయాత్మ-పోషణమును
సలుపుచుండును, వానిలో-నిలువదెపుడు
చూడు నాయోగమహిమంబు-భూరవర్య

గే॥ బ్రహ్మమొదలుగ స్థావరాంతము
ప్రాణులన్ని భరించుచు
నేనెచేయుచునుంధు వృద్ధియు
కానివానిలోనుండనే

అబ్బురంబగు నాదుమహిమను
అర్జునా పరికించుమా
అని కిరీటికి ॥శ్రీహరిని

6) శ్లో॥ యథాఽఽకాశస్థితో నిత్యం
వాయుస్సర్వత్రగో మహాన్
తథాసర్వాణి భూతాని
మత్స్థానీత్యుప ధారయ

ప.వి. యథా. ఆకాశస్థితః. నిత్యం. వాయుః. సర్వత్రగః. మహాన్. తథా. సర్వాణి. భూతాని. మత్స్థాని. ఇతి. ఉపధారయ.

టీ॥ యథా-ఏప్రకారముగా. సర్వత్రగః-అంతటవ్యాపించియున్న మహాన్ - అధికమైన. వాయుః - వాయువు. నిత్యం - యెల్లప్పుడు. ఆకాశస్థితః - ఆకాశమందున్నదో. తథా - ఆప్రకారముగా. సర్వాణి భూతాని-సమస్తప్రాణులు. మత్స్థానిఇతి-నాయందున్నవని. ఉపధారయ-తెలిసికొనుము

గ॥ అర్జునా అంతటను సంచరించుచున్న గొప్పదగు వాయువు నిత్యము ఆకాశమునందేవిధముగానున్నదో. ఆవిధముగా సమస్త భూతములు నాయందున్నవని తెలిసికొనుము .

ప॥తే॥ అంతటను వ్యాప్తమైయున్న-యధికమైన
వాయువేరీతి, నభమున-వఱలుచుండు
నావిధంబుగ భూతంబు-లన్నియెపుడు
నిలిచియుండు నాయందని-తెలిసికొనుము

గే॥ అంతటను వ్యాపించువాయువు
ఆకసంబున కంటకా
యేవిధంబున యణగియున్నదో
యెల్ల భూతములావిధీ
లీనమై నాయందునుండును
నేనుయుండను వానిలో
అని కిరీటికి ॥శ్రీహరి॥

7) శ్లో॥ సర్వభూతాని కౌంతేయ
ప్రకృతింయాంతి మామికాం
కల్పక్షయే, పునస్థాని
కల్పాదౌ, విసృజామ్యహమ్.

ప.వి సర్వభూతాని, కౌంతేయ, ప్రకృతిం, యాంతి, మామికాం, కల్పక్షయే, పునః, తాని, కల్పాదౌ, విసృజామి, అహం .

టీ॥ కౌంతేయ - అర్జునా, కల్పక్షయే - కల్పాంతమందు, సర్వభూతాని-సమస్తప్రాణులు, మామికాం - నాసంబంధమైన, ప్రకృతిం-త్రిగుణాత్మమగు మాయను, యాంతి-పొందుచున్నవి, అహం-నేను, కల్పాదౌ - కల్పారంభమునందు, తాని - ఆసర్వప్రాణులను, పునః-మరల, విసృజామి-పుట్టించుచున్నాను .

గ॥ అర్జునా కల్పాంతమందెల్ల ప్రాణులు నాకు సంబంధించిన ప్రకృతిలో లీనమైపోవుచున్నవి. నేను కల్పారంభమందు మరల ఆసర్వప్రాణులను పుట్టించుచున్నాను

ప॥తే॥ ప్రళయకాలంబునందెల్ల - ప్రాణిచయము
నాదగుప్రకృతిలోన లీ-నంబుపొందు
అన్నిప్రాణుల కల్పాది-యందునేను
సంభవింపగ జేయుదు-సవ్యసాచి

గే॥ అన్నిప్రకృతిలో కల్పాంతమున
అణగిపోవును లీనమై
పుట్టించెదనే కల్పాదిని
భూతములనన్నింటినిఁ
అని కిరీటికి ॥శ్రీహరిని

8) శ్లో॥ ప్రకృతింస్వా మవష్టభ్య
విసృజామి పునః పునః
భూతగ్రామ మిమంకృత్స్న
మవశం ప్రకృతేర్వశాత్ ....

ప.వి ప్రకృతిం, స్వామ్, అవష్టభ్య, విసృజామి, పునః, పునః, భూతగ్రామం, ఇమం, కృత్స్నం, అవశం, ప్రకృతేః, వశాత్

టీ॥ స్వాం-స్వకీయమైన, ప్రకృతిం - మాయను, అవష్టభ్య-స్వాధీనముచేసికొని, అవశం - అస్వతంత్రమైన, ఇమం - ఈ, కృత్స్నం-సమస్తమైన, భూతగ్రామం-భూతసముదాయమును, పునః పునః-మరలమరల, ప్రకృతేః-ప్రకృతియొక్క, వశాత్-వశమువలన, విసృజామి-పుట్టించుచున్నాను ...

గ॥ అర్జునా స్వకీయమైన మాయను స్వాధీనపరచుకొని అస్వతంత్రమైన సమస్త ప్రాణులను ప్రకృతి వశమువలన నేను మరల మరల పుట్టించుచున్నాను

ప॥తే॥ స్వీయమైనట్టి ప్రకృతిని-చేపికొనుచు
వశము, నవశులౌ ప్రాణుల-ప్రకృతి వశత
సారెసారెకు, పుడమిపై-సంభవంబు
సలుపుచుందు, నేనెపుడును-సవ్యసాచి

గే॥ స్వకీయంబగు మాయనునేను
స్వాధీన పరచుకొనుచు॥
అవనిపైపుట్టింతు మరిమరి
అస్వతంత్రపు ప్రాణుల॥

9) శ్లో॥ నచమాంతాని కర్మాణి
నిబధ్నంతి ధనంజయ
ఉదాసీన వదాసీన
మసక్తంతేషు కర్మసు....

ప.వి. న, చ, మాం, తాని. కర్మాణి, నిబధ్నంతి, ధనంజయ, ఉదాసీనవత్, ఆసీనమ్, అసక్తం, తేషు. కర్మసు

టీ॥ ధనంజయ - అర్జునా. తేషుకర్మసు - ఆకర్మములయందు, అసక్తం-సంగములేనివాడను, ఉదాసీనవత్-తటస్థునివలె, ఆసీనం-ఉన్నట్టి. మాం-నన్ను. తానికర్మాణి-ఆకర్మములు. ననిబధ్నంతి-బంధింపవు

గ॥ అర్జునా ఆకర్మములయందు, సంగములేనివాడను, తటస్థుని వలెనుండు వాడనగు నన్ను ఆకర్మములు బంధింపవు

ప॥తే॥ అట్టి కర్మంబులందునే-నాశలేని
వాడనై, తటస్థుడనైన-వాడనగుట
వలన, యాకర్మములునాకు-కలుగజేయ
జాలవెపుడును బంధంబు-సవ్యసాచి

గీ॥ లేదుప్రీతియు లేదులక్ష్యము
లేశమును కర్మములలో
ఈకర్మలునను బంధింపవు
యెంతమాత్రము భారతా
అని కిరీటికి ॥శ్రీహరిని

10) శ్లో॥ మయాధ్యక్షేణ ప్రకృతిః
సూయతే సచరాచరం
హేతునాఽనేన కౌంతేయ
జగద్విపరివర్తతే ....

వ.వి. మయా, అధ్యక్షేణ, ప్రకృతిః, సూయతే, సచరాచరమ్, హేతునా, అనేన, కౌంతేయ, జగత్, విపరివర్తతే . .

టీ॥ కౌంతేయ-ఓయర్జునా, అధ్యక్షేణ-అధ్యక్షుడనైన, మయా-నాచేతను, ప్రకృతిః-త్రిగుణాత్మకమెన మాయ, సచరాచరం-చరాచరములతోగూడ సమస్త జగత్తును, సూయతే - పుట్టించుచున్నది, అనేన-ఈ, హేతునా-కారణముచేత, జగత్-జగత్తు, విపరివర్తతే-ప్రవర్తించుచున్నది.

గ॥ అర్జునా అధ్యక్షుడనైన నాచేతనే, ప్రకృతి యీచరాచరము లగు సమస్త ప్రాణులను పుట్టించుచున్నది. ఆకారణముచేతనే జగత్తు ప్రవర్తించుచున్నది.

ప॥తే॥ సాక్షిభూతుడౌ నాచేత-సచర మచర
ములగు, సర్వభూతములను-పుట్టునట్లు
చేయుచుండును ప్రకృతియే-శిష్టచరిత
అట్టి హేతువు చేతనే-యఖిలమైన
జగము వర్తిలుచున్నది-సవ్యసాచి

గే॥ సాక్షిభూతంబైన నాచే
సచరాచర ప్రాణులకా
ప్రకృతియే పుట్టించుచున్నది
పాండునందన నిత్యముగా
ఆకారణముచేత జగంబు
అన్నివర్తిలు భారతా
అని కిరీటికి ॥శ్రీహరిని

11) శ్లో॥ అవజానంతి మాంమూఢా
మానుషీంతను మాశ్రితమ్
పరంభావ మజానంతో
మమభూత మహేశ్వరమ్

ప.వి. అవజానంతి, మాం, మూఢాః, మానుషీం, తనుం, ఆశ్రితం. పరం, భావం, అజానంతః, మమ, భూతమహేశ్వరమ్,

టీ॥ మమ-నాయొక్క, పరం-ఉత్తమమైన, భావం-భావమును, భూతమహేశ్వరం - భూతములనియంతను, అజానంతః - తెలియని, మూఢాః-మూఢులు, మానుషీం-మనుష్యసంబంధమైన, తనుం-దేహమును, ఆశ్రితం-ఆశ్రయించిన, మాం-నన్ను, అవజానంతి-అవమానించుచున్నారు,

గ॥ అర్జునా పరమోత్కృష్టమైన, ప్రాణి, నియామకమైన నాయొక్క తత్వమును తెలియనట్టి మూఢులు, నన్ను మనుష్యదేహము నాశ్రయించిన వానినిగా. అవమానించుచున్నారు

ప॥తే॥ ప్రాణులను, నియమించెడి-వాడనసియు
పరమశ్రేష్ఠుడననుచు, న-న్నరయలేక
నాదుతత్వంబు తెలియక-నన్ను మూఢు
లై, మనుజదేహమొందగ-నవమతినను
సలుపుచుండిరీ, మనుజులు-సవ్యసాచి

గే॥ ప్రాణులను నియమించువాడై
పరమశ్రేష్ఠుండైన, నే
పొందియుండగ మనుజదేహము
మూఢులై నను తెలియక౯
నన్నలక్ష్యము చేయుచుండిరి
నాదుతత్వమెరుంగక౯
అని కిరీటికి ॥శ్రీహరి॥

12) శ్లో॥ మోఘాశా మోఘకర్మాణో
మోఘజ్ఞానా విచేతసః
రాక్షసీ మాసురీంచైవ
ప్రకృతిం మోహినీంశ్రితాః .

ప వి మోఘాశాః, మోఘకర్మాణః, మోఘజ్ఞానాః, విచేతసః, రాక్షసీం. అసురీం, చ. ఏవ. ప్రకృతిం. మోహినీం, శ్రితాః

టీ॥ మోఘాశాః - వ్యర్థములైన ఆశలుగలవారును, మోఘకర్మాణః-వ్యర్థములైన కర్మలుగలవారును, మోఘజ్ఞానాః-వ్యర్థములైన జ్ఞానముగలవారును, విచేతసః-మూఢులును, మోహినీం-మోహజనకమైనట్టిదియును, రాక్షసీం-హింసారూపమైన, ఆసురీం-అసురసంబంధమైన, ప్రకృతిం-స్వభావమును, శ్రితాః-అశ్రయించినవారగుచున్నారు

గ॥ అర్జునా వ్యర్థములైన ఆశలుగలవారును వ్యర్థములైన కర్మములుగలవారును, వ్యర్థములైన జ్ఞానముకలవారును, మూఢులు, రాక్షస సంబంధమును. అసురసంబంధమునైన, ప్రకృతిని ఆశ్రయించిన వారగుచున్నారు

ప॥తే॥ వ్యర్థమైనట్టి యాశలు-వ్యర్థకర్మ
వ్యర్థమౌ జ్ఞానముగలుగు-వారు, మూఢు
లై, యసురరాక్షసీ భావ-మైన, ప్రకృతి
నాశ్రయించుచు నుండెద-రన్నిగతుల

గే॥ వ్యర్థమగు జ్ఞానంబుచేతను
వ్యర్థమగు కర్మంబుచే

వ్యర్థమగు పేరాసచేతను
　　వ్యర్థులై చెడిపోవుచుణా　　॥శ్రీ॥
ఆశ్రయించెడి వారలగుచును
　　అసురరాక్షస గుణములణా
మూఢులై నను లక్ష్యపెట్టరు
　　పొంది ప్రకృతి స్వభావముణా
అని కిరీటికి　　॥శ్రీహరి॥

13) శ్లో॥　మహాత్మానస్తుమాం పార్థ
　　దైవీంప్రకృతి మాశ్రితాః
భజంత్యనన్య మనసో
　　జ్ఞాత్వాభూతాది మవ్యయం ....

ప వి.　మహాత్మానః, తు, మాం, పార్థ, దైవీం, ప్రకృతిం, ఆశ్రితాః, భజంతి, అనన్యమనసః, జ్ఞాత్వా, భూతాదిం, అవ్యయం.

టీ॥　పార్థ-అర్జునా, మహాత్మానస్తు-మహాత్ములు, దైవీ-దేవతా సంబంధమైన, ప్రకృతిం-స్వభావమును, ఆశ్రితాః-ఆశ్రయించినవారలై భూతాదిం - భూతములకాదికారణమైన, అవ్యయం - నాశరహితుడైన, మాం-నన్ను, జ్ఞాత్వా-తెలిసికొని, అనన్యమనసః - ఇతరచింతలులేని వారై, భజంతి-భజించుచున్నారు

గ॥　అర్జునా మహాత్ములైనవారలు, దేవతా సంబంధమైన సాత్త్విక ప్రకృతి నాశ్రయించినవారలై, జగత్తునకు ముఖ్యకారణమై నాశరహితుడైన, నన్ను తెలిసికొని, యితర చింతలులేనివారై భజించుచున్నారు .

ప॥తే॥ ఆశ్రయించుచు దైవిక-మైన, సత్వ
ప్రకృతిని, మహాత్ములాత్మలో-ప్రాణికోట్ల
కాదికారణ మవ్యయుం-డనుచు తెలిసి
యితరచింతలుమాని, న-న్నెల్లవేళ
భజనజేయుచునున్నారు-భక్తిగలిగి

గే॥ దేవతాసంబంధ మగుయా
దివ్యసత్వ స్వభావులై
ఆదిహేతువు ప్రాణికోటికి
అవ్యయుండని తెలియుచున్
అన్యచింతలు మానికొలుతురు
ఆత్మలో నన్నెప్పుడున్
అని కిరీటికి ॥శ్రీహరిని

14) శ్లో॥ సతతం కీర్తయంతోమాం
యతంతశ్చ దృఢవ్రతాః
నమస్యంతశ్చమాం భక్త్యా
నిత్యయుక్తా ఉపాసతే

ప.వి. సతతం, కీర్తియంతః, మాం, యతంతః, చ, దృఢవ్రతాః, నమస్యంతః, చ, మాం, భక్త్యా, నిత్యయుక్తాః, ఉపాసతే.

టీ॥ సతతం-యెల్లప్పుడును, మాం-నన్ను, కీర్తయంతః + చ-సంకీర్తనముచేయువారును, యతంతః-ప్రయత్నించువారును (జితేంద్రియులును) దృఢవ్రతాః - దృఢమైన వ్రతములుచేయువారును,

భక్త్యా-భక్తిచేతను. మాం-నన్ను. నమస్యంతః + చ-నమస్కరించెడి వారునునైన. నిత్యయుక్తాః-నిత్యయోగులు. మాం-నన్ను. ఉపాసతే-సేవించుచున్నారు

గ॥ అర్జునా చలింపని దృఢవ్రతములుగలవారలై కొందరు జితేంద్రియులును. యెల్లప్పుడు నన్ను సంకీర్తనముచేయువారును. భక్తిచేత నమస్కరించువారునునైన నిత్యయోగులు నన్ను సేవించు చున్నారు

ప॥తే॥ చంచలము లేక వ్రతములు-సలుపువారు
సంతతమునను కీర్తన-సలుపువారు
భక్తిచే చేయువారలు-వందనంబు
లట్టినిత్యయోగులు. సత-మధికభక్తి
సలుపుచుందురు నాసేవ-సవ్యసాచి

గే॥ జితేంద్రియులు దృఢవ్రతులును
చింతించుచు ననుసతముగా
భక్తిశ్రద్ధాయుక్తులగుచును
వందనంబులు సలుపుచుగా
ననుగొలుచుచు ననుకీర్తించుచు
ననుసేవించెదరర్జునా
అని కిరీటికి ॥శ్రీహరిని

15 శ్లో॥ జ్ఞానయజ్ఞేన చాప్యన్యే
యజంతో మాముపాసతే
ఏకత్వేన పృథక్త్వేన
బహుధా విశ్వతోముఖమ్ .

ప.వి. జ్ఞానయజ్ఞేన, చ, అపి, అన్యే, యజంతః, మాం, ఉపాసతే, ఏకత్వేన, పృథక్త్వేన, బహుధా, విశ్వతోముఖమ్

టీ॥ అన్యే-మరికొందరు, జ్ఞానయజ్ఞేన-జ్ఞానమనెడి యజ్ఞముచేత, మాం-నన్ను, యజంతః-పూజించుచున్నవారై, ఉపాసతే - సేవించుచున్నారు. అన్యే - మరికొందరు, ఏకత్వేన - ఒకడనుభావముచేతను, పృథక్త్వేన-భిన్నభావముచేతను (కొందరు) (మరికొందరు) బహుధా-బహుప్రకారములుగాను, విశ్వతోముఖంచ - అంతట ముఖములుగల వానినిగా, ఉపాసతే-సేవించుచున్నారు

గ॥ అర్జునా నన్ను కొందరు, జ్ఞానయజ్ఞముచేత పూజించుచున్నారు, కొందరు సర్వము బ్రహ్మమనుభావముచేత పూజించుచున్నారు. కొందరు నన్ను బహురూపునిగా భావించి పూజించుచు సేవించుచున్నారు

ప॥తే॥ జ్ఞానయజ్ఞాన కొందరు-నన్ను పూజ
సలిపి సేవించుచుందురు-సవ్యసాచి
విశ్వరూపుడనుచు మరి-వివిధ రూప
ములనుకొందరు, బహువిధం-బులను, నన్ను
పాసనము చేయుచుందురు-బ్రహ్మమనుచు

గే॥ జ్ఞానయజ్ఞముచేత కొంచరు
సలుపుచుందురు పూజనలా
బ్రహ్మమొకడే యనుచుకొందరు
బహువిధంబుల కొందరులా
అంతటనుకలవాడు వదనము
లనుచుగొలుతురు భారతా
అని కిరీటికి ॥శ్రీహరిని

16) శ్లో॥ అహంక్రతు రహంయజ్ఞః
స్వధాహామహా మౌషధమ్
మంత్రో౾హామహా మేవాజ్య
మహామగ్నిరహం హుతమ్ .

ప.వి. అహం, క్రతుః, అహం, యజ్ఞః. స్వధా, అహం, అహం, ఔషధం, మంత్రః, అహం. అహం, ఏవ, ఆజ్యం, అహం, అగ్నిః, అహం, హుతమ్

టీ॥ అహం-నేను, క్రతుః-క్రతువును. అహం-నేను, యజ్ఞః-యజ్ఞమును, అహం - నేను, స్వధా-పిండమును, అహం - నేను, ఔషధం-ఔషధమును, అహం-నేను, మంత్రః-మంత్రమును, అహం-నేను, ఆజ్యం-హావిస్సును, అహం-నేను, అగ్నిః-అగ్నిహోత్రమును, అహం + ఏవ-నేనే, హుతం-హోమకర్మను.

గ॥ అర్జునా నేను క్రతువును, నేను యజ్ఞమును, నేను పిండమును, నేను ఔషధమును, నేను మంత్రమును. నేను హవిస్సును, (నేయి), నేను అగ్నిహోత్రమును, నేనె హోమకర్మమునై యున్నాను

ప॥తే॥ నేనెయజ్ఞము, పిండము-నేనెక్రతువు
నేనెమంత్ర, మౌషధమును-నేనెఘృతము
హోమకర్మము, నేనగ్ని-హోత్రిమగుదు
సర్వమును నేనగుచునుంటి-సవ్యసాచి

గే॥ నేనెక్రతువును నేనెయజ్ఞము
నేనెపిండము. మంత్రిము-

అగ్నిహోత్రము హోమకర్మము
ఔషధమును హవిస్సునూ
సర్వమును నేననుచు తెలియుము
సర్వమును నారూపముల్
అని కిరీటికి ॥శ్రీహరిని

17) శ్లో॥ పితాఽహమస్య జగతో
మాతాధాతా పితామహః
వేద్యం పవిత్రమోంకార
ఋక్సామ యజురేవచ

ప.వి. పితా, అహం, అస్య, జగతః, మాతా, ధాతా. పితామహః, వేద్యం, పవిత్రం, ఓంకారః, ఋక్, సామ యజుః, ఏవ, చ.

టీ॥ అస్య-ఈ, జగతః - జగత్తునకు, అహం-నేను, పితా-తండ్రిని. మాతా-తల్లిని, ధాతా-ఫలప్రదుడును. పితామహః-తాతను. వేద్యం-తెలిసికొనదగిన. పవిత్రం - పవిత్రమైన. ఓంకారం-ఓంకారమును. ఋక్సామయజురేవచ-ఋగ్యజుసామవేదములు. అహం-నేను

గ॥ అర్జునా యీ జగత్తునకు. తండ్రిని. తల్లిని ఫలప్రదుడను, తాతయును. తెలియదగినవస్తువును. పావనమైన ఓంకారమును. ఋగ్యజుస్సామవేదములునేనే అయియున్నాను

ప॥తే॥ నేనెజగతికి తండ్రిని-నేనెతల్లి
నేనెధాతను, పావన-మైనవస్తు
వును, తెలియదగు వస్తువు-నేనెతాత

సామఋగ్యజు ప్రణవము-సర్వమేనె
అన్నియును నాస్వరూపంబు-లనియెరుంగు

గే॥ తల్లిదండ్రి ఫలప్రదుండను
తండ్రితండ్రియు వేద్యముగా
నేనెపావనమైన వస్తువు
నేనే ఓంకారంబునూగా
సామయజువు ఋగ్వేదంబులు
సర్వమును నేజగతికిగా

అని కిరీటికి ॥శ్రీహరిని॥

18) శ్లో॥ గతిర్భర్తా ప్రభుఃసాక్షీ
నివాసః శరణంసుహృత్
ప్రభవః ప్రలయఃస్థానం
నిధానం బీజమవ్యయం ....

ప.వి. గతిః, భర్తా, ప్రభుః, సాక్షీ, నివాసః, శరణం, సుహృత్, ప్రభవః, ప్రలయః, స్థానం, నిధానం, బీజం, అవ్యయం.

టీ॥ గతిః-గతియును, భర్తా-భరించువాడను, ప్రభుః-ప్రభువును, సాక్షి-సాక్షిని, నివాసః-నివాసమును, శరణం-ఆశ్రయమును, సుహృత్-మిత్రుడను, ప్రభవః - ఉత్పత్తియు, ప్రలయః-సంహారమును, స్థానం-స్థితియును, నిధానం-నిక్షేపమును, అవ్యయం-నాశములేని, బీజం-మూలకారణము (బీజము) (నేనే అయియున్నాను)

గ॥ అర్జునా యీ జగత్తునకు నేనే గతియును భరించువాడను, ప్రభువును, సాక్షి నివాసమును, ఆశ్రయమును, మిత్రుడను, ఉత్పత్తియు స్థితియు, సంహారమును, నిక్షేపము, నాశములేని బీజమును నేనే అయియున్నాను

ప॥తే॥ నేనెజగతికి గతియును-నేనెభర్త
నేనెప్రభువును సాక్షిని-నేనెస్థితియు
నేనెసృష్టికి కర్తను-నేనెమిత్రు
డను, నివాసము, శరణము-నేనిధాన
మును, వినాశకరుండను-నేనె పార్థ
అవ్యయంబగు బీజంబు-నగుచునుందు

గే॥ ఉత్పత్తిస్థితి సంహారకు
డుపకారియును మిత్రుడున్
కర్మఫలమును పోషకుండును
కారణంబుత్పత్తికిన్
నేనెబీజము నాశమొందని
నేనెప్రభువును సాక్షియున్
అని కిరీటికి ॥శ్రీహరిని

19) శ్లో॥ తపామ్యహ మహంవర్షం
నిగృహ్ణా మ్యుత్సృజామిచ
అమృతంచైవ మృత్యుశ్చ
సదసచ్చాహ మర్జున

ప.వి. తపామి, అహం. అహం, వర్షం, నిగృహ్ణామి. ఉత్సృజామి. చ, అమృతం, చ, ఏవ. మృత్యుః. చ. సత్. అసత్. చ, అహం. అర్జున

టీ॥ అర్జున-ఓయర్జునా అహం-నేను. తపామి-తపింపజేయుచున్నాను. అహం-నేను. వర్షం-వర్షమును. నిగృహ్ణామి-నిలుపుచున్నాను. ఉత్సృజామి + చ-కురిపించుచున్నాను. అమృతం + చ-మరణరాహిత్యమున్ను. మృత్యుశ్చ-మృత్యువును. సత్-సత్తును. అసత్ + చ-అసత్తును. అహం + ఏవ-నేనేను .

గ॥ అర్జునా నేను వేడిని కలుగజేయుచున్నాను. నేను వర్షము కురిపించుచున్నాను. వర్షమును నిలుపుచున్నాను. అమృతమును మృత్యువును నేనే. సత్తును. అసత్తును నేనే యగుచున్నాను

ప॥తే॥ వానకురిపింతు, నిలుపుదు-వాననేను
అమృతమును మృత్యువును నేనె-యగుచునుందు
నేనెయుష్ణంబు పుట్టింతు-నేనె సత్తు
నగు దసత్తును మరలనే-నగుదు పార్థ

గే॥ నేనెయుష్ణము కలుగజేసెద
నే, వానకురిపించెదన్
నేనె వర్షమునిలిపివేసెద
నేనెసత్తు నసత్తునున్
నేనెయమృతము, మృత్యువగుదును
నేనెయగుదు సర్వంబున్
అని కిరీటికి ॥శ్రీహరిని

20) శ్లో॥ త్రైవిద్యామాంసోమపాః పూతపాపా
యజ్ఞైరిష్ట్వాస్వర్గతిం ప్రార్థయంతే
తేపుణ్యమాసాద్య సురేంద్రలోక
మశ్నంతి దివ్యాన్ దివిదేవభోగాన్

ప.వి. త్రైవిద్యాః, మాం, సోమపాః, యజ్ఞైః, ఇష్ట్వా, స్వర్గతిం, ప్రార్థయంతే, తే, పుణ్యం, ఆసాద్య, సురేంద్రలోకం, అశ్నంతి, దివి, దేవభోగాన్

టీ॥ త్రైవిద్యాః - వేదాధ్యయనపరులు, యజ్ఞైః-యజ్ఞములచేత, మాం-నన్ను, ఇష్ట్వా-పూజించి, సోమపాః-సోమపానముచేసినవారై, పూతపాపాః-పాపములుతొలగినవారై, స్వర్గతిం - స్వర్గలోకస్థితిని, ప్రార్థయంతే-ప్రార్థించుచున్నారు, తే-వారు, పుణ్యం-పుణ్యప్రదమైన, సురేంద్రలోకం-దేవేంద్రలోకమును, ఆసాద్య-పొంది, దివి-స్వర్గమునందు, దివ్యాన్-దివ్యములైన, దేవభోగాన్-దేవతాభోగములను, అశ్నంతి-అనుభవించుచున్నారు

గ॥ అర్జునా వేదాధ్యయనపరులు, యజ్ఞములచేత నన్ను పూజించి, పాపములు తొలిగిపోయినవారై, స్వర్గలోకస్థితిని, ప్రార్థించుచున్నారు, వారు పుణ్యప్రదమైన దేవేంద్ర లోకమునుపొంది స్వర్గమునందు, దివ్యములైన, దేవతాభోగములనుభవించుచున్నారు.

ప॥తే॥ యాజకులు సోమపానంబు-నాచరించి
కలుషరహితులై, ననుపూజ-సలిపి, స్వర్గ
మంది, వారలచట దివ్య-మైన
భోగము లనుభవింతురు-పుణ్యచరిత

గీ॥ వేదాధ్యయనము సలిపినట్టి
వేదవేత్తలు భారతా
సోమపానముజేసి వారలు
శుద్ధులై పాపంబుచే ॥శ్రీ॥
యజ్ఞాదులచేత భక్తితో
నర్చించుచు ననువారలు
పొందుచుందురు ఇంద్రలోకము
పొందుదురు సురసౌఖ్యముల్
అవి కిరీటికి ॥శ్రీహరిని

21) శ్లో॥ తేతంభుక్త్వా స్వర్గలోకంవిశాలం
క్షీణేపుణ్యే మర్త్యలోకం విశంతి
ఏవంత్రయీధర్మ మనుప్రపన్నా
గతాగతం కామకామాలభంతే ....

ప.వి. తే, తం, భుక్త్వా, స్వర్గలోకం, విశాలం, క్షీణే, పుణ్యే, మర్త్యలోకం, విశంతి, ఏవమ్, త్రయీధర్మం, అనుప్రపన్నాః, గతాగతం, కామకామాః, లభంతే

టీ॥ తే-వారు, తం-ఆ, విశాలం-విస్తారమైన, స్వర్గలోకం-స్వర్గలోక సౌఖ్యములను, భుక్త్వా-అనుభవించి, పుణ్యే-పుణ్యము, క్షీణే-అంతమునొందగానే, మర్త్యలోకం-మానవ లోకమును, విశంతి-ప్రవేశించుచున్నారు, ఏవం-ఈరీతిగాను, త్రయీధర్మం-వైదికకర్మలను, అనుప్రపన్నాః - ఆశ్రయించినవారలు, కామకామాః-కోరికలు గలవారై, గతాగతం-జననమరణములను, లభంతే-పొందుచున్నారు.

గ॥ అర్జునా వారు, విస్తారమైన, స్వర్గలోక సుఖములనుభవించి, వారి పుణ్యకర్మఫలములు నశించినపిదప, మానవలోకమును ప్రవేశించుచున్నారు. ఈవిధముగా వైదికకర్మపరులు వారికోరికలను పొందుచు, మర్త్యస్వర్గలోకములకు, పోవుట వచ్చుట, పొందుచున్నారు

వ॥తే॥ పొంది స్వర్గసుఖంబులు-పుణ్యకర్మ
ఫలముక్షీణింప, మనుజులై-వారుపుట్టి
మనుజలోకమందీరీతి-మరలపుట్టి
చచ్చుచుందురు, ఫల్గునా-సలిపి కర్మ

గే॥ స్వర్గమందున దివ్యసుఖములు
చాలకాలము పొందుచున్
వారిపుణ్యఫలంబు తొలగిన
వారలీ లోకంబులో ॥శ్రీ॥
పుట్టుచుందురు సలిపియజ్ఞము
పోవుచుందురు స్వర్గమున్
మర్త్యలోకము స్వర్గలోకము
మరలవచ్చుచు పోవుచున్
అని కిరీటికి ॥శ్రీహరిని

22) శ్లో॥ అనన్యాశ్చింతయంతో మాం
యేజనాః పర్యుపాసతే
తేషాంనిత్యాభి యుక్తానాం
యోగక్షేమం వహామ్యహమ్ . . .

ప.వి. అనన్యాః. చింతయంతః. మాం. యే. జనాః. పర్యుపాసతే. తేషాం. నిత్యాభియుక్తానామ్. యోగక్షేమం. వహామి. అహమ్

టీ॥ అనన్యాః-యేకాగ్రచిత్తులై. మాం - నన్ను. యే - ఎట్టి. జనాః-జనులు. చింతయంతః-స్మరించుచున్నవారలై. పర్యుపాసతే-సేవించుచున్నారో. నిత్యాభియుక్తానాం - సర్వదా. నాయందభియుక్తులైన. తేషాం - వారలయొక్క. యోగక్షేమం - యోగక్షేమములను. అహం-నేను. వహామి-వహించుచున్నాను

గ॥ అర్జునా యెవరితర చింతలులేక. నన్నేశరణుపొంది సేవించుచున్నారో (స్మరించుచున్నారో) అట్టి అచంచలచిత్తులైనవారల. యోగక్షేమములను నేనే వహించుచున్నాను

ప॥తే॥ ఇతరచింతలు మానుచు-నెవరునన్ను
భజన సలుపుచుందురో-భక్తిచేత.
అట్టినిశ్చల మానసు-లైనవారి
క్షేమయోగమేను వహింతు-శిష్ట చరిత

గే॥ ఏకాగ్రంబగు మనసుగలిగి
యితరచింతలు మానుచు॥
యెవరునను ధ్యానించుచుందురో
యెల్లవేళల శ్రద్ధతో
వారి యోగక్షేమములనే
వహించెదను ధనంజయా
అని కిరిటికి ॥శ్రీహరి॥

23) శ్లో॥ యేఽప్యన్య దేవతాభక్తా
యజంతేశ్రద్ధ యాన్వితాః
తేఽపిమామేవ కౌంతేయ
యజంత్యవిధి పూర్వకమ్

ప.వి॥ యే, అపి, అన్యదేవతాః, భక్తాః, యజంతే, శ్రద్ధయా, అన్వితాః, తేం అపి, మాం, ఏవ, కౌంతేయ, యజంతి, అవిధి పూర్వకమ్

టీ॥ కౌంతేయ-ఓయరునా, యే + అపి-ఎవరైతే, అన్యదేవతా భక్తాః-ఇతరదేవతల భక్తులై, శ్రద్ధయా - వారినిశ్రద్ధతో, అన్వితా కూడినవారై, యజంతే - పూజించుచున్నారో, తే + అపి-వారును, మాం + ఏవ-నన్నే, అవిధిపూర్వకం-అవిధిపూర్వకముగను, యజంతి పూజించుచున్నారు

గ॥ అర్జునా యెవరైతే, యితర దేవతాభక్తులై, ఆదేవతలను భక్తిశ్రద్ధలతోకూడినవారై పూజించుచున్నారో, వారు కూడా నన్నే అవిధిపూర్వకముగా పూజించుచున్నారు

ప॥తే॥ ఇతరదేవతా భక్తులై-యెవరు, వారి
భజనసేయుచునుందురో-వారుకూడ
అవిధి పూర్వకంబుగ, నన్నె-యర్చనంబు
సలుపుచుండిన వారలే-సవ్యసాచి

గే॥ ఇతరదేవత భక్తులగుచును
యెవరుశ్రద్ధా భక్తితో
కొలుచుచుండెడి వారుమోక్షము
కోరక నవిధి పథముచే

నన్నెయాస్తికులగుచు గొలుచుచు
నున్నవారని తెలియుమా ....
అని కిరీటికి ॥శ్రీహరిని

24) శ్లో॥ అహంహి సర్వయజ్ఞానాం
భోక్తాచ ప్రభురేవచ
నతుమా మభిజానంతి
తత్వేనాతశ్చ్యవంతితే ....

ప.వి. అహం, హి, సర్వయజ్ఞానామ్, భోక్తా, చ, ప్రభుః, ఏవ, చ, న, తు, మామ్, అభిజానంతి, తత్వేన, అతః, చ్యవంతి, తే ....

టీ॥ అహం + హి-నేను, సర్వయజ్ఞానాం-సమస్త యజ్ఞములకు, భోక్తా + చ-అనుభవించువాడును, ప్రభుః + ఏవ + చ-ప్రభువును కూడ, తు-అయినను, తే-వారు, మాం-నన్ను, తత్వేన-యథార్థము గను, న + అభిజానంతి-ఎరుగరు, అతః-అందువలన, చ్యవంతి-పడిపోవుచున్నారు ..

గ॥ అర్జునా సమస్తయజ్ఞములను, అనుభవించువాడును, అధిపతిని నేనే అయినను, వారు నన్ను యథార్థముగ తెలిసికొనుటలేదు. అందువలనవారు పడిపోవుచున్నారు (పునర్జన్మమును పొందుచున్నారు)

ప॥తే॥ సర్వయజ్ఞములకు భోక్త-స్వామినేనె
యైన, నాదుతత్వమెరుగ-రందువలన

యాగములుసల్పి బ్రహ్మత్వ-మందలేక
పొందుచున్నారు జన్మంబు-భువిని పార్థ

గే॥ సర్వయజ్ఞము లనుభవించెడి
స్వామినేనని తెల్పియక-
నాయథార్థము తెలియజాలక
నన్నుపొందగ జాలక-
సంసారమున బడుచునుందురు
సారెకజ్ఞానంబుచే
అని కిరీటికి ॥శ్రీహరిని॥

25) శ్లో॥ యాంతిదేవవ్రతాం దేవా-
పిత్యాన్-యాంతి పితృవ్రతాః
భూతానియాంతి భూతేజ్యా
యాంతిమద్యాజినో ఒపిమామ్

ప.వి. యాంతి, దేవవ్రతాః, దేవాం. పిత్యాన్, యాంతి, పితృవ్రతాః, భూతాని, యాంతి. భూతేజ్యాః, యాంతి, మద్యాజినః, అపి, మామ్..

టీ॥ దేవవ్రతాః-దేవతలనారాధించువారు, దేవాన్-దేవతలను. యాంతి - పొందుచున్నారు, పితృవ్రతాః - పితృపూజనుచేయువారు, పిత్యాన్-పితరులను, యాంతి-పొందుచున్నారు, భూతేజ్యాః-భూతములను పూజించువారు, భూతాని - భూతములను. యాంతి - పొందుచున్నారు, మద్యాజినః + అపి-నన్ను పూజించెడివారు, మాం-నన్ను, యాంతి-పొందుచున్నారు

గ॥ అర్జునా దేవతలను పూజించెడివారు దేవతలనే పొందుచున్నారు, పితృదేవతలను పూజించెడివారు పితృదేవతలనే పొందుచున్నారు, భూతములను పూజించెడివారు భూతములనే పొందుచున్నారు నన్ను పూజించెడివారు నన్నే పొందుచున్నారు

స॥తే॥ దేవతల పూజసలుపుచు-దేవతలను
భూతముల పూజసలుపుచు-భూతములను
పితరులను పూజసలుపుచు-పితరులందు
చేరుచుందురు వారలు-చేసిపూజ
నన్ను భజియించి చేరనౌ-నన్నెవారు

గే॥ అమరులను పూజించువార
లమరులను పొందుచుందురు
పితరులను పూజించువారలు
పితరులను పొందుచుందురు
భూతముల పూజించువారలు
భూతముల పొందుచుందురు
నన్ను శ్రద్ధాభక్తి గొలుచుచు
నన్నె పొందుదు రర్జునా
అని కిరీటికి ॥శ్రీహరిని

26) శ్లో॥ పత్రం పుష్పం ఫలంతోయం
యోమేభక్త్యా ప్రయచ్ఛతి
తదహం భక్త్యుపహృత
మశ్నామి ప్రయతాత్మనః ....

ప.వి. పత్రం, పుష్పం, ఫలం, తోయం, యః, మే, భక్త్యా, ప్రయచ్ఛతి, తత్, అహం, భక్త్యుపహృతం, అశ్నామి, ప్రయతాత్మనః

టీ॥ యః-ఎవడు, భక్త్యా-భక్తిచేత, పత్రం-ఆకునో, పుష్పం-పుష్పమునో, ఫలం - పండునో, తోయం - జలమునో, మే-నాకు, ప్రయచ్ఛతి-సమర్పించునో, ప్రయతాత్మనః-ఆపరిశుద్ధాత్ముని యొక్క, భక్త్యుపహృత-భక్తిపూర్వకముగ సమర్పింపబడిన, తత్-ఆపత్రాధికమును, అహం-నేను, అశ్నామి-ఆరగించుచున్నాను

గ॥ అర్జునా యెవరు భక్తితో, పత్రమైనను ఫలమునైనను, పుష్పమైనను, జలమునైన నాకు సమర్పించునో, అట్టి పరిశుద్ధాత్ముడు భక్తిపూర్వకముగ సమర్పించిన ఆపత్ర పుష్పఫలాదులను, నేనారగించుచున్నాను

ప॥తే॥ భక్తిచేత నాకెవ్వరు-పత్రమైన
ఫలముగాని, పుష్పముగాని-జలముగావి
ఇచ్చిన, పరిశుద్ధాత్ముని-దేదియైన
అరగించెద ప్రియముతో-నదియెనేను

గే॥ ఫలమునైనను యుదకమైనను
పత్రమైనను పుష్పమో
యెవరుశ్రద్ధా భక్తితోడను
యేమియొసగిన దానినే
నారగించెద సంశయింపక
అధికసంతోషంబుతో

అని కరీటిక ॥శ్రీహరిపి

27) శ్లో॥ యత్కరోషి యదశ్నాసి
యజ్జుహోషి దదాసియత్
యత్తపస్యసి కౌంతేయ
తత్కురుష్వ మదర్పణమ్

ప.వి. యత్, కరోషి. యత్, అశ్నాసి, యత్, జుహోషి, దదాసి, యత్. యత్, తపస్యసి, కౌంతేయ, తత్, కురుష్వ, మదర్పణం

టీ॥ కౌంతేయ - ఓఅర్జునా, యత్ - దేనిని, కరోషి-చేయుచున్నావో, యత్-దేనిని, అశ్నాసి-తినుచున్నావో, యత్-దేనిని, జుహోషి-హోమముచేయుచున్నావో, యత్-దేనిని, దదాసి-దానముచేయుచున్నావో, యత్-దేనిని, తపస్యసి-తపముచేయుచున్నావో, తత్ - దానినంతయును, మదర్పణం - నాకర్పింపబడినదానినిగాను. కురుష్వ-చేయుము .

గ॥ అర్జునా నీవుచేయు కర్మమును, నీవు దేనిని తినుచున్నావో, దేనిని హోమముచేయుచున్నావో దేనిని దానము చేయుచు న్నావో, దేనిని తపస్సుచేయుచున్నావో దానినంతయు, నా క ర్పిం ప బ డి న దానినిగాచేయుము ...

ప॥తే॥ ఏదిచేయుచునుంటివో-యేదితినుచు
నుంటివో, యేదివేల్చుచు-నుంటి, వేది
దానమును చేయుచుంటివో-దేనితపము
చేయుచున్న, వన్నింటిని-చేయుచుండు
మర్పణంబని నాకవి-యధికభక్తి

గే॥ నీవొనర్చు సమస్తకర్మలు
నీవుచేసేడి హోమముల
నీవుసలిపెడి తపముదానము
నీవుతినెడి పదార్థముల్
నాసమర్పణమనుచు తలచిన
నాకొనర్చిన పూజయౌ
అని కిరీటికి ॥శ్రీహరిని

28) శ్లో॥ శుభాశుభ ఫలైరేవం
మోక్ష్యసే కర్మబంధనైః
సన్యాసయోగ యుక్తాత్మా
విముక్తో మాముపైష్యసి ....

ప.వి శుభాశుభఫలైః, ఏవం, మోక్ష్యసే, కర్మబంధనైః, సన్యాసయోగయుక్తాత్మా, విముక్తః, మామ్, ఉపైష్యసి

టీ॥ ఏవం - ఈరీతిని, శుభాశుభఫలైః - శుభాశుభఫలములను, కలుగజేసెడి, కర్మబంధనైః-కర్మబంధములచేత, మోక్ష్యసే-విడువబడుదువు, సన్యాసయోగయుక్తాత్మా - సన్యాసయోగముతోకూడిన ఆత్మగలవాడవై, విముక్తః - బంధరహితుడవై, మాం - నన్ను, ఉపైష్యసి-పొందగలవు

గ॥ అర్జునా యీరీతిగా సర్వకర్మములను, నాకర్పణచేయుట వలన, నీవు పుణ్యపాపరూపములైన, కర్మబంధములనుండి, విడువబడగలవు, సన్యాసముతోగూడిన, యోగయుక్తాత్ముడవై నన్ను పొందగలవు

సీ॥తే॥ అన్నికర్మలు నీవునా-కర్పణంబు
సలుపు, పుణ్యపాపంబుల-ఫలము వలన
కలుగు, కర్మబంధంబులు-కలుగకుండు
అపుడు సన్యాసయోగయు-క్తాత్ముడగుచు
పొందుచుందువు ననునీవు-పుణ్యచరిత

గీ॥ భగదర్పితమనుచు కర్మలు
ఫలముకోరక సలిపిన౯
పుణ్యపాప సంబంధఫలము
పొందకుందువు భారతా
కర్మబంధము నీకుకలుగదు
కలుగుమోక్షము మిదట౯

29) శ్లో॥ సమోఽహం సర్వభూతేషు
నమేద్వేష్యో ఽస్తి నప్రియః
యేభజంతితు మాంభక్త్యా
మయితేతేషుచా ఽప్యహమ్

ప.వి. సమః, అహమ్, సర్వభూతేషు. న, మే, ద్వేష్యః, అస్తి. న, ప్రియః, యే, భజంతి, తు, మాం, భక్త్యా, మయి, తే, తేషు, చ, అపి, అహం

టీ॥ అహం-నేను, సర్వభూతేషు-సమస్త భూతములయందును, సమః-సముడను, మే-నాకు, ద్వేష్యః-శత్రువు, న + అపి-లేడు, యేతు-యెవరైతే, మాం-నన్ను, భక్త్యా-భక్తితోను, భజంతి-భజించు చున్నారో, తే-వారు, మయి-నాయందు, (ఉందురు) తేషు + చ-వారియందు, అహం + అపి-నేనును (ఉందును)

గ॥ అర్జునా నేను సర్వభూతములయందును, సముడనై యున్నాను, నాకు శత్రువులేడు, నాకు యిష్టుడునులేడు, యెవరైతే నన్ను భక్తితో భజించుచున్నారో, వారు నాయందును, నేను వారియందును, యున్నాను.

ప॥తే॥ సర్వభూతంబులందు నే-సముడనగుదు
లేడుశతృవు, ప్రియుడును-లేడునాకు
యెవరుగొలుతురో భక్తితో-నెపుడునన్ను
వారునాయందు. నేనుందు-వారియందు

గే॥ సర్వప్రాణులయందు సతతము
సముడనై నేనుందెదఁగా
లేడిష్టుడు నాకొకరుండును
లేడునాకు విరోధియుఁగా ॥శ్రీ॥
యెవరుశ్రద్ధాభక్తితోడను
యెల్లవేళ భజింతురో
వారియందుననేవసింతును
వారుందురునాయందే
అని కిరీటికి ॥శ్రీహరిని

30) శ్లో॥ అపిచేత్సు దురాచారో
భజతే మా మనన్యభాక్
సాధురేవ సమంతవ్యః
సమ్యగ్వ్యవసితోహిసః....

ప వి అపి, చేత్, సుదురాచారః, భజతే, మాం, అనన్యభాక్,
సాధుః, ఏవః, సః, మంతవ్యః, సమ్యక్, వ్యవసితః, హి, సః.

టీ॥ సుదురాచారః + అపి - మిక్కిలి దురాచారముగలవాడైనను
అనన్యభాక్-ఇతరాశ్రయముగోరనివాడై. మాం-నన్ను, భజతే +
చేత్-భజించునెడల, సః-వాడు, సమ్యక్-స్థిరమైన, వ్యవసితః + హి-
చిత్తముగలవాడుగావున, సాదుః + ఏవ-సాధువేయని, మంతవ్యః-
తలంపదగినవాడు

గ॥ అర్జునా మిక్కిలి దురాచారముగలవాడైనను, ఇతరాశ్ర
యము కోరినివాడై, నన్నే భజించుచున్నవాడైనయెడల, వాడు స్థిర
మైన చిత్తముగలవాడుగావున, సాదువనియే తలంపబడుచున్నాడు

ప॥తే॥ అతిదురాచారుడైన, తా-నన్యమాశ్ర
యమును, కోరకెపుడును, న-న్నాత్మదలచు
స్థిరతరంబైన చిత్తం-బు-చెందునతని
సాధువని తలపబడును-సవ్యసాచి

గే॥ కలవాడయ్యు దురాచారము
కలిగిభక్తి నాయందే
శరణుబొందుచు నన్నుగొలిచిన
స్థిరచిత్తముగల నతని
సాధువనుచును తలచుచుండుము
సంతతము నీవర్జునా
అని కిరీటికి ॥శ్రీహరి॥

31) శ్లో॥ క్షిప్రంభవతి ధర్మాత్మా
శశ్వచ్ఛాంతిం నిగచ్ఛతి
కౌంతేయ ప్రతిజానీహి
నమేభక్తః ప్రణశ్యతి.

ప.వి. క్షిప్రం, భవతి, ధర్మాత్మా, శశ్వత్, శాంతిం, నిగచ్ఛతి, కౌంతేయ, ప్రతి, జానీహి, న, మే, భక్తః, ప్రణశ్యతి .

టీ॥ (సః-అట్టివాడు) క్షిప్రం-శీఘ్రముగాను, ధర్మాత్మా-ధర్మాత్ముడు, భవతి-అగుచున్నాడు, శశ్వత్-స్థిరమైన, శాంతిం-శాంతిని, నిగచ్ఛతి-పొందుచున్నాడు, కౌంతేయ-ఓయర్జునా, మే-నాయొక్క, భక్తః-భక్తుడు, న + ప్రణశ్యతి + ఇతి-నాశముపొందడని, ప్రతి జానీహి-తెలిసికొనుము

గ॥ అర్జునా అట్టివాడు శీఘ్రముగా ధర్మాత్ముడగుచున్నాడు, స్థిరమైన శాంతిని పొందుచున్నాడు, నాభక్తుడెప్పుడును, నాశము పొందడని తెలిసికొనుము

ప॥తే॥ అతడుధర్మాత్ముడౌ శీఘ్ర-మనియెరుంగు
స్థిరతరంబగు, శాంతిని-చెందుచుండు
నాదుభక్తుండు పొందడు-నాశమెప్పు
డనుచు, తెలియుము, ఫల్గునా-మనసునందు

గే॥ శీఘ్రమే ధర్మాత్ముడగుచును
చెందు సతమగుశాంతియుఁ
నాకుభక్తుండైన యాతడు
నాశమొందండెన్నడుఁ

అనియెరుంగుము పాండునందన
ఆత్మలో నీవెప్పుడుఁ
అని కిరీటికి ॥శ్రీహరిని

32) శ్లో॥ మాంహిపార్థ వ్యపాశ్రిత్య
యేఽపిస్యుః పాపయోనయః
స్త్రియోవైశ్యా స్తథాశూద్రా
స్తేఽపియాంతి పరాంగతిమ్ ...

ప వి. మాం, హి, పార్థ, వ్యపాశ్రిత్య, యే అపి, స్యుః, పాపయోనయః, స్త్రియః, వైశ్యాః, తథా, శూద్రాః, తే, అపి, యాంతి, పరాం, గతిం

టీ॥ పార్థ-అర్జునా, యేఅపి-ఎవరు, పాపయోనయః-పాపాత్ములు, స్యుః-అవుదురో, తేఅపి-వారును, స్త్రియః-స్త్రీలును, తథా-అలాగుననే, వైశ్యాః-వైశ్యులును, శూద్రాశ్చ-శూద్రులును, మాం-నన్ను, వ్యపాశ్రిత్య-ఆశ్రయించి, పరాం-ఉత్కృష్టమైన, గతిం-గతిని, యాంతిహి-పొందుచున్నారుగదా.

గ॥ అర్జునా పాపపు జన్మములనెత్తినవారును. స్త్రీలును, వైశ్యులును, శూద్రులును, నన్నాశ్రయించినవారలైనచో ఉత్తమమైన మోక్షమును పొందుచున్నారు

ప॥తే॥ పాపయోనుల బుట్టిన-వారు, స్త్రీలు,
వైశ్యులును, శూద్రులైనను,-పాండుపుత్ర
ఆశ్రయించినఁ పూర్తిగా-నందగలరు
శ్రేష్ఠమైనట్టి మోక్షంబు-శిష్టచరిత

గే॥ అధమజన్ములు స్త్రీలు వైశ్యులు
అల్పశూద్రులు, భక్తిన
న్నాశ్రయించిన పొందుచుండెద
రందరుత్తమ మౌగతిఁ
అని కిరీటికి ॥శ్రీహరిని

33) శ్లో॥ కింపునర్బ్రాహ్మణాః పుణ్యా
భక్తారాజర్షయస్తథా
అనిత్య మసుఖంలోక
మిమంప్రాప్య భజస్వమామ్..

ప వి. కిం, పునః, బ్రాహ్మణాః, పుణ్యాః, భక్తాః, రాజర్షయః, తథా, అనిత్యం, అసుఖం, లోకం, ఇమం, ప్రాప్య, భజస్వ, మాం.

టీ॥ పుణ్యాః - పుణ్యాత్ములైనట్టియు, భక్తాః-భక్తులైనట్టియు, బ్రాహ్మణాః-బ్రాహ్మణులును, తథా-అటులే, రాజర్షయః-రాజఋషులును, (విషయమై) కింపునః-ఏమిచెప్పవలయును, అనిత్యం-నిత్యము కానిదియు, అసుఖం-సుఖములేనిదియునగు, ఇమం-ఈ, లోకం-లోకమును, ప్రాప్య - పొందినవాడవై, మాం - నన్ను, భజస్వ-భజింపుము

గ॥ అర్జునా నాభక్తులైన పాపాత్ములే, మోక్షమును పొందునపుడు, పుణ్యాత్ములును, భక్తులైనట్టి బ్రాహ్మణులును, రాజర్షులను గురించి, యేమిచెప్పవలయును, అనిత్యమైనదియు, సుఖములేనిదియునగు, యీ లోకమును పొందినవాడవగు, నీవు నన్ను భజించి ముక్తినిపొందుము

ప॥తే॥ భక్తులైన పుణ్యాత్ములు-బ్రాహ్మణులును
మరియు రాజర్షులో వారి-మాటలేమి
చెప్ప, అసుఖ, మనిత్యమై-చెలగునట్టి
లోకమున బుట్టియును నీవు-నాకుభక్తు
డగుచు సేవించి, మోక్షంబు-నందు పార్థ

గే॥ భక్తిగలిగిన రాజఋషులును
భక్తిగలిగిన బ్రాహ్మణుల్
పొందుటకు వారుత్తమస్థితి
సందియములేదర్జునా ॥శ్రీ॥
అనిత్యమసుఖమగు యీలోక
మందుబుట్టిన ఫల్గునా
నన్ను శరణముపొంది సతతము
ననుభజింపుము భక్తితో
అని కిరీటికి ॥శ్రీహరిని

34) శ్లో॥ మన్మనాభవ మద్భక్తో
మద్యాజీ మాంనమస్కురు
మామేవైష్యసి యుక్త్వైవ
మాత్మానం మత్పరాయణః . . .

ప.వి. మన్మనాః, భవ, మద్భక్తః, మద్యాజీ, మాం, నమస్కురు
మాం, ఏవ, ఏష్యసి, యుక్త్వా, ఏవం, ఆత్మానం, మత్పరాయణః

టీ॥ మన్మనాః - నాయందే మనసుగలవాడవును, మద్భక్తః - నాభక్తుడవును, మద్యాజీ-నన్నే పూజించువాడవును, భవ - కమ్ము. మాం-నన్నే. నమస్కురు-నమస్కరింపుము. ఏవం-ఇట్లు. ఆత్మానం-మనస్సును. యుక్త్వా-నాయందునిలిపి, మత్పరాయణః - నాయందు ప్రీతిగలవాడవై. మాంఏవ-నన్నే. ఏష్యసి-పొందగలవు

గ॥ అర్జునా మనసు నాయందునిలుపుము, నాకు భక్తుడవగుము. నన్నే పూజింపుము, నాకే నమస్కారముచేయుము. ఈ రీతిగా మనసు నాయందునిలిపి, నన్నే పరమగతిగ తలంచువాడవై. నన్నేపొందుము.

ప॥తే॥ నిశ్చలంబుగ నాయందు-నిలుపు మనసు
నన్ను పూజించుచుండుము-నాకు వంద
నములు సలుపుము భక్తుడై-నన్నె శరణ
మంద గలిగినచో నన్ను-పొందగలవు

గే॥ నీవుమనసును నిలిపినాపై
నిత్యమును ననుగొలుచుచుఞ
కలిగిశ్రద్ధాభక్తి మిక్కిలి
కలిగిస్థిరమగు చిత్తముఞ
నాకుసలుపుము వందనంబులు
నన్నుపొందుదు వర్జునా
అని కిరీటికి ॥శ్రీహరిని

గ॥　ఇది శ్రీ కవిరత్న రత్నాకరము వేంకటేశ్వర కవి విరచితమై గద్య పద్య గేయరూపంబును, శ్రీ కృష్ణార్జునుల సంవాదంబగు, శ్రీ భగవద్గీతా గద్య పద్య గేయామృతము నందు రాజవిద్యా రాజగుహ్యయోగమను తొమ్మిదవ అధ్యాయము సంపూర్ణము.

హరిః ఓమ్ తత్సత్ హరిః ఓమ్

శాంతిః శాంతిః శాంతిః



విభూతి యోగము — అధ్యాయసంగ్రహము

శా॥ నేనే హేతువు సృష్టికంతటికి, నే
నే సూర్యుడున్, చంద్రుడున్
నేనేశ్రీయును కీర్తి, వాణియును, నే
నే ధైర్యమున్, బుద్ధియున్
నానాలోకములున్. చరాచరములున్,
నాసంపదే సర్వమున్
నేనే విశ్వమటంచునెంచి, కనుమా
నిక్కంబు నీవర్జునా .

తా॥ అర్జునా యీ సృష్టికంతటికి కారణమైనవాడనునేనే, సూర్యుడు, చంద్రుడు, శ్రీ, కీర్తి, వాణి, బుద్ధి, ధైర్యమునేనే, చరాచర జగద్వస్తువులన్నియునేనే.

నాసంపదే యీసమస్తవిశ్వమని, నన్నుధ్యానించిన, స్వ స్వరూపానుభవము, నీకుసిద్ధించునని, శ్రీ కృష్ణపరమాత్మ పార్థునకు బోధించిన, విభూతి యోగమను పదియవ అధ్యాయము శ్రీ భగవద్గీతా గద్య పద్య గేయామృతమునందు, సంగ్రహ పద్య తాత్పర్యములు.

ఓ మ్ త త్స త్

హరిఃఓమ్ శాంతిః శాంతిః శాంతిః

❖ శ్రీ భగవానువాచ ❖

1) శ్లో॥ భూయఏవ మహాబాహో
　　　శృణుమే పరమంవచః
　　యత్తేఽహం ప్రీయమాణాయ
　　　వక్ష్యామి హితకామ్యయా

ప.వి. భూయః, ఏవ, మహాబాహో, శృణు, మే, పరమమ్, వచః, యత్, తే, అహం, ప్రీయమాణాయ, వక్ష్యమి, హిత కామ్యయా

❋ శ్రీభగవంతుడు చెప్పుచున్నాడు ❋

టీ॥ హేమహాబాహో - ఓయర్జునా, ప్రీయమాణాయ - ప్రీతిని బొందుచున్న, తే - నీకొరకు, హితకామ్యయా - హితమునుగోరుట చేతను, అహం-నేను, యత్-ఏ, వచః-వాక్యమును, వక్ష్యమి- చెప్పుదునో (తత్-ఆ) పరమం - ఉత్తమమైన, (వచః-మాటను) భూయః + ఏవ-మరలను, శృణు-వినుము

గ॥ అర్జునా నేను తెలుపుచున్న వాక్యములను విని, ప్రీతిని బొందుచున్న, నీహితమునుగోరి నేను చెప్పబోయెడి వాక్యములను మరల వినుము

ప॥తే॥　నేనుతెలిపెడి వాక్యముల్-నీవు ప్రీతి
　　గలుగుచు వినుచుమంటివి-గాన, మరల

నీదు హితమునుగోరుచు-నేను శ్రేష్ఠ
మైన వాక్యముల్ వినిపింతు,-వినుము పార్థ

గే॥ సంతసంబున వినుచునుంటివి
సర్వమును నామాటలన్
నీకుహితమును గోరితెలిపెద
నేనుయుత్తమవాక్యముల్
ఆలకింపుము మరల శ్రద్ధతో
నన్నియును విశదంబుగా
అని కిరీటికి ॥శ్రీహరి॥

2) శ్లో॥ నమేవిదుః సురగణాః
ప్రభవం నమహర్షయః
అహమాదిర్హి దేవానాం
మహర్షీణాంచ సర్వశః....

ప.వి. న, మే, విదుః, సురగణాః, ప్రభవం, న, మహర్షయః
అహం, ఆదిః, హి, దేవానాం, మహర్షిణాం, చ, సర్వశః

టీ॥ మే-నాయొక్క, ప్రభవం-పుట్టుక, (ప్రభావము) సురగణాః-దేవతాసమూహములును, న + విదుః - వెరుగరు, మహర్షయః-మహర్షులును, న + విదుః - ఎరుగరు, అహం - నేను, దేవానాం-దేవతలకును, మహరీణాంచ-మహర్షులకును, సర్వశః-సమస్త విధములను, ఆదిర్హి-మూలకారణముగదా?

గ॥ అర్జునా నాయొక్క పుట్టుకను (ప్రభావమును) దేవతాగణములును, మహర్షులును యెరుగరు, నేను దేవతలకును, మహర్షు

లకును సర్వవిధముల మొదటివాడను కదా? (మూలకారణము)
ప్రభవం-పుట్టుక. ప్రభావము

ప॥తే॥ సురగణములు, మౌనిగణము-లెరుగరెవరు
నాదుపుట్టుక వివరంబు-ఆదిహేతు
వైనవాడను, సురలకు-మౌనులకును
సర్వవిధముల జన్మకు-సవ్యసాచి

గే॥ తెలియజాలరు నాదుప్రభవము
దేవతలు ఋషిగణములు॥
వారికన్నను మొదటివాడను
వారిజన్మకు హేతువు॥
అని కిరీటికి ॥శ్రీహరిని

3) శ్లో॥ యోమామజ మనాదించ
వేత్తిలోక మహేశ్వరమ్
అసమ్మూఢః సమర్త్యేషు
సర్వపాపైః ప్రముచ్యతే .

ప.వి. యః, మాం, అజం, అనాదిం, చ, వేత్తి. లోకమహేశ్వరం, అసమ్మూఢః, సః, మర్త్యేషు, సర్వపాపైః, ప్రముచ్యతే.

టీ॥ యః-ఎవడు, అజం-పుట్టుకలేనివాడను, అనాదిం-మొదలు లేనివాడను, లోకమహేశ్వరం + చ-లోకనియంతను, (అగు) మాం-నన్ను, వేత్తి-తెలిసికొనుచున్నాడో, సః-వాడు, మర్త్యేషు-మానవుల యందు, అసమ్మూఢః - అజ్ఞానములేనివాడై, సర్వపాపైః - సమస్త పాపములచేతను, ప్రముచ్యతే-విడువబడుచున్నాడు

గ॥ అర్జునా నన్ను మొదలులేని వాడనియు పుట్టుకలేని వాడనియు, సర్వలోకములకు నియామకుడనియు, యే మానవులు తెలిసికొనుచున్నారో, అట్టివారు జ్ఞానవంతులై, సర్వ పాపముల నుండి విముక్తులగుచున్నారు .

ప॥తే॥ పుట్టు కనులేని వాడని-మొదలులేని
వాడు, లోకనియంతని-పార్థయెవరు
తెలిసికొనుచుందురో, వార-ఖిలమనుజుల
యందు, జ్ఞాను, లఘవిముక్తు-లని, యెరుంగు

గే॥ లేనివాడను మొదలుయనునది
లేనివాడను పుట్టుకకా
యెల్ల లోక నియామకుండని
యెవడు తెలియునో జ్ఞానియై
విడువబడు మోహంబుచేతను
విడువబడు పాపంబుచే
అని కిరీటికి ॥శ్రీహరిని

4) శ్లో॥ బుద్ధిర్జ్ఞాన మసమ్మోహః
క్షమాసత్యం దమశ్శమః
సుఖందుఃఖంభవోఽభావో
భయంచా భయమేవచ....

ప.వి. బుద్ధిః, జ్ఞానం, అసమ్మోహః, క్షమా, సత్యం, దమః శమః, సుఖం, దుఃఖం, భవః, అభావః, భయం, చ, అభయం, ఏవ, చ

టీ॥ బుద్ధిః-నిశ్చయజ్ఞానము, జ్ఞానం-జ్ఞానము, అసమ్మోహః-మోహరాహిత్యము, క్షమా-ఓర్పు, సత్యం-సత్యము, దమః-బాహ్యేంద్రియ నిగ్రహము, శమః-అంతరింద్రియనిగ్రహము, సుఖం-సుఖము దుఃఖం-దుఃఖము, భవః-పుట్టుక. అభావః-నాశము. భయం-భయము అభయంచ-భయములేకపోవుట

గ॥ అర్జునా సర్వప్రాణులకు, బుద్ధి, జ్ఞానము, మోహరాహిత్యము, ఓర్పు, సత్యము, బాహ్యేంద్రియనిగ్రహము, అంతరింద్రియ నిగ్రహము, సుఖము, దుఃఖము, పుట్టుక, నాశము, భయము, భయములేకుండుట నావలననే కలుగుచున్నవి

ప॥తే॥ బుద్ధియును, జ్ఞాన, మోర్పును-మోహశూన్య
మభయము, భయముసత్యంబు-నంతరింద్రి
యముల నిగ్రహంబు, సుఖము-దమము, దుఃఖ
ములును, పుట్టుక, నాశము-కలుగుచుండు
సర్వప్రాణికి నాచేత-సవ్యసాచి

4-5 శ్లోకముల గేయములుకలిపి వ్రాయబడినవి.

5) శ్లో॥ అహింసా సమతాతుష్టి
స్తపోదానం యశోఽయశః
భవంతిభావా భూతానాం
మత్తఏవ పృథగ్విధాః..

ప.వి. అహింసా, సమతా, తుష్టిః, తపః, దానం, యశః, అయశః. భవంతి, భావాః, భూతానాం, మత్తః, ఏవ, పృథగ్విధాః

టీ॥ అహింస-అహింసయు, సమతా-సర్వసమత్వము, తుష్టి-తృప్తి, తపః-తపస్సు, దానం-దానము, యశః-కీర్తి, అయశః-అపకీర్తి, భూతానాం - ప్రాణులకు, పృథగ్విధా-నానా విధములైన, భావాః-భావములును, మత్తః + ఏవ-నావలననే, భవంతి - కలుగుచున్నవి

గ॥ అర్జునా అహింస, సమత్వము, సంతుష్టి తపస్సు, దానము, కీర్తి, అపకీర్తి, మొదలగు నానావిధములైన గుణములు నావలననే కలుగుచున్నవి

ప॥తే॥ దానము. నహింస, సంతుష్టి-తపము, కీర్తి,
సమత, మపకీర్తు లనియెడి-సర్వవిధము
లైన, గుణసముదాయము-లన్ని, భూత
ములకు, నావలననె పార్థ-కలుగుచుండు

4, 5 శ్లోకముల గే॥ బుద్ధియును జ్ఞానంబు సత్యము
మోహరహితము కీర్తియుఁ
అంతరింద్రియ, బాహ్యేంద్రియము
లన్ని వశమున నుంచుటఁ ॥శ్రీ॥
శాంతియును, సుఖదుఃఖభయములు
సంతోషంబును దానముఁ
అహింసయు, సమచిత్తత్వము
అపయశంబును, నాశముఁ ॥శ్రీ॥
భయవిహీనము, తపము, యశమును
ప్రాణిసంతతి కన్నియున్

పలువిధంబుల గుణములర్జున
కలుగునివి నావలననే
అని కిరీటికి ॥శ్రీహరి॥

6) శ్లో॥ మహర్షయః సప్తపూర్వే
చత్వారో మనవస్తథా
మద్భావా మానసాజాతా
ఏషాంలోక ఇమాఃప్రజాః...

ప.వి. మహర్షయః, సప్త, పూర్వే. చత్వారః, మనవః, తథా, మద్భావాః, మానసాః, జాతాః, ఏషామ్, లోకే, ఇమాః, ప్రజాః.

టీ॥ పూర్వే-పూర్వులైన. (తే-అ) సప్త-ఏడుగురైన, మహర్షయశ్చ-మహర్షులును, తథా-అటులే, చత్వారః-నలుపురైన, మనవశ్చ-మనువులును, మద్భావా - నాభావముగలవారై, మానసాః-మనస్సుచేత పుట్టింపబడినవారలై, జాతా - పుట్టిరి, ఏషాం - వీరికి, లోకాః-లోకమందు, ఇమాః-ఈః, ప్రజాః-ప్రజలు, జాతాః-పుట్టిరి.

గ॥ అర్జునా యీలోకమునందు, పూర్వులైన సప్తమహర్షులును నలుపురు మనువులును, నా భావముగలవారై, నా మానసపుత్రులై జన్మించిరి, వారిచేతనే యీప్రజలందరు పుట్టిరి .

ప॥తే॥ నాదుమానస పుత్రులు-నలుపురు మను
వులును, సప్తమహర్షులు-కలదు పార్థ
పుట్టియుండిరి వీరిచే-భువన జనము
పూర్వకాలంబునందున-పుణ్యచరిత

గే॥ మనువులు నలువురు సప్తఋషులు
మద్గతభావము కలిగియు
పుట్టింపగనే, మనసుచేతను
పుట్టియుండిరి, వీరిచే
పుట్టియుండేను పుడమియందున
భూతజాలము పూర్వమున్
అని కిరీటికి ॥శ్రీహరిని

7) శ్లో॥ ఏతాంవిభూతిం యోగంచ
మమయోవేత్తి తత్వతః
సోఽవికంపేన యోగేన
యుజ్యతేనాత్ర సంశయః ...

ప వి ఏతాం విభూతిం, యోగం, చ, మమ, యః, వేత్తి, తత్వతః, సః, అవికంపేన, యోగేన, యుజ్యతే, న, అత్ర, సంశయః

టీ॥ మమ-నాయొక్క, ఏతాం-ఈ, విభూతిం - మహిమను, యోగం + చ-యోగమును, తత్వతః-యదార్థముగాను, యః-ఎవడు, తత్వతః-యదార్థముగాను, యః-ఎవడు, వేత్తి-తెలిసికొనునో, సః-వాడు, అవికంపేన-చలింపని, యోగేన-యోగముచేతను, యుజ్యతే-కూడినవాడగుచున్నాడు, అత్ర-ఈవిషయమునందు, సంశయః-సంశయము, న-లేదు

గ॥ అర్జునా నాయొక్క యీమహిమను యోగమును, యథార్థముగ యెవడు తెలిసికొనుచున్నాడో, వాడు చలింపని యోగముచేత కూడిన వాడగుచున్నాడు ఈ విషయమునందు సంశయములేదు

ప॥తే॥ ఎవరునాయోగ మహిమంబు-లెరుగగలరో
నిశ్చయంబుగ, వారలు-నిశ్చలమగు
యోగమునకూడినట్టి వా-రగుచునుంద్రు
సంశయములే దొకింతయు-సవ్యసాచి

గే॥ నావిభూతిని యోగమహిమను
నన్నునిజముగ తెలిసినన్
సంశయింపక కలుగువారికి
చలనమొందని యోగమున్
లేదు సంశయమేమి దీనిలో
లేశమైనను భారతా
అని కిరీటికి ॥శ్రీహరిని॥

8) శ్లో॥ అహంసర్వస్య ప్రభవో
మత్తఃసర్వం ప్రవర్తతే
ఇతిమత్వా భజంతేమాం
బుధాభావ సమన్వితాః....

ప.వి. అహం, సర్వస్య, ప్రభవః, మత్తః, సర్వం, ప్రవర్తతే, ఇతి, మత్వా, భజంతే, మాం, బుధాః, భావసమన్వితాః

టీ॥ అహం-నేను, సర్వస్య-సకలమైన జగత్తునకును, ప్రభవః-ఉత్పత్తికారణమైనవాడను. మత్తః-నావలననే, సర్వం-సమస్తమును, ప్రవర్తతే-ప్రవర్తించుచున్నది, ఇతి-ఈవిధముగా, మత్వా-తలచి,

భావసమన్వితాః-పరమార్థభావముగల, బుధా-జ్ఞానులు, మాం-నన్ను, భజంతే-భజించుచున్నారు

గ॥ అర్జునా సమస్త జగత్తునకుత్పత్తికారకుడను నేనే యని యును, నావలననే జగత్తంతయు నడచుచున్నదనియు, తెలిసికొని జ్ఞానులు నన్ను సేవించుచున్నారు

ప॥తే॥ అన్నిజగముల కుత్పత్తి-నగుదుననుచు
అన్నినడచును నావల్ల-ననుచు తెలిసి
నాదుభావంబు సీకేతి-బుధజనంబు
సలుపుచున్నారు నాసేవ-సవ్యసాచి

గే॥ జగదుత్పత్తికి కారకుండని
సర్వమును నామహిమచే
జరుగుచున్నవటంచు జగములు
చాలప్రజ్ఞావంతులై
పండితులునను తెలిసికొలిచిరి
భక్తిగలిగినవారలై
అని కిరీటికి ॥శ్రీహరిని

9) శ్లో॥ మచ్చిత్తా మద్గతప్రాణా
బోధయంతః పరస్పరం
కథయంతశ్చ మాంనిత్యం
తుష్యంతిచ రమంతిచ ..

ప.వి. మచ్చిత్తాః, మద్గతప్రాణాః, బోధయంతః, పరస్పరం, కథయంతః, చ, మాం, నిత్యం, తుష్యంతి, చ, రమంతి, చ .

దదామిబుద్ధి యోగంతం
యేనమా ముపయాంతితే ....

వ.వి. తేషాం, సతతయుక్తానాం, భజతాం, ప్రీతిపూర్వకం, దదామి, బుద్ధియోగం, తం, యేన, మాం, ఉపయాంతి, తే .

టీ॥ సతతయుక్తానాం-యెల్లప్పుడు నాయందు చిత్తముగలవారును ప్రీతిపూర్వకం-ప్రీతిచేత, భజతాం-సేవించుచున్న, తేషాం - వారికి, తంబుద్ధియోగం-ఆజ్ఞానయోగమును, దదామి-ఇచ్చుచున్నాను, యేన-యేబుద్ధియోగముచేత, తే-వారలు, మాం - నన్ను, ఉపయాంతి-భొందుచున్నారో .

గ॥ అర్జునా యెల్లప్పుడు నాయందు మనస్సుగలవారలై ప్రీతితో నన్ను భజించుచున్నట్టివారలకు, దేనిచేవారలు నన్ను పొంద గలరో, అట్టి బుద్ధియోగమును ఇచ్చుచున్నాను, దానిచే వారలు నన్ను పొందుచున్నారు

ప॥తే॥ చిత్తమెప్పుడు నాయందు-చేర్చియుంచి
పరమప్రీతితో సేవించు-భక్తతతికి
వారలెద్దానిచే నను-చేరగలరో
అట్టిబుద్ధి యోగమువారి-కందజేతు

గే॥ ఎపుడుచిత్తము నాయందుంచి
యెవరుగొలుతురో ప్రీతినన్
వారికొసగెద బుద్ధియోగము*
వారు నన్నేపొందగా
అని కిరీటికి ॥శ్రీహరిని

* రాజయోగము అర్థాత

జ్ఞానమనియెడి దీపకాంతిచె
సర్వమును తొలగించెదరా
అని కిరీటికి ॥శ్రీహరి॥

## అర్జున ఉవాచ

12) శ్లో॥ పరంబ్రహ్మ పరంధామ
పవిత్రం పరమంభవాన్
పురుషం శాశ్వితం దివ్య
మాదిదేవ మజంవిభుమ్ ....

13) శ్లో ఆహుస్త్వా మృషయఃసర్వే
దేవర్షిర్నార దస్తథా
అసితోదేవలో వ్యాసః
స్వయంచైవ బ్రవీషిమే ...

ప.వి పరం. బ్రహ్మ. పరం. ధామ. పవిత్రం. పరమం. భవాన్
పురుషం. శాశ్వతమ్ దివ్యం, ఆదిదేవం. అజం. విభుం. (12)

ఆహుః త్వామ్. ఋషయః. సర్వే. దేవర్షిః నారదః. తథా,
అసితః. దేవలః. వ్యాసః. స్వయం. చ. ఏవ బ్రవీషి. మే. (13)

టీ॥ భవాన్-నీవు. పరం + బ్రహ్మ-పరబ్రహ్మవు. పరం + ధామ-పరమతేజస్వరూపుడవు. పరమం + పవిత్రం - పరమపవిత్రుడవు. త్వాం-నిన్ను. శాశ్వతమ్-నిత్యునిగను. దివ్యం-స్వప్రకాశునిగను.

ఆదిదేవం-మొదటిదేవునిగను, అజం-పుట్టుకలేనివానినిగా, విభుం-ప్రభువుగను, సర్వే-సమస్తమైన, ఋషయః-మహర్షులును, దేవర్షిః-దేవఋషియైన, నారదః-నారదుడును, తథా-అట్లే, అసితః-అసితుడును, దేవలః-దేవలుడును, వ్యాసః-వ్యాసుడును, ఆహుః-తెలిపియుండిరి. స్వయం + చ + ఏవ-నీవును స్వయముగా ఆవిధముగనే, మే-నాకొరకు, బ్రవీషి-చెప్పుచున్నావు .

❋ అర్జునుడు చెప్పుచున్నాడు ❋

ఓ కృష్ణా నీవు పరబ్రహ్మవు, పరంధాముడవు పరమపావనుడవు శాశ్వతుడవనియు. దివ్యమూర్తివనియును, పరమపురుషుడవనియును ఆదిదేవునిగను, పుట్టుకలేని వానినిగాను, ప్రభువుగను, సమస్త మహర్షులును, నారదుడును, అసితుడను ఋషియును, దేవలుడను ఋషియును, వ్యాసమహర్షియును, తెలిపియుండిరి, నీవు స్వయముగా అట్లే నాకు చెప్పితివి

12) ప॥తే॥ పరమపురుషుడును, పర-బ్రహ్మవనుచు
పరమపావనుడనుచును-పరంధాము
డజుడు, ప్రభువనియును, నిత్య-డనియు, నాది
దేవుడును, దివ్యుడనుచు-తెలిపినారు

13) ప॥తే॥ అఖిలఋషులును, నారద-అసితఋషియు
దేవలుడు, వ్యాసమౌనియు-తెలుపగాను
నేనువినియుంటి పలుమారు-నీవుకూడ
తెలుపుచుంటివి శ్రీకృష్ణ-తెల్లముగను

గే॥ నీవు పరమాత్ముండవనియును
నిన్నుశాశ్వతుడవనియునూ
నీవు పరబ్రహ్మంబవనియు
నినుపరంధాముండుగా ॥శ్రీ॥
పరమపావన పరమపురుషుడు
పరమతేజోవంతుడున్
దేవతలలో మొదటివాడని
దివ్యమూర్తి వటంచునిన్ ॥శ్రీ॥
పుట్టిగిట్టుట లేనివాడవు
పూర్వపురుషుడవనియునూ
తెలిపియుండెను నారదుండును
తెలిపెదేవలుడసితుడున్ ॥శ్రీ॥
తెలిపియుండిరి సర్వఋషులును
తెలిపియుండెను వ్యాసుడుఁ
నీవుతెలిపితివా విధంబున
నీదుమహిమలు మాధవా
అనుచు పొగడెను కృష్ణమూర్తిని
అర్జునుడు రణభూమిలో
శ్రీహరిని శ్రీ కృష్ణమూర్తిని

14) శ్లో॥ సర్వమేతదృతం మన్యే
యన్మాంవదసి కేశవ
నహితేభగవఁ వ్యక్తిం
విదుర్దేవాన దానవాః..

ప.వి. సర్వం. ఏతత్. ఋతం. మన్యే. యత్. మాం. వదసి. కేశవ. న. హి. తే. భగవన్. వ్యక్తిమ్. విదుః. దేవాః. న. దానవాః

టీ॥ కేశవ-ఓకృష్ణా. యత్-యేవిషయమును. మాం-నన్ను గురించి. వదసి-చెప్పుచున్నావో. ఏతత్-ఈ. సర్వం-సమస్తమును. ఋతం-సత్యము (అని) మన్యే-తలంచుచున్నాను. హే భగవన్-ఓ భగవంతుడా తే - నీయొక్క. వ్యక్తిం - స్వరూపస్వభావములను. దేవాః-దేవతలును. న + విదుః-ఎరుగరు. దానవాః-దానవులును. న + హి + విదుః-ఎరుగరుగదా।

గ॥ ఓ కృష్ణా నీవు నాకుపదేశించిన. సమస్త విషయములను. సత్యములని నమ్ముచున్నాను. నీమహిమలను. దేవతలుగాని. దా.. నులుగాని పూర్తిగా తెలియజాలరు

ప॥వే॥ నీవుతెలిపిన విషయముల్-నేనుపూర్తి
విశ్వసించితి మాధవా-విశ్వరూప
నీదుమహిమలు పూర్తిగా-నిర్జరులును
తెలియజాలరు దానవుల్-తెల్లముగను

గీ॥ నీవుతెలిపినవన్ని సత్యము
నేనునమ్మితి కేశవా
జ్ఞానమును [illegible]
వ్యక్తిగల భగవంతుడా

తెలియజాలరు నీదుమహిమలు
దేవదానవు లెవ్వరుణ్
అనుచు పొగడెను ॥శ్రీహరిని

15) శ్లో॥ స్వయమేవాత్మ నాఽఽత్మానం
వేత్థత్వం పురుషోత్తమ
భూతభావన భూతేశ
దేవదేవ జగత్పతే

ప.వి స్వయం, ఏవ, ఆత్మనా, వేత్థ త్వం, పురుషోత్తమ, భూతభావన, భూతేశ, దేవదేవ, జగత్పతే

టీ॥ పురుషోత్తమ-పురుషశ్రేష్ఠుడా, భూతభావనా - భూతములను కలుగజేసినవాడా, దేవదేవ-దేవతలకు దేవతయైనవాడా, జగత్పతే-లోకనామకుడైనవాడా, త్వం-నీవు, ఆత్మానం-నిన్ను, స్వయం + ఏవ-స్వయముగానే ఆత్మనా-నీచేతనే, వేత్థ-తెలిసికొనుచున్నావు

గ॥ ఓ కృష్ణా నీవు ప్రాణులను వృద్ధిచేయువాడవును, ప్రాణులకు నియామకుడవును, పూరుషోత్తముడవు, నీ మహిమలుతెలియదగినవాడవు నీవేకాని వేరింకెవరులేరు

ప॥తే॥ ప్రాణులను వృద్ధినిసలుపు-వాడనీవు
ప్రాణులనియామకుండవు-పరమపురుష
డవును, దేవదేవుడగుదు-నీవు, లోక
పాలకుడవు నీమహిమలు-తెలియలేరు
నీస్వరూపము లెవ్వరు-నీవుగాక

ప॥తే॥ ఏవిభూతులచేత, నీ-వెల్లజగము
అందు, వ్యాపించియుందువో-యట్టి, నీవి
భూతులతెలియజేయ సం-పూర్ణముగను
అర్హుడవునీవె శ్రీ కృష్ణ-యన్యులెవరు

గే॥ కాంచుచుంటిని నీదుమహిమలు
కలిగియుంటి వనేకముల్
యేమహిమచే వ్యాపకంబై
యీలోకములనుంటివో
ఆమహిమల తెలియజేయగ
నర్హుడవునీవే హరీ
అనుచు పొగడెను ॥శ్రీహరిని

17) శ్లో॥ కథంవిద్యా మహంయోగిన్
త్వాంసదా పరిచింతయన్
కేషుకేషుచ భావేషు
చింత్యోఽసి భగవన్మయా

ప వి. కథం, విద్యామ్, అహం, యోగిన్, త్వాం, సదా, పరిచింతయన్, కేషు కేషు, చ, భావేషు, చింత్యః, అసి, భగవం, మయా

టీ॥ యోగిన్-యోగేశ్వరాకృష్ణా, అహం-నేను, కథం-యెట్లు, త్వాం-నిన్ను, సదా-ఎల్లప్పుడు, పరిచింతయన్-ధ్యానముచేయుచున్నవాడనై, విద్యాం-తెలియుదును, భగవాన్-ఓకృష్ణస్వామీ, కేషు

కేషుచభావేషు-యేయేభావములయందు, మయా - నాచేత, చింత్యా-ధ్యానముచేయదగినవాడవు, అసి-అగుచున్నావు

గ॥ ఓకృష్ణా నేను నిన్ను, సర్వకాలములయందు, యేవిధముగా ధ్యానమునుసలిపి, తెలిసికొనగలను, నీవు యేయేరూపములుగలవాధ వుగా, ధ్యానముచేయుటకు తగినవాడవు

ప॥తే॥ ఏవిదంబుగ ద్యానంబు-నెపుడుసలిపి
యెట్లు నినునేనుపూర్తిగా-నెరుగగలను
యేస్వరూపమున నినునే-నెంచి సలుప
వలయునో ధ్యానమయ్యది-తెలుపమయ్య

గే॥ ఏవిధంబుగ సలిపిధ్యానము
యెరుగగల నిన్నెప్పుడున్
యేస్వరూపము గలగువాడని
యెంచుదును నినుమాధవా
తెలియజేయుము విషయమంతయు
దేవదేవ పరాత్పరా
అనుచు నడిగెను అర్జునుడు రణభూమిలో

18) శ్లో॥ విస్తరేణాత్మనో యోగం
విభూతించ జనార్దన
భూయఃకథయ తృప్తిర్హి
శృణ్వతోనాస్తి మేఽమతమ్....

ప.వి. విస్తరేణ, ఆత్మనః, యోగం, విభూతిం, చ, జనార్దన, భూయః, కథయ, తృప్తిః, హి, శృణ్వతః, న, అస్తి, మే, అమృతమ్

టీ॥ జనార్దన-ఓకృష్ణా, ఆత్మనః-నీయొక్క, యోగం-యోగమును, విభూతించ-ఐశ్వర్యమును విస్తరేణ-విస్తారముచేత, భూయః-మరల, . కథయ - చెప్పుము, అమృతం - మీవాక్యామృతమును, శృణ్వతః-వినుచున్న, మే-నాకు, తృప్తిః-తనివి, నాస్తిహి-లేదు గదా?

గ॥ ఓకృష్ణాస్వామీ మీయొక్క యోగమును, ఐశ్వర్యమును, విస్తారముగా మరల చెప్పుము, మీ వాక్యామృతమును, వినుచున్న నాకు సంతృప్తిలేదుగదా

ప॥తే॥ నీవిభూతి విశేషము-నీదుయోగ
మహిమమును వివరంబుగా-మరలచేపుము
నీదువాక్యామృతమునెంత-నేనువినిన
కలుగలేదయ్యా సంతృప్తి-కమలనాథ

గే॥ నీవిభూతిని యోగమహిమను
నీవె తెలుపుము విరివిగా
ఆలకించితి తృప్తికలుగదు
అమృతమౌ నీవాక్యముల్
అనుచు నడిగెను ॥అర్జునుడు రణభూమిలో

✳ శ్రీ భగవానువాచ ✳

19) శ్లో॥ హంతతే కథయిష్యామి
దివ్యాహ్యాత్మ విభూతయః
ప్రాధాన్యతః కురుశ్రేష్ఠ
నాస్త్యంతో విస్తరస్యమే. .

ప.వి. హంత, తే. కథయిష్యామి, దివ్యాః, హి, ఆత్మవిభూతయః, ప్రాధాన్యతః, కురుశ్రేష్ఠ, న, అస్తి, అంతః, విస్తరస్య, మే.

టీ॥ హంత-అట్లయినను, తే-నీకొరకు, దివ్యాః-దివ్యమైనట్టివగు, ఆత్మవిభూతయః - నావిభూతులను, ప్రాధాన్యతః - ముఖ్యమునుబట్టి. కథయిష్యామి-చెప్పుచున్నాను, హేకురుశ్రేష్ఠ-ఓయర్జునా.(నాయొక్క) విస్తరస్య-విభూతివిస్తారమునకు, అంతః-అంతము, నఅస్తి + హి-లేదు గదా?

గ॥ ఓయర్జునా నావిభూతులనేకములున్నవి వానికంతములేదు. అయినను, వానిలో ముఖ్యమైనవి, నీకు కొన్నిటినిచెప్పెదను వినుము.

ప॥తే॥ అధికమగు నావిభూ తుల-కంతులేదు
కలవనేకము, ఫల్గునా-కానివాని
యందున, వినుము, ముఖ్యమై-నట్టివాని
తెలియజేసెద కొన్నింటి-తెల్లముగను

గే॥ కలవుపెక్కులు నాదుమహిమలు
కాదు తెలుపగనన్నిటిన్
అలకింపుము ముఖ్యమైనవి
అందులోనొక కొన్నిటివ్
అని కిరీటికి ॥శ్రీహరిని

20) శ్లో॥ అహమాత్మా గుడాకేశ
సర్వభూతాశయస్థితః
అహమాదిశ్చ మధ్యంచ
భూతానామంత యేవచ

ప.వి. అహం. ఆత్మా. గుడాకేశ. సర్వభూతాశయస్థితః అహం. ఆదిః. చ. మధ్యం. చ. భూతానామ్. అంతః ఏవ. చ.

టీ॥ గుడాకేశ-ఓయర్జునా, అహం-నేను, సర్వభూతాశయస్థితః-నాకు శరీరభూతములైన, సమస్తభూతముల హృదయమునందుండు, ఆత్మా-ఆత్మయు, భూతానాం-భూతములకు, ఆదిశ్చ-అదియును (సృష్టి) మధ్యంచ-మధ్యమున్ను, (స్థితియు) అంతశ్చ-అంతమును (లయ మును) అహంఏవ-నేనేను.

గ॥ సర్వప్రాణులయొక్క హృదయములయందుండు, ఆత్మను నేనే, సర్వప్రాణులయొక్క యుత్పత్తికి, రక్షణకు, లయమునకు కారణభూతుడను నేనే.

ప॥తే॥ అన్నిప్రాణులయందుండు-నాత్మనేను
అన్నిప్రాణులకుత్పత్తి-నగుదునేను
అన్నిప్రాణులకాధార-మగుదునేను
అన్నిప్రాణుల, లయకర్త-నగుదునేను

గే॥ నేనెయాత్మను సర్వప్రాణికి
నేనెసృష్టికి హేతువుగ
నేనెప్రాణుల పోషకుండను
నేనెకర్త, లయానికిగ
అని కిరీటికి ॥శ్రీహరిని

21) శ్లో॥ ఆదిత్యానా మహంవిష్ణు
ర్జ్యోతిషాం రవిరంశుమాన్
మరీచిర్మరు తామస్మి
నక్షత్రాణా మహంశశీ....

ప.వి ఆదిత్యానాం. అహం, విష్ణుః, జ్యోతిషామ్, రవిః, అంశుమాన్, మరీచిః, మరుతాం, అస్మి, నక్షత్రాణాం, అహం, శశీ.

టీ॥ అహం-నేను, ఆదిత్యానాం, ద్వాదశాదిత్యులలో, విష్ణుః-విష్ణువనెడియాదిత్యుడను, జ్యోతిషాం - తేజస్సులలో, అంశుమాం-కిరణములుగల, రవిః - సూర్యుడను, మరుతాం - సప్తమరుత్తులలో, మరీచిః-మరీచియనువాయువును, నక్షత్రాణాం-నక్షత్రములలో, శశీ-చంద్రుడను, అస్మి-అగుచున్నాను

గ॥ అర్జునా ద్వాదశాదిత్యులలో, విష్ణువను ఆదిత్యుడను, జ్యోతులలో కిరణములుగల సూర్యుడను, సప్తమరుత్తులలో మరీచిని నక్షత్రములలో చంద్రుడను నేనే అయియున్నాను .

ఆ॥తే॥ అగుదు నాదిత్యులలోవిష్ణు-వనెడివాడ
జ్యోతులందున, ఫల్గునా-సూర్యుడగుదు

మరి మరీచినినగుదు, నే-మరుతులందు
చంద్రుడగుదు, తారకలందు-సవ్యసాచి

గే॥ అదిత్యులలో విష్ణువనియెడి
అదిత్యుండను నేనే
తేజస్సులలో కిరణములుగల
దినకరుండనునేనే ॥శ్రీ॥
మరుతులేడిటియందునేనే
మరీచియనెడివాయువుణా
నేనెచంద్రుడ తారకలలో
నిజమటంచునెరుంగుమా
అని కిరీటికి ॥శ్రీహరిని

22) శ్లో॥ వేదానాం సామవేదోఽస్మి
దేవానామస్మి వాసవః
ఇంద్రియాణాం మనశ్చాస్మి
భూతానా మస్మి చేతనా.

ప.వి. వేదానాం, సామవేదః, అస్మి, దేవనామ్, అస్మి, వాసవః ఇంద్రియాణాం, మనః, చ, అస్మి, భూతానాం, అస్మి, చేతనా

టీ॥ వేదానాం-వేదములలో, సామవేదః-సామవేదము, అస్మి-అయియున్నాను, దేవానాం-దేవతలలో, వాసవః-ఇంద్రుడను, అస్మి-అయియున్నాను, ఇంద్రియాణాం - ఇంద్రియములలో, మనః - మనస్సును, అస్మి-అయియున్నాను, భూతానాం-ప్రాణులలో, చేతనా-చేతనాశక్తి, అస్మి-అయియున్నాను

గ॥ అర్జునా వేదములలో సామవేదము నేనే, దేవతలయందు దేవేంద్రుడను నేనే, ఇంద్రియములయందు మనస్సును నేనే, ప్రాణుల యందు తెలివిని నేనేయయియున్నాను

ప॥తే॥ వేదములలోన నేసామ-వేదమగుదు
అమరులందున దేవేంద్రు-డగుదునేను
యింద్రియములందు మానస-మేనెయగుదు
ప్రాణులందున తెలివిని-పార్థనేనె

గే॥ వేదములలో సామవేదము
విబుధులందున నింద్రుడ
యేనుప్రాణులయందు తెలవిని
యింద్రియములలో మనసునూ
అని కిరీటక ॥శ్రీహరి॥

23) శ్లో॥ రుద్రాణాంశంకర శ్చాస్మి
విత్తేశోయక్ష రక్షసామ్
వసూనాం పావకశ్చాస్మి
మేరుఃశిఖరిణా మహమ్....

ప.వి రుద్రాణామ్, శంకరః, చ, అస్మి, విత్తేశః యక్షరక్షసాం, వసూనాం, పావకః, చ, అస్మి, మేరు శిఖరిణాం అహం....

టీ॥ రుద్రాణాం-ఏకాదశరుద్రులలో, శంకరశ్చ - శంకరుడను, అస్మి-అగుచున్నాను, యక్షరక్షసాం-యక్షరక్షోగణములలో, విత్తేశః- కుబేరుడను, అస్మి-అగుచున్నాను, వసూనాం-అష్టవసువులలో, పావ

కశ్చ-అగ్నిని. అస్మి-అగుచున్నాను శిఖరిణాం-కొండలలో. మేరుః-మేరుపర్వతమును. అహం-నేనే. అస్మి-అగుచున్నాను

గ॥ అర్జునా నేను ఏకాదశరుద్రులలో శంకరుడను. యక్షరాక్షసులలో కుబేరుడను. అష్టవసువులలో అగ్నిహోత్రుడను. పర్వతములలో మేరుపర్వతమును నేనే యగుచున్నాను.

ప॥తే॥ శంకరుడ రుద్రులందునే-సవ్యసాచి
అసురయక్షుల విత్తేశు-డగుదునేను
అష్టవసువులలోన, నే-నగ్నినగుదు
పర్వతముల, నగుదు మేరు-పర్వతంబు

గే॥ ఏకాదశ రుద్రులయందున
యేనుశివుడ ధనంజయా
యక్షరక్షో గణములందున
నగుదునేను కుబేరుడ—
అష్టవసువులలోన యగ్నిని
అగములందున మేరువు—
అని కిరీటికి ॥శ్రీహరిని

24) శ్లో॥ పురోధసాంచ ముఖ్యంమాం
విద్ధిపార్థ బృహస్పతిం
సేనానీనా మహంస్కందః
సరసామస్మి సాగరః....

ప.వి. పురోధసాం, చ, ముఖ్యం, మామ్, విద్ధి, పార్థ, బృహ స్పతిం, సేనానీనాం, అహం, స్కందః, సరసాం, అస్మి, సాగరః,

టీ॥ పార్థ-ఓయర్జునా, మాం-నన్ను, పురోధసాం-పురోహితు లలో, ముఖ్యం - ముఖ్యమైన, బృహస్పతించ - బృహస్పతినిగాను, విద్ధి-యెరుగుము, అహం-నేను, సేనానీనామ్-సేనానులలో, స్కందః-కుమారస్వామియును, సరసాం-సరస్సులలో, సాగరః-సముద్రడను, అస్మి-అగుచున్నాను

గ॥ అర్జునా పురోహితులలో శ్రేష్ఠుడగు బృహస్పతియను పురోహితుడను, నేనే, సేనాధిపతులలో కుమారస్వామిని నేనే, సరస్సులలో సముద్రుడను నేనేయని తెలిసికొనుము

ప॥ తే॥ అగుదునే పురోహితుల, బృ-హస్పతియును
సకల సేనాధిపతులందు-స్కందుడగుదు
సరసులందునే నగుదును-సాగరుండు
తెలిసికొనుమయ్య ఫల్గునా-తెల్లముగను

గే॥ నేనెబృహస్పతి పురోహితులలో
సేనానుల స్కందుడఁగా
సరసులందుననేనె పార్థా
సాగరుండని తెలియుమా
అని కిరీటికి ॥శ్రీహరిని

25 శ్లో ॥ మహర్షీణాం భృగురహం
గిరామస్మ్యేక మక్షరమ్

యజ్ఞానాం జపయజ్ఞో ఽస్మి
స్థావరాణాం హిమాలయః ...

ప.వి. మహర్షిణాం, భృగుః, అహం, గిరాం, అస్మి, ఏకమ్, అక్షరం, యజ్ఞానాం, జపయజ్ఞః, అస్మి, స్థావరాణాం, హిమాలయః

టీ॥ అహం-నేను, మహర్షిణాం-సప్తమహర్షులలో, భృగు-భృగుమహర్షిని, గిరాం-మాటలలో, ఏకం-ఒకటేయగు, అక్షరం-అక్షరమును (ఓంకారమును) అస్మి - అయియున్నాను, యజ్ఞానాం-యజ్ఞములలో, జపయజ్ఞః - జపయజ్ఞమును, స్థావరాణాం - స్థావరములలో, హిమాలయః-హిమవత్పర్వతమును, అస్మి-అయియున్నాను

గ॥ అర్జునా మహర్షులలో భృగుమహర్షిని నేనే, మాటలలో ఒకే అక్షరమగు ఓంకారమును నేనే, యజ్ఞములలో, జపయజ్ఞము నేనే స్థావరములలో హిమత్పర్వతము నేనేయని, తెలిసికొనుము

ప॥తే॥ ఋషులలోనేను భృగుమహా-ఋషిసినగుదు
వాక్కులందున ఫల్గునా-ప్రణవమగుదు
అగుదు యజ్ఞములను జప-యజ్ఞమేను
అన్నిగిరులందు హిమగిరి-నగుదునేను

గే॥ మరీచ్యాది మహర్షులలో భృగు
మహర్షినగుదు ఫల్గునా
అర్థవంతపు శబ్దములలో
అగుదునేనే ప్రణవముగా ॥శ్రీ॥

యజ్ఞములలో జపయజ్ఞంబును
యగుదునేను ధనంజయా
అన్ని గిరులయందున నేనే
యగుదుహిమగిరి ఫల్గునా
అని కిరీటికి ॥శ్రీహరిని

26) శ్లో॥ అశ్వత్థస్సర్వ వృక్షాణాం
దేవర్షీణాంచ నారదః
గంధర్వాణాం చిత్రరథః
సిద్ధానాం కపిలోమునిః....

ప.వి. అశ్వత్థః, సర్వవృక్షాణాం, దేవర్షీణాం, చ, నారదః. గంధర్వాణాం చిత్రరథః, సిద్ధానాం, కపిలః, మునిః,

టీ॥ సర్వవృక్షాణాం-సకలవృక్షములలో, అశ్వత్థః-రావిచెట్టును, దేవర్షీణాం-దేవఋషులలో, నారదః - నారదుడను, గంధర్వాణాం-గంధర్వులలో, చిత్రరథః-చిత్రరథుడను, సిద్ధానాం-సిద్ధులలో, కపిల మునిః-కపిలమునియు, అస్మి-అగుచున్నాను

గ॥ అర్జునా వృక్షములలో రావిచెట్టును నేనే, దేవఋషులలో నారదుడను నేనే, గందర్వులలో చిత్రరథుడను నేనే, సిదులలో కపిలమునియును నేనే, యగుచున్నాను

ప॥తే॥ వృక్షములయందు నశ్వత్థ-వృక్షమేను
దేవఋషుల నారదుడని-తెలిసికొనుము
చిత్రరథుడ గంధర్వుల-శిష్టచరిత
అగుదు కపిలమునిని సిద్ధ-లందునేనే

గే॥ అన్నిరకముల వృక్షములలో
నగుదునే నశ్వత్థముగా
దేవఋషులలో నారదుండని
తెలిసికొనుము ధనంజయా
గంధర్వులలో చిత్రరథుడను
కపిలముని సిద్ధులందున్
అని కిరీటికి ॥శ్రీహరిని

27) శ్లో॥ ఉచ్చైశ్శ్రవస మశ్వానాం
విద్ధిమా మమృతోద్భవం
ఐరావతం గజేంద్రాణాం
నరాణాంచ నరాధిపమ్

ప.వి. ఉచ్చైః శ్రవసం, అశ్వానాం, విద్ధి, మామ్, అమృతోద్భవం, ఐరావతం, గజేంద్రాణా, నరాణాం, చ, నరాధిపం

టీ॥ అశ్వానాం-అశ్వములలో (గుఱ్ఱములలో) అమృతోద్భవం-అమృతమందు బుట్టిన, ఉచ్చైశ్రవసం-ఉచ్చైశ్రవసముగను, గజేంద్రాణాం-దిగ్గజములలో, ఐరావతం-ఐరావతముగను, నరాణాం-మానవులలో, నరాధిపం-రాజుగను, మాం-నన్ను, విద్ధి-తెలిసికొనుము

గ॥ అర్జునా నేనే అశ్వములలో అమృతముతోబుట్టిన ఉచ్చైశ్రవసమునగుదును, యేనుగులయందు నైరావతము నేనే, మనుష్యులలో రాజును నేనేయగుదునని తెలిసికొనుము

ప॥తె॥ అమృతముజతను బుట్టిన-దగుటచేత
నగుదు. నుచ్చైశ్శ్రివసము, నే-నశ్వములలొ
అగుదునై రావతము కరు-లందునేనె
మనుజులందున రాజును-నేనెయగుదు

గే॥ అశ్వములలో నుచ్చైశ్రవస
మైరావతము గజములందు
మనుజులందున నేనురాజని
మదిదలంచు ధనంజయా
అని కిరీటికి ॥శ్రీహరి॥

28) శ్లో॥ ఆయుధానా మహంవజ్రం
ధేనూనా మస్మి కామధుక్
ప్రజనశ్చాస్మి కందర్ప
సర్పాణామస్మి వాసుకిః....

ప.వి. ఆయుధానాం, అహం, వజ్రం, ధేనూనాం, అస్మి, కామధుక్, ప్రజనః, చ, అస్మి, కందర్పః సర్పాణాం, అస్మి, వాసుకిః.

టీ॥ అహం - నేను, ఆయుధానాం - ఆయుధములలో, వజ్రం-వజ్రాయుధమును, ధేనూనాం-గోవులలో, కామధుక్-కామధేనువును, అస్మి-అవుచున్నాను, ప్రజనః-ప్రజల పుట్టువునకు కారణమగు, కందర్పశ్చ-మన్మథుడను, అస్మి-అగుదును, సర్పాణాం - సర్పములలో, వాసుకిశ్చ-వాసుకియును, అస్మి-అగుచున్నాను

గ॥ అర్జునా ఆయుధములలో వజ్రాయుధము నేనే గోవులయందు కామధేనువు నేనే. ప్రాణుల పుట్టుకకు కారణమైన మన్మథుడను నేనే. సర్పములలో వాసుకియను సర్పము నేనే యగుచున్నాను

ప॥తే॥ ఆయుధములయందు నేనెవ-జ్రాయుధంబు
నగుదు, నేకామధేనువు-నావులందు
కాముడను ప్రాణిపుట్టుక-కారకులలో
సర్పములలోన, వాసుకి-సర్పమేను

గే॥ ఆయుధములలొ వజ్రాయుధము
నగుదువాసుకి ఫణులలో
కామధేనువు గోవులందున
కాముడను నరజన్మకు
అని కిరీటికి ॥శ్రీహరిని

29) శ్లో॥ అనంతశ్చాస్మి నాగానాం
వరుణోయాదసామహం
పితౄణా మర్యమాచాస్మి
యమఃసంయమతా మహం....

ప.వి. అనంతః, చ, అస్మి, నాగానామ్, వరుణః, యాదసాం, అహం, పిత్రూణాం, అర్యమా, చ, అస్మి, యమః, సంయమతాం, అహం

టీ॥ అహం-నేను, నాగానాం-పాములలో, అనంతశ్చ - అనంతుడను, యాదసాం - జలవాసులలో, వరుణః-వరుణుడను, అస్మి-అగుదును అహం-నేను, పిత్రూణాం-పితృదేవతలలో, అర్యమా-

అర్యముడను సంయమతాం-దండించువారలలో, యమః-యముడను, అస్మి-అగుచున్నాను

గ॥ అర్జునా పాములలో అనంతుడను పాము నేనే. జలదేవత లలో వరుణుడను నేనే పితృదేవతలలో అర్యముడను నేనే, దండించు వారలలో యముడను నేనే యగుచున్నాను

ప॥తే॥ నాగులం, దనంతుడ నెడి-భోగినేను
వారిదేవతలందున-వరుణుడగుదు
అర్యముడ పితృదేవత-లందునేను
యముడ దండించువారిలో-నగుదునేను

గే॥ అర్యముడను పితృదేవతలలో
అనంతుడను నాగులలో
జలవాసులలో వరుణుండను
జముడ దండించువారిలో
అని కిరీటికి ॥శ్రీహరి॥

30) శ్లో॥ ప్రహ్లాదశ్చాస్మి దైత్యానాం
కాలఃకలతా మహం
మృగాణాంచ మృగేంద్రోఽహం
వైనతేయశ్చ పక్షిణామ్....

ప.వి. ప్రహ్లాదః, చ, అస్మి, దైత్యానాం, కాలః, కలయతాం, అహం, మృగాణాం, చ, మృగేంద్రః, అహం, వైనతేయః, చ పక్షిణామ్.

టీ॥ అహం-నేను, దైత్యానాం-రాక్షసులలో, ప్రహ్లాదశ్చ-ప్రహ్లాదుడను, కలయతాం-గణిత శాస్త్రజ్ఞులలో, కాలః-కాలమును, మృగాణాంచ-మృగములలో, మృగేంద్రః-సింహమును, పక్షిణాం-పక్షులలో వైనతేయశ్చ-గరుత్మంతుడను, అస్మి-అగుచున్నాను

గ॥ అర్జునా నేను దైత్యులలో ప్రహ్లాదుడను, గణితశాస్త్రజ్ఞులలో కాలమును నేనే, మృగములలో సింహమును నేనే, పక్షులలో గరుత్మంతుడను నేనే యగుచున్నాను

ప॥తే॥ అగుదు ప్రహ్లాదుడను, దైత్య-లందునేను
గణిత శాస్త్రజ్ఞులందు, నే-కాలమగుదు
మృగములందున, సింహంబు-నగుదునేను
పక్షులందున, గరుడుడ-పార్థనేను

గే॥ ప్రహ్లాదుండను దైత్యులందున
పక్షులందున గరుడుడ
నేనుకాలము గణకులందున
నేను మృగముల్ సింహమున్
అని కిరీటికి
॥శ్రీహరిని

31) శ్లో॥ పవనః పవతామస్మి
రామఃశస్త్ర భృతామహం
ఝుషాణాం మకరశ్చాస్మి
స్రోతసామస్మి జాహ్నవీ ..

ప.వి పవనః, పవతాం, అస్మి, రామః, శస్త్రభృతాం, అహం, ఝుషాణాం, మకరః, చ, అస్మి, స్రోతసాం, అస్మి, జాహ్నవీ .

టీ॥ అహం-నేను, పవతాం-పవిత్రముచేసెడివానిలో, పవనః-వాయువును, అస్మి-అగుచున్నాను, శస్త్రభృతాం-ఆయుధధారులలో, రామః-శ్రీరాముడను, అస్మి-అగుచున్నాను, ఝషాణాం-చేపలలో, మకరః-మొసలియును, అస్మి-అగుచున్నాను, స్రోతసాం-నదులలో జాహ్నవీ-గంగానదియు, అస్మి-అగుచున్నాను

గ॥ అర్జునా నేను పరిశుద్ధముచేయు వానిలో వాయువును నేను. ఆయుధధారులలో శ్రీరాముడను, చేపలయందు మొసలిని, నదులలో గంగానదియును నేనగుచున్నాను

ప॥తే॥ శస్త్రధరులలో శ్రీరామ-చంద్రుడగుదు
వాయువగుదును, పరిశుద్ధి-చేయువాని
యందు, మకరమగుదు, చేప-లందునేను
నదులయందున గంగయగు-నదినినేను

గే॥ పరిశుద్ధి సలిపెడివానిలో
పవనుడనునే ఫల్గునా
నేనెరాముడ ధనుర్ధరులలో
నేనె మకరముఝషములం
అన్నినదులంచు గంగానది
నగుదునేను ధనంజయా
అని కిరీటికి ॥శ్రీహరిని

32) శ్లో॥ సర్గాణా మాదిరంతశ్చ
మధ్యంచైవాహ మర్జున
అధ్యాత్మ విద్యా విద్యానాం
వాదః ప్రవదతా మహమ్

ప.వి. సర్గాణాం, ఆదిః, అంతః, చ, మధ్యం, చ, ఏవ అహం, అర్జున, అధ్యాత్మవిద్యా, విద్యానాం, వాదః, ప్రవదతాం, అహం.

టీ॥ అర్జున-అర్జునా, సర్గాణాం-సృష్టులకు, ఆదిః - మొదలును, అంతశ్చ-తుదయును, మధ్యంచ-మధ్యమును, అహంఏవ-నేనే, విద్యానాం-విద్యలలో, అధ్యాత్మవిద్యా-బ్రహ్మవిద్యయు, ప్రవదతాం-వాదించు వారియొక్క, వాదః-వాదమును, అహం-నేనే

గ॥ అర్జునా సకలసృష్టులయొక్క, ఆదియును, అంతమును, మధ్యమమును, నేనే యగుచున్నాను. విద్యలలో బ్రహ్మవిద్యయును నేనే, వాదించువారలయందు, వాదమును నేనే యగుచున్నాను.

ప॥తే॥ అగుదుసృష్టికంతము, మధ్య-మాదినేనె
యగుదు, నధ్యాత్మవిద్య, నే-నన్ని విద్య
లందు, వాదించువారల-యందు, నేను
వాదమనుచును తెలియుము-పార్థనీవు

గే॥ నేనెసృష్టికిమొదలు, మధ్యము,
నేనెయగుదునూ, తుదియునూ
విద్యలందుననేనే, బ్రహ్మ
విద్యనగుదు, ధనంజయా
వాదించెడి వారలయందున
వాదమునునేనె యగుదున్
అని కిరీటికి ॥శ్రీహరి॥

33) శ్లో॥ అక్షరాణా మకారోఽస్మి
ద్వంద్వః సామాసికస్యచ

అహమేవాక్షయః కాలో
ధాతాఽహం విశ్వతోముఖః

ప.వి. అక్షరాణాం, అకారః, అస్మి, ద్వంద్వః, సామాసికస్య, చ, అహం ఏవ, అక్షయః, కాలః, ధాతా, అహం, విశ్వతోముఖః

టీ॥ అక్షరాణాం-అక్షరములలో, అకారః-అకారమును, సామాసికస్య-సమాసములలో, ద్వంద్వశ్చ-ద్వంద్వసమాసమును, అస్మి-అగుచున్నాను, అక్షయః-నాశములేని, కాలః-కాలము, అహంఏవ-నేనే, విశ్వతోముఖః-నలుదెసల ముఖములుగల, ధాతా-బ్రహ్మయు, అహం-నేనే

గ॥ అర్జునా అక్షరములలో అకారము నేనే సమాసములలో ద్వంద్వ సమాసము నేనే, నాశములేని కాలమును నేనే, యెల్లెడల ముఖములుగల బ్రహ్మయు నేనెయగుచున్నాను

ప॥తే॥ అగు దకారమునే, నన్ని-యక్షరముల
నగుదు ద్వంద్వసమాసమే-నఖిలమగు, స
మాసములయందు ఫల్గునా-మరియునేనె
యక్షరంబగు కాలంబు-నన్నిదిశల
ముఖములుగల, విధాతను-పుణ్యచరిత

గే॥ అక్షరములలోనే, నకారము
నగుదు నక్షయకాలముగా
సమాసంబులయందున ద్వంద్వ
సమాసంబగుదునేనే

నాల్గుదిశలను ముఖములఁగలుగు
నలువనేనని తెలియుమా
అనుచు పొగడెను ॥శ్రీహరిని

34) శ్లో॥ మృత్యుః సర్వహరశ్చాహ
ముద్భవశ్చ భవిష్యతామ్
కీర్తిః శ్రీర్వాక్చ నారీణాం
స్మృతిర్మేధాధృతిః క్షమా ...

ప.వి. మృత్యుః, సర్వహరః, చ అహం, ఉద్భవః, చ, భవిష్యతాం, కీర్తిః, శ్రీః, వాక్, చ, నారీణాం, స్మృతిః, మేధా, ధృతిః, క్షమా

టీ॥ సర్వహరః-సమస్తమును నశింపజేయునట్టి, మృత్యుశ్చ-మృత్యువును. భవిష్యతాం-పుట్టుకగలవారియొక్క., ఉద్భవశ్చ-పుట్టువును, అహమస్మి - నేనగుచున్నాను, నారీణాం - స్త్రీలలో, శ్రీః-లక్ష్మియు, కీర్తిః-కీర్తియు, వాక్చ-సరస్వతియు, స్మృతిః-జ్ఞాపకశక్తియు. మేధా-బుద్ధియును, ధృతిః-ధైర్యమును, క్షమా - ఓర్పును, అహంఅస్మి-నేనై యున్నాను

గ॥ అర్జునా సర్వమును హరింపజేయునట్టి మృత్యువును నేనే, ముందు పుట్టబోవువారలయొక్క వుట్టుకయును నేనే, స్త్రీలలో, కీర్తి, లక్ష్మియు, సరస్వతి, జ్ఞాపకశక్తియు, బుద్ధి, ధైర్యము ఓర్పు నేనే యగుచున్నాను

వ॥తే॥ అన్నిహరియించు మృత్యువు-నగుదునేను
పుట్టబోయెడివారల-పుట్టుకగుదు

స్త్రీలలో, బుద్ధి, ధైర్యము-శ్రీయు, కీర్తి
వాక్కు. స్మృతియు, క్షమ, మగుదు-పార్థనేను

గీ॥ నేనె పుట్టుకయగుచునుందును
నేహరించెడి మృత్యువున్
స్త్రీలయందున వాక్కు, బుద్ధియు
శ్రీ,యశ,క్షమ, ధైర్యముల్
అన్నియును నేనగుదునని నీ
వాత్మయందు దలచుమా
అని కిరీటికి ॥శ్రీహరిని

35) శ్లో॥ బృహత్సామ తథాసామ్నాం
గాయత్రీఛందసా మహమ్
మాసానాం మార్గశీర్షోఽహ
మృతూనాం కుసుమాకరః

వ.వి. బృహత్సామ, తథా, సామ్నాం, గాయత్రీ, ఛందసాం, అహం, మాసానాం, మార్గశీర్షః, అహం, ఋతూనాం, కుసుమాకరః.

టీ॥ సామ్నాం-సామములలో, బృహత్సామ-బృహత్సామమును, ఛందసాం-ఛందస్సులలో గాయత్రీ-గాయత్రీ ఛందస్సును, తథా-అలాగుననే, మాసానాం-మాసములలో, మార్గశీర్షః-మార్గశీర్ష మాసమును, ఋతూనాం-ఋతువులలో, కుసుమాకరః-వసంత ఋతువును, అహంఅస్మి-నేనై యుందును

గ॥ అర్జునా సామములలో బృహత్సామము నేనే, ఛందస్సులలో గాయత్రీ ఛందస్సు నేనే మాసములలో మార్గశిరమాసము నేనే, ఋతువులలో వసంతఋతువును నేనే అయియున్నాను

ప॥తే॥ సామములయందునే బృహ-త్సామమగుదు
ఛందసులయందు గాయత్రి-ఛందమేను
మాసముల మార్గశిరమను-మాసమేనె
యగుదునే, వసంతఋతువు-నఖిలమందు

గే॥ సామములలో బృహత్సామము
ఛందసుల గాయిత్రియును
మాసములలొ నేను పార్థా
మార్గశిర మాసమగుదున్
ఋతువులందున నేను వసంత
ఋతువటంచును తెలియుమా
అని కిరీటికి ॥శ్రీహరిని

36) శ్లో॥ ద్యూతంఛలయతా మస్మి
తేజస్తేజస్వినామహం
జయోఽస్మి వ్యవసాయోఽస్మి
సత్వం సత్వవతామహమ్ .

ప.వి. ద్యూతం, ఛలయతాం, అస్మి, తేజః, తేజస్వినాం, అహం, జయః, అస్మి, వ్యసాయః, అస్మి, సత్వం. సత్వవతాం, అహం.

టీ॥ అహం-నేను, ఛలయతాం-మోసగాండ్రయొక్క, ద్యూతం-జూదము, తేజస్వినాం - తేజోవంతులయొక్క, తేజః - తేజస్సును, జయః - జయించువారల జయమును, అస్మి - అగుచున్నాను, వ్యవసాయః - ఉద్యోగవంతులయొక్క, యుద్యోగమును. అస్మి-అగుచున్నాను. సత్వవతాం-సత్వవంతులయొక్క, సత్వం - సత్వమును. అస్మి-అగుచున్నాను

గ॥ అర్జునా వంచకులలో జూదము నేను, తేజోవంతుల యొక్క తేజస్సు నేను, జయించువారలలో జయమును నేనే, ఉద్యోగవంతులయొక్క యుద్యోగమును నేనే యగుచున్నాను, బలముగల వారియొక్క బలమును నేనే యగుచున్నాను

ప॥ చే॥ వంచకులలోన జూదంబు-పార్థ నేను
తేజమును, గలవారిలో-తేజమేను,
జయముగలవారిలో నేనె-జయమునగుదు
బలముగలవారిలో నేనె-బలమునగుదు
ఉద్యమించెడి వారిలో-ఉద్యమమును

గే॥ వంచకములగు వస్తువులలో
నెంచునేనని జూదమున్
తేజోవంతులయందు గలిగిన
తేజమేనని తెలియుమీ
జయముపొందెడి వారలందున
జయమునేనని తెలియుమీ ॥శ్రీ॥
బలముకలిగిన వారలందున

బలమునేనని యెరుగుమా
ఉద్యోగవంతులగువారిలో
యుద్యోగమేనె యగుదున్
అవి కిరీటికి ॥శ్రీహరిని

37) శ్లో॥ వృష్ణీనాం వాసుదేవోఽస్మి
పాండవానాం ధనంజయః
మునీనామప్యహం వ్యాసః
కవీనాముశనా కవిః...

ప వి వృష్ణీనాం, వాసుదేవః, అస్మి, పాండవానాం, ధనంజయః మునీనాం, అపి, అహం, వ్యాసః, కవీనాం, ఉశనా, కవిః

టీ॥ వృష్ణీనాం - యాదవులలో, వాసుదేవః - వాసుదేవుడను, పాండవానాం-పాండవులలో, ధనంజయః-ధనంజయుడను, మునీనాం-మునులలో, వ్యాసః-వ్యాసుడను, కవీనాం-కవులలో, ఉశనాకవిః + అపి-శుక్రాచార్యుడను, అస్మి-అయియున్నాను .

గ॥ అర్జునా యాదవులలో వాసుదేవుడను నేనే పాండవులలో అర్జునుడను నేనే, మునులలో వ్యాసమునిని నేనే. కవులలో శుక్రాచార్యుడను నేనే అగుదును

ప॥తే॥ అగుదునే వాసుదేవుండ-యాదవులలో
అగుదు పాండవులలోన-యర్జునుండు
మునులలోనెల్ల, నేవ్యాస-మునిని నగుదు
కవులలో శుక్రుడనియెడి-కవిని నేనె

గే॥ యాదవులలో వాసుదేవుడ
వ్యాసముని నే మునులలో
పండితులలో నేను శుక్రుడ
పాండవులలో పార్థుడన్
అని కిరీటికి ॥శ్రీహరిని

38) శ్లో॥ దండోదమయతా మస్మి
నీతిరస్మి జిగీషతామ్
మౌనంచైవాస్మి గుహ్యానాం
జ్ఞానంజ్ఞానవతా మహమ్..

ప.వి. దండః, దమయతాం. అస్మి. నీతిః. అస్మి, జిగీషతాం, మౌనం. చ. ఏవ, అస్మి, గుహ్యానాం, జ్ఞానం, జ్ఞాననతాం, అహం

టీ॥ అహం - నేను, దమయతామ్ - దండించెడివారలయొక్క, దండః-శిక్షను (దండనీతి) అస్మి-అగుచున్నాను, జిగీషతాం-జయింపగోరువారియొక్క, నీతిః-నీతిని, అస్మి-అయియున్నాను, గుహ్యానాం-రహస్యములలో, మౌనంచైవ-మౌనమును, జ్ఞానవతాం-జ్ఞానమును, అహం-నేనే, అస్మి-అగుచున్నాను ..

గ॥ అర్జునా దండించువారియొక్క దండనీతి నేనే, జయింపగోరువారియొక్క, జయోపాయమును నేనే, రహస్యములలో మౌనము నేనే, జ్ఞానులయొక్క జ్ఞానమును నేనే

ప॥తే॥ దండనము సేయువారల-దండనీతి
జయముకోరెడి వారల-జయమునీతి

నగుదు, మౌనము, గోప్యంబు-లందునేను
జ్ఞానవంతులయందున-జ్ఞానమేను

గే॥ దండించెడివారలయొక్క-
దండనీతిని నగుదునే
జయింపగోరు వారలయొక్క-
జయోపాయములునేనే ॥శ్రీ॥
జ్ఞానవంతులయందున గలిగిన
జ్ఞానమేనని తెలియుమా
నేనె గోప్యంబైనవాటిలో
మౌనమనుచు నెరుంగుమా
అని కిరీటికి ॥శ్రీహరిని॥

౩౹) శ్లో॥ యచ్చాపి సర్వభూతానాం
బీజంతదహ మర్జున
నతదస్తి వినాయత్స్యా
న్మయాభూతం చరాచరమ్...

ప.వి. యత్, చ, అపి, సర్వభూతానాం, బీజం, తత్, అహం, అర్జున, న, తత్, అస్తి, వినా, యత్, స్యాత్, మయా, భూతం, చరాచరమ్

టీ॥ అర్జునా-ఓయర్జునా, యత్-ఏది. సర్వభూతానామ్-సమస్త భూతములకు, బీజం-ఉత్పత్తికారణమో, తదపిచ-అదియును, అహం-నేను, యత్-ఏది, మయావినా - నన్నువిడిచి, స్యాత్ - ఉందునో, తత్-అట్టి, చరాచరం-చరాచరరూపమైన, భూతం-భూతసమూహము, నఅస్తి-లేదు

గ॥ అర్జునా సమస్తభూతములకు నేనే బీజము. ఈ చరాచరభూత సమూహమునందు, నేనులేకుండ యేదియునులేదు

ప॥తే॥ అన్నిప్రాణుల బీజంబు-నగుదునేను
జగతిగల చరాచరముల-సర్వమందు
నేదియునులేదు ఫల్గునా-యెక్కడేని
నెనులేనట్టి వస్తువే-కానబడదు

గే॥ అన్నిప్రాణుల, కాదికారణ
మైన బీజంబగుదునే
నేనుగాని చరాచరంబులు
లేనేలేవు ధనంజయా
అని కిరీటికి ॥శ్రీహరిని॥

40) శ్లో॥ నాంతోఽస్తి మమదివ్యానాం
విభూతీనాం పరంతప
ఏషతూద్దేశతఃప్రోక్తో
విభూతే ర్విస్తరోమయా....

ప.వి. న, అంతః, అస్తి, మమ, దివ్యానాం, విభూతీనాం, పరంతప, ఏషః, తు, ఉద్దేశః, ప్రోక్తః, విభూతేః, విస్తారః, మయా.

టీ॥ పరంతప-ఓయర్జునా, మమ-నాయొక్క, దివ్యానాం-దివ్యములైన, విభూతీనాం-విభూతులకు, అంతః-అంతము, న + అస్తి-లేదు, ఏషః + తు - ఇది, మయా - నాచేత, విభూతే - విభూతి యొక్క, విస్తరః-వివరణము, ఉద్దేశతః-సంక్షేపముగా, ప్రోక్తః-చెప్పబడెను ..

గ॥ అర్జునా నాయొక్క దివ్యములైన విభూతులకు అంతములేదు అయినను నావిభూతులయొక్క వివరణము కొన్నింటిని సంక్షేపముగా నాచేత చెప్పబడెను

ప॥తే॥ అంతమేలేని, నాయొక్క-యఖిలమైన
దివ్యమౌ విభూతతతిని-తెలుపతరమె
వానిలో సంగ్రహంబుగ-నేనునీకు
ముఖ్యమగు కొన్ని తెలిపితి-పుణ్యచరిత

గే॥ అంతులేనివి నాదుమహిమలు
అందులోనొక కొన్నిటిని
తెలియజేసితి సంగ్రహముగా
కలుగ నీపై ప్రేమచే
అని కిరీటికి. ॥శ్రీహరిని

41) శ్లో॥ యద్యద్విభూతి మత్సత్త్వం
శ్రీమదూర్జిత మేవవా
తత్తదేవావ గచ్ఛత్వం
మమతేజోం ఽశసంభవం....

ప.వి. యత్, యత్, విభూతిమ్, సత్వం, శ్రీమత్, ఊర్జితమ్, ఏవ, వా, తత్, తత్, ఏవ, అవగచ్ఛ, త్వమ్, మమ, తేజోం-శసంభవమ్ .

టీ॥ విభూతిమత్-విభూతియుక్తమైనదియు, శ్రీమత్-శ్రీమంతమును, ఊర్జితంఏవ-ఉత్సాహముతోకూడిన, యద్యత్సత్త్వం-యేయే

వస్తువుకలదో, తత్-ఆయావస్తువు, మమ-నాయొక్క, తేజోం-శసంభవమేవ-తేజోభాగసంభవమైన దానినిగా, త్వం - నీవు, అవగచ్ఛ-తెలిసికొనుము

గ॥ అర్జునా విభూతియుక్తమై కాంతివంతమై, యుత్సాహముతో కూడినదియై యేయేవస్తువు (ప్రాణి) కలదో, అదంతయు నాయొక్క తేజోంశవలన కలిగినదానిగా తెలిసికొనుము ..

వ॥తే॥ ప్రాణిగణములందు విభూతి-వంతమగుచు
కాంతివంతమై యుత్సాహ-వంతమగుచు
నేదిపొడసూపునవియన్ని-నాదు తేజ
సంభవములని తెలియుము-సవ్యసాచి

గే॥ బలవిభూతి తేజోత్సాహము
కలిగియుండిన వన్నియుణా
నాతేజాంశ సంభవంబులు
నాదుతేజమే సర్వమున్
అనుచు తెలియుము నీవుపార్థా
అన్నియును విశదంబుగా
అని కిరీటికి ॥శ్రీహరిని

42) శ్లో॥ అథవా బహునైతేన
కింజ్ఞాతేన తవార్జున
విష్టభ్యాహ మిదంకృత్స్న
మేకాంశేనస్థితో జగత్. .

ప.వి అథవా, బహునా, ఏతేన, కిం, జ్ఞాతేన, తవ, అర్జున, విష్టభ్య, అహమ్, ఇదం, కృత్స్నం, ఏకాంశేన, స్థితః, జగత్

టీ॥ అర్జున-ఓయర్జునా, అథవా-ఇంతేకాక, బహునా-విశేషమైన, ఏతేన-ఈ, జ్ఞాతేన-తెలిసికొనుటచేతను, తవ-నీకు, కిం-ఏమిలాభము అహం-నేను, ఇదం-ఈ, కృత్స్నం-సమస్తమైన, జగత్-జగత్తును, ఏకాంశేన - ఒకపాదముచేత. (ఒకభాగముచేత) విష్టభ్య-వ్యాపించి, స్థితః-యున్నాను .

గ॥ అర్జునా నావిభూతి వివరములన్ను, విశేషముగా తెలిసికొన వలసిన పని నీకులేదు. నే నీజగత్తునంతయు నొకయంశముచేతనే వ్యాపించియున్నానని తెలిసికొనుము.

ప॥తే॥ ఈ విభూతులవివరంబు-నెంత తెలుప
నేమిలాభంబు ఫల్గునా-యీజగ మొక
యంశమున నేను వ్యాపక-మగుచునుంటి
తెలుపవలసిన వివరముల్-తెలిపినాను

గే॥ నాదుమహిమలు వివరములుగా
లేదు తెలుప నవశ్యముగా
ఒకపాదమున వ్యాపకంబై
యున్నటి జగములన్నిటిగా
అని కిరీటికి బోధజేసెను
అచ్యుతుడు, రణభూమిలో

శ్రీ హరి శ్రీ కృష్ణమూర్తిని చిత్తమందు భజించెదగా
అశుభమగు సంసారబంధము, లన్నియును తొలగింపగా.

గ॥ ఇది శ్రీ కవిరత్న రత్నాకరము వెంకటేశ్వర కవి విరచితమై గద్య పద్య గేయరూపంబును, శ్రీ కృష్ణార్జునుల సంవాదంబగు, శ్రీ భగవద్గీతా గద్య పద్య గేయామృతము నందు విభూతి యోగమను పదియవ అధ్యాయము సంపూర్ణము.

హరిః ఓమ్ తత్సత్ హరిః ఓమ్

శాంతిః శాంతిః శాంతిః





విశ్వరూప సందర్శన యోగము-అధ్యాయ సంగ్రహము

మ॥ కనుమేనిచ్చెద దివ్యదృష్టి హతులౌ
కౌరవ్యులం, సైన్యముల్
కనుమా మామక విశ్వరూపమున, నీ
కాంక్షించు, సర్వాంశముల్
కనుమా ద్యంతములేనిరూపమును, నా
కాంతి, ప్రభావంబులన్
కని, సంసారభయంబుబాసి చని, మో
క్షంబందుమా ఫల్గునా ...

తా॥ అర్జునా నీకు దివ్యదృష్టినిచ్చెద, ఆద్యంతములులేని, నా విశ్వరూపమున, నీవుకోరిన సమస్తవిషయములను, హతులై కనబడు, కౌరవులను, భీష్మద్రోణాదులను. సైన్యమును, చూడుము అట్టి నాదివ్యమగు విశ్వరూపమును దర్శించిన, సంసారభయమునుబాపి, ముక్తిని ప్రసాదించునని శ్రీ కృష్ణపరమాత్మ పార్థునకు బోధించిన విశ్వరూప సందర్శన యోగమను పదకొండవ అధ్యాయము శ్రీ భగవద్గీతా గద్య పద్య గేయామృతమునందు అధ్యాయ సంగ్రహ పద్య తాత్పర్యములు.

హరిఃఓమ్ శాంతిః శాంతిః శాంతిః

✻ అర్జున ఉవాచ ✻

1) శ్లో॥ మదనుగ్రిహాయ పరమం
గుహ్యమధ్యాత్మ సంజ్ఞితం
యత్వయోక్తం వచస్తేన
మోహోఽయం విగతోమమ

ప.వి　మదనుగ్రహాయ, పరమం, గుహ్యం, అధ్యాత్మ, సంజ్ఞితం, యత్, త్వయా, ఉక్తం, వచః, తేన, మోహః, అయం, విగతః, మమ

టీ॥　మదనుగ్రహాయ-నన్నుగ్రహించుటకొరకు, త్వయా-నీచేత, పరమం-ఉత్తమమైన, గుహ్యం-రహస్యమైనటువంటియు, అధ్యాత్మ సంజ్ఞితం-అధ్యాత్మమను పేరుగలదియు, (అగు) యత్-ఏ, వచః-వాక్యము, ఉక్తం-చెప్పబడినదో, తేన-దానిచేతను, మమ-నాయొక్క, అయం-ఈ, మోహః-అజ్ఞానము, విగతః-పోయినది

✻ అర్జునుడడుగున్నాడు ✻

గ॥　ఓకృష్ణపరమాత్మా నన్నుగ్రహించుటకొరకు నీచేత ఉత్కృష్ట మైన, రహస్యమైన, అధ్యాత్మమను పేరుగలదియగు, యే వాక్యము ను చెప్పబడినదో దానిచేత నాయొక్క మోహము పోగొట్టబడినది

ప॥తే॥　కమలపత్రాక్ష (శ్రీ) కృష్ణ-కరుణచేత
నతిరహస్యమై, యధ్యాత్మ-మనెడిపేర
పరుగుచున్నట్టి, శ్రేష్ఠమౌ-వచనములను
నేను నీచేతశ్రద్ధగా-వినుటచేత
వదలిపోయె, నామోహము-వాసుదేవ

గే॥ అతిరహస్యంబుత్తమంబగు
ఆత్మానాత్మ విచారము
నన్నుదయతో నేలుటకునై
నాకొనర్చిన బోధచే ॥శ్రీ॥
వదలె నాయజ్ఞానమంతయు
వాసుదేవా మాధవా
అనుచు పొగడెను కృష్ణమూర్తిని
అర్జునుడు రణభూమిలో
॥శ్రీహరి॥

2) శ్లో॥ భవాప్యయౌహి భూతానాం
శ్రుతౌవిస్తరశోమయా
త్వత్తఃకమల పత్రాక్ష
మాహాత్మ్యమపిచా వ్యయమ్.

ప.వి. భవాప్యయౌ, హి, భూతానాం, శ్రుతౌ, విస్తరశః, మయా త్వత్తః, కమలపత్రాక్ష, మాహాత్మ్యమ్, అపి, చ, అవ్యయమ్

టీ॥ కమలపత్రాక్ష-ఓకృష్ణా, త్వత్తః - నీవలన, భూతానాం-ప్రాణులయొక్క, భవాప్యయౌ-ఉత్పత్తి ప్రళయములు, విస్తరశః-విస్తారముగా, మయా-నాచేత, శ్రుతౌ-వినబడినవి, అవ్యయం-నాశరహితమైన, తే-నీయొక్క, మహాత్మ్యం-మహాత్మమున్నూ, శ్రుతం-వినబడెను

గ॥ ఓకృష్ణా నీవలన, ప్రాణులయొక్క ఉత్పత్తి వినాశములను విస్తారముగా నేను వినియున్నాను. నాశరహితమైన నీయొక్క మాహాత్మ్యమును బాగుగ వినియున్నాను..

ప॥తే॥ అన్నిప్రాణులయుత్పత్తి-యంతములను
అవ్యయంబగు. నీయొక్క-యంతులేని
దివ్యమైనట్టి మహిమను-తెలుప నీవు
విస్తరంబుగ వినియుంటి-విశ్వరూప

గే॥ భూతోత్పత్తి వినాశములను
పూర్తిగా విశదంబుగా
వింటినక్షయ నీదుమహిమను
వింటిబాగుగ మాధవా
అనుచు పొగడెను ॥శ్రీహరిని

3) శ్లో॥ ఏవమేతద్యథా ఒత్థత్వ
మాత్మానం పరమేశ్వర
ద్రష్టుమిచ్ఛామితే రూప
మైశ్వరం పురుషోత్తమ....

ప.వి. ఏవం, ఏతత్, యథా, ఆత్థ, త్వం, ఆత్మానం, పరమేశ్వర ద్రష్టుం, ఇచ్ఛామి, తే, రూపం, ఐశ్వరం, పురుషోత్తమ

టీ॥ పరమేశ్వర-ఓకృష్ణా. ఏతత్-ఏది, ఏవం-ఈలాగే, యథా-యేరీతిగా, ఆత్మానం-నిన్నుగురించి, త్వం-నీవు, ఆత్థ-చెప్పితివో, పురుషోత్తమ-ఓకృష్ణా, తథా - అరీతిగా, ఐశ్వరం-ఈశ్వరసంబంధ మైన, తే-నీయొక్క, రూపం - స్వరూపమును, ద్రష్టుం-చూచుట కొరకు. ఇచ్ఛామి-కోరుచున్నాను

గ॥ ఓకృష్ణ పరమాత్మా నిన్నుగురించి నీవేప్రకారముగా తెలియజేసితివో పురుషోత్తమా నీయొక్క ఈశ్వరసంబంధమైన దివ్యరూపమును చూడగోరుచున్నాను..

ప॥తే॥ ఏవిదంబుగ నినుగూర్చి-యిపుడునీవు
తెలియజేసిన రీతిగా-దివ్యమైన
నీదు యీశ్వరరూపంబు-నేనుచూడ
వలయునను కోర్కె-గలిగెను-పరమపురుష

గే॥ ఎట్టిదని నీయాత్మరూపము
యెట్లుతెలిపితొ యాస్థితిఁ
నీ స్వరూపము చూడవలెనని
నేనుకోరెద వాసవా
అనుచు నడిగెను ॥శ్రీహరిని

4) శ్లో॥ మన్యసే యదితచ్ఛక్యం
మయాద్రష్టు మితిప్రభో
యోగేశ్వర తతోమేత్వం
దర్శయాత్మాన మవ్యయమ్....

ప.వి. మన్యసే, యది, తత్, శక్యం, మయా, ద్రష్టుం, ఇతి, ప్రభో, యోగేశ్వర, తతః, మే, త్వమ్, దర్శయ, ఆత్మానం, అవ్యయమ్

టీ॥ ప్రభోహేయోగేశ్వర-ఓకృష్ణపరమాత్మా, తత్-ఆరూపము, మయా-నాచేత, ద్రష్టుం-చూచుటకొఱకు, శక్యం - సాధ్యమైనదని, మన్యసేయది-తలంచితివేని, తతః-ఆతరువాత, త్వం-నీవు, మే-నాకొఱకు, అవ్యయం-శాశ్వతమైన, ఆత్మానం - నిన్ను, దర్శయ-చూపుము

గ॥ ఓకృష్ణపరమాత్మా అట్టి ప్రభావము గల ఆస్వరూపమును చూచుటకు నాకుసాధ్యమని, నీవు తలంచితివేని అవ్యయమైన యాదివ్య స్వరూపమును నాకు చూపుము .

పః।తే॥ పరమపూరుష గోవింద-పద్మనాభ
సాధ్యమని నీవుతలచిన-సరసిజాక్ష
అవ్యయంబగు, మిక్కిలి-దివ్యమైన
ఆ స్వరూపము. చూపించు-మయ్యనాకు

గే॥ సాధ్యమని నీదివ్యరూపము
చక్కగా నేచూడగా
నీకుతోచిత నాకుజూపుము
నిఖిలమును విశదంబుగా
అనుచు నడిగెను ॥శ్రీహరిని

శ్రీ భగవానువాచ

5) శ్లో ॥ పశ్యమేపార్థ రూపాణి
శతశోఽథ సహస్రశః
నానావిధాని దివ్యాని
నానావర్ణా కృతీనిచ

ప.వి. పశ్య, మే, పార్థ, రూపాణి, శతశః, అథ, సహస్రశః నానావిధాని, దివ్యాని. నానావర్ణాకృతీని, చ

టీ॥ పార్థ - ఓయర్జునా, నానావిధాని - అనేక ప్రకారములైన, దివ్యాని-దివ్యములైన, నానావర్ణాకృతీనిచ-అనేక విధములైనరంగులు రూపములు గలిగినవియు, శతశః - నూరులైన, అథ - మరియు, సహస్రశః-వేలసంఖ్యలైన, మే-నాయొక్క, రూపాణి-ఆకారములను పశ్య-చూడుము

✵ శ్రీకృష్ణపరమాత్మ చెప్పుచున్నాడు ✵

గ॥ అర్జునా అనేక విధములైన, దివ్యమైన పలువిధముల రంగులు రూపములుగలిగి. వందలు వేలుకల, నాస్వరూపములను చూడుము

ప॥తే॥ పలువిధంబుల రూపముల్-పలురకముల
వర్ణములచేత దివ్యమై-పరగుచున్న
పలువిశేషము గలవియై-వంద, వేలు
కలుగు నాస్వరూవములన్ని-కనుము పార్థ

గే॥ పలువిధంబుల దివ్యములునై
పలువిశేషము గలవియై
బహువిధంబుల వర్ణములతో
బహుశసంఖ్యలు గలవియౌ
నాస్వరూపములన్ని చూడుము
నామహో మహిమోన్నతుల్
అని కిరీటికి శ్రీహరిని

6) శ్లో॥ పశ్యాదిత్యాన్వసూన్ రుద్రా
నశ్వినౌ మరుతస్తథా

బహూన్యదృష్ట పూర్వాణి
పశ్యాశ్చర్యాణి భారత

ప.వి. పశ్య, ఆదిత్యాం, వసూన్, రుద్రాన్, అశ్వినౌ, మరుతః, తథా, బహూని, అదృష్టపూర్వాణి. పశ్య, ఆశ్చర్యాణి, భారత

టీ॥ భారత - ఓ యర్జునా, ఆదిత్యాన్ - ద్వాదశాదిత్యులను, వసూన్-అష్టవసువులను, రుద్రాన్ - ఏకాదశరుద్రులను, అశ్వినౌ-అశ్వినీదేవతలను, తథా-అటులే, మరుతః-సప్తవాయువులను, పశ్య-చూడుము, అదృష్టపూర్వాణి-ఎన్నడు చూడబడని, బహూని-అనేకములైన, ఆశ్చర్యాణి-అద్భుతములను, పశ్య-చూడుము

గ॥ అర్జునా ఆదిత్యులను, వసువులను, రుద్రులను, అశ్వినీ దేవతలను, వాయువులను, అన్నే నీవిదివరకు చూచియుండని, అనేకములైన, అద్భుతముల నిపుడు చూడుము

ప॥తే॥ ద్వాదశాదిత్యు, లెనమండ్రు-వసుగణముల
నశ్వినీ దేవతల, రుద్రు-లల్లై, మరుత
గణము, లింతవరకు నీవు-కాంచనట్టి
యధిక, యద్భుతముల, నిపు-డరయు పార్థ

గే॥ అష్టవసువాదిత్య రుద్రుల
నశ్వినుల మరుత్పవసులన్
ఇంతవరకును నీవుచూడని
యెన్నొ యద్భుతవిషయముల్
నావిశ్వరూపమున చూడుము
నామహా మహిమోన్నతుల్
॥శ్రీహరిని

7) శ్లో॥ ఇహైకస్థం జగత్కృత్స్నం
పశ్యాద్య సచరాచరం
మమదేహే గుడాకేశ
యచ్చాన్యద్ద్రష్టు మిచ్ఛసి

ప.వి. ఇహ, ఏకస్థమ్, జగత్, కృత్స్నం, పశ్య, అద్య, సచరాచరం, మమ, దేహే, గుడాకేశ, యత్, చ, అన్యత్, ద్రష్టుం, ఇచ్ఛసి.

టీ॥ గుడాకేశ-ఓయర్జునా, అద్య-యిప్పుడు, సచరాచరం-చరాచరములతోకూడిన, కృత్స్నం - సమస్తమైన, జగత్ - జగత్తును, మమ-నాయొక్క, ఇహ దేహే-ఈశరీరమందు, ఏకస్థం - ఒకప్రదేశ మందున్నదానినిగా పశ్య-చూడుము, అన్యత్-మరియొకనైన, యచ్ఛ-దేనిని, ద్రష్టుం-చూచుటకొరకు, ఇచ్ఛసి-కోరుచున్నావో, తత్-దానిని, పశ్య-చూడుము . .

గ॥ ఓయర్జునా ఈ చరాచరంబైన సమస్త ప్రపంచమును, ఒకే ప్రదేశమందున్న దానినిగా, నాదివ్యదేహమున చూడుము, ఇదిగాక యే, యే, అంశములను నీవు చూడదలచుకొన్నావో వానినన్నిటిని యిపుడుచూడుము

ప॥తే॥ ఈ చరాచరమైనట్టి-యెల్లజగతి
నొక్కచోట, నాదేహమం-దున్నవాని
చూడు, మితరంబునేదేది-చూడనీవు
కోరియున్నావొ యన్నింటి-నరయుపార్థ

గే॥ చరాచరములతోడ గూడిన
సమస్త ప్రపంచంబునుణా
యేయేవిషయము చూడగోరితో
యీ నాశరీరంబులో
చూడుమన్నియు నొక్కచోటను
చోద్యమగు నారూపముల్
అని కిరీటికి ॥శ్రీహరిని

8) శ్లో॥ నతుమాంశక్యసే ద్రష్టు
మనేనైవ స్వచక్షుసా
దివ్యందదామితే చక్షుః
పశ్యమే యోగమైశ్వరమ్

ప.వి. న. తు. మామ్. శక్యసే. ద్రష్టుమ్. అనేన. ఏవ. స్వచక్షుసా. దివ్యం. దదామి. తే. చక్షుః. పశ్య. మే. యోగం. ఐశ్వరమ్

టీ॥ అనేన-ఈ. స్వచక్షుసాఏవ-నీకన్నులచేతనే. మాం-నన్ను. ద్రష్టుం-చూచుటకొరకు. నశక్యసే-శక్తుడవుకావు. దివ్యం-దివ్యమైన. చక్షుః-నేత్రములను. తే-నీకొఱకు. దదామి-ఇచ్చుచున్నాను. ఐశ్వరం-ఈశ్వరసంబంధమైన. మే-నాయొక్క. యోగం-యోగమును. పశ్య-చూడుము

గ॥ అర్జునా ప్రాకృతములైన నీకన్నులతో నాదివ్యరూపమును. చూడజాలవు నీకు నేను దివ్యదృష్టినిచ్చుచున్నాను. వానిచేత. ఆశ్చర్యకరమైన. నాయొక్క యోగశక్తిని చూడుము

ప॥తే॥ కనుగొనగలేవు, నీదగు-కనులతోడ
దివ్యమగు నాదురూపంబు-దివ్యదృష్టి
నిచ్చెదను, వానిచేత నీ-విపుడు పార్థ
చూడు నాయోగశక్తిని-చోద్యమైన

గే॥ ప్రాకృతములగు నీదుకనులతొ
భవ్యమగు నారూపమున్
చూడజాలవు నాదుశక్తిని
చోద్యమగు నామహిమలన్
చూడుమిచ్చెద దివ్యదృష్టివి
చూడవలసిన వన్నియున్
అని కిరీటికి ॥శ్రీహరి॥

సంజయ ఉవాచ

9) శ్లో॥ ఏవముక్త్వాతతో రాజన్
మహాయోగేశ్వరో హరిః
దర్శయామాస పార్థాయ
పరమంరూప మైశ్వరమ్ ..

ప.వి. ఏవం, ఉక్త్వా, తతః, రాజన్, మహాయోగేశ్వరః, హరిః దర్శయామాస, పార్థాయ, పరమం, రూపం, ఐశ్వరం

టీ॥ రాజన్ - ఓధృతరాష్ట్రా, మహాయోగేశ్వరః - అధికమైన యోగములకు ప్రభువైన, హరిః-శ్రీకృష్ణమూర్తి, ఏవం-ఈప్రకారముగా, ఉక్త్వా-పలికి, తతః-ఆతరువాత, పార్థాయ-అర్జునునికొరకు, పరమం-ఉత్తమమైన, ఐశ్వరం-ఈశ్వరసంబంధమైన, రూపం-విశ్వరూపమును, దర్శయామాస-చూపెను

❋ సంజయుడు చెప్పెను ❋

గ॥ ఓ ధృతరాష్ట్ర మహారాజా, మహాయోగేశ్వరుడైన శ్రీకృష్ణమూర్తి, యీ విధముగాచెప్పి, తరువాత తన పరమేశ్వర సంబంధమైన, విశ్వరూపమును అర్జునునకు చూపించెను

ప॥తే॥ ఈవిధంబుగ ధృతరాష్ట్ర-యెల్లవిషయ
ములను వచియించి, శ్రీ కృష్ణ-మూర్తి, పిదప
పార్థునకపుడు దివ్యమై-పరగు, తనదు
విశ్వరూపంబు చూపించె-విశదముగను

గే॥ ఆవిధంబుగపలికి కృష్ణుడు
అప్పుడర్జును కొరకునై
చూపెప్రీతితో విశ్వరూపము
చోద్యమును దివ్యంబునౌ
॥శ్రీహరిని

10) శ్లో॥ అనేక వక్త్రనయన
మనేకాద్భుత దర్శనం
అనేక దివ్యాభరణం
దివ్యానేకోద్యతాయుధం

ప.వి. అనేక వక్త్రనయనం, అనేకాద్భుతదర్శనం, అనేక దివ్యాభరణం, దివ్యానేకోద్యతాయుధమ్

టీ॥ అనేక వక్త్రనయనం - అనేకములైన ముఖములును, నేత్రములు గలిగినట్టియు, అనేకాద్భుతదర్శనం-బహువిధములైన ఆశ్చ

ర్యముల మాపునట్టియు, అనేకదివ్యాభరణం-అనేక దివ్యభూషణములు గలిగినట్టియు, దివ్యానేకోద్యతాయుధం-దివ్యములైన, అనేకములైన యెత్తబడియున్న, ఆయుధములు గలిగినట్టియు, (రూపమును చూపెను)

గ॥ అనేక ముఖములు, కన్నులును, బహువిధములగు విచిత్రములుగలదియు, అనేక దివ్యభూషణములుగలదియు, దివ్యములైన, యెత్తబడిన, ఆయుధములుగలిగినట్టియునగు (రూపమునుజూపెను)

ప॥తే॥ అధికముఖములు, నేత్రము-లధికముగను
బహువిధ, చిత్రములతోడ-బరగుచుండు
దివ్యమగు నాభరణములు-దివ్యమైన
యాయుధములపై కెత్తి, యు-న్నట్టి, రూప
మపుడుజూపెను, ధృతరాష్ట్ర-అర్జునునకు

గే॥ పెక్కుముఖములు, నేత్రంబులును
పెక్కుదివ్యాభరణముల్
అద్భుతములతో నెత్తబడిన
యాయుధములతో కూడియుండ
॥శ్రీహరి॥

11) శ్లో॥ దివ్యమాల్యాంబరధరం
దివ్యగంధానులేపనం
సర్వాశ్చర్య మయందేవ
మనంతం విశ్వతోముఖమ్

ప.వి దివ్యమాల్యాంబరధరం, దివ్యగంధానులేపనం, సర్వాశ్చ
ర్యమయం, దేవం, విశ్వతోముఖమ్

టీ॥ దివ్యమాల్యాంబరధరం-దివ్యములైన హారములు, వస్త్రము
లను, ధరించియున్న, దివ్యగంధానులేపనం-దివ్యగంధలేపనముగలిగిన
సర్వాశ్చర్యమయం - సమస్తమైన ఆశ్చర్యములతో నిండినదియు,
విశ్వతోముఖం-అంతటముఖములుగలిగిన, అనంతం - అంతములేనిది
యును, దేవం-శ్రీభగవంతుని, (విశ్వరూపము అర్జునునకుజూపెను)

గ॥ దివ్యములైన పుష్పమాలలును, వస్త్రములను, ధరించినట్టి
దియు, దివ్యగంధలేపనముగలదియును, సర్వాశ్చర్యమయమును,
అంతములేనిదియును, అంతట ముఖములుగలదియనగు విశ్వరూప
మును అర్జునునకుజూపెను

ప॥తే॥ దివ్యమగు పుష్పమాలలు-దివ్యవస్త్ర
ములను, దివ్యమునగు గంధ-ములను గలిగి
యంతమేలేని, యద్భుత-మైనదగుచు
అన్నిదిశలను ముఖములై -యలరునట్టి
విశ్వరూపంబు చూపించె-విశదముగను

గే॥ దివ్యాంబర పుష్పహారములు
దివ్యగంధము లేపముగా
అన్నిదిశలనుగలిగి ముఖములు
అమిత తేజోవిరాజితుడౌ

అంనతుడగు శ్రీ భగవంతుని
అర్జునుడుగనె నచ్చటకా
॥శ్రీహరిని

12) శ్లో॥ దివిసూర్య సహస్రస్య
భవేద్యుగ పదుత్థితా
యదిభా సదృశీసాస్యా
ద్భాసస్తస్య మహాత్మనః

ప.వి. దివి, సూర్యసహస్రస్య, భవేత్, యుగపత్, ఉత్థితా, యది, భాః, సదృశీ, సా, స్యాత్, భాసః, తస్య, మహాత్మనః

టీ॥ దివి - ఆకాశమందు, సూర్యసహస్రస్య - (ఏకకాలమందు దయించిన) వేలకొలది సూర్యులయొక్క, భాః-కాంతి, యుగపత్-ఏకకాలమందు, ఉత్థితా-ఎగసినది, భవేద్యది-అయనేని, సా-ఆకాంతి, తస్యమహాత్మనః - ఆమహాత్మునియొక్క, భాసః - కాంతికి, సదృశీ-సమానమైనది, స్యాత్-అగును

గ॥ రాజా ఆదివ్యరూపముయొక్క కాంతి ఆకాశమునందు ఒకే సమయమందు, వేయిమంది సూర్యులు ప్రకాశించిన యెంతకాంతి కలుగునో అంతకాంతికి యీవిశ్వరూపుని కాంతికి సమమగును

ప॥తే॥ వేయిసూర్యు లాకసమున-వెలుగ, నొక్క-
కాలమెంత కాంతియగు, నా-కాంతిసమము
వెలుగుచుండగ, దివ్యమై-విశ్వరూప
మలరుచుండెను, ధృతరాష్ట్ర-నబ్బురముగ

గే॥ ఆకసంబున వేయిసూర్యులు
యేకకాలము వెలుగగా
యెంతకాంతిచె వెలుగుచుందురో
అంతకాంతికి సమమునై
వెలుగుచుండెడి విశ్వరూపము
వింతగాగనె పార్థుడున్
అనివచించెను ధృతరాష్ట్రునితో
నచట సంజయుడంతయు॥
॥శ్రీహరిని

13) శ్లో॥ తత్రైకస్థం జగత్కృత్స్నం
ప్రవిభక్త మనేకధా
అపశ్యద్దేవ దేవస్య
శరీరే పాండవస్తథా.

ప.వి. తత్ర, ఏకస్థం, జగత్, కృత్స్నమ్, ప్రవిభక్తం, అనేకధా, అపశ్యత్, దేవదేవస్య, శరీరే, పాండవః, తథా

టీ॥ తదా-అప్పుడు, పాండవః - అర్జునుడు. అనేకధా - అనేకవిధములుగాను, ప్రవిభక్తం-విభజింపబడియున్న, జగత్-జగత్తును, కృత్స్నం-సమస్తమును, దేవదేవస్య-దేవదేవుడైన శ్రీకృష్ణమూర్తియొక్క, తత్ర-ఆ, శరీరే-దేహమునందు, ఏకస్థం - ఒకచోటనున్నదానినిగను, అపశ్యత్-చూచెను

గ॥ అప్పుడర్జునుడు పలువిధములుగా విభజింపబడియున్న సమస్త జగత్తును, దేవదెవుడైన శ్రీకృష్ణమూర్తియొక్క దేహమందొకటిగా చేరియుండుట చూచెను

ప॥తే॥ పలురక విభాగములచేత-పరగుచున్న
జగతినొకచోట చేరుట-చక్కగాను
దేవదేవుని కృష్ణుని-దేహమందు
చూచె పార్థుడు సర్వంబు-చోద్యముగను

గే॥ వివిధజగములు బహువిధంబుల
వేరుపరచిన వన్నియుః
చూచెనొకటిగ చేరుటపార్థుడు
చోద్యముగ హరితనువులో
అని వచించెను ॥శ్రీహరిని

14) శ్లో॥ తతః సవిస్మయావిష్టో
హృష్టరోమా ధనంజయః
ప్రణమ్య శిరసాదేవం
కృతాంజలి రభాషత. .

ప.వి. తతః, సః, విస్మయావిష్టః, హృష్టరోమా, ధనంజయః ప్రణమ్య, శిరసా, దేవం, కృతాంజలిః, అభాషత

టీ॥ తతః-అనంతరము, ధనంజయః-అర్జునుడు, విస్మయావిష్టః-ఆశ్చర్యముతోకూడినవాడై, హృష్టరోమా-పులకితాంగుడునై, దేవం-విశ్వరూపుడైన శ్రీకృష్ణస్వామిని, శిరసా-శిరస్సుచేతను, ప్రణమ్య-నమస్కరించి, కృతాంజలిః-అంజలిబద్ధుడై, అభాషత-పలికెను

గ॥ అప్పుడర్జునుడాశ్చర్యముతోకూడిన వాడునై. గగురుపాటు చెందినవాడై, విశ్వరూపధరుడైన శ్రీకృష్ణునకు శిరస్సుచేత నమస్కరించి, చేతులుజోడించి, భక్తితో నీవిధముగాపలికెను.

ఏ॥తె॥ అబ్బురముతోడ గూడిన-యర్జునుండు
గగురు పొడిచిన వెంట్రుకల్-కలిగియపుడు
శిరసుచే నమస్కారముల్-జేసి, హస్త
ములను జోడించి, శ్రీ కృష్ణ-మూర్తిగాంచి
పలికెనిట్లని మిక్కిలి-భక్తిగలిగి

గే॥ కాంచిపార్థుడు చెంది దిగ్భ్రమ
గగురుపాటును పొందుచున్
శిరమువంచి నమస్కరించుచు
చేతులను జోడించుచున్
పలికెనిట్లని భక్తితోడను
పరమపురుషుని గాంచుచున్
అని వచించెను ॥శ్రీహరిని

అర్జున ఉవాచ

15) శ్లో॥ పశ్యామిదేవాంస్తవ దేవదేహే
సర్వాంస్తథా భూతవిశేషసంఘాన్
బ్రహ్మాణమీశం కమలాసనస్థం-
ఋషీంశ్చసర్వానురగాంశ్చదివ్యాన్ ...

ప.వి. పశ్యామి, దేవాన్, తవ, దేవ, దేహే, సర్వాన్, తథా, భూతవిశేషసంఘాన్, బ్రహ్మాణం, ఈశం, కమలాసనస్థం, ఋషీన్, చ, సర్వాన్, ఉరగాన్, చ, దివ్యాన్

❋ అర్జునుడు పలుకుచున్నాడు ❋

టీ॥ దేవ-శ్రీకృష్ణా, తవ-నీయొక్క, దేహే-దేహమునందు, సర్వాన్-సమస్తమైన, దేవాన్-దేవతలను, తథా - అటులె, భూత విశేషసంఘాం-చరాచర భూతసమూహములను, ఈశం - ఈశుడును, కమలాసనస్థం - పద్మాసనమందున్నవాడైన, బ్రహ్మాణం - బ్రహ్మను, సర్వాన్-సమస్తమైన, ఋషీం-ఋషులను, దివ్యాం-దివ్యములైన, ఉరగాన్-సర్పములను, పశ్యామి-చూచుచున్నాను

గ॥ ఓకృష్ణా నీదేహమునందు, సమస్త దేవతలను, చరాచర భూతసమూహమును, సృష్టికర్తయు, కమలాసనుడైన బ్రహ్మను, సర్వ ఋషులను, సర్పములను చూచుచున్నాను

ప॥తే॥ దివ్యమైనట్టి నీదగు-దేహమందు
సకలసుర సంఘముల, ప్రాణి-సముదయంబు
సర్వఋషి సమూహములను-సర్పములను
బ్రహ్మను కమలాసను, నేను-పరమపురుష
చూచుచుంటిని, మిక్కిలి-చోద్యమంది

గే॥ దేవదేవా నీదేహమున
దేవతలను, పితామహున్
సర్వఋషులను సర్పములనూ
సర్వప్రాణి సమూహమున్
విశ్వరూపమునందు మాధవ
విశదముగ చూచుచుంటిన్

అనేను చూచుచు విశ్వరూపము
అర్జునుడు రణభూమిలో
॥శ్రీహరి॥

16) శ్లో॥ అనేకబాహూదర వక్త్రనేత్రం
పశ్యామిత్వాం సర్వతోఽనంతరూపం
నాంతంనమధ్యం నపునస్తవాదిం
పశ్యామి విశ్వేశ్వర విశ్వరూప....

ప.వి. అనేక బాహూదరవక్త్రనేత్రం, పశ్యామి, త్వాం, సర్వతః, అనంతరూపం, న, అంతం, న, మధ్యం, న, పునః, తవ, ఆదిం పశ్యామి, విశ్వేశ్వర, విశ్వరూప

టీ॥ విశ్వేశ్వర-విశ్వనియామకుడా, విశ్వరూపా - విశ్వరూప ధరుడైన కృష్ణా, అనేక బాహూదరవక్త్రనేత్రం-అనేకములైన బాహువులును, కడుపులును, ముఖములును, నేత్రములును కలిగిన, త్వాం-నిన్ను, సర్వతః-అంతటను, అనంతరూపం - అనంతములైన రూపములుగల వానినిగాను, పశ్యామి-చూచుచున్నాను, పునః-మరియు, తవ-నీయొక్క, ఆదిం-మొదలును, మధ్యం-మధ్యమమును, అంతం-తుదను, నపశ్యామి-చూడజాలకున్నాను

గ॥ విశ్వేశ్వరా, విశ్వరూపా శ్రీకృష్ణా, అనేకములైన బాహువులను, ఉదరములును, కన్నులను, ముఖములను కలిగిన అనంతరూపములుగల వానినిగా చూచుచున్నాను, నీ రూపమునకు ఆది మధ్యాంతములు కనుపించకున్నవి ...

ఆ॥తే॥ పెక్కు ముఖము. ఉదరములు - పెక్కు కనులు
పెక్కు బాహువులు కలిగి - వెలయుచున్న
నిన్ననంతరూపముల, వా - నినిగనేను
కనుగొనుచునుంటిగాని, నీ - కాయమందు
నాది, మధ్యాంతములను, నే - నరయలేదు

గే॥ విశ్వేశ్వర విశ్వరూపా
విశ్వాత్మక జనార్దనా
పెక్కు కరము, ఉదరంబులునూ
పెక్కు ముఖములు, కన్నులున్ ॥శ్రీ॥
కలిగియంతట వ్యాపకంబై
వెలుగు నీరూపంబునన్
ఆది, మధ్యాంతములుచూడను
అద్భుతాకారంబులో
అనెనుచూచుచు విశ్వరూపము
అర్జునుడు రణభూమిలో
॥శ్రీహరిని

17) శ్లో॥ కిరీటినంగదినం చక్రిణంచ
తేజోరాశిం సర్వతోదీప్తి మంతం
పశ్యామిత్వాందుర్నిరీక్ష్యంసమంతా
ద్దీప్తానలార్క ద్యుతి మప్రమేయం..

ప.వి, కిరీటినం, గదినం, చక్రిణం, చ, తేజోరాశిం, సర్వతః, దీప్తిమంతం, పశ్యామి, త్వామ్, దుర్నిరీక్ష్యం, సమంతాత్. దీప్తానలార్క ద్యుతిం, అప్రమేయం

టీ॥ కిరీటినం-కిరీటముగలవానినిగను, గదినం-గదాధరునిగను, చక్రిణం-చక్రాయుధముకలిగినట్టియు, తేజోరాశిం - తేజోరాశినిగను, సర్వతో దీప్తిమంతం-అంతటను ప్రకాశముగలిగినట్టియు, దుర్నిరీక్ష్యం-చూడశక్యముగాని వానినిగను దీప్తానలార్క-ద్యుతిం-ప్రకాశించుచున్న అగ్నిసూర్యులకాంతివంటి కాంతిగలిగినట్టియు, అప్రమేయం - అప్రమేయునిగను (మితి చెప్పదగనివానినిగను), త్వాం-నిన్ను, సమంతాత్-అంతటను, పశ్యామి-చూచుచున్నాను

గ॥ ఓకృష్ణా కిరీటము, గద, చక్రము, ధరించిన, నీవిశ్వరూపము కాంతిచేనిండినదియై, అగ్ని సూర్యులవంటి కాంతిచే అంతటను ప్రకాశించుచూ, చూడశక్యముగాని, అప్రమేయమైన నీస్వరూపమును చూచుచున్నాను

ప॥తే॥ గద, కిరీటము, చక్రము-గలుగునీదు
విశ్వరూపము కాంతిచే-వెలుగుచుండి
అగ్నిసూర్యుల కాంతిచే-నన్నిదిశల
నప్రమేయమౌ వెలుగుచే-నలరుచుండ
చూడలేనట్టి నీరూపు-చూచుచుంటి

గే॥ గదయుచక్రము కిరీటంబును
కలిగి కాంతిచెనిండియున్
అగ్నిసూర్యులవంటి కాంతిచే
నంతటను వెలుగొందగా

చూడజాలని నీదురూపము
చూచుచుంటిని మాధవా
వందనము శ్రీ విశ్వరూపా
వందనము పరమేశ్వరా
అనెను చూచుచు ॥శ్రీహ॥

18) శ్లో॥ త్వమక్షరం పరమం వేదితవ్యం
త్వమస్యవిశ్వస్య పరంనిధానమ్
త్వమవ్యయశ్శాశ్వత ధర్మగోప్తా
సనాతనస్త్వం పురుషోమతోమే

ప.వి. త్వం, అక్షరం, పరమమ్, వేదితవ్యం, త్వం, అస్య
విశ్వస్య, పరం, నిధానం, త్వం, అవ్యయః, శాశ్వతధర్మగోప్తా
సనాతనః, త్వమ్, పురుషః, మతః, మే

టీ॥ త్వం-నీవు, అక్షరం-నాశరహితమును, వేదితవ్యం-తెలి
దగినదియునగు, పరమం - పరబ్రహ్మవు, త్వం - నీవు, అస్య - ఈ
విశ్వస్య-విశ్వమునకు, పరం-ఉత్కృష్టమైన, నిధానం-ఆశ్రయుడ
త్వం - నీవు, శాశ్వతధర్మగోప్తా - నిత్యమైన ధర్మమునురక్షించ
అవ్యయం-నిత్యుడవు, త్వం-నీవు, సనాతనః-పురాణుడైన, పురుష
పురుషుడవు, (అని) మే-నాయొక్క, మతః-అభిప్రాయము

గ॥ ఓకృష్ణా నీవే తెలియదగిన, నిత్యమైన పరబ్రహ్మవు, నీ
జగత్తున కాధారభూతుడవు, నీవేశాశ్వత ధర్మరక్షకుడవు, పురాణపు
షుడవని నాయభిప్రాయము

ప॥తే॥ నీవె తెలియగా, దగినట్టి-నిత్యుడవును
పరమమైనట్టి బ్రహ్మమై-పరగువాడ
వన్నిలోకాల కాధార-మైనవాడు
శాశ్వతంబైన ధర్మసం-స్థాపకుండ
వని, పురాణపురుషుడని-నేనుతలతు

గే॥ నీవె శ్రేష్ఠంబైనవాడవు
నీవె పరబ్రహ్మయున్
అన్నిజగముల కాశ్రయుండవు
ఆదిపురుషుడ వీవెగా
రక్షకుండవు దృఢతరంగు
మోక్షమను ధర్మమునకున్
అనెను చూచుచు వందనము ॥శ్రీహరిని

19) శ్లో॥ అనాదిమధ్యాంత మనంతవీర్య
మనంతబాహుం శశిసూర్యనేత్రమ్
పశ్యామిత్వాందీప్త హుతాశవక్త్రం
స్వతేజసావిశ్వ మిదంతపంతమ్.

ప.వి. అనాదిమధ్యాంతం, అనంతవీర్యం, అనంతబాహుం, శశి
సూర్యనేత్రం, పశ్యామి, త్వామ్, దీప్తహుతాశవక్త్రం, స్వతేసాజ,
విశ్వం, ఇదం, తపంతం ..

టీ॥ అనాదిమధ్యాంతం - మొదలు నడుము, తుద, లేనట్టియు,
అనంతవీర్యం-అపరిమిత పరాక్రమము గలిగినట్టియు, అనంతబాహుం-
అపరిమితములైన బాహువులుగలిగినట్టియు, శశిసూర్యనేత్రం-చంద్ర

సూర్యులే నేత్రములుగాగలిగినట్టియు, దీప్త హుతాశవక్త్రం-ప్రకాశించుచున్న యగ్నివంటి ముఖములుగలిగినట్టియు, త్వాం-నిన్ను, స్వతేజసా-నిజతేజముచేత, ఇదంవిశ్వం-ఈప్రపంచమును, తపంతం-తపింపజేయుచున్న వానినిగా పశ్యామి-చూచుచున్నాను .

గ॥ ఓకృష్ణా నీవాది మధ్యాంతములు లేనివాడవై అంతములులేని హస్తములుగలవాడవై, రగులుచున్న అగ్నిముఖమందుగలిగి, సర్వలోకములను, నీకాంతిచే తపింపజేయుచున్నవాడవుగా. కనుపించుచున్నావు

ప॥తే॥ అది, మధ్యాంత, శూన్యుండ-వగుచు, నమిత
బలముగలిగి, యనంతమౌ-బాహువులను
గలిగి, రవిచంద్రులకనులు-గాగగలిగి
యగ్నిముఖమందుగలిగి, నీ-వఖిలజగతి
నీదుకాంతిచే, తప్తంబు-నీవు సలుపు
నట్లు, కానుపించుచునుంటి-వంబుజాక్ష

గే॥ అదిమధ్యాంతములు లేకను
అధికమగు బలశాలివై
అంతమేలేనట్టి బాహువు
లమరియుండిన వాడవై
అలరిసూర్యుని శశినికనులుగ
యగ్నివంటి ముఖంబుతో॥అనెను
నీదుకాంతిచె జగములన్నియు
బాధసలిపెడి వానిగా

చూచుచుంటిని నీరూపమున
చోద్యమంచుచు కేశవా
అనెను చూచుచు వందనము ॥శ్రీహరిని

20) శ్లో॥ ద్యావాపృథివ్యో రిదమంతరంహి
వ్యాప్తంత్వయైకేన దిశశ్చసర్వాః
దృష్ట్వాఽద్భుతం రూపముగ్రంతవేదం
లోకత్రయం ప్రవ్యథితంమహాత్మన్.

ప.వి. ద్యావాపృథివ్యోః. ఇదమ్ అంతరం, హి, వ్యాప్తం, త్వయా. ఏకేన. దిశః. చ. సర్వాః. దృష్ట్వా. అద్భుతమ్. రూపం. ఉగ్రం. తవ. ఇదం. లోకత్రయం. ప్రవ్యథితం. మహాత్మన్

టీ॥ ఏకేన-ఒక్కడవైన. త్వయా-నీచేత ద్యావాపృథివ్యోః-భూమ్యాకాశములయొక్క. ఇదమంతరం - ఈమధ్యప్రదేశము న్ను. వ్యాప్తం-వ్యాపింపబడెనుగదా? సర్వాః + దిశః + చ-సమస్తదిక్కులును. వ్యాప్తాః - వ్యాపింపబడినవి మహాత్మన్ - ఓమహానుభావా. అద్భుతం - ఆశ్చర్యమైన. ఉగ్రం-భయంకరమైన. తవ - నీయొక్క ఇదంరూపం-ఈరూపమును. దృష్ట్వా-చూచి. లోకత్రయం-మూడు లోకములును. ప్రవ్యథితం-భయపడుచున్నవి .

గ॥ ఓ కృష్ణా నీయొక్కనిచేతనే. భూమి ఆకాశము అంతరాళము, దిక్కులన్నియు వ్యాపింపబడియున్నవి. ఓ మహానుభావా. అద్భుతముగను అతిభయంకరముగానుండు నీరూపమును చూచి. ముల్లోకములు భయమును పొందుచున్నవి..

ప॥ తే॥ అంతరాళము. భూమియు-నాకసంబు
అన్నిదిశలను వ్యాప్తమై-యలరునట్టి
అతిభయంకర మద్భుత-మైనయట్టి
నీస్వరూపము కనుగొని-నిఖిలమును
మూడులోకంబు లెంతయో-పొంధెభయము

గే॥ ఆకసముభువి యంతరాళము*
నన్నిదిశలను నిండియు॥
అతిభయంకర మద్భుతంబును
వయిన నీరూపంబును॥
కాంచి కృష్ణా మూడుజగములు
కడుభయంబును పొందెడి॥
అనెను చూచుచు వందనము ॥శ్రీహరిని

* అన్నిదిశలకు నడిమిచోటు

21) శ్లో॥ అమీహిత్వాం సురసంఘావిశంతి
కేచిద్భీతాః-ప్రాంజలయోగృణంతి
స్వస్తీత్యుక్త్వామహర్షి సిద్ధసంఘాః
స్తువంతిత్వాం స్తుతిభిః పుష్కలాభిః ...

ప.వి. అమీ. హి త్వాం. సురసంఘాః, విశంతి కేచిత్ భీతాః, ప్రాంజలయః. గృణంతి, స్వస్తి ఇతి ఉక్త్వా. మహర్షిసిద్ధసంఘాః స్తువంతి, త్వామ్. స్తుతిభిః, పుష్కలాభిః.

టీ॥ అమీ-ఈ, సురసంఘాః-దేవతాసంఘములు, త్వాం-నిన్ను, విశంతి-ప్రవేశించుచున్నవి. కేచిత్-కొందరు, భీతాః-భయపడినవారై

ప్రాంజలయః-దోసిలొగ్గినవారై. గృణంతి-స్తోత్రముచేయుచున్నారు. మహర్షి సిద్ధసంఘాః - మహర్షులు, సిద్ధులయొక్క, సమూహములు, స్వస్తి + ఇతి - క్షేమముకలుగుగాకయని ఉక్త్వా-చెప్పుచు, పుష్కలాభిః-అనేకములైన, స్తుతిభిః - స్తోత్రములచేతను, త్వాం - నిన్ను, స్తువంతి-స్తోత్రముచేయుచున్నారు

గః॥ ఉత్కృష్టా దేవతా సంఘములు, నీయందు ప్రవేశించుచున్నవి కొందరు భయపడినవారై చేతులుజోడించి స్తోత్రముచేయుచున్నారు. మహర్షులు, సిద్ధులయొక్క సమూహములు, క్షేమముకలుగుగాకయని పలికి నిన్ను అనేకములైన, స్తోత్రములచేత స్తుతించుచున్నారు.

ప॥తే॥ సురసమూహము నీలోన-చేరుచుండె
కొందరు స్తుతియొనర్చిరి-పొందిభయము
స్వస్తి పలికెను మునివర-సంఘమెల్ల
సిద్ధగణమెల్ల, స్తోత్రంబు-చేయుచుండె

గే॥ సురసంఘములు శరణుజెందుట
చూచుచుంటి పరాత్పరా
చెందభీతి స్తుతిరచుచుండిరి
కొందరందులో మ్రొక్కుచు ॥అనెను
మునులు, సిద్ధులు, స్వస్తియనుచును
పూర్తిగా స్తుతియించుట
చూచుచుంటిని నీరూపంలో
చోద్యముగ పరమేశ్వరా
అనేను చూచుచు వందనము ॥శ్రీహరిని

22) శ్లో॥ రుద్రాదిత్యా వసవోయేచసాధ్యా
విశ్వేఽశ్వినౌ మరుతశ్చోష్మపాశ్చ
గంధర్వయక్షా సురసిద్ధసంఘా
వీక్షంతేత్వాం విస్మితాశ్చైవసర్వే.

ప.వి రుద్రాదిత్యాః, వసవః, యే, చ, సాధ్యాః, విశ్వే, అశ్వినౌ, మరుతః, చ, ఊష్మపాః, చ, గంధర్వయక్షాసురసిద్ధసంఘాః, వీక్షంతే త్వాం, విస్మితాః, చ, ఏవ, సర్వే.

టీ॥ రుద్రాదిత్యాః-రుద్రులును, ఆదిత్యులును, వసవః-వసువులును, యే-యెవరు, సాధ్యాః + చ-సాధ్యులోవారును, విశ్వే-విశ్వదేవతలును, అశ్వినౌ-అశ్వినీదేవతలను, మరుత + చ-వాయుదేవతలును, ఊష్మపాః + చ - పితృదేవతలును, గంధర్వయక్షాసురసిద్ధసంఘాః - గంధర్వులు, యక్షులు, అసురులు, సిద్ధులు మొదలగువారి సమూహములు, సర్వే-అందరును, విస్మితాః-ఆశ్చర్యమునుపొందినవారలై, త్వాంఏవ-నిన్నే, వీక్షంతే-చూచుచున్నారు

గ॥ ఓ కృష్ణ పరమాత్మా. రుద్రులు, ఆదిత్యులు, వసువులు, సాధ్యులు, విశ్వదేవతలు, అశ్వినీదేవతలు, వాయుదేవతలు, పితృదేవతలు, యక్షులు, గంధర్వులు, అసురులు, సిద్ధులు మొదలగు వారంచరు, ఆశ్చర్యమును పొందినవారై నిన్నుచూచుచున్నారు.

ప॥తే॥ అశ్వినులు, యక్ష, గంధర్వ-అసుర, విశ్వ
దేవతలు, మరుతులు. పితృ-దేవ, సాధ్య
గణము, లాదిత్య, వసు, సిద్ధ-గణమునిన్ను
చూచుచుండిరి, రుద్రులు-చోద్యమంది

గే॥ ఆదిత్యులును, సప్తమారుతు
లశ్విలును, పితృదేవతల్
యక్ష, రాక్షస, సిద్ధ, సాధ్యులు
అష్టవసువులు రుద్రులుణా ॥అనెను
విశ్వదేవత, గంధర్వులును
వీరలందరు గుంపులై
చూచుచుండిరి, నిన్ను మిక్కిలి
చోద్యమంచును మాధవా
వందనము శ్రీ విశ్వరూపా
అనెను చూచుచు ॥శ్రీహరిని

23) శ్లో॥ రూపంమహత్తే బహువక్త్రనేత్రం
మహాబాహో బహుబాహూరుపాదం
బహూదరం బహుదంష్ట్రాకరాళం
దృష్ట్వాలోకాః ప్రవ్యథితాస్తథాఽహమ్ ..

ప.వి. రూపం, మహత్, తే, బహువక్త్రనేత్రం, మహాబాహో, బహుబాహూరుపాదం, బహూదరం, బహుదంష్ట్రాకరాళం, దృష్ట్వా, లోకాః, ప్రవ్యథితాః, తథా, అహం

టీ॥ మహాబాహో - ఓకృష్ణా, బహువక్త్రనేత్రం-అనేకములైన ముఖములను, నేత్రములను గలిగినట్టియు, బహుబాహూరుపాదం- అనేకములైన బాహువులను, తొడలను, పాదములను గలిగినట్టియు బహూదరం - అనేకములైన కడుపులుగలిగినట్టియు, బహుదంష్ట్రా

కరాళం - అనేకములైన కోరలచేత భయంకరమైనట్టియు, మహత్ - గొప్పదైనట్టి, తే-నీయొక్క, రూపం-ఆకారమును, దృష్ట్వా-చూచి, లోకాః-ప్రాణులు, ప్రవ్యధితాః-భయపడుచున్నాను, అహం-నేనును. (భయపడుచున్నాను)

గ॥ ఓకృష్ణా పెక్కు ముఖములు, కన్నులు, తొడలు, పాదములు, పెక్కు కడుపులు, అనేకములైన కోరలతో భయంకరమై గొప్పదైన నీరూపమునుచూచి, లోకములును, నేనును, భయమును పొందియున్నాము

వ॥తే॥ బహుముఖము, ఉదర, తొడలు-బాహువులును
పాదములును, కనులతోడ-బరగుచున్న
గొప్పకోరలతోడను-ఘోరమైన
నీదురూపము కనుగొని-నేను, సకల
జనులు, భయమందియుంటిమి-సరసిజాక్ష

గే॥ పెక్కుముఖములు, కనులు, కరములు
పెక్కుతొడలును, పాదముల్
ఘోరమగు నీగొప్పకోరలు
గొప్పదగు యాకారముగా
కాంచినేనును యెల్లప్రాణులు
కలిగియుంటిమి భీతియుగా
అనెను చూచుచు ॥శ్రీహరిని

24) శ్లో॥ నభఃస్పృశం దీప్తమనేకవర్ణం
వ్యాత్తాననందీప్త విశాలనేత్రం
దృష్ట్వాహిత్వాం ప్రవ్యధితాంతరాత్మా
ధృతింనవిందామి శమంచవిష్ణో...

ప.వి. నభఃస్పృశం, దీప్తం, అనేకవర్ణం, వ్యాత్తాననం, దీప్త విశాలనేత్రం, దృష్ట్వా, హి, త్వాం ప్రవ్యధితాంతరాత్మా, ధృతిం, న, విందామి, శమం, చ, విష్ణో

టీ॥ విష్ణో-ఓకృష్ణా, నభఃస్పృశం - ఆకాశముతాకుచున్నట్టియు, దీప్తం-మండుచున్నట్టియు, అనేకవర్ణం-నానావర్ణములుగలిగినట్టియు, వ్యాత్తాననం - తెరవబడిన నోరులుగలిగినట్టియు, దీప్తవిశాలనేత్రం-ప్రకాశించుచున్న గొప్పకన్నులుగలిగినట్టియు, త్వాం-నిన్ను, దృష్ట్వా-చూచి, ప్రవ్యధితాంతరాత్మా-మిక్కిలి భయపడిన, మనస్సుగలిగిననేను ధృతిం-ధైర్యమును, నవిందామి-పొందకయున్నాను, శమంచ-శాంతిని నవిందామి-పొందకయున్నాను

గ॥ ఓకృష్ణా ఆకాశమును తాకుచున్నట్టియు, ప్రకాశించు అనేక రంగులు కలిగినట్టియు తెరచిననోళ్లుగలిగినట్టియు, ప్రకాశించెడి విశాల మైన కన్నులుకలిగినట్టియు. నీరూపమునుచూచి, నామనస్సు భయము పొందినది, నేను ధైర్యమును, శాంతిని, పొందకున్నాను

ప॥తే॥ మిన్నుతాకెడి రూపంబు-మిగులవెలుగు
వర్ణములతోడ, తెరచిన-వదనములును
కడువిశాల ప్రకాశమౌ-కనులుగలుగు
నిన్నుజూచుచు భయమంది-నేను మనసు
నందు, శాంతిని ధైర్యంబు-పొందకుంటి

గే॥ ఆకసంబును దాకిమండుచు
నసేకమగు వర్ణములతో
తెరవబడిన నోరులుగలిగియు
దీప్తిగలిగిన, కనులతో ॥నినెను

వెలయు నీరూపంబుకనుగొని
వెరపుగలిగెను మనసులో
పొందకుంటిని ధైర్యమునునే
పొందకుంటిని శాంతియుకా
వందనము శ్రీ విశ్వరూపా అనెను చూచుచు

25) శ్లో॥ దంష్ట్రాకరాళానిచ తేముఖాని
దృష్ట్వైవకాలానల సన్నిభాని
దిశోనజానే నలభేచశర్మ
ప్రసీదదేవేశ జగన్నివాస....

ప.వి. దంష్ట్రాకరాళాని, చ, తే, ముఖాని, దృష్ట్వా, ఏవ, కాలానలసన్నిభాని, దిశః, న, జానే న, లభే, చ, శర్మ, ప్రసీద, దేవేశ, జగన్నివాస .

టీ॥ దంష్ట్రాకరాళాని - కోరలచేత భయంకరములైనట్టి, కాలానలసన్నిభాని - ప్రళయకాలాగ్నికి సమానములైన, తే - నీయొక్క, ముఖాని-ముఖములను, దృష్ట్వా-చూచి, దిశః-దిక్కులను, నజానే-తెలియకున్నాను, శర్మచ - సుఖమును, నలభే - పొందకున్నాను, జగన్నివాస-జగదాధారుడవైన, దేవేశ-దేవదేవుడవైన, ఓకృష్ణా, త్వం-నీవు, ప్రసీద-ప్రసన్నుడవగుము

గ॥ ఓ కృష్ణా దేవదేవా కోరలచేత భయంకరమైనట్టి, ప్రళయాగ్నికి సమానమైన, నీముఖములను చూచుటవలన, నేను దిక్కులను తెలిసికొనజాలకున్నాను, సుఖమును పొందజాలకున్నాను, జగదాధారుడవైన ఓకృష్ణా నాకు ప్రసన్నుడవగుము .

ప॥తే॥ గొప్పకోరలచేతను-ఘోరమగుచు
ప్రళయకాలాగ్ని సదృశమై-పరగుచున్న
నీదుముఖములు బొడగాంచి-నేను, దిశలు
తెలియకున్నాను, సుఖమును-తెలియకుంటి
కరుణననుజూడు జగదీశ-కమలనాథ

గే॥ భయంకరమగు కోరలచేత
ప్రళయానల సమానమై
నీదుముఖములుకాంచి దిశలను
నేనుతెలియను, సౌఖ్యమున్
పొందకుంటిని దయనుజూడుము
పురుషోత్తమ కేశవా
అనెను చూచుచు వందనము ॥శ్రీహరిని

26) శ్లో॥ అమీచత్వాం ధృతరాష్ట్రస్యపుత్రా
సర్వేసహైవావని పాలసంఘైః
భీష్మోద్రోణస్సూత పుత్రస్తథాఽసౌ
సహాస్మదీయై రపియోధ్యముఖ్యైః

ప.వి. అమీ, చ, త్వాం, ధృతరాష్ట్రస్య, పుత్రాః, సర్వే, సహ, ఏవ, అవనిపాలసంఘైః, భీష్మః, ద్రోణః, సూతపుత్రః, తథా, అసౌ, సహ, అస్మదీయైః, అపి, యోధముఖ్యైః.

27) శ్లో॥ వక్త్రాణితే త్వరమాణావిశంతి
దంష్ట్రాకరాళాని భయానకాని

కేచిద్విలగ్నా దశనాంతరేషు
సందృశ్యంతే చూర్ణితైరుత్తమాంగైః...

ప.వి. వక్త్రాణి, తే, త్వరమాణాః, విశంతి, దంష్ట్రాకరాళాని, భయానకాని, కేచిత్, విలగ్నాః, దశనాంతరేషు, సందృశ్యంతే, చూర్ణితైః, ఉత్తమాంగైః

టీ॥ అవనిపాలసంఘైః-భూపాలసమూహములతోగూడను, సర్వే-అందరైన, అమీ - ఈ, ధృతరాష్ట్రస్యపుత్రాః - ధృతరాష్ట్రుని యొక్క పుత్రులును, భీష్మః - భీష్ముడును, ద్రోణశ్చ-ద్రోణాచార్యుడును, తథా-అప్రకారముగా, అసౌ - ఈ, సూతపుత్రః - కర్ణుడును, అస్మదీయైః-నాసంబంధులైన, యోధముఖ్యైస్సహా-యోధాగ్రేసరులతో కూడ, త్వాం-నిన్ను, ఏతే - యీదుర్యోధనాదులు, త్వరమాణాః-తొందరపడుచున్నవారై, దంష్ట్రాకరాళాని - కోరలచేత వికృతములైనట్టి, భయానకాని-భయంకరమైనట్టి, తే-నీయొక్క, వక్త్రాణి-ముఖములను, విశంతి-ప్రవేశించుచున్నారు, కేచిత్-వారిలోకొందరు, దశనాంతరేషు-పండ్లసందులయందు, విలగ్నాః-చిక్కినవారలై, చూర్ణితైః - పొడిగాచేయబడిన, ఉత్తమాంగైః - శిరస్సులతోడను, సందృశ్యంతే-కనబడుచున్నారు .

గ॥ ఓ కృష్ణా ఈధృతరాష్ట్రునియొక్క కుమారులందరును, భూపాలసమూహమును, భీష్మాచార్యుడును, ద్రోణాచార్యుడును, కర్ణుడును, నాసంబంధులైన సైనిక ప్రముఖులతోకూడ, కోరలతో భయంకరమైన నీముఖములందు, వేగముగా ప్రవేశించుచున్నారు కొందరు నీపండ్లసందులయందు చిక్కుకొనినవారై పొడిచేయబడిన శిరస్సులతో కనబడుచున్నారు .

26 ప॥తే॥ ధార్తరాష్ట్రులు సంపూర్తి-ధరణిపాల
సంఘమంతయు, వారల-సైన్యమెల్ల
దుర్జయులగు భీష్మాచార్య-ద్రోణ, కర్ణు
లెల్ల, మాసహాయులు రాజు-లెల్ల, నీదు
వదనముల, చేరుచుండిరి-వాసుదేవ

27 ప॥తే॥ క్రూరమౌ కోరలుగల, నీ-ఘోర ముఖము
లందు, వేగమే చేరిరి-కొందరందు
పండ్లసందుల చిక్కిన-వారితలలు
చూర్ణితములగుచుండ, నే-చుచుచుంటి

గే॥ ధార్తరాష్ట్రులు భీష్మద్రోణులు
ధరణిపాల సమూహముల్
కర్ణుడునుకల యోధముఖ్యులు
కౌరవుల సైన్యంబులు ॥అనెను
మాకుసాయము చేయవచ్చిన
మహీపాలకులందరు
గొప్పకోరలుకలిగి భయమును
గొలుపునీదు ముఖంబుల
చేరుచుండిరి. దంతసందుల
చేరికొందర శీర్షముల్
చూర్ణితములై పోవుచుండుట
చూచుచుంటిని మాధవా
అనెను చూచుచు ॥శ్రీహరిని

28) శ్లో॥ యథానదీనాం బహవోఽంబువేగాః
సముద్రమేవాభి ముఖాద్రవంతి
తథాతవామీ నరలోకవీరా
విశంతివక్త్రాణ్యాభి విజ్వలంతి..

ప.వి. యథా, నదీనాం, బహవః, అంబువేగాః, సముద్రం, ఏవ, అభిముఖాః, ద్రవంతి, తథా తవ, అమీ, నరలోకవీరాః, విశంతి, వక్త్రాణి, అభివిజ్వలంతి .

టీ॥ నదీనాం-నదులయొక్క, బహవః-అనేకములైన, అంబు వేగాః-నీటిప్రవాహములు, యథా - ఏప్రకారముగా, సముద్రంఏవ-సముద్రమునే, అభిముఖాః-అభిముఖములైనవై, ద్రవంతి-పరువెత్తు చున్నవో, (ప్రవేశించుచున్నవో) అమీ - ఈ నరలోకవీరాః - రాజ వీరులు, తవ-నీయొక్క, అభివిజ్వలంతి-అంతట ప్రజ్వలించుచున్న, వక్త్రాణి-ముఖములను, విశంతి-ప్రవేశించుచున్నారు ..

గ॥ ఓ కృష్ణా అనేక నదీప్రవాహములు మిక్కిలి వేగముతో సముద్రమునందేవిధముగా ప్రవేశించుచున్నవో, అవిధముగా యీ రాజవీరులందరు, ప్రజ్వలించుచున్న నీముఖములయందు ప్రవేశించు చున్నారు .

ప॥తే॥ సాగరంబున బడుటకై-సర్వనదులు
యేవిధంబుగ, వేగమే-యేగువిధము
శూరవరులందరును, మండు-చుండు నీదు
ముఖములను, చేరుచున్నారు-పురుషశ్రేష్ఠ

గే॥ సరసులన్నియు సాగరంబున
చేరువిధమున వేగమే
ప్రజ్వలించెడి నీదుముఖముల
ప్రబలశూర సమూహముల్
చేరుచుండుట చూచుచుంటిని
శ్రీశకేశవ మాధవా
అనెను చూచుచు ॥శ్రీహరిని

28) శ్లో॥ యథాప్రదీప్తం జ్వలనంపతంగా
విశంతినాశాయ సమృద్ధవేగాః
తథైవనాశాయ విశంతిలోకా
స్తవాపివక్త్రాణి సమృద్ధవేగాః

ప.వి. యథా, ప్రదీప్తం, జ్వలనం, పతంగాః, విశంతి, నాశాయ, సమృద్ధవేగాః, తథా, ఏవ, నాశాయ, విశంతి, లోకాః, తవ, అపి, వక్త్రాణి, సమృద్ధవేగాః .

టీ॥ పతంగాః - మిడుతలు, నాశాయ - నశించుకొరకు, సమృద్ధవేగాః-అతివేగముగలవియై, ప్రదీప్తం-మండుచున్న, జ్వలనం-అగ్నిని యథా-యేప్రకారముగా, విశంతి - ప్రవేశించుచున్నవో, తథైవ-ఆ ప్రకారముగానే, లోకాః-జనసమూహము, నాశాయ-నశించుకొరకు, సమృద్ధవేగాః - అధికమైన వేగముగలవారలై, తవ - నీయొక్క, వక్త్రాణి-ముఖములను, విశంతి-ప్రవేశించుచున్నారు....
(లోకాః + అపి-ఈజనసమూహమంతయు)

గ॥ ఓ కృష్ణా మిడుతలు మండుచున్న అగ్నిలో అతివేగముతో ప్రవేశించి, యే విధముగా నశించుచున్నవో, ఆవిధముగా యీ జన సమూహము నశించుకొరకు. కతివేగముతో నీ ముఖములయందు ప్రవేశించుచున్నారు

ప॥తే॥ మిగులమండెడి యగ్నిలో-మిడుతలెట్లు
వేగమేపడి నశియించు-విధముగాను
చేరుచున్నారు లోకులు-చెడుటకొరకె
నీదుముఖముల వేగమే-నీరజాక్ష

గే॥ మిడుతలగ్నిలొవచ్చి వేగమె
పడినశించెడి రీతిగా
నీదుముఖలవేరి లోకులు
నీల్గుచుండెను వేగమే
అనెను చూచుచు విశ్వరూపము
అర్జునుడు రణభూమిలో ॥శ్రీ॥

30) శ్లో॥ లేలిహ్యసే గ్రసమానఃసమంతా
ల్లోకాన్సమగ్రా న్వదనైర్జ్వలద్భిః
తేజోభిరాపూర్య జగత్సమగ్రం
భాసంతవోగ్రాః ప్రతపంతివిష్ణో....

ప వి. లేలిహ్యసే, గ్రసమానః, సమంతాత్, లోకాన్, సమగ్రాన్, వదనైః, జ్వలద్భిః, తేజోభిః, ఆపూర్య, జగత్, సమగ్రం, భాసః, తవ, ఉగ్రాః, ప్రతపంతి, విష్ణో

టీ॥ హే విష్ణో - ఓ విష్ణుమూర్తీ. జ్వలద్భిః-మండుచున్న, వదనైః-ముఖములచేత. సమగ్రాన్-సమస్తములైన, లోకాన్-జనులను, గ్రసమానః-మ్రింగుచున్నవాడవై, సమంతాత్-అన్నివైపులను లేలిహ్యసే-ఆస్వాదించుచున్నావు. తవ-నీయొక్క, ఉగ్రా-భయంకరములైన, భాసః-కాంతులు, తేజోభిః - తేజస్సులచేత, సమగ్రం-సమస్తమైన, జగత్-జగత్తును. ఆపూర్య-నిండించి,, ప్రతపంతి-తపింపజేయుచున్నవి

గ॥ ఓ విష్ణుమూర్తీ మండుచున్న నీనోళ్లచే, అన్నివైపుల నుండి సమస్త ప్రాణులను మ్రింగుచున్నావు. నీభయంకరమైన కాంతులెల్ల జగత్తులనిండి తపింపజేయుచున్నవి

ప॥తే॥ నీవుమండెడి నోళ్ళచే-నిఖిలజనుల
మ్రింగుచున్నావు యంతట-మిగులఘోర
మైన నీదుమహాకాంతు-లఖిలజగము
వ్యాప్తమై తప్తమొనరించె-వాసుదేవ

గే॥ మండుచుండెడి వదనములతో
మనుజులందర మ్రింగుచున్
అన్నిదిశలను నాలుకలతో
నన్నిప్రాణుల నీడ్చుచున్
నీభయంకరమైన కాంతులు
నిఖిలజగము తపించెడిన్
అనెను చూచుచు ॥శ్రీహరిని

31) శ్లో॥ ఆఖ్యాహిమేకో భవానుగ్రరూపో
నమోఽస్తుతేదేవ వరప్రసీద
విజ్ఞాతుమిచ్ఛామి భవంతమాద్యం
నహిప్రజానామి తవ ప్రవృత్తిమ్

ప.వి. ఆఖ్యాహి, మే, కః, భవాణ్, ఉగ్రరూపః, నమః, అస్తు, తే, దేవవర, ప్రసీద, విజ్ఞాతుం ఇచ్ఛామి భవంతం, అద్యం, న, హి, ప్రజానామి, తవ, ప్రవృత్తిం

టీ॥ దేవవర-దేవశ్రేష్ఠుడా, తే-నీకొరకు, నమః-నమస్కారము అస్తు-అగుగాక, మే-నాకొరకు, ప్రసీద-ప్రసన్నుడవగుము, తే-నీ యొక్క, ప్రవృత్తిం - ప్రవర్తనమును, ప్రజానామిహి - తెలిసికొన జాలకున్నానుగదా, ఉగ్రరూపః-భయంకరాకారముగలిగిన, భవాణ్-నీవు, కః-ఎవరో, అద్యం-ఆద్యుడవైన, భవంతం-నిన్ను, విజ్ఞాతుం-తెలియుటకొరకు, అహం-నేను, ఇచ్ఛామి-కోరుచున్నాను, మే-నాకొరకు ఆఖ్యాహి-చెప్పుము

గ॥ ఓకృష్ణా దేవదేవ నీకు నమస్కారములుచేసెదను, దయచేసి నాకు ప్రసన్నుడవగుము నీ ప్ర వ ర్త న ము నాకు తెలియకున్నది, యీ భయంకర రూపముగల నీ వె వ ర వో తెలుపుము ఆద్యుడవైన, నిన్ను, తె లి సి కొ న గో రు చున్నాను దయచేసి తెలుపుము

ప॥తే॥ వందనంబులుజేసెద-వాసుదేవ
ఈభయంకర రూప, ఘ-దేభకలిగె
దేవదేవా తెలియజేయు-మీ, వెవరవు
తెలియ లేదు, నీప్రవర్తన-తెలుపుదయను

గే॥ కరుణతోడ ప్రసన్నుడగుచును

కై కొని నానమస్కృతుల్

ఇట్టిభీకరమైన రూపము

యేలపొందితో హేతువుల్

తెలియజేయుము నీవుయెవరో

తెల్లముగ నాకంతయున్

వందనము శ్రీ విశ్వరూపా

వందనము పరమేశ్వరా

అనెను చూచుచు ॥శ్రీహరిని

❖ శ్రీ భ గ వా ను వా చ ❖

32) శ్లో ॥ కాలోఽస్మిలోకక్షయ కృత్ప్రవృద్ధో
లోకాన్సమాహర్తు మిహప్రవృత్తః
ఋతేఽపిత్వాం నభవిష్యంతిసర్వే
యేఽవస్థితాః ప్రత్యనీకేషుయోధాః ...

ప.వి. కాలః అస్మి. లోకక్షయకృత్. ప్రవృద్ధః. లోకాన్, సమాహర్తుం. ఇహ ప్రవృత్తః. ఋతే. అపి త్వాం. న భవిష్యంతి, సర్వే. యే. అవస్థితాః. ప్రత్యనీకేషు. యోధాః

❖ శ్రీకృష్ణమూర్తి చెప్పుచున్నాడు ❖

టీ॥ లోకక్షయకృత్ - లోకనాశనకరమైన. ప్రవృద్ధః-విజృంభించిన. కాలః-కాలుడను. అస్మి-అయియున్నాను. లోకాన్-లోకములను. సమాహర్తుం-సంహరించుటకు ఇహ-యిప్పుడు. ప్రవృత్తః-ప్రవర్తించినవాడను. అస్మి-అగుచున్నాను ప్రత్యనీకేషు-ఎదిరి సేనల

యందు యోధాః-యోధులు. యే-యెవరు. అవస్థితాః - ఉన్నారో. సర్వే-వారందరును. త్వాంఋతేఽపి-నీవులేకపోయినను నభవిష్యంతి-ఉండరు (నీవు యుద్ధముచేయక పోయినను బ్రతికియుండరు)

గ॥ అర్జునా నేను లోకనాశనకరమైన ప్రబలమైన కాలస్వరూపుడనై యున్నాను. ప్రాణులను సంహరించుటకై. సిద్ధమైయున్నాను. శత్రు సేనలయందు యుద్ధముచేయు వారెవరున్నారో, వా ర ం ద రు. నీవు యుద్ధము చేయకపోయినను. జీవించియుండరు

ప॥తే॥ లోకనాశన హేతువై -లోకమందు
కాలుడై నేనుప్రాణుల-క్షయమొనర్ప
సిద్ధమ-గనుంటినే, నీవు-యుద్ధమిపుడు
సలుపకున్నను, ప్రతిపక్ష-సైన్యమందు
బ్రతికియుండ, రెవ్వరుగాని-భావియందు

గే॥ అగుదుకాలుడ, నేనులోకము
అన్ని నాశనకరమునై
సిద్ధముగనేనుంటి ధ్వంసము
చేయగా లోకంబులకా ॥అని కిరీటికి
యెదిరి సేనలయందునిలిచిన
యేయోధులు సన్నద్ధులై
చేయగా యుద్ధంబునిక్కడ
చేరియుండిన వారలకా
నీవుచంపకయున్న వీరలు
నిలిచియుండరు బ్రతికియుకా
అని కిరీటికి ॥శ్రీ హరిని

33) శ్లో॥ తస్మాత్త్వముత్తిష్ఠ యశోలభస్వ
జిత్వాశత్రూన్‌భుంక్ష్వ రాజ్యంసమృద్ధం
మయైవైతేనిహతాః పూర్వమేవ
నిమిత్తమాత్రంభవ సవ్యసాచి

ప వి. తస్మాత్, త్వం, ఉత్తిష్ఠ, యశః, లభస్వ, జిత్వా, శత్రూన్, భుంక్ష్వ, రాజ్యం, సమృద్ధం, మయా, ఎవ, ఏతే, నిహతాః, పూర్వం, ఏవ, నిమత్తమాత్రం, భవ, సవ్యసాచి

టీ॥ తస్మాత్-అందువలన, త్వం-నీవు, ఉత్తిష్ఠ-లెమ్ము, శత్రూన్-శత్రువులను, జిత్వా-జయించి, యశః-కీర్తిని, లభస్వ-పొందుము, సమృద్ధం-సంపూర్ణమగు, రాజ్యం-రాజ్యము, భుంక్ష్వ-అనుభవింపుము, ఏతే-ఈశత్రువులందరును, మయైవ-నాచేతనే, పూర్వమేవ-మునుపే, నిహతాః-చంపబడిరి, హేసవ్యసాచి - ఓయర్జునా, నిమిత్తమాత్రం-నిమిత్తమాత్రుడవు భవ-కమ్ము

గ॥ అర్జునా ఆకారణమువలన, యుద్ధమొనర్చుటకు నీవు లెమ్ము, నీశత్రులను దుర్యోధనాదులగెలిచి, కీర్తినిపొందుము. సంపూర్ణమగు రాజ్యమునను భవింపుము, నీశత్రువులందరు, మునుపే, నాచేత చంప బడిరి. నీవు నిమిత్తమాత్రుడవగుము

ప॥తే॥ లెమ్ముభారతనీవు యు-ద్ధమ్ము సలుప
గెలిచి శత్రువులందర-కీర్తి పొందు
మనుభవింపుము రాజ్యంబు-నపుడుపూర్తి
చచ్చియుండిరి నాచేత-శత్రులపుడె
కారణము మాత్రమేనీవు-కమ్ము పార్థ

గే॥ అందువలనను నీవులెమ్మిక

నాహవంబొనరింపగా

గెలిచిశత్రులకీర్తి పొందుము

సలిపియుద్ధము ధీరుడై

అనుభవింపుము రాజ్యమంతయు

నడ్డు లేక చరించుచున్ ॥అని కిరీటికి

పొ.చియుండిరి ముందెమరణము

నందరును నాశక్తి చే

నీవుకారణ మాత్రుడగుచును

నిలిచిసలుపుము యుద్ధమున్

అని కిరీటికి

॥శ్రీహరిని

34) శ్లో॥ ద్రోణంచ భీష్మంచ జయద్రథంచ

కర్ణంతథాఽన్యానపి యోధవీరాన్

మయాహతాం స్త్వంజహిమావ్యథిష్ఠా

యుద్ధస్వజేతాఽసిరణే సపత్నాన్

ప.వి. ద్రోణం, చ, భీష్మం, చ, జయద్రథం, చ, కర్ణం, తథా, అన్యాని, అపి, యోధవీరాన్, మయా, హతాన్, త్వమ్, జహి, మా, వ్యథిష్ఠాః, యుద్ధస్వ, జేతాసి, రణే, సపత్నాన్

టీ॥ మయా - నా చేత, హతాన్ - పూర్వమే చంపబడిన, ద్రోణంచ-ద్రోణాచార్యుని, భీష్మంచ-భీష్మాచార్యుని, జయద్రథంచ-సైంధవుని, కర్ణంచ-కర్ణుని, తథా-ఆరీతిగానే, అన్యాం-ఇతురులైన, యోధవీరాన్ - యుద్ధముచేయునట్టి పరాక్రమశీలురను, త్వం - నీవు,

జహి-చంపుము, మావ్యథిష్ఠా-భయపడకుము, యుద్ధస్వ - యుద్ధము చేయుము, రణే-యుద్ధమునందు, సపత్నాన్-శత్రువులను, జేతాఽసి-గెలువగలవు .

గ॥ అర్జునా యిదివరకే నాచేత చంపబడిన ద్రోణ, భీష్మ, కర్ణ సైంధవాదులను, యితరులైన యోధవీరులను, నీవుచంపుము, భయ పడక యుద్ధముచేయుము, శత్రువులను నీవు జయించగలవు .

ప॥తే॥ మున్నెనాచేత, నిహతులై-యున్నవారు
ద్రోణ, భీష్మ, సైంధవ, కర్ణ-దుర్జయులగు
శత్రువీరు, లన్యుల, నీవు-చంపుమిపుడు
వదలిభయమును పూర్తిగా-పార్థ నీవు
సలుపయుద్ధంబు, శత్రులన్-గెలువగలవు

గే॥ భీష్ముడును, దోృణుండు మొదలగు
భీమవిక్రమ శాలురున్
ముందెనాచే మరణమందిరి
సైంధవుడు కర్ణుండున్ ॥అని కిరీటికి
చంపువీరల, నితరయోధుల
సలిపియుద్ధము భారతా
పొందెదవు విజయంబు రణమున
పొమ్ముభయమును విడిచియున్
అని కిరీటికి ॥శ్రీహరిని

✳ స ం జ య వు వా చ ✳

35) శ్లో॥ ఏతచ్ఛ్రుత్వా వచనంకేశవస్య
కృతాంజలిర్వేపమానం కిరీటీ
నమస్కృత్వాభూయఏవాహ కృష్ణం
సగద్గదంభీతభీతః ప్రణమ్య....

ప.వి. ఏతత్, శ్రుత్వా, వచనం, కేశవస్య, కృతాంజలిః, వేప మానః, కిరీటీ, నమస్కృత్వా, భూయః, ఏవ, ఆహ, కృష్ణం, సగద్గదం, భీతభీతః, ప్రణమ్య

✳ సంజయుడు చెప్పుచున్నాడు ✳

టీ॥ కిరీటి-అర్జునుడు, కేశవస్య - శ్రీకృష్ణునియొక్క, ఏతత్-ఈ, వచనం-వాక్యమును, శ్రుత్వా - విని, కృతాంజలిః - ముకుళిత హస్తుడై, వేపమానః-వణకుచున్నవాడునై, నమస్కృత్వా-నమస్కరించి, ప్రణమ్య - వినమ్రుడై, భీతభీతః - మిక్కిలిభయపడుచు, సగద్గదం-గద్గదస్వరముతో, భూయఃఏవ-మరల, ఆహ-పలికెను

గ॥ ఓ ధృతరాష్ట్రా వణకుచున్న అర్జునుడు, శ్రీభగవంతుడగు శ్రీకృష్ణుని మాటలనువిని, దోసిలొగ్గి, నమస్కరించుచు, మిక్కిలి భయపడుచున్నవాడై, భగవంతునిచూచి, నమస్కరించి, గద్గద స్వరముతో (తొట్రుపాటుతో) మరల నిట్లనిచెప్పెను

ప॥తే॥ అట్లు కృష్ణునిమాటల-నాలకించి
వణకుచుండెడి పార్థుండు-వందనములు
జేసి, దోసిలొగ్గి, భయము-జెంది, మరల

పలికె గద్గదసర్వముతో-వందనములు
సలిపి, కృష్ణునిగని. యిట్లు-సార్వభౌమ

గే॥ వణకుచున్న కిరీటి యప్పుడు
వాసుదేవుని వాక్యముల్
విని, నమస్కారంబు సలుపుచు
వెరపుగలిగిన వాడునై
వడకి గడగడ తొట్రుపాటుతో
నుడివె ముకుళితహస్తుడై ॥శ్రీహరిని

అర్జునుని వువాచ

36) శ్లో॥ స్థానేహృషీకేశ తవప్రకీర్త్యా
జగత్ప్రహృష్యత్యను రజ్యతేచ
రక్షాంసిభీతాని దిశోద్రవంతి
సర్వేనమస్యంతిచ సిద్ధసంఘాః..

ప.వి. స్థానే, హృషీకేశ, తవ, ప్రకీర్త్యా, జగత్, ప్రహృష్యతి, అనురజ్యతే, చ, రక్షాంసి, భీతాని, దిశః, ద్రవంతి, సర్వే, నమస్యంతి, చ, సిద్ధసంఘాః

అర్జునుడు చెప్పుచున్నాడు

టీ॥ హేహృషీకేశ-ఓకృష్ణమూర్తీ, తవ-నీయొక్క, ప్రకీర్త్యాః-మాహాత్మ్యముచేతను, జగత్ - జగత్తు, ప్రహృష్యతి - సంతసించుచున్నది, అనురజ్యతే + చ-అనురాగమున్నుపొందుచున్నది. రక్షాంసి-రాక్షసులు, భీతాని - భయపడినవారలై, దిశః - దిక్కులనుగూర్చి,

ద్రవంతి-పరువిడుచున్నారు. సర్వే-సమస్తమైన. సిద్ధసంఘాః - సిద్ధసంఘములు. నమస్యంతిచ-నమస్కారములుచేయుచున్నవి. స్థానే-ఇదంతయుతగియున్నది

గ॥ ఓకృష్ణా నీమాహాత్మ్యమునకు జగత్తు సంతసించుచు అనురాగము పొందుచున్నది. రాక్షసులు మిక్కిలి భయముజెందినవారలై దిశలకు పరుగిడుచున్నారు. సకల సిద్ధసమూహములు నమస్కరించుచున్నవి. ఇదంతయు యుక్తముగాయున్నది

ప॥తే॥ నీదుమహిమను పొడగాంచి-నిఖిలజగము
పొందె యనురాగమానంద-ములను, పొంది
భయము రాక్షసుల్ దిశలకు-పరువులిడిరి
సిద్ధగణము వందనములు-చేయుచుండె
యుక్తమైయున్న దిదియంత-భక్తపోష

గే॥ నీదుమాహాత్మ్యంబు గనుగొని
నిఖిలజగమను రాగముఁ
పొంది సంతోషించుచున్నది
పూర్తి శ్రద్ధాభక్తితో ॥అనెను
భయముజెందుచు, నసురులందరు
పరువులెత్తిరి దిశలకుఁ
చేయుచుండెను వందనంబులు
సిద్ధసంఘములన్నియుఁ
అనెను చూచుచు ॥శ్రీహరిని

37) శ్లో॥ కస్మాచ్చ తేననమేరన్ మహాత్మన్
గరీయసే బ్రహ్మణోఽప్యాదికర్త్రే
అనంత దేవేశ జగన్నివాస
త్వమక్షరం సదసత్తత్పరంయత్..

ప.వి. కస్మాత్, చ, తే, న, నమేరన్, మహాత్మన్, గరీయసే, బ్రహ్మణః, అపి, ఆదికర్త్రే, అనంత, దేవేశ, జగన్నివాస. త్వం, అక్షరం, సత్, అసత్, తత్పరమ్, యత్

టీ॥ హేమతహాత్మన్-ఓమహాత్మా, అనంతా-ఓఅనంతా, దేవేశ-దేవదేవా, జగన్నివాస-జగదంతర్యామీ, సత్-సత్తు, అసత్ + చ-అసత్తును, యత్-యేదో, తత్పరం-దానికి పరమైన, అక్షరం-అక్షర బ్రహ్మవు, త్వం - నీవు, అసి - అయియున్నావు, బ్రహ్మణః + అపి-బ్రహ్మకును, ఆదికర్త్రే-మూలకర్తవును, గరీయసే-గొప్పవాడవునైన, తే-నీకొరకు, కస్మాత్-ఏల, న + నమేరం-నమస్కరింపకుందురు.

గ॥ ఓ మ హా త్మా. ఓఅనంతా, దేవదేవా, జగన్నివాసా, సతు. అసత్తునకు పరమైన అక్షరబ్రహ్మవు నీవు. సృష్టికికారణమైన బ్రహ్మకుకూడా నీవు మూలకర్తవు. గొప్ప వాడవునైన. నీ కె వ రు నమస్కరింపకుందురు

ప॥తె॥ ఓజగన్నివాస మహాత్మ-ఓయనంత
అసతుసత్తుకు, శ్రేష్ఠమౌ-యక్షరుడవు
దేవదేవుండ వగుదువు-నీవు, సృష్టి
కర్తయౌ, బ్రహ్మకునుమూల-కర్తవీవు
అట్టినీకెవరు సలుప-రంజలులను

గే॥ ఓమహాత్మా జగదాధార
ఓదేవదేవా హరీ
అసతుసత్తుకు శ్రేష్ఠంబైన
అక్షరపరబ్రహ్మయుగా ॥అనెన
ఆదికారణ మీవుబ్రహ్మకు
నమితశ్రేష్ఠుడనంతుడుగా
అందుకై నీకెవరువందన
మాచరింపరు మాధవా
అనెను చూచుచు ॥శ్రీహరి॥

38) శ్లో॥ త్వమాదిదేవః పురుషః పురాణ
స్త్వమస్యవిశ్వస్యపరం నిధానం
వేత్తాఽసివేద్యంచ పరంచధామ
త్వయాతతం విశ్వమనంతరూప

ప.వి. త్వం. ఆదిదేవః, పురుషః, పురాణః, త్వం, అస్య, విశ్వస్య, పరం, నిధానం. వేత్తా. అసి. వేద్యం. చ. పరం, చ, ధామ. త్వయా, తతం, విశ్వం, అనంతరూప .

టీ॥ అనంతరూప-ఓకృష్ణా, త్వం - నీవు, ఆదిదేవః - మొదటి దేవుడవు, పురాణః-పురాతనుడైన, పురుషః-పురుషుడవు. త్వం-నీవు, అస్య-ఈ, విశ్వస్య-విశ్వమునకు, పరం-ఉత్తమమైన, నిధానం-ఆశ్రయమవు. వేత్తా-సర్వజ్ఞుడవు, వేద్యంచ - తెలియదగిన విషయమును, పరంచ-ఉత్కృష్టమైన, ధామ - స్థానమును. అసి - అయియున్నావు విశ్వం-విశ్వము, త్వయా - నీచేత, తతం - వ్యాప్తమైయున్నది

గ॥ ఓయనంతరూపా, నీవాదిదేవుడవు, పురాణ పురుషుడవు, సమస్త జగత్తున కాధారభూతుడవు, సర్వజ్ఞుడవు, శ్రేష్ఠమైన పొందదగిన స్థానమును నీవే, సమస్త విశ్వము నీచేత వ్యాపింపబడియున్నది.

ప॥తే॥ అన్నిజగముల కాధార-మగుదువీవు
మొదటిదేవుడవు, పురాణ-పురుషుడవును
తెలియదగినట్టివాడవు-తెలిసియున్న
వాడవన్ని, పొందదగిన-పరమపదము
నీవె, సర్వజగంబులు-నీవలననె
వ్యాపకమగుచు నుండెనో-వాసుదేవ

గే॥ దేవదేవ పురాణపూరుష
నీవెమోక్ష స్థానముగా
అన్నిజగముల కాధారుండ
వాదిదేవుడ వీవెగా ॥అనెను
తెలియదగినవాడవు నీవే
తెలిసినవాడవు నీవే
అన్నిజగములు నీవలననే
వ్యాపించినవంతటగా
అనెను చూచుచు ॥శ్రీహరిని

39) శ్లో॥ వాయుర్యమోఽగ్నిర్వరుణశ్శశాంకః
ప్రజాపతిస్త్వం ప్రపితామహశ్చ
నమోనమస్తేఽస్తు సహస్రకృత్వః
పునశ్చభూయోఽపి నమోనమస్తే . .

ప.వి. వాయుః, యమః, అగ్నిః, వరుణః, శశాంకః, ప్రజాపతిః, త్వం, ప్రపితామహః, చ, నమః, తే, అస్తు, సహస్రకృత్వః, పునః, చ, భూయః, అపి, నమఃనమః, తే

టీ॥ వాయుః - వాయువును, యమః - యముడును, అగ్నిః - అగ్నిదేవుడును, వరుణః - వరుణుడును, శశాంకః - చంద్రుడును, ప్రజాపతిః-బ్రహ్మదేవుడును, ప్రపితామహశ్చ - బ్రహ్మకుతండ్రియును, త్వమేవ-నీవే, (అందువలన) తే-నీకొరకు, సహస్రకృత్వః-వేయిసారులు, నమోనమః-నమస్కారములు, అస్తు-అగుగాక, పునః + చ-మరలను, భూయః + అపి-తిరిగియు, తే-నీకొరకు, నమోనమః-నమస్కారములు .

గ॥ ఓ కృష్ణా వాయువు, యముడవు, అగ్ని, వరుణుడవు, చంద్రుడవు, ప్రజాపతివి, ప్రపితామహుడవు నీవేయయియున్నావు, నీకు వేయిమారులు వందనములు, పెక్కుమారులు వందనములు మరలమరల నమస్కారములు.

ప॥తే॥ వాయువు, యముడు, చంద్రుడు-వరుణు, డగ్ని
బ్రహ్మయును, బ్రహ్మతండ్రివై -వరగునీకు
వేయిమార్లు వందనములు- పెక్కుమార్లు
వందనంబులు మరిమరి-వందనములు

గే॥ నీవెవాయువు వరుణుడగ్నియు
నీవెయముడవు చంద్రుడున్
నీవెబ్రహ్మవు బ్రహ్మతండ్రివి
నీకివే నాల్మ్రొక్కులు

వందనంబులు వేయిమారులు
వందనము మరివందనం
వందనము శ్రీ విశ్వరూపా
వందనము పరమేశ్వరా
అనెను చూచుచు ॥శ్రీహరిని

40) శ్లో॥ నమఃపురస్తాదథ పృష్ఠతస్తే
నమోఽస్తుతే సర్వతఏవసర్వ
అనంతదివ్యామిత విక్రమస్త్వం
సర్వంసమాప్నోషి తతోఽసి సర్వః..

ప.వి. నమః, పురస్తాత్, అథ, పృష్ఠతః, తే, నమః, అస్తుతే, సర్వతః, ఏవ, సర్వ, అనంతవీర్య, అమితవిక్రమః, త్వం, సర్వం, సమాప్నోషి. తతః, అసి, సర్వః

టీ॥ హేసర్వ - ఓసమస్త స్వరూపా, కృష్ణమూర్తీ, పురస్తాత్- ముందరను, అథ-ఇంకను, పృష్ఠతః - వెనుకను, సర్వతఏవ - సర్వ దిక్కులయందును. తే - నీకొఱకు, నమః - నమస్కారము, అస్తు- అగుగాక, అనంతదివ్యామితవిక్రమః - అమితమైన సామర్థ్యమును, పరాక్రమమునుగలిగిన, త్వం-నీవు, సర్వం - సమస్తమును. సమా ప్నోషి-లెస్సగా వ్యాపించియున్నావు, తతః - అందువలన, సర్వః- సర్వస్వరూపుడవు, అసి-అయితివి

గ॥ ఓసర్వస్వరూపుడవైన కృష్ణమూర్తీ నీకుముందు, వెనుక సర్వదిక్కులను నమస్కారములు, నీవమితమైన శక్తి పరాక్రమ ములుగలిగినవాడవై, సమస్తమును పూర్తిగా వ్యాపించియున్నందు వలన, సర్వస్వరూపుడవు నీవే యయియున్నావు .

ప॥తే॥ వందనము ముందు, వెనుకను-వందనంబు
అన్నిదిక్కులయందు, నీ-కమితమైన
శక్తి, శౌర్యములుగలిగి-సకలజగము
వ్యాపకుండవై యున్నందు-వలననీవు
సర్వరూపకుడైతివి-సరసిజాక్ష

గే॥ ముందువెనుకను యెల్ల దిక్కులు
వందనము మరివందనం
అమితమైన పరాక్రమంబున
అంతటను వ్యాపించియుణ్ణా
సర్వశక్తి సమన్వితుండవు
సర్వరూపుడ వీవెగా
వందనము శ్రీ విశ్వరూపా
వందనము పరమేశ్వరా
అనెను చూచుచు వందనము ॥శ్రీహరిని

41) శ్లో॥ సఖేతిమత్వా ప్రసభంయదుక్తం
హేకృష్ణ హేయాదవ హేసఖేతి
అజానతా మహిమానంతవేదం
మయాప్రమాదాత్ప్రణ యేనవాఽపి....

వ.వి. సఖా, ఇతి, మత్వా, ప్రసభం, యత్, ఉక్తం, హేకృష్ణ, హేయాదవ, హేసఖే, ఇతి, అజానతా, మహిమానం, తవ, ఇదం, మయా, ప్రమాదాత్, ప్రణయేన, వా అపి

టీ॥ తవ-నీయొక్క, ఇదం-ఈస్వరూపమును, మహిమానం-మహిమను, అజానతా-తెలియనట్టి, మయా-నాచేతను, ప్రమాదాత్-ప్రమాదమువలననుగాని. ప్రణయేనవాసపి - పరిచయముచేతనైనను, సఖేతి - స్నేహితుడవని, మత్వా - తలచి, హేకృష్ణ - ఓకృష్ణుడా, హేయాదవ-ఓయాదవుడా, హేసఖే-ఓసఖుడా, ఇతి-అని, ప్రసభం-అలక్ష్యముగ, యత్-ఏవాక్యమును, ఉక్తం - పలుకబడెనో, దానిని క్షమింపుము

గ॥ ఓకృష్ణా నేను నీయొక్క యీమహిమను తెలియనివాడనైన నాచేత పొరబాటుచేతను, పరిచయముచేతను, స్నేహితుడవనితలచి, ఓకృష్ణుడా, ఓయాదవుడా, ఓసఖుడాయని, ఆలోచింపక, అలక్ష్యము చేత, యేది పలికియుంటినో దానిని క్షమింపుము

ప॥తే॥ నీదుమహిమంబు నెరుగక-నే ప్రమాద
వశమున, తెలియజాలక-పరిచయమున
తలచి సఖుడని, గురిలేక-పిలిచియుంటి
నోయియాదవ, యోసఖా-ఓయికృష్ణ
యనిన వన్నియు, క్షమియింప-మనవి, నాదు

గే॥ నీదుమహిమలు తెలియజాలక
నేనుమిక్కిలి మూర్ఖుడై
పరిచయంబున, లేక, లక్ష్యము
ప్రమాదవశము చేతనే
నోయికృష్ణా ఓయియాదవ
ఓయిసఖుడా యనుచునే

తలచిమిత్రుడవనుచు మనమున
పలికియుంటి క్షమింపుమా
అనెను చూచుచు ॥శ్రీహరిని॥

42) శ్లో॥ యచ్చాపహాసార్థ మసత్కృతోఽసి
విహారశయ్యాసన భోజనేషు
ఏకోఽథవాప్యచ్యుత తత్సమక్షం
తత్క్షామయే త్వా మహ మప్రమేయం

వ.వి. యత్, చ, అపహాసార్థం, అసత్కృతః, అసి, విహార, శయ్యాసనభోజనేషు, ఏకః, అథవా, అపి, అచ్యుత, తత్సమక్షం, తత్, క్షామయే త్వామ్ అహం, అప్రమేయం .

టీ॥ అచ్యుత-ఓకృష్ణమూర్తి. అపహాసార్థం-పరిహాసముకొఱకు, విహారశయ్యాసనభోజనేషు - విహరణ, శయన, ఆసన, భోజన, కాలములందు, అసత్కృతః-తిరస్కరింపబడినవాడవు, అసీతియచ్చ-అయితివనునదియేదికలదో, అథవా-అట్లుకాకపోయినా, ఏకః-ఒక్కడై యున్నప్పుడు, తత్సమక్షం-యితరులయెదుటనుగాని, (తిరస్కరింపబడిన వాడవనునది యేదికలదో) తత్ - ఆయపరాధమునుగూర్చి, అప్రమేయం-అప్రమేయుడవైన, త్వాం - నిన్ను, అహం - నేను, క్షామయే-క్షమింపగోరుచున్నాను

గ॥ ఓ కృష్ణా నీవు అప్రమేయుడవని తెలియక యేకాంతంబున, యితరుల యెదుటను పరిహాసముగా విహార, శయ్యాసన భోజన సమయములయందు, అపరాధములుచేసితిని, ఆయపరాధములన్నింటిని క్షమించుమని, నిన్ను వేడుచున్నాను

ప॥తే॥ అప్రమేయుడవనుచు, ని-న్నరయలేక
శయన, భోజన, విహరణ-సమయమందు
నందరెదుట, నేకాంతము-నందు, నిన్ను
పలికియుంటిని, మాధవా-పరిహసించి
సలిపియుంటిని తప్పులు-చాల నేను
వానినన్నింటి క్షమియించు-వాసుదేవ

గే॥ అప్రమేయుడ* వనుచు తెలియక
అన్నమాటల నన్నిటిన్
యేకాంతమున- నితరులయెదుట
నెన్నియంటినో యన్నిటిన్
శయన, భోజన, విహారా, సన
సమయముల పరిహాసమై
పలికియుండిన తిరస్కారపు
పలుకులన్ని పరాత్పరా
కరుణతోడ క్షమింపవేడెద
కలిగియుండిన తప్పులన్
వందనము శ్రీ విశ్వరూపా
వందనము పరమేశ్వరా
అనెను చూచుచు వందనము ॥శ్రీహరిని

* మితిచెప్పడగనివాడు

43) శ్లో॥ పితాఽసిలోకస్య చరాచరస్య
త్వమస్యపూజ్యశ్చ గురుర్గరీయాన్

సత్వత్సమోఽస్త్య భ్యధికఃకుతోఽన్యో
లోకత్రయేఽప్యప్రతిమ ప్రభావ...

ప వి. పితా, అసి, లోకస్య, చరాచరస్య, త్వమ్, అస్యపూజ్యః, చ, గురుః, గరీయాన్, న, త్వత్సమః, అస్తి, అభ్యధికః, కుతః, అన్యః, లోకత్రయేఅపి, అప్రతిమప్రభావ

టీ॥ అప్రతిమప్రభావ - అసమానమైన ప్రభావముగల ఓకృష్ణా, త్వం-నీవు, చరాచరస్య-చరాచరస్వరూపమైన, లోకస్య-ప్రాణి సమూహమునకు, పితా-తండ్రియు, పూజ్యః-పూజార్హుడవును, గరీయాన్-శ్రేష్ఠుడైన, గురుశ్చ-గురువును, అసి-అయియున్నావు, (అందువలన) లోకత్రయేపి-మూడులోకములయందును, త్వత్సమః-నీకునసమానుడు, నఅస్తి-లేడు, అన్యః-ఇతరుడు, అభ్యధికః-అధికుడు, కుతః-యెక్కడి వాడు, (లేడనుట) .

గ॥ సాటిలేని ప్రభావముగల యో కృష్ణమూర్తి, నీవు చరాచరములగు, సమస్త ప్రాణులకు తండ్రివి, పూజ్యుడవు, శ్రేష్ఠుడవు, గురుడవై యున్నావు, మూడు లోకములందును, నీకు సమానుడు లేడు, అధికుడెట్లుండును

ప॥తే॥ శ్రేష్ఠు, డసమానశక్తి వౌ-చిత్స్వరూప
ఈచరాచర ప్రాణుల-కెల్లనీవె
తండ్రివి, గురుడవును, పూజ్య-దైవతంబు
మూడులోకంబులందున-లేడు సమము
అధికుడెట్లుండు నీకంటె-నంబుజాక్ష

గే॥ శ్రేష్ఠుండ, వసమానశక్తివి
చిత్స్వరూప పరాత్పరా
నీవెతండ్రివి ప్రాణులకెల్ల
నీవెగురుడవు పూజ్యుడుగా
మూడులోకములందు నీసరి
లేడధికుడుం శూన్యమే
అనెను చూచుచు ॥శ్రీహరిని

44) శ్లో॥ తస్మాత్ప్రణమ్య ప్రణిధాయకాయం
ప్రసాదయేత్వా మహమీశమీడ్యం
పితేవపుత్రస్య సఖేవసఖ్యుః
ప్రియప్రియాయార్హసి దేవసోఢుమ్....

ప.వి. తస్మాత్, ప్రణమ్య, ప్రణిధాయ, కాయం, ప్రసాదయే, త్వాం, అహం, ఈశం, ఈడ్యమ్, పితా, ఇవ, పుత్రస్య, సఖా, ఇవ, సఖ్యుః, ప్రియః, ప్రియాయాః, అర్హసి, దేవ, సోఢుం .

టీ॥ తస్మాత్-అందువలన, ఈశం-నియామకుడవును, ఈడ్యం-స్తుతింపదగినవాడవునగు, త్వాం-నిన్నుగూర్చి, అహం-నేను, కాయం-శరీరమును, ప్రణిధాయ-వంచి, ప్రణమ్య-నమస్కరించి, ప్రసాదయే-అనుగ్రహింపవేడుచున్నాను, హేదేవ-ఓకృష్ణా, పుత్రస్య-కుమారుని తప్పును, పితా + ఇవ-తండ్రివలెను, సఖ్యుః-సఖునితప్పు, సఖా + ఇవ-సఖునివలెను, ప్రియాయాః - ప్రియురాలితప్పును, ప్రియ + ఇవ-ప్రియునివలెను, సోఢుం-సహించుటకు, అర్హసి-తగియున్నావు,

గ॥ ఓ కృష్ణా అందువలన స్తుతింపదగినవాడవును, నియామకుడవైన నీకు శిరస్సాష్టాంగ నమస్కారముచేయుచు వేడుకొనుచున్నాను,

పుత్రునితప్పు తండ్రివలెను, స్నేహితునితప్పు స్నేహితునివలెను' ప్రియురాలితప్పు ప్రియునివలెను, నీవు నాతప్పులను క్షమించుటకు తగినవాడవు

ప॥తే॥ అర్హుడవు నీవుస్తుతికి, నే-నందువలన
సలిపి సాష్టాంగముగ, నమ-స్కారములను
తనయులను తండ్రి, సఖునిని-తనసఖుండు
భర్త భార్యను, క్షమియించు-పగిది, నిన్ను
అన్నితప్పులు క్షమియించు-మనుచునేను
వేడుకొనుచుంటి కరుణింప-విశ్వరూప

గే॥ శిరమువాల్చి నమస్కరించెద
చేసియుండిన తప్పులకా
పుత్రునితప్పు తండ్రిరీతిగ
మిత్రునితప్పు మిత్రుడే
భార్యసలిపిన తప్పులన్నియు
భర్తరీతి క్షమింపగా
వేడుచుంటిని కరుణజూడుము
విశ్వరూపా మాధవా
అనెను చూచుచు ॥శ్రీహరిని

45) శ్లో॥ అదృష్టపూర్వం హృషితోఽస్మిదృష్ట్వా
భయేనచప్రవ్యథితం మనోమే
తదేవమేదర్శయ దేవరూపం
ప్రసీదదేవేశ జగన్నివాస ..

ప వి. అదృష్టపూర్వం, హృషితః, అస్మి, దృష్ట్వా, భయేన, చ, ప్రవ్యథితం, మనః, మే, తత్, ఏవ, మే, దర్శయ, దేవ, రూపం, ప్రసీద, దేవేశ, జగన్నివాస

టీ॥ హేదేవ - ఓకృష్ణస్వామీ, అదృష్టపూర్వం-పూర్వమెప్పుడు చూడని విశ్వరూపమును, దృష్ట్వా-చూచి,, హృషితః-సంతోషించు వాడను, అస్మి-అయితిని, మే-నాయొక్క, మనః-మనస్సు, భయేన-భయముచేతను, ప్రవ్యథిత-మిక్కిలి పీడింపబడినది, తదేవరూపం-ఆప్రసన్నమగు పూర్వరూపమునే, మే-నాకొరకు, దర్శయ - మాపుము దేవేశ-దేవదేవా, జగన్నివాసా-జగదాధారా, మే-నాకు, ప్రసీద-ప్రసన్నుడవగుము

గ॥ ఓకృష్ణా ఇదివరకెన్నడు చూడబడని నీ విశ్వరూపమును చూచి, ఆనందముపొందితిని, కాని భయముచేత, నామనస్సు మిక్కిలి బాధపడుచున్నది. కావున ఓదేవదేవా, జగదాధారా, నీ పూర్వ రూపమును చూపి, నన్ననుగ్రహింపుము

ప॥తే॥ పొందితానందమును నేను-పూర్వమెపుడు
చూడనిది, విశ్వరూపంబు-చూచి, కాని
భయమున మనసు, వ్యాకుల-పడుచునుండె
పూర్వరూపంబు చూపించి-ముదముగూర్చి
పరమపూరుష నన్నేలు-పద్మనాభ

గే॥ ఎపుడుచూడని విశ్వరూపము
నిపుడుకనుగొని మిక్కిలిన్
సంతసించితికాని మనసున
చాలభయపడియుంటినే

పూర్వరూపముచూపి దయగను
పూరుషోత్తమ మాధవా
వందనము శ్రీ విశ్వరూపా
వందనము పరమేశ్వరా
అనెను చూచుచు ॥శ్రీహరిని

46) శ్లో॥ కిరీటింన గదినంచక్రహస్త
మిచ్ఛామి త్వాంద్రష్టుమహంతథైవ
తేనైవరూపేణ చతుర్భుజేన
సహస్రబాహో భవవిశ్వమూర్తే

ప.వి. కిరీటినం, గదినం, చక్రహస్తం ఇచ్ఛామి, త్వాంద్రష్టుం, అహం, తథా, ఏవ, తేన, ఏవ, రూపేణ, చతుర్భుజేన, సహస్ర బాహో, భవ, విశ్వమూర్తే

టీ॥ సహస్రబాహో - వేయిభుజములుగలిగిన, విశ్వమూర్తే- విశ్వస్వరూపా, త్వాం-నిన్ను, కిరీటినం-కిరీటమునుగలవానినిగాను, తథైవ-అవిధముగనే, గదినం - గదాయుధముగలవానినిగాను, చక్రహస్తం-హస్తమందు చక్రముగలవానినిగాను, ద్రష్టుం-చూచుటకొరకు అహం-నేను, ఇచ్ఛామి - కోరుచున్నాను, (కావున) చతుర్భుజేన - నాలుగు భుజములుగలిగిన, తేనరూపేణ-అపూర్వరూపముతోకూడిన వాడవు, భవ-కమ్ము

గ॥ అనేక భుజములుగల ఓ విశ్వరూపా కిరీటము, గద, చక్రమును ధరించిన, నాల్గుభుజములుగల నీ సౌమ్యమైన రూపమును చూడగోరుచున్నాను, ఆరూపమున కలవాడవగుము .

ప॥తే॥ వేయిభుజములు గలిగిన-విశ్వరూప
గద, కిరీటము చక్రింబు-గలిగి నాల్గు
భుజములను ధరించిన, దివ్య-మూర్తివగుచు
దర్శనంబునొసగి, నన్ను-దయనుగనుము

గే॥ వేయిభుజములు గలిగియుండిన
విశ్వరూపా జనార్దనా
గదయు చక్రము కిరీటంబును
కలిగి, నాలుగుహస్తముల్
కలుగురూపము చూడగోరితి
కరుణజూపుము కేశవా
వందనము శ్రీ విశ్వరూపా
వందనము పరమేశ్వరా
అనెను చూచుచు ॥శ్రీహరిని

శ్రీ భగవానువాచ

47) శ్లో॥ మయాప్రసన్నే తవార్జునేదం
రూపంపరందర్శిత మాత్మయోగాత్
తేజోమయం విశ్వమనంతమాద్యం
యన్మేత్వదన్యేన నదృష్టపూర్వం...

ప.వి. మయా, ప్రసన్నేన, తవ, అర్జున, ఇదం, రూపం. పరం దర్శితం, ఆత్మయోగాత్, తేజోమయం. విశ్వం, అనంతం, ఆద్యం, యత్, మే, త్వదన్యేన, న, దృష్టపూర్వం

✵ శ్రీకృష్ణమూర్తి చెప్పుచున్నాడు ✵

టీ॥ అర్జున-ఓయర్జునా, మే-నాయొక్క, యద్రూపం-యేరూపము తేజోమయం-తేజోమయమను, అనంతం-అంతములేనిదియును, ఆద్యం-ఆదియైనదియును, త్వదన్యేన-నీకంటెయితరునిచేత, నదృష్టపూర్వం-ఇంతవరకు చూడబడనిదియు, పరం - ఉత్తమమైనదియును, (అగు) ఇదం విశ్వరూపం-ఈ విశ్వరూపమును, ప్రసన్నేన - ప్రసన్నుడనైన, మయా-నాచేతను ఆత్మయోగాత్-ఆత్మయోగమువలన, దర్శితం-చూపించబడెను

గ॥ అర్జునా నీపై దయగలిగి నాయోగబలముచేత, తుది, మొదలు, అంతములేనిది, కాంతివంతమైనది, శ్రేష్ఠమైనది, ఇతరుల చేత నిదివరకు చూడబడని నా విశ్వరూపమును నీకు జూపితిని

ప॥తే॥ కలిగి నీపై దయనునేను-కాంతివంత
మగు, తుది, మొదలంతములేని-దైన, నాదు
యోగబలమున, నేతాల్చి-యుండినట్టి
విశ్వరూపముజూపితి-వేరువారు
చూడకుండిన, దిదినీవు-చూచినావు

గే॥ నీపై కరుణచె యోగబలమున
నేనుతేజోవంతమౌ
మొదలు, తుదియును లేనిదంతము
మునుపుచూడని శ్రేష్ఠమౌ
విశ్వరూపము నీకుజూపితి
వేరువారలు కననిదౌ

అని కిరీటికి ॥శ్రీహరిని

48) శ్లో॥ నవేదయజ్ఞాధ్యయనై ర్నదానై
ర్నచక్రియాభిర్న తపోభిరుగ్రైః
ఏవంరూపశ్శక్య అహంనృలోకే
ద్రష్టుంత్వదన్యేన, కురుప్రవీర .

ప వి న, వేదయజ్ఞాధ్యయనైః. న, దానైః, న, చ, క్రియాభి,
న, తపోభిః, ఉగ్రైః. ఏవంరూపం, శక్యః, అహం, నృలోకేః
ద్రష్టుం, త్వదన్యేన, కురుప్రవీర

టీ॥ కురుప్రవీర-ఓయర్జునా, ఏవంరూపం-ఈవిశ్వరూపముగల,
అహం-నేను, 'నృలోకే - మనుష్యలోకమందు, త్వదన్యేన - నీకంటే
యితరునిచేతను వేదయజ్ఞాధ్యయనైః-వేదాధ్యయనముచేతను,
యజ్ఞములచేతను, దానైః-దానములచేతను, క్రియాభిః-కర్మలచేతను
ఉగ్రైస్తపోభిః-ఉగ్రతపస్సులచేతను, ద్రష్టుం-చూచుటకొరకు, నశక్యః-
వీలుగానివాడను

గ॥ ఓయర్జునా ఈ విశ్వరూపముగల నేను, మనుష్యలోకము
నందు నీకంటె యితరులచేతను వేదాధ్యనముచేతను, యజ్ఞముల
చేతను, దానములచేతను, కర్మలచేతను, ఉగ్రతపస్సులచేతను
చూచుటకు సాధ్యమైనవాడనుకాను

ప॥తే॥ మనుజలోకాన, యీరూపు-మనుజులెవరు
చూడశక్యంబుగానట్టి-వాడ, నీవు
గాక, వేదాధ్యయనమున-గాని, యుగ్ర
తపము, యజ్ఞము, కర్మల-దానములను

గే॥ గొప్పదగు నావిశ్వరూపము
నెప్పుడుచూడరెవ్వరుణా
మనుజలోకమునందు మనుజులు
కనరుయజ్ఞము కర్మముల్
తపమునలిపియు వేదపఠనము
దానముల నొనరించియుణా
అని కిరీటికి ॥శ్రీహరిని

49) శ్లో॥ మాతేవ్యథామాచ విమూఢభావో
దృష్ట్వారూపం ఘోరమీదృఙ్మమేదం
వ్యపేతభీః ప్రీతమనాః పునస్త్వం
తదేవమే రూపమిదంప్రపశ్య...

ప.వి మా, తే, వ్యథా, మా, చ, విమూఢభావః, దృష్ట్వా, రూపం, ఘోరం, ఈదృశం, మమ, ఇదం, వ్యపేతభీః, ప్రీత మనాః, పునః, త్వం, తత్, ఏవ, మే, రూపం, ఇదం, ప్రపశ్య.

టీ॥ ఈదృక్-ఇట్టి, ఘోరం-భయంకరమైన, మమ-నాయొక్క, ఇదంరూపం-ఈరూపమును, దృష్ట్వా-చూచి, తే-నీకు, వ్యథా-భయ మును, విమూఢభావాశ్చ-చిత్తసంక్షోభమున్ను, మా-వద్దు త్వం-నీవు, వ్యపేతభీః-భయముపోయినవాడవై, ప్రీతమనాః-సంతోషమనస్సుగల వాడవై, పునః-మరల, మే-నాయొక్క, తదిదంరూపమేవ-ఈపూర్వ రూపమునే, ప్రపశ్య-చూడుము

గ॥ అర్జునా భయంకరమైన నా విశ్వరూపమును చూచి, భయమును చిత్తవిభ్రాంతిని, బొందవలదు నీవు భయమును లేనివాడవై, సంతో షమును, గలిగిన మనస్సుగలవాడవై నాయొక్క పూర్వ రూపమును చూడుము

ప॥తే॥　చూచి నావిశ్వరూపంబు-నుంతయేని
భయము, మోహంబుచెందకు-పార్థనీవు
భయములేని మనసుగల-వాడగుచును
సంతసంబుతోఁగూడిన-స్వాంతుడగుచు
పూర్వరూపంబు చూడుము-పురుష శ్రేష్ఠ

గే॥　నాభయంకర విశ్వరూపము
నాదుమహిమను చూచియుఁ
కలిగియుండిన భయమువదలుము
కాంచి సహజస్వరూపముఁ
చిత్తశాంతినిబొంది, ముదమును
చెందియుండుము, భారతా
అని కిరీటికి　॥శ్రీహరిని॥

❖ స ం జ య ఉ వా చ ❖

50) శ్లో॥　ఇత్యర్జునం వాసుదేవస్తథోక్త్వా
స్వకంరూపం దర్శయామాసభూయః
ఆశ్వాసయామాసచ, భీతమేనం
భూత్వాపునస్సౌమ్య వపుర్మహాత్మా....

ప.వి.　ఇతి, అర్జునం, వాసుదేవః, తథా, ఉక్త్వా, స్వకం, రూపం, దర్శయామాస, భూయః, ఆశ్వాసయామాస, చ, భీతం, ఏనం, భూత్వాపునః, సౌమ్యవపుః, మహాత్మా . .

సంజయుడు చెప్పుచున్నాడు

టీ॥ ఇతి-ఇట్లని, వాసుదేవః-శ్రీకృష్ణమూర్తి, అర్జునం - అర్జునునిగూర్చి, తదా-అట్లు, ఉక్త్వా-పలికి, భూయః-మరల, స్వకం రూపం - స్వకీయమైన పూర్వరూపమును, దర్శయామాస - చూపెను, మహాత్మా-శ్రీకృష్ణపరమాత్మ, సౌమ్యవపుః-శాంతశరీరముగలవాడు, భూత్వా-అయి, భీతం-భయపడిన, ఏనం-ఈయర్జునుని, పునః-మరల, ఆశ్వాసయామాస-ఊరడించెను

గ॥ ఓధృతరాష్ట్రా శ్రీకృష్ణుడర్జునుని చూచి, ఈవిధముగాచెప్పినవాడై, మరల తన పూర్వరూపమును చూపించి, భయపడియున్న పార్థుని యూరడించెను

ప॥తే॥ ఈవిధంబుగ శ్రీ కృష్ణు-డెల్లవిషయ
ములు, కిరీటికి, పూర్తిగా-తెలియజేసి
సహజరూపంబు చూపించి-సవ్యసాచి
భయముతొలగించి, శాంతిని-బడయజేసె

గే॥ పరమపురుషుడు పలికి యీగతి
మరల పూర్వపు రూపముణా
చూపి, పార్థుని యూరడించెను
చూచితిని నేనంతయుణా
అనుచుదెలిపెను ధృతరాష్ట్రునకు
అచట సంజయుడంతయుణా
శ్రీహరిని శ్రీ ॥అశుభమగు

అర్జున ఉవాచ

51) శ్లో॥ దృష్ట్వేదం మానుషం రూపం
తవసౌమ్యం జనార్దన
ఇదానీమస్మి సంవృత్త
స్సచేతాః ప్రకృతింగతః...

వ.వి. దృష్ట్వా. ఇదం, మానుషం, రూపం, తవ, సౌమ్యం, జనార్దన, ఇదానీమ్, అస్మి, సంవృత్తః. సచేతాః. ప్రకృతిం, గతః

అర్జునుడు చెప్పుచున్నాడు

టీ॥ జనార్దన-ఓకృష్ణమూర్తీ, సౌమ్యం-ప్రసన్నమైన, మానుషం-మనుష్యసంబంధమైన, తవ - నీయొక్క, ఇదంరూపం - ఈయాకారమును, దృష్ట్వా-చూచి, ఇదానీ - ఇప్పుడు, సంవృత్తః - స్వస్థతను బొందినవాడను, సచేతాః - చైతన్యముతోకూడినవాడను, ప్రకృతిం-స్వభావమును, గతః-బొందినవాడను, అస్మి-అయితిని

గ॥ ఓకృష్ణా యిపుడు సౌమ్యమైన నీమానుష రూపమునుచూచి నేను నిర్భయుడను, స్వస్థచిత్తుడను, సహజస్వభావుడనైతిని .

ప॥తే॥ పరమపూరుష, జగదీశ-పద్మనాభ
నీదుమానుష రూపంబు-నేనుజూచి
స్వస్థచిత్తుడనైతిని సరసిజాక్ష
కలిగె సహజమౌభావము-కలతమాని

గే॥ సహజమగునీమనుజ రూపము
శాంతిబొందితి చూచుచుఁ
కలిగెస్థిమితము బుద్ధియందున
తొలగెభీతి, మనంబులో
కలిగెసహజంబైన భావము
కలతమాసితి నంతయుఁ
అనుచు దెలిపెను కృష్ణమూర్తితొ
అర్జునుడు రణభూమిలో
శ్రీహరిశ్రీ ॥అశుభమగు

❖ శ్రీ భ గ వా ను వా చ ❖

52) శ్లో ॥ సుదుర్దర్శ మిదంరూపం
దృష్టవానసి యన్మమ
దేవాఅప్యస్య రూపస్య
నిత్యందర్శన కాంక్షిణః...

ప.వి. సుదుర్దర్శం, ఇదం, రూపం, దృష్టవానసి, యత్, మమ దేవాః, అపి, అస్య, రూపస్య, నిత్యం, దర్శనకాంక్షిణః

✵ శ్రీభగవంతుడు చెప్పుచున్నాడు ✵

టీ॥ మమ-నాయొక్క, యద్రూపం-ఏరూపమును, దృష్టవాఁ— చూచినవాడవు. అసి - అయితివో, సుదుర్దర్శం - చూడదుర్లభమైనది. ఇదంరూపం-ఈరూపమును, దేవాః + అపి-దేవతలును, నిత్యం-యెల్లప్పుడును, అస్య - ఈ, రూపస్య-రూపముయొక్క, దర్శనకాంక్షిణః- దర్శనముకోరుచున్నారు .

గ॥ అర్జునా నీవిప్పుడు చూచిన విశ్వరూపము చూచుటకు చాల దుర్లభమైనది. ఇట్టి విశ్వరూపము చూచుటకు దేవతలుకూడ సదా కోరుచుందురు

వ॥తే॥ ఎట్టినావిశ్వరూపంబు-నిపుడునీవు
చూచియుంటివో మిక్కిలి-చోద్యమంది
పరులుచూడ, మహాదుర్ల-భంబుపార్థ
అట్టినావిశ్వరూపంబు-ననుదినంబు
సురలుకాంక్షించుచుందురు-చూడగాను

గీ॥ నీకుచూపిన విశ్వరూపము
నిఖిలదేవరలాత్మలో
చూడగోరుచునుండి, రనయము
చూడదుర్లభ, మెరికిఁ
అని కిరీటికి ॥శ్రీహరిని

53) శ్లో॥ నాహంవేదై ర్నతపసా
నదానేన నచేజ్యయా
శక్యఏవం విధోద్రష్టుం
దృష్టవానసి మాంయథా...

ప.వి. న, అహం, వేదైః, న, తపసా, న, దానేన, న, చ, ఇజ్యయా, శక్యః, ఏవంవిధః, ద్రష్టుం, దృష్టవానసి, మాం, యథా.

టీ॥ మాం-నన్ను, యథా-ఏప్రకారముగా, దృష్టవాఁ-చూచిన వాడవు, అసి-అయితివో, ఏవంవిధం-అట్టి విశ్వరూపమును ధరించిన,

అహం - నేను, వేదైః - వేదములచేతను, తపసా - తపస్సుచేతను, దానేన-దానముచేతను, ఇజ్యయా-యజ్ఞముచేతను, ద్రష్టుం-చూచుట కొరకు, నశక్యః-శక్యుడనుకాను .

గ॥ అర్జునా నీవు చూచిన విశ్వరూపమును వేదములచేతను, యజ్ఞదాన, తపస్సులచేతను చూచుటకు శక్యుడనుగాను .

ప॥తే॥ దానముల, యజ్ఞములచేత-తపముచేత
వేదములచేత శక్యంబు-గాదు, నీవు
గనిన నావిశ్వరూపంబు-గాంచజాల
రమిత దుర్లభమైనట్టి-దనియెరుంగు

గే॥ తపముసలిపిన వేదముచదువ
దాన, క్రతువులు, సలిపినా
చూడజాలరు విశ్వరూపము
చూడదుర్లభమైనదై
అని కిరీటికి ॥శ్రీహరిని

54) శ్లో॥ భక్త్యా త్వనన్యయాశక్య
అహమేవం విధోఽర్జున
జ్ఞాతుంద్రష్టుంచ తత్త్వేన
ప్రవేష్టుంచ పరంతప

ప.వి భక్త్యా, తు, అనన్యయా, శక్యః, అహం, ఏవంవిధః, అర్జున, జ్ఞాతుం, ద్రష్టుం, చ, తత్త్వేన, ప్రవేష్టుం, చ, పరంతప,

టీ॥ పరంతప - శత్రుతాపనుడవైన, అర్జున - ఓ యర్జునా, అనన్యయా-ఇతరాసక్తముగాని, భక్త్యా - భక్తిచేత, ఏవంవిధః-ఇట్టి విశ్వరూపమును ధరించిన, అహం-నేను, తత్త్వేన - యదార్థముగను, జ్ఞాతుం-తెలియుటకొరకును, ద్రష్టుం-చూచుటకొరకును, ప్రవేష్టుంచ-ప్రవేశించుటకొరకును, శక్యః-శక్యమైనవాడనుకాను

గ॥ అర్జునా యీ విధమగు విశ్వరూపముగల నన్ను, అనన్యమైన భక్తిచేతనే, యధార్థముగ తెలిసికొనుటకు, చూచుటకు, పొందుటకు, సాధ్యమైనవాడనగుచున్నాను

ప॥తే॥　అన్యచింతలు లేనివా-రంద, రచల
మైన, భక్తిచే దలచువా-రైన, నన్ను
సులభసాధ్యంబు పొందంగ,చూడగాను
తెలిసికొనుటకు శక్యంబు-తెల్లముగను

గే॥　అన్యచింతలు లేనివారలు
అచలమగు సద్భక్తిచే
నన్నుజూతురు, ననుపొందుదురు
నన్నుతెలియగ సాధ్యమౌ
అని కిరీటికి　॥శ్రీహరిని

55) శ్లో॥　మత్కర్మ కృన్మత్పరమో
మద్భక్తః సంగవర్జితః
నిర్వైరస్సర్వ భూతేషు
యస్సమామేతి పాండవ....

ప.వి. మత్కర్మకృత్, మత్పరమః, మద్భక్తః, సంగవర్జితః, నిర్వైరః, సర్వభూతేషు, యః, సః, మాం, ఏతి, పాండవ

టీ॥ పాండవ-ఓయర్జునా, మత్కర్మకృత్ - నాకొరకు సత్కర్మములు చేయువాడును, మత్పరమః-నాయందాసక్తుడును, మద్భక్తః-నాయందేభక్తిగలవాడును, సంగవర్జితః - సంగముచేత విడువబడినవాడును, సర్వభూతేషు-సర్వప్రాణులయందు, నిర్వైరః-వైరములేనివాడును, యః - ఎవడో, సః - వాడు, మాం-నన్ను, ఏతి-పొందుచున్నాడు

గ॥ అర్జునా నాకొరకు సత్కర్మములను చేయువాడును, నాయందాసక్తిగలవాడును, నాయందే భక్తిగలవాడును, సంగమును వదలినవాడును, సర్వభూతములయందు వైరములేనివాడును, నన్నే పొందుచున్నాడు

ప॥తే॥ సర్వకర్మలు ననుగూర్చి-సలుపువాడు
నన్ను ప్రేమించువాడును-నన్నుభక్తి
భజనసలుపుచు, సంగంబు-వదలువాడు
సర్వప్రాణులయందును-సముడెవండొ
అట్టిభక్తుడు ననుజేరు-నంతమందు

గే॥ నన్నుగూర్చి యొనర్చువాడును
అన్నిసత్కర్మంబులన్
నన్నెగతియని నమ్మువాడును
నను, భజించెడివాడును
వదలిసంగము విడిచివైరము
వాడునన్నే పొందెడిన్

అని కిరీటికి బోధజేసెను
అచ్యుతుడు రణభూమిలో
శ్రీహరిని శ్రీ కృష్ణమూర్తిని
చిత్తమందు భజించెదగా
అశుభమగు సంసారబంధము
అన్నియును తొలగింపగా ॥శ్రీ॥

గ॥ ఇది శ్రీ కవిరత్న రత్నాకరము వెంకటేశ్వర కవి విరచితమై గద్య పద్య గేయరూపంబును, శ్రీ కృష్ణార్జునుల సంవాదంబగు, శ్రీ భగవద్గీతా గద్య పద్య గేయామృతము నందు విశ్వరూప సందర్శన యోగమను పదునొకండవ అ ధ్యా య ము సంపూర్ణము.

హరిః ఓమ్ తత్సత్ హరిః ఓమ్

శాంతిః శాంతిః శాంతిః





అధ్యాయ సంగ్రహము - భక్తి యోగము

మ॥ అనురాగంబున, మైత్రిచేత, సతమున్
హర్షంబుతో ప్రాణులన్
గని, దుఃఖంబు, సుఖంబులం, సమముగా
కన్గొంచు, ధీ, చిత్తముల్
తనకర్మంబుల, నీశ్వరార్పణముగా
ధ్యానించు, సద్భక్తుడే
ఘనుడుగా, నాకుప్రియుండు, మిక్కుటముగా
కౌంతేయ ముక్తుండునౌ....

తా॥ అర్జునా సమస్త భూతములయందు, వైరములేనివాడై మైత్రితో, ప్రేమ, దయ, సంతోషములతో చూచుచు, సుఖ దుఃఖములయందు, సమముగావర్తించి, నిత్యానందుడై, నా కర్పించిన, మనోబుద్ధి కర్మములుగలవాడై, శ్రద్ధాభక్తులతో, నన్నే నిరంతరము ధ్యానించువాడు, నాకుమిక్కిలి ప్రియుడై ముక్తుడగునని, శ్రీ కృష్ణపరమాత్మ, పార్థునకు బోధించిన భక్తి యోగమను పండ్రెండవ అధ్యాయము, శ్రీ భగవద్గీతా గద్య పద్య గేయామృతమునందు, సంగ్రహ పద్య తాత్పర్యములు.

హరిఃఓమ్ శాంతిః శాంతిః శాంతిః

## అర్జున ఉవాచ

1) శ్లో॥ ఏవంసతత యుక్తాయే
భక్తాస్త్వాం పర్యుపాసతే
యేచాఽప్యక్షర మవ్యక్తం
తేషాంకే యోగవిత్తమాః...

ప.వి. ఏవం, సతతయుక్తాః, యే, భక్తాః, త్వాం, పర్యుపాసతే, యే, చ, అపి, అక్షరం, అవ్యక్తం, తేషాం, కే, యోగవిత్తమాః

టీ॥ ఏవం-ఈప్రకారముగా. సతతయుక్తాః-ఎల్లప్పుడు నీయందు నిష్ఠగలవారై. యేభక్తాః-ఏభక్తులు. త్వాం - నిన్ను, పర్యుపాసతే-ధ్యానముచేయుచున్నారో. యేచాపి - యెవ్వరైనను అవ్యక్తం - యింద్రియములకు గోచరముకానట్టి. అక్షరం-బ్రహ్మమును. పర్యుపాసతే-ద్యానముచేయుచున్నారో. తేషాం-వారలయందు. కే - ఎవరు, యోగవిత్తమాః-మిక్కిలి యోగముతెలిసినవారలు

## అర్జునుడడుగుచున్నాడు

గ॥ ఓకృష్ణా కొందరు భక్తులెల్లప్పుడు. నీయందు చిత్తమునిలిపి, నిన్నుపాసించుచున్నారు. మరికొందరు యింద్రియ గోచరముకాని పరబ్రహ్మము నుపాసించుచున్నారు. వారలలో మిక్కిలి యోగము తెలిసిన వారెవరు? .

ప॥తే॥ చిత్త మెప్పుడు నీయందు-చేర్చి, నిన్ను
భజనసలిపెడి కొందర-భక్తులందు
వ్యక్త మేగాని యక్షర-బ్రహ్మ మెపు, డు
పాసన సలుపుచుండెడి-వారలందు
తెలుపు మెవ్వారు శ్రేష్ఠులో-దేవదేవ

గే॥ భగవత్ప్రీతిగ కర్మసలిపి
భక్తిచే గొలుసువారల ?
అవ్యక్తంబగు పరబ్రహ్మను
ఆత్మగొలిచెడి వారలా ?
సగుణ నిర్గుణసేవకులలో
సర్వశ్రేష్ఠుల తెలుపుమా
అనుచు నడిగెను ॥శ్రీహరిని

※ శ్రీ భ గ వా ను వా చ ※

2) శ్లో॥ మయ్యావేశ్య మనోయేమాం
నిత్యయుక్తా ఉపాసతే
శ్రద్ధయా పరయోపేతా
స్తేమేయుక్తత మామతాః....

ప.వి. మయి, ఆవేశ్య. మనః, యే. మామ్, నిత్యయుక్తాః, ఉపాసతే. శ్రద్ధయా, పరయా, ఉపేతాః, తే, మే, యుక్తతమాః, మతాః

✹ శ్రీ కృష్ణుడు చెప్పుచున్నాడు ✹

టీ॥ యే-ఏ భక్తులు, మయి - నాయందు, మనః - మనస్సును, ఆవేశ-ఉంచి, నిత్యయుక్తాః-నిరంతరసమాహితచిత్తులై, పరయా-ఉత్కృష్టమైన, శ్రద్ధయా-శ్రద్ధచేత, ఉపేతాః-కూడినవారలై, మాం-నన్ను, ఉపాసతే-ధ్యానించుచున్నారో, తే-వారలు, యుక్తతమాః-యోగిశ్రేష్ఠులని మే-నాకు, మతాః-ఇష్టులు (సమ్మతులు)

గ॥ అర్జునా యెవరు నాయందు మనసునిలిపి, నిత్యయుక్తులై, మిక్కిలి శ్రద్ధతోకూడినవారలై, నన్ను ధ్యానించుచున్నారో, అట్టి యుత్తమ పురుషులు యోగిశ్రేష్ఠులు, నాకు యిష్టులు

ప॥తే॥ నిలిపి నాయందుమనసును-నిశ్చలముగ
శ్రద్ధ మిక్కిలిగలిగియు-సంతతంబు
నన్నుధ్యానించు భక్తులే-నాకు హితులు
యుత్తమోత్తము లైనట్టి-యోగివరులు

గే॥ నిలిపి నాపైమనసు సతతము
కలిగి శ్రద్ధాభక్తులన్
నన్నుధ్యానము చేయువారలె
నాకుహితులు యోగివరులు
అని కిరీటికి ॥శ్రీహరిని

3) శ్లో॥ యేత్వక్షర మనిర్దేశ్య
మవ్యక్తం పర్యుపాసతే
సర్వత్రగ మచింత్యంచ
కూటస్థ మచలంధ్రువమ్....

4) శ్లో॥ సన్నియమ్యేంద్రి యగ్రామం
సర్వత్ర సమబుద్ధయః
తేప్రాప్నువంతి మామేవ
సర్వభూతహితే రతాః .

3 ప వి యే. తు. అక్షరం. అనిర్దేశం. అవ్యక్తం. పర్యుపాసతే. సర్వత్రగం. అచింత్యం. చ. కూటస్థం. అచలం. ధ్రువం

4 ప.వి. సన్నియమ్య. ఇంద్రియాగ్రామం. సర్వత్ర. సమబుద్ధయః తే. ప్రాప్నువంతి. మామ్. ఏవ. సర్వభూతహితే. రతాః

టీ॥ యేతు-యెవరైతే, ఇంద్రియగ్రామం - ఇంద్రియ సమూహమును, సన్నియమ్య-లెస్సగానిగ్రహించి, సర్వత్ర-సమస్తమందును, సమబుద్ధయః-సమబుద్ధిగలినయున్నవారలై. సర్వభూతహితే - సకల ప్రాణుల క్షేమమునందు, రతాః-ఆసక్తులైనవారలై, అనిర్దేశ్యం-నిర్ణయింపగూడని, అవ్యక్తం-రూపాదిరహితమైన, సర్వత్రగం-అంతటను వ్యాపించియున్న, అచింత్యం-చింతింపరాని, కూటస్థం - ప్రకృతియందున్న, అచలం-చలింపని, ధ్రువం-నిత్యమైన, అక్షరం - పరబ్రహ్మమును, పర్యుపాసతే-ఉపాసనచేయుచున్నారో, తే-వారలు, మామేవ-నన్నే, ప్రాప్నువంతి-పొందుచున్నారు

3 గ॥ అర్జునా యెవరెల్లకాలమునందు యింద్రియ నిగ్రహముగలిగి సర్వప్రాణుల యందాసక్తిగలిగి నాశములేనిదియు, నిర్దేశింపరానిదియు రూపరహితమైనదియు, అంతట వ్యాపించియున్నదియు, చింతింప శక్యముకానిదియు, ప్రకృతియందున్నదియు, చలించనిదియు, శాశ్వతమైనదియునగు, పరబ్రహ్మము నుపాసనచేయుచున్నారో వారు నన్నే పొందుచున్నారు

3 ప॥తే॥ నిర్ణయింప సాధ్యమును గా-నిదియు, చింత
సలుపరాని, దచలమును-సకల దిశల
వ్యాప్తమైనదియు, ప్రకృతి-యందు, నిత్య
మైన, బ్రహ్మముపాసించు-నట్టివారు

4 ప॥తే॥ ఇంద్రియంబుల నరికట్టి-యెల్లగతుల
సకల భూతంబులందున-సామ్యబుద్ధి
గలిగి, సర్వభూతహితము-సలిపి, నన్ను
బొందుచుందురు వారలు-పుణ్యచరిత

గే॥ కలిగి యింద్రియ నిగ్రహంబును
కాంచి సమముగ ప్రాణులన్
సర్వప్రాణుల కెల్లకాలము
సలుపువారై హితమునే ॥అని కిరీటికి
సాధ్యముగానిది నిర్ణయింప
సలుపరానిది చింతయున్
అంతటను వ్యాపించి యుండెడి
అచలు, నక్షరు, నవ్యక్తున్
ననుపరబ్రహ్మంబు గొలుచుచు
నన్నెపొందుదు రెప్పుడున్
అని కిరీటికి ॥శ్రీహరిని

5) శ్లో॥ క్లేశోఽధిక తరస్తేషా
మవ్యక్తా సక్తచేతసామ్
అవ్యక్తా హిగతిర్దుఃఖం
దేహవద్భి రవాప్యతే

వ.వి. క్లేశః, అధికతరః, తేషాం, అవ్యక్తాసక్తచేతసామ్, అవ్యక్తా, హి, గతిః, దుఃఖం, దేహవద్భిః, అవాప్యతే ..

టీ॥ తేషాం-ఆ. అవ్యక్తాసక్తచేతసాం - పరబ్రహ్మమునందాసక్తమైన చిత్తముగలవారలకు. క్లేశః - కష్టము, అధికతరః - మిక్కిలి యధికమైనది, హి-యేకారణమువలన, దేహవద్భిః-దేహాభిమానము గలవారిచేత, అవ్యక్తా - అవ్యక్తమైన గతిః-మార్గము, దుఃఖం-కష్టముగాను, అవాప్యతే-పొందబడుచున్నది

గ॥ అర్జునా అవ్యక్త పరబ్రహ్మమందాసక్తిగలవారికి. మిక్కిలి కష్టముగలుగును, నిర్గుణోపాసనమార్గము, దేహాభిమానముగలవారికి, వాల కష్టముగా పొందబడుచున్నదిగదా?

ప॥తే॥ ఆ పరబ్రహ్మమందున-యాశగలుగు
మనసుగల వారలకధిక-మైన శ్రమము
గలుగు, నక్షరరూపము-గతికి* దేహ
మందు, ప్రేమనుగలిగిన-యట్టివార
లధిక శ్రమముతోడనె, పొంద-నగునుపార్థ

* మార్గము

గే॥ కలుగుబాధలనేక మెప్పుడు
సలుప నిర్గుణధ్యానమున్
తనువుపై నభిమానముండిన
నినుమదించును, కష్టముల్
పొందకుందురు వారుసిద్ధిని
పొందజాలరు నిష్టయుణా

అని కిరీటికి ॥శ్రీహరిని

6) శ్లో॥ యేతుసర్వాణి కర్మాణి
మయిసన్యస్య మత్పరాః
అనన్యే నైవయోగేన
మాంధ్యాయంత ఉపాసతే...

ప.వి. యే. తు. సర్వాణి. కర్మాణి. మయి. సన్యస్య. మత్పరాః. అనన్యేన. ఏవ. యోగేన. మాం. ధ్యాయంతః. ఉపాసతే

టీ॥ యేతు-యెవరు. మత్పరాః-నేనే యుత్కృష్టగతిగాగలవారై సర్వకర్మాణి-సమస్తకర్మములను. మయి-నాయందు. సన్యస్య-సమర్పించి. అనన్యేన-ఏకాంతమైన. యోగేనైవ-యోగముచేతనే. మాం-నన్ను. ధ్యాయంతః-ధ్యానముచేయుచున్నవారలై. ఉపాసతే-సేవించుచున్నారో

గ॥ అర్జునా యెవరు నాయందాసక్తులై. సమస్త కర్మములను నాకు సమర్పించి. యేకాంతమైన యోగముచేత. నన్ను ధ్యానము చేయుచున్నారో.

ప॥తే॥ అన్నికర్మలుపూర్తి నా-కప్పగించి
నన్నె యుత్తమగతియని-యెన్నుకొనుచు
సలిపి యేకాంతయోగంబు-సంతతంబు
నన్నుపాసించి పూజించు-చున్నజనులు

గే॥ నన్నెయుత్తమగతిగ దలచుచు
నన్నెయెంచుచు మనసులో
నాసమర్పణసలిపి కర్మలు
నన్ను ధ్యానమొనర్తురో
అని కిరీటికి ॥శ్రీహరిని

7) శ్లో॥ తేషామహంస ముద్ధర్తా
మృత్యుసంసార సాగరాత్
భవామి నచిరాత్పార్థ
మయ్యావేశిత చేతసామ్

ప.వి. తేషాం, అహం, సముద్ధర్తా, మృత్యుసంసారసాగరాత్, భవామి, నచిరాత్, పార్థ, మయి, ఆవేశితచేతసామ్

టీ॥ హేపార్థ-ఓయర్జునా, మయి-నాయందు, ఆవేశితచేతసాం-ఉంచబడిన చిత్తముగలిగిన, తేషాం-వారలను, అహం-నేను, మృత్యు సంసారసాగరాత్-మృత్యురూపమైన సంసారమను సముద్రమునుండి, సముద్ధర్తా-ఉద్ధరించువాడను, నచిరాత్-శీఘ్రముగా, భవామి - అగుచున్నాను

గ॥ అర్జునా నాయందుంచబడిన చిత్తముగలవారలను, జనన, మరణ రూపమైన, సంసార సముద్రమునుండి శీఘ్రకాలముసనే ఉద్ధరించు వాడనగుచున్నాను

ప॥తే॥ నిశ్చలంబుగ నాయందు-నిలిపి మనసు
నన్నుధ్యానించి పూజించు-చున్న వారి
జనన మరణరూపమగు, సం-సార జలధి
దాటజేయుదు శీఘ్రమే-ధన్యచరిత

గే॥ అట్టిచిత్తము గలుగువారల
కతిరయంబున ఫల్గునా
సంసారమను మృత్యురూపక
సాగరము దాటింతునే
అని కిరీటికి ॥శ్రీహరిని

8) శ్లో॥ మయ్యేవ మన అధత్స్వ
మయిబుద్ధిం నివేశయ
నివసిష్యసి మయ్యేవ
అతఊర్ధ్వం నసంశయః....

ప.వి. మయి. ఏవ. మనః. అధత్స్వ. మయి. బుద్ధిం. నివేశ్య. నివసిష్యసి. మయి. ఏవ. అతః. ఊర్ధ్వం. న. సంశయః

టీ॥ మయ్యేవ-నాయందే. మనః - మనస్సును. ఆధత్స్వ-ఉంచుము. మయి-నాయందే. బుద్ధిం-బుద్ధిని. నివేశయ-ఉంచుము. అతఊర్ధ్వం-అటుపిమ్మట. మయ్యేవ-నాయందే. నివసిష్యసి-ఉండగలవు. నసంశయః-సందెహములేదు

గ॥ అర్జునా నీమనస్సును. బుద్ధిని. నాయందే స్థిరముగా నిలుపుము. ఆవిధముగా చేసితివేని ఈ దేహమునశించిన తరువాత నాయందే నిస్సంశయముగ నుండగలవు

ప॥తే॥ నీమనసు, బుద్ధి, నాయందు-నిలుపు మెప్పు
డావిధంబుగ నొనరింప-నంతమందు
చేరియుందువు, నాయందె-స్థిరముగాను
సంశయంబును మానుము-సవ్యసాచి

గే॥ ఉంచియుండుము మనసునాపై
యుంచియుండుము బుద్ధియుణా
పొందగలవు, నశింపదేహము
సందియము లేకుండనణా
అని కిరీటికి ॥శ్రీహరిని

9) శ్లో॥ అథచిత్తం సమాధాతుం
నశక్నోషి మయిస్థిరమ్
అభ్యాస యోగేనతతో
మామిచ్ఛాప్తుం ధనంజయ....

ప వి. అధ, చిత్తం, సమాధాతుం, న, శక్నోషి, మయి, స్థిరం అభ్యాసయోగేన, తతః, మాం, ఇచ్ఛ, ఆప్తుం, ధనంజయ

టీ॥ హేధనంజయ - ఓయర్జునా, అథ - అటుపిమ్మట, మయి- నాయందు, చిత్తం-చిత్తము, స్థిరం - నిశ్చలముగా, సమాధాతుం- ఉంచుటకొరకు, నశక్నోషి-శక్తుడవుగాక పోయితివేని, తతః-ఆతరువాత, అభ్యాసయోగేన-అభ్యాసయోగముచేత, మాం-నన్ను, ఆప్తుం- పొందుటకొరకు, ఇచ్ఛ-కోరుము

గ॥ అర్జునా ఆవిధముగా నీమనస్సును, బుద్ధిని నాయందు నిశ్చలముగా నిలుపుటకు, శక్తిలేనివాడవైన యెడల, నన్ను పొంద వలెనను కోరికకలవాడవై అభ్యాసముచేయుము

ప॥తే॥ నీదుమనసును, బుద్ధిని-నిశ్చలముగ
నిలుపనాయందు సాధ్యంబు-గలుగకున్న
కోరి, నను బొందమనసున-స్థిరముగాను
నలుపు మభ్యాస యోగంబు-సవ్యసాచి

గే॥ నీమానసమును నాయందే
నిశ్చలంబుగ బుద్ధినీ॥
నిలుప శక్యముగాయుండిన
నలుపు మభ్యాసంబును॥

నన్నుపొందగగోరి మనసున
యున్నవాడై నిత్యముఙా
అని కిరీటికి		॥శ్రీహరిని

10) శ్లో॥ అభ్యాసేఽప్యస మర్థోఽసి
మత్కర్మ పరమోభవ
మదర్థమపి కర్మాణి
కుర్వణాసిద్ధి మవాప్యసి...

వ.వి. అభ్యాసే, అపి, అసమర్థః, అసి, మత్కర్మపరమః భవ, మదర్థం, అపి, కర్మాణి, కుర్వం, సిద్ధి, అవాప్యసి

టీ॥ అభ్యాసేఽపి-అభ్యాసయోగమందును, అసమర్థః - అశక్తుడవు, అసి-అయితివేని, 'మత్కర్మపరమః - నానిమిత్తమైన కర్మయే ప్రధానముగాకలవాడవు, భవ-కమ్ము, మదర్థం-నాకొరకు, కర్మాణి-సత్కర్మములను, కుర్వన్నపి - చేయుచున్నవాడవయ్యును, సిద్ధిం-మోక్షమును, అవాప్యసి-పొందగలవు..

గ॥ అర్జునా అట్లభ్యాసము చేయుటకు శక్తిలేనివాడవైన యెడల సమస్త కర్మములు, నాకొరకై చేయుము, అట్లు నాప్రీతికొరకు సత్కర్మములను చేసితివేని నీకు మోక్షముగలుగును

ప॥తే॥ ఆవిధంబుగ నభ్యాస-మాచరింప
శక్తుడవు, నీవుగానిచో-సవ్యసాచి
నానిమిత్తము కర్మంబు-లనుదినంబు
సలిపి పొందుము మోక్షంబు-సవ్యసాచి

గే॥ సలుపుటకు నీకభ్యాసంబు
శక్తి చాలక యున్నచో
సత్కర్మములు సలుపుచుండుము
సంతతము నాకొరకునై
సిద్ధిబొందిన వాడవగుచును
చెందెదవు మోక్షంబునే

అని కిరీటికి ॥శ్రీహరిని

11) శ్లో॥ అథైత దప్యశక్తో౽సి
కర్తుంమద్యోగ మాశ్రితః
సర్వకర్మ ఫలత్యాగం
తతః కురు యతాత్మవాన్

ప.వి. అథ, ఏతత్, అపి, అశక్తః. అసి, కర్తుం, మద్యోగం, ఆశ్రితః, సర్వకర్మఫలత్యాగం, తతః, కురు, యతాత్మవాన్

టీ॥ అథ-అపిమ్మట. ఏతదపి-ఈకార్యమును, కర్తుం-చేయుట కొరకు, అశక్తః-అసమర్థుండవు, అసి-అయితివేని, మద్యోగం - నా యొక్క యోగమును. ఆశ్రితః-ఆశ్రయించినవాడవై. తతః-పిమ్మట, యతాత్మవాన్ -నిగ్రహించిన చిత్తముగలవాడవై. సర్వకర్మఫల త్యాగం-సమస్తకర్మఫలత్యాగమును. కురు-చేయుము

గ॥ అర్జునా నీకావిధంబుగా చేయుటకు సమర్థలేనివాడవైన యెడల, నన్నాశ్రయించి, చలింపని మనస్సుగలవాడవై, సమస్త కర్మఫలములను, త్యాగముచేయుము

ప॥తే॥ అట్లు భక్తిచే కర్మంబు-లాచరింప
శక్తి లేదన్నచో, నను_శరణుబొంది
నిగ్రహించి మానసమును-నిశ్చలముగ
ఫలము త్యజియించికర్మముల్-సలుపుచుండు

గే॥ అదియు సాధ్యము కాకయుండిన
అచంచల మానసముతో
ఫలముకోరక సర్వకర్మలు
సలిపి పొందుము సిద్దిని
అని కిరీటికి ॥శ్రీహరిని

12) శ్లో॥ శ్రేయోహిజ్ఞాన మభ్యాసాత్
జ్ఞానాద్ధ్యానం విశిష్యతే
ధ్యానాత్కర్మ ఫలత్యాగ
స్త్యాగాచ్ఛాంతి రనంతరం

ప.వి. శ్రేయః, హి, జ్ఞానం, అభ్యాసాత్, జ్ఞానాత్, ధ్యానం, విశిష్యతే, ధ్యానాత్, కర్మఫలత్యాగః, త్యాగాత్, శాంతిః, అనంతరం

టీ॥ అభ్యాసాత్ - అభ్యాసయోగమునకంటె, జ్ఞానం - జ్ఞానము, శ్రేయోహి - శ్రేష్ఠమైనదిగదా?, జ్ఞానాత్ - జ్ఞానముకంటే, ధ్యానం-ధ్యానము, విశిష్యతే-శ్రేష్ఠమగుచున్నది. ధ్యానాత్-ధ్యానమునకంటే, కర్మఫలత్యాగః-కర్మఫలపరిత్యాగమును, త్యాగాత్-త్యాగమునకంటే, అనంతరం-అపిమ్మట శాంతిః-శాంతి (శ్రేష్ఠమైనది) స్యాత్-అగును

గ॥ అర్జునా అభ్యాసమునకంటె, జ్ఞానము శ్రేష్ఠము, జ్ఞానమునకన్న ధ్యానము శ్రేష్ఠము, ధ్యానముకన్న కర్మఫలత్యాగము శ్రేష్ఠము,

త్యాగమునకంటే, పిమ్మట శాంతి శ్రేష్ఠము. (కర్మఫలత్యాగమువలన సంసారముడుగుట సంభవించును. దానివలన సిద్ధిని పొందవీలగుసు).

ప॥తే॥ మిన్న జ్ఞానమభ్యాసము-కన్న, మిన్న
ధ్యానమేజ్ఞానమునకన్న-ధ్యానమునకు
మిన్న ఫలము వదలుటయే-మిన్న యగును
త్యాగమునకన్న, శాంతియే-యగునుపిదప

గే॥ అభ్యాసమునకన్న శ్రేష్ఠము
నగును జ్ఞానము భారతా
ధ్యానము శ్రేష్ఠము దానికన్న
దానికన్నను శ్రేష్ఠమౌ
సలుపత్యాగము, కర్మఫలమును
శాంతిశ్రేష్ఠము పిమ్మట॥
అని కిరీటికి ॥శ్రీహరిని॥

13) శ్లో॥ అద్వేష్టా సర్వభూతానాం
మైత్రః కరుణయేవచ
నిర్మమో నిరహంకార
సమ దుఃఖసుఖః క్షమీ

ప.వి. అద్వేష్టా, సర్వభూతానాం, మైత్రః, కరుణః, ఏవ, చ, నిర్మమః, నిరహంకారః, సమదుఃఖసుఖః, క్షమీ.

టీ॥ సర్వభూతానాం-సమస్తప్రాణులకు, అద్వేష్టా - ద్వేషిగాని వాడును, మైత్రః-మిత్రుడును, కరుణః-దయగలవాడును, నిర్మమః-

మమకారములేనివాడును, నిరహంకారః-అహంకారములేనివాడును, సమదుఃఖసుఖః-సుఖదుఃఖములయందు సమబుద్ధిగలవాడును, క్షమీ-ఓర్పుగలవాడును.

గ॥ అర్జునా సమస్త భూతములను ద్వేషింపనివాడును, మిత్రుడును, దయగలవాడును, మమకారములేనివాడును, అహంకారములేనివాడును, సుఖదుఃఖములయందు సమబుద్ధిగలవాడును, ఓర్పుగలవాడును

ప॥తే॥ వైరమేలేనివాడెల్ల-ప్రాణులందు
మైత్రి, దయ, క్షమగలవాడు-మమత, లేని
వాడు, గర్వంబులేనట్టి-వాడు, సామ్య
బుద్ధి సుఖదుఃఖములయందు-పొందువాడు

గే॥ ఎల్ల ప్రాణులయందు దయయును
యెల్లప్రాణికి మిత్రుడుఁగా
లేక మమకారంబు, గర్వము,
లేనివాడై వైరముఁగా,
సుఖముదుఃఖము సమానముగా
చూచి, క్షమగలవాడునుఁగా
అని కిరీటికి ॥శ్రీహరిని

14) శ్లో॥ సంతుష్టః సతతంయోగీ
యతాత్మా దృఢనిశ్చయః
మయ్యర్పిత మనోబుద్ధి
ర్యోమద్భక్తః సమేప్రియః

ప.వి. సంతుష్టః, సతతం, యోగీ, యతాత్మా, దృఢనిశ్చయః, మయి, అర్పితమనోబుద్ధిః, యః, మద్భక్తః, సః, మే, ప్రియః

టీ॥ సతతం-యెల్లప్పుడును, సంతుష్టః-సంతోషముగలవాడును, యోగీ-ధ్యానపరుడును, యతాత్మా-నిగ్రహించిన మనస్సుగలవాడును, దృఢనిశ్చయః - దృఢసంకల్పముగలవాడును, మయి - నాయందు, అర్పితమనోబుద్ధిః - నిలిపిన మనస్సు బుద్ధిగలవాడును, మద్భక్తః-నా భక్తుడును, యః-ఎవడో, సః-వాడు, మే-నాకు, ప్రియః-ఇష్టుడు.

గ॥ అర్జునా యెల్లప్పుడును, సంతోషము పొందియుండువాడును ధ్యానపరుండును, నిగ్రహించిన మనస్సుగలవాడును, దృఢసంకల్పము గలవాడును, నాయందుంచబడిన మనోబుదులు కలవాడును నాభక్తు డెవడో వాడు నాకుయిష్టుడు

ప॥తే॥ నిత్యసంతోషి, మనసును-నిగ్రహించు
వాడు, ధ్యానపరుండై న-వాడు, సంది
యంబులేనట్టివాడు, నా-యందు బుద్ధి
మనసునుకలిగి, నాభక్తు-డై నవాడు
నిష్టుడౌ నాకు మిక్కి-లి-యెల్ల వేళ

గే॥ చంచలంబగు మనసులేకను
సంతసంబున నుండుచు॥
లేనివాడై సంశయంబును
లేశమైన మనస్సులో ॥అని॥
కలిగినాపై మనసు బుద్ధియు
కలిగియుండిన భక్తియు॥

వాడె యిష్టుడు నాకు మిక్కిలి
వాడె శ్రేష్టుడు భారతా
అని కరీటికి ॥శ్రీహరిని

15) శ్లో॥ యస్మాన్నోద్విజతేలోకో
లోకాన్నోద్విజతేచయః
హర్షామర్ష భయోద్వేగై
ర్ముక్తోయః సచమేప్రియః

ప.వి. యస్మాత్, న, ఉద్విజతే, లోకః, లోకాత్, న, ఉద్విజతే, చ, యః, హర్షామర్షభయోద్వేగైః, ముక్తః, యః, సః, చ, మే, ప్రియః

టీ॥ యస్మాత్-యెవనివలన, లోకః-జనులు, నోద్విజతే-భయపడరో, యః-ఎవ్వడు, లోకాత్-జనములవలన, నోద్విజతే - భయపడడో, యః-యెవ్వడు, హర్షామర్షభద్వేయోగైః-హర్ష-ప్రీతిచేతను, అమర్షః-అసహిష్ణుత్వముచేతను, భయః-భయముచేతను, ఉద్వేగైః-ఉద్వేగముచేతను, ముక్తః-విడువబడినవాడో, సచ-వాడును, మే-నాకు, ప్రియః-యిష్టుడు

గ॥ అర్జునా యెవనివలన జనులకు భయములేదో, సమస్త జనములవలన, యెవనికి భయములేదో, సంతోషము, క్రోధము, భయము, తొందర వీని కెవ్వడతీతుడై యుండునో అట్టి వాడు నాకు మిక్కిలి యిష్టుడు

ప॥తే॥ ఎల్ల జనులకు నెవనిచే-నెట్టి భయము
కలుగదో, యెల్ల జనముల-వలన, నెవడు
భయముచెందడో, హర్షము-భయము, క్రోధ
ములకు, మానసవ్యాకుల-ములకు, విడువ
బడిన, వాడిష్టుడగు నాకు-పార్థమిగుల

గే॥ ఎల్ల జనము లెవ్వానివలన
యెవ్వడెల్ల జనంబుచే
యెంత మాత్రము భయముపొందడో
యెవడు సంతోషమునకుఁ
అసూయకును భయంబునకునూ
అతీతుడై యుండునో
వాడె యిష్టుడు నాకు మిక్కిలి
వాడె శ్రేష్టుడు ఫల్గునా
అని కిరీటికి ॥శ్రీహరిని

16) శ్లో॥ అనపేక్షః శుచిర్దక్ష
ఉదాసీనో గతవ్యథః
సర్వారంభ పరిత్యాగీ
యోమద్భక్తః సమేప్రియః..

ప.వి. అనపేక్షః, శుచిః, దక్షః, ఉదాసీనః, గతవ్యథః. సర్వా
రంభపరిత్యాగీ, యః, మద్భక్తః, సః, మే, ప్రియః

టీ॥ అనపేక్షః-కోరికలేనివాడును, శుచిః-పరిశుద్ధుడును, దక్షః-సమర్థుడును, ఉదాసీనః-నిర్లిప్తుడును, గతవ్యథః-విచారరహితుడును, సర్వారంభపరిత్యాగీ - సకలకార్యములు విడిచినవాడును, మద్భక్తః-నాకు భక్తుడును, యః-ఎవ్వడో, సః-వాడు, మే - నాకు, ప్రియః-యిష్టుడు ...

గ॥ అర్జునా కోరికలులేనివాడును, పరిశుద్ధుడును, నిర్లిప్తుడును వ్యథలులేనివాడును, స క ల కర్మములను వదలినవాడును నా భక్తుడెవ్వడో, వాడు నాకు మిక్కిలి ప్రియుడు ...

ప॥తే॥ వాంఛ లించుకలేనట్టి-వాడు, శుచియు
పక్షపాతంబులేకున్న-వాడు, శక్తి
శాలి, వ్యథలేనివాడును-సకల కార్య
ములను వదలినవాడును-ముఖ్య భక్తు
డైన వాడిష్టుడగు నాకు-ఘనుడు పార్థ

గే॥ పక్షపాతము, భయములేకను
దక్షత శుచిగలవాడుగా
కోరికలు వ్యథలేని వాడును
కొలువనన్నే భక్తుడై
ఆతడిష్టుడు నాకు మిక్కిలి
అతడె శ్రేష్ఠుడు భారతా
అని కిరీటికి ॥శ్రీహరిని

17) శ్లో॥ యోనహృష్యతి నద్వేష్టి
నశోచతి నకాంక్షతి

శుభాశుభ పరిత్యాగీ
భక్తిమాన్యః సమేప్రియః. .

ప.వి. యః, న, హృష్యతి, న, ద్వేష్టి, న, శోచతి, న, కాంక్షతి, శుభాశుభపరిత్యాగీ, భక్తిమాన్, యః, సః, మే, ప్రియః.

టీ॥ యః-ఎవ్వడు, నహృష్యతి-సంతోషింపడో, నద్వేష్టి-ద్వేషింపడో, నశోచతి - దుఃఖింపడో, నకాంక్షతిః - అపేక్షింపడో, యః - ఎవడు, శుభాశుభపరిత్యాగీ - శుభాశుభములను పరిత్యజించినవాడో, భక్తిమాన్ - భక్తిగలిగినవాడో, సః - వాడు, మే - నాకు, ప్రియః-యిష్టుడు.

గ॥ అర్జునా యెవడు సంతోషమునకును, ద్వేషమునకును, దుఃఖమునకును, ఆశకును. శుభాశుభముల కతీతుడై, నాయందుభక్తి గలిగినవాడై, యుండునో, అట్టివాడు నాకు మిక్కిలి ప్రియుడు

ప॥తే॥ నందమొందక, దుఃఖంబు-పొందకుండ,
వైరమొందక, యేదియు-కోరకుండ,
వదలి శుభ, మశుభములను-భక్తిగలిగి
యెవడు నాయందు, సేవించు-నెల్ల వేళ
లట్టి భక్తుండునాకగు-నమితప్రియుడు

గే॥ ఎవడు సంతోషింపకుండునో
యెవడు ద్వేషంబుంచడో
యెవ్వడా కాక్షింపకుండునో
యెవడు దుఃఖము పొందడో ॥అని॥

విడిచి పుణ్యము పాపకర్మలు
విడిచి యాశలన్నిటిఁ
భక్తిగలిగినవాడు ప్రియుడగు
బహువిధంబుల శ్రేష్ఠుడుఁ
అని కిరీటికి　　॥శ్రీహరిని

18) శ్లో॥　సమః, శత్రౌ చ మిత్రేచ
తథా మానావ మానయోః
శీతోష్ణ సుఖదుఃఖేషు
సమః సంగవివర్జితః....

ప.వి. సమః, శత్రౌ, చ, మిత్రే, చ, తథా, మానావమానయోః, శీతోష్ణసుఖదుఃఖేషు, సమః, సంగవివర్జితః

టీ॥ శత్రౌచ-శత్రువునందును. మిత్రేచ-స్నేహితునియందును, తథా-అట్లే, మానావమానయోః-మానావమానములయందును, సమః-సమానుడైనవాడును, శీతోష్ణసుఖదుఃఖేషు-శీతము, ఉష్ణము, సుఖము. దుఃఖములయందును, సమః - సముడైనవాడును, సంగవివర్జితః - సంగములేనివాడును .

గ॥ అర్జునా శత్రు, మిత్రులయందును, మానావమానముల యందును, శీతోష్ణములయందును, సుఖదుఃఖములయందును, సమ బుద్ధిగలవాడై, సంగరహితుడైనవాడును .

ప॥తే॥　శత్రుమిత్రులయందును-సామ్యబుద్ధి
మాన, మవమానములలో, స-మాన బుద్ధి
సౌఖ్యమందున, దుఃఖంబు-చలియు, నుష్ణ
ముల, సమానుడగుచు, సంగ-ములను వదలు
వాడు, నాభక్తుడిష్టుడు-పార్థ నాకు

గే॥ శత్రుమిత్రుల శీతోష్ణముల
సమముగా సుఖ, దుఃఖముల్
సమముమాన, మవమానంబుల
స్వాంతమందు దలంచుచుణ్
జనసంగమును వదలువాడును
చాల యిష్టుడు నాకగుణ్
అని కిరీటికి ॥శ్రీహరిని

19) శ్లో॥ తుల్యనిందాస్తుతి ర్మౌనీ
సంతుష్టో యేనకేనచిత్
అనికేతః స్థిర మతి
భక్తిమాణ్ మే ప్రియోనరః ...

ప.వి. తుల్యనిందాస్తుతిః, మౌనీ, సంతుష్టః, యేన, కేనచిత్, అనికేతః, స్థిరమతిః, భక్తిమాణ్, మే, ప్రియః, నరః

టీ॥ తుల్యనిందాస్తుతిః-నిందాస్తుతులయందు సమానుడును, మౌనీ - మౌనముదాల్చినవాడును, యేనకేనచిత్ - యేమాత్రముచేతనైనను, సంతుష్టః-తృప్తిబొందువాడును, అనికేతనః-నివాసరహితుడును, స్థిరమతిః-నిశ్చయబుద్ధిగలవాడును, భక్తిమాణ్ - నాయందు భక్తిగలవాడును, యోనరః-ఏ పురుషుడో, సః - వాడు, మే-నాకు, ప్రియః-యిష్టుడు

గ॥ అర్జునా నిందాస్తుతులయందు, సమానుడై, మౌనమును, దాల్చినవాడునై, లభించినదానితో తృప్తినిబొందువాడు, నివాసరహితుడు, నిశ్చలమైన బుద్ధిగలవాడై, నాయందు భక్తిగలిగినవాడు, నాకు మిక్కిలి ప్రియుడు ...

ప॥తే॥　స్తోత్రమును, నింద, సమముగా-జూచుచుండి
మౌనమును, లభ్యమైనట్టి-దాన తృప్తి
డగుచు, స్థిరబుద్ధిగలవాడు-నగుచు, గేహ
శూన్యుడిష్టుడు నాకగు-శూరవర్య

గే॥　నిందాస్తుతులయందు సముడై
నిశ్చయంబగు బుద్ధియుఁ
కలిగి, నాపై భక్తి సతతము
కలిగియుండిన వాడునుఁ
పొంది మౌనము, దొరకినదాన
పొందువాడును, తృప్తినిఁ
లేనివాడు నివాసమెక్కడ
వాని, నేప్రేమించెదఁ
అని కిరీటికి　॥శ్రీహరిని

20) శ్లో॥　యేతు ధర్మ్యామృత మిదం
యథోక్తం పర్యుపాసతే
శ్రద్దధానా మత్పరమా
భక్తాస్తేఽతీవ మే ప్రియాః.

ప.వి. యే, తు, ధర్మ్యమృతం, ఇదం, యథా, ఉక్తం, పర్యుపాసతే. శ్రద్దధానాః. మత్పరమాః, భక్తాః, తే, అతీవ, మే, ప్రియః

టీ॥ యేతు - యెవరు, శ్రద్దధానాః - శ్రద్ధగలవారును, మత్పరమాః-నాయందాసక్తిగలవారునునై, యథా + ఉక్తం-పైనిచెప్పబడిన ఇదం-ఈ, ధర్మ్యామృతం - ధర్మస్వరూపమైన అమృతమును, పర్యుపాసతే-సేవించుచున్నారో, తే-ఆ, భక్తాః-భక్తులు, మే-నాకు, అతీవ ప్రియాః-మిక్కిలి యిష్టులు

గ॥ అర్జునా యెవరు శ్రద్ధావంతులై, నాయందాసక్తిగలవారై, పైచెప్పబడిన, యీధర్మ స్వరూపమైన అమృత వాక్యములను నమ్మి అనుసరించు భక్తుడు నాకు మిక్కిలి ప్రియుడు.

ప॥తే॥ శ్రద్ధగలవాడు, నాయందు-సక్తుడైన
వాడు, ధర్మ్యామృతమగునీ-వాక్య మెవ్వ
డనుసరించుచునుండునో-యనుదినంబు
అట్టి భక్తుడునాకగు-నమిత ప్రియుడు

గే॥ శ్రద్ధగలిగిన వారలగుచును
సక్తులై నాయందునే
యీధర్మ్యామృత వాక్యములను
యెవరు నమ్మినవారలై
నడుచువారే నాకు భక్తులు
నాకు మిక్కిలి యిష్టులుగా
అని కిరీటికి ॥శ్రీహరిని

గ॥ ఇది శ్రీ కవిరత్న రత్నాకరము వెంకటేశ్వర కవి విరచితమై గద్య పద్య గేయరూపంబును, శ్రీ కృష్ణార్జునుల సంవాదంబగు, శ్రీ భగవద్గీతా గద్య పద్య గేయామృతము నందు భక్తియోగమను పండ్రెండవ అధ్యాయము సంపూర్ణము.

హరిః ఓమ్ తత్సత్ హరిః ఓమ్

శాంతిః శాంతిః శాంతిః





అధ్యాయ సంగ్రహము - క్షేత్ర క్షేత్రజ్ఞ విభాగ యోగము

శా॥ క్షేత్రజ్ఞుల్ విభజించి క్షేత్రములలో
సిద్ధాంత భావంబుచే
క్షేత్రంబంచు దలంచి దేహమును, నన్
క్షేత్రజ్ఞుడంచెంచు, మే
మాత్రంబున్ చలనంబులేని మదితో
మత్సేవలం జేసి, నన్
క్షేత్రజ్ఞుంగని, మాయవీడి, కనుమా
శ్రేయంబు నీవర్జునా..

తా॥ అర్జునా దేహములన్నియు క్షేత్రములనియు, నన్ను క్షేత్రజ్ఞుడనియు, సద్గురూపదేశము చేతను, శాస్త్రముల చేతను, క్షేత్ర, క్షేత్రజ్ఞులను, విభజించికనుగొని, ఒకే ఆత్మ సమస్త పదార్థములను, సూర్యునివలె ప్రకాశింపజేయుచున్నదని తెలిసి కొని, నిశ్చయమైన మనస్సున, నను క్షేత్రజ్ఞుని సేవించి, ముక్తుడగుదువని, శ్రీ కృష్ణపరమాత్మ, పార్థునకు బోధించిన క్షేత్ర, క్షేత్రజ్ఞ విభాగయోగమను పదుమూడవ అధ్యాయము, శ్రీ భగవద్గీతా గద్య పద్య గేయామృతమునందు, సంగ్రహ పద్య తాత్పర్యములు.

హరిఃఓమ్ శాంతిః శాంతిః శాంతిః [ 80

అర్జున ఉవాచ

1) శ్లో॥ ప్రకృతిం పురుషంచైవ
క్షేత్రం క్షేత్రజ్ఞమేవచ
ఏతద్వేదితు మిచ్ఛామి
జ్ఞానం జ్ఞేయంచ కేశవ....

ప.వి. ప్రకృతిం, పురుషం, చ, ఏవ, క్షేత్రం, క్షేత్రజ్ఞం, ఏప, చ, ఏతత్, వేదితుం, ఇచ్ఛామి, కేశవ

టీ॥ హేకేశవ-ఓకృష్ణమూర్తీ, ప్రకృతిం-ప్రకృతిని, పురుషం-పురుషుని, క్షేత్రం-క్షేత్రమును, క్షేత్రజ్ఞంచ-క్షేత్రజ్ఞుని, జ్ఞానం-జ్ఞానమును, జ్ఞేయంచ-జ్ఞేయమును, ఏతత్-ఈసమస్తమును, వేదితుం-తెలియుటకొరకు, ఇచ్ఛామి-కోరుచున్నాను

అర్జునుడు చెప్పుచున్నాడు

గ॥ ఓకృష్ణా ప్రకృతియనగా నెయ్యది? పురుషుడనగా నెవరు? క్షేత్రమనగా నేది?, క్షేత్రజ్ఞుడనగా నెవరు?, జ్ఞానమనగా నేమి? వీని నన్నింటిని చక్కగా తెలిసికొనవలెనని కోరుచున్నాను

ప॥తే॥ ఏది క్షేత్రము, క్షేత్రజ్ఞు-డెవడు, పురుషు
డెవడు, జ్ఞానమనగనేది-యేది ప్రకృతి
యేది జ్ఞేయము, శ్రీకృష్ణ-యెరుగజెపుమ
వీని నన్నింటి సంగతి-విశదముగను

గే॥ ఏది ప్రకృతియొ యెవడు పురుషుడో
యేది క్షేత్రమొ తెలుపుమా

యెవరినందురో క్షేత్రజ్ఞుండని
యేది జ్ఞానము జ్ఞేయమో
తెలియుజేయుము శ్రీశ కేశవ
తెల్లముగ నాకంతయు॥

అనుచునడిగెను కృష్ణమూర్తిని - అర్జునుడు రణభూమిలో ॥శ్రీ॥

※ శ్రీ భ గ వా ను వా చ ※

2) శ్లో॥ ఇదం శరీరం కౌంతేయ
క్షేత్ర మిత్యభిధీయతే
ఏతద్యోవేత్తి తం ప్రాహుః
క్షేత్రజ్ఞ ఇతితద్విదః

ప.వి. ఇదం, శరీరం, కౌంతేయ, క్షేత్రం, ఇతి, అభిధీయతే ఏతత్, యః, వేత్తి, తం, ప్రాహుః, క్షేత్రజ్ఞః, ఇతి, తద్విదః.

※ శ్రీ భగవంతుడు చెప్పుచున్నాడు ※

టీ॥ హేకౌంతేయ-ఓయర్జునా, ఇదంశరీరం-ఈదేహము, క్షేత్ర మితి-క్షేత్రమని, అభిధీయతే - చెప్పబడుచున్నది యః - ఎవ్వడు, ఏతత్-ఈశరీరమును, వేత్తి - తెలియుచున్నాడో, తద్విదః-ఆక్షేత్ర వేత్తలు, తం-ఆతెలిసినవానిని, క్షేత్రజ్ఞఇతి-క్షేత్రజ్ఞుడని, ప్రాహుః-చెప్పుదురు

గ॥ అర్జునా ఈదేహమును క్షేత్రమని చెప్పబడుచున్నది. యెవడీ దేహమును తెలిసికొనుచున్నాడో, వానిని క్షేత్రజ్ఞుడని, తత్వజ్ఞులు చెప్పుచున్నారు

ప॥ తే॥ ఈ శరీరము క్షేత్రమం-చెంచబడియె
దీని విషయంబు, సర్వంబు-తెలిసికొన్న
వాని, క్షేత్రజ్ఞుడనినారు-పార్థ, క్షేత్ర
విదులు, సర్వమునుతెలిసి-విశదముగను

గే॥ ఈశరీరము క్షేత్రంబందురు
యెవదు దేహము తెలియునో
వానినందురు క్షేత్రజ్ఞుండని
దానినెరిగిన పెద్దలే
అని కిరీటికి ॥శ్రీహరిని

3) శ్లో॥ క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి
సర్వ క్షేత్రేషు భారత
క్షేత్ర క్షేత్రజ్ఞయోర్ జ్ఞానం
యత్తద్ జ్ఞానం మతం మమ...

ప.వి క్షేత్రజ్ఞం, చ, అపి, మామ్, విద్ధి, సర్వక్షేత్రేషు, భారత, క్షేత్రక్షేత్రజ్ఞయోః, జ్ఞానం, యత్, తత్, జ్ఞానం, మతం, మమ

టీ॥ భారత-ఓయర్జునా, సర్వక్షేత్రషు-సమస్త క్షేత్రములయందు, క్షేత్రజ్ఞంచాపి-క్షేత్రజ్ఞునినిగను, మాం - నన్ను, విద్ధి - తెలియుము, క్షేత్రక్షేత్రజ్ఞయోః-క్షేత్రక్షేత్రజ్ఞులయొక్క, జ్ఞానం - జ్ఞానమని మమ-నాయొక్క, మతం-అభిప్రాయము

గ॥ అర్జునా సమస్త క్షేత్రములయందుండు క్షేత్రజ్ఞుడు నేనేయని తెలిసికొనుము, ఈక్షేత్రక్షేత్రజ్ఞులను విభజించి తెలిసికొనుటయే జ్ఞానమనినా మతము. ..

ప॥తే॥ అన్ని క్షేత్రంబులందు, నం-దధివసించు
చున్న, క్షేత్రజ్ఞుడని నీవు-నన్ను తెలిసి
కొనుము, క్షేత్రక్షేత్రజ్ఞుల-కనుగొనునది
యేదొయదియె, జ్ఞానమనుచు-నెరుగుపార్థ

గే॥ నన్ను తెలియుము క్షేత్రజ్ఞుండని
అన్ని క్షేత్రములందునణా
ఇదియె క్షేత్రము క్షేత్రజ్ఞుండని
యేది తెలుపునొ దానికే
జ్ఞానమనుచును తెలిసికొనుమా
సర్వమును విశదంబుగా
అని కిరీటికి ॥శ్రీహరిని

4) శ్లో॥ తత్ క్షేత్రం యచ్చయాదృక్చ
యద్వికారి యతశ్చయత్
సచయోయత్ప్రభావశ్చ
తత్సమాసేనమే శృణు.

ప.వి. తత్, క్షేత్రం, యత్, చ, యాదృక్, చ, యద్వికారి, యతః, చ, యత్, సః, చ, యః, యత్ప్రభావః, చ, తత్, సమాసేన, మే, శృణు .

టీ॥ భారత-ఓయర్జునా, తత్ క్షేత్రం-ఆక్షేత్రము, యచ్చ-యేదో, యాదృక్చ-యెట్టిదో, యద్వికారి-ఏవికారముగలదో, యతశ్చ - యే కారణమువలన, యత్-ఏదిపుట్టునో, సచ-ఆక్షేత్రజ్ఞుడు. యః-ఎవడో యత్ప్రభావశ్చ-యెట్టి ప్రభావముగలవాడో, తత్ - ఆస్వరూపమును. సమాసేన-సంక్షేపముగాను. మే-నావలన, శృణు-వినుము .

గ॥ అర్జునా ఆక్షేత్రమేదియో, దానియొక్క స్వభావమెట్టిదో, దాని వికారములేవియో, యే కారణమువలన యదిజనించినదో, ఆక్షేత్రజ్ఞుడెట్టివాడో యెట్టి ప్రభావముగలవాడో సంక్షేపముగా చెప్పెద వినుము

ప॥ తే॥ అట్టి క్షేత్రమేదియగునో-యెట్టిదగునో
యేవి దాని వికారముల్-యేల జనన
మందియున్నదో, కారణ-మట్టిదేదో
యెట్టివాడో క్షేత్రజ్ఞుడు-యెట్టి మహిమ
గలుగువాడో సంగ్రహముగ-తెలిపెదవిను

గే॥ ఏది యెట్టిదో యాక్షేత్రంబు
యెందుకై జనియించెనో
యెట్టివాడో క్షేత్రజ్ఞుండు
యెట్టి దతని ప్రభావమో
తెలియజేసెద సంగ్రహముగా
దీని వినుము ధనంజయా

అని కిరీటికి ॥శ్రీహరిని

5) శ్లో॥ ఋషిభిర్బహుధా గీతం
ఛందోభిర్వివిధైః పృథక్
బ్రహ్మసూత్ర పదైశ్చైవ
హేతుమద్భి ర్వినిశ్చితైః ..

ప వి. ఋషిభిః, బహుధా, గీతం, ఛందోభిః, వివిధైః, పృథక్, బ్రహ్మసూత్రపదైః, చ, ఏవ, హేతుమద్భిః, వినిశ్చితైః

టీ॥ ఋషిభిః-ఋషులచేతను, బహువిధా-అనేకవిధములుగాను, పృథక్-ప్రత్యేకముగను, వివిధైః-వివిధములైన, ఛందోభిః - వేదములచేతను, హేతుమద్భిః-సహేతుకములైనవియును, వినిశ్చితైః-సంశయరహితమైనవియును (అగు) బ్రహ్మసూత్రపదైః + చ + ఏవ - బ్రహ్మసూత్ర పదములచేతను, గీతం-చెప్పబడినది

గ॥ అర్జునా యీ క్షేత్ర క్షేత్రజ్ఞుల విషయమునుగురించి, ఋషులవలనను, వేదములవలనను, బహువిధములుగా చెప్పబడి యున్నవి. ఇంతియకాక సంశయమున కాస్పదములేని బ్రహ్మ సూత్రములవలనను, సహేతుకముగ చెప్పబడెను

ప॥తే॥ ఇట్టి విషయమును గురించి-యెల్లఋషులు
వేదములు, బ్రహ్మసూత్రముల్-వివరముగను
బహు ప్రకారములుగ చెప్ప-బడెను పార్థ
అట్టి విషయంబు తెలిపెద-నాలకంపు

గే॥ ఈ క్షేత్ర క్షేత్రజ్ఞుల స్వరూప
మెన్నొ విధముల ఋషులునూ
వేదములచే చెప్పబడియెను
వివిధ విధముల ఫల్గునా
చెప్పబడియె బ్రహ్మసూత్రముల
చేత సహేతుకంబుగా
అని కిరీటికి ॥శ్రీహరిని

6) శ్లో॥ మహాభూతాన్యహంకారో
బుద్ధిరవ్యక్త మేవచ

ఇంద్రియాణి దశైకంచ
పంచచేంద్రియ గోచరాః

ప.వి. మహాభూతాని, అహంకారః, బుద్ధిః, అవ్యక్తం, ఏవ, చ, ఇంద్రియాణి, దశ ఏకం చ, పంచ, చ, ఇంద్రియగోచరాః.

టీ॥ మహాభూతాని-పంచమహాభూతములు, అహంకారః-అహంకారము, బుద్ధిః-బుద్ధి, అవ్యక్తం + ఏవ + చ - మాయయు, దశ యింద్రియాణి - జ్ఞానేంద్రియ, కర్మేంద్రియములు, (పది) ఏకంచ-మనస్సు, ఇంద్రియగోచరాః - యింద్రియవిషయములు, పంచచ - అయిదును

గ॥ అర్జునా పంచమహాభూతములు (పృథివి, జలము అగ్ని, వాయువు, ఆకాశము) అహంకారము, బుద్ధి, మాయయు, జ్ఞానేంద్రియ కర్మేంద్రియములు పదియు (జ్ఞానేంద్రియములు - శ్రోత్ర, త్వక్, చక్షు, జిహ్వా, ఘ్రాణము 5) కర్మేంద్రియములు = వాక్, పాణి, పాద, పాయు, ఉపస్థ 5) మనస్సు, యింద్రియగోచరములుః - శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములను, పంచతన్మాత్రలు, వీనిని 24 తత్వములని సాంఖ్యులందురు.

ప॥తే॥ బుద్ధియును నహంకారము-భూతపంచ
కమును, యాజ్ఞానకర్మేంద్రి-యములుగూడ
మానసంబును మఱియును-మాయయొకటి
శబ్దమాదిగ విషయముల్-సవ్యసాచి

గే॥ మహాభూతము లహంకారము
మనసు బుద్ధియు మాయయుణా
జ్ఞానేంద్రియ కర్మేంద్రియములు
శబ్దాది తన్మాత్రలుణా
అని కిరీటికి ॥శ్రీహరిని

7) శ్లో॥ ఇచ్ఛా ద్వేషః సుఖందుఃఖం
సంఘాతశ్చేతనా ధృతిః
ఏతత్ క్షేత్రం సమాసేన
సవికారముదా హృతమ్

ప.వి. ఇచ్ఛా, ద్వేషః, సుఖమ్, దుఃఖమ్, సంఘాతః, చేతనా ధృతిః, ఏతత్, క్షేత్రం, సమాసేన, సవికారం, ఉదాహృతమ్

టీ॥ ఇచ్ఛా-కోరిక, ద్వేషః-ద్వేషము, సుఖం-సుఖము, దుఃఖం-దుఃఖము, సంఘాతః-సమూహము, చేతనా-తెలివి- ధృతిః-ధైర్యము ఏతత్-ఇది, క్షేత్రం-క్షేత్రమని, సమాసేన-సంక్షేపముగాను, సవికారం-వికారములతో సహితముగ, ఉదాహృతం - చెప్పబడినది

గ॥ అర్జునా కోరిక, ద్వేషము, సుఖము. దుఃఖము, దేహేంద్రియాది సమూహము, తెలివి, ధైర్యము, అను వికారములతోగూడిన దీనిని క్షేత్రమని సంగ్రహముగా చెప్పబడును

ప॥ తే॥ ధీరత, సుఖము, దుఃఖము,-కోరికయును,
దేహ, మింద్రియాదిగణము-తెలివి, యను, వి
కారములచేత గూడిన-కారణమున
చెప్పిరిదియె సంగ్రహముగ-క్షేత్రమనుచు

గే॥ కోరిక ద్వేషము సుఖదుఃఖములు
ధీరతయను వానితో
దేహేంద్రియాది సమూహమును
తెలివితోడను చేరియున్

ఈవికారములచే గూడిన
దిదియె క్షేత్రము ఫల్గునా.
అని కిరీటికి ॥శ్రీహరిని

8) శ్లో॥ అమానిత్వమ దంభిత్వ
మహింసాక్షాంతి రార్జవమ్
ఆచార్యోపాసనం శౌచం
స్థైర్యమాత్మ వినిగ్రహః

ప.వి. అమానిత్వం, అదంభిత్వం, అహింసా, క్షాంతిః, ఆర్జవం, ఆచార్యోపాసనం, శౌచం, స్థైర్యం, ఆత్మవినిగ్రహః

టీ॥ అమానిత్వం - అభిమానరాహిత్యమును, అదంభిత్వం-కపటములేకయుండుట, అహింసా-హింసచేయకుండుట, క్షాంతిః - ఓర్పు, ఆర్జవం-మంచినడత, ఆచార్యోపాసనం - గురుసేవయు, శౌచం - శుచిత్వము, స్థైర్యం-స్థిరభావము, ఆత్మవినిగ్రహః-మనోనిగ్రహంబును.

గ॥ అర్జునా అభిమానములేకయుండుట, కపటములేకయుండుట. హింసచేయకుండుట. ఓర్పు, మంచినడత, గురుసేవ. శుచిత్వము, చలనములేకయుండుట. మనోనిగ్రహము

ప॥తే॥ లేక యభిమాన గర్వముల్-లేశమైన
కలిగియుండుటయు, నహింస-కలిగియోర్పు
మనసు నిగ్రహించుటయును-మంచి నడత
శౌచమును, గురుసేవయు-స్థైర్యగుణము.

గే॥ గర్వ మభిమానములులేకను
కలిగియోరి మహింసయుఁ
ఆచార్యుని సేవయు, స్థైర్యము
ఆత్మ నిగ్రహ, శౌచముఁ
అని కిరీటికి ॥శ్రీహరిని

9) శ్లో॥ ఇంద్రియార్థేషు వైరాగ్య
మనహంకార ఏవచ
జన్మమృత్యు జరావ్యాధి
దుఃఖదోషాను దర్శనమ్ .

ప.వి. ఇంద్రియార్థేషు. వైరాగ్యం. అనహంకారః. ఏవచ. జన్మ మృత్యుజరావ్యాధి దుఃఖదోషానుదర్శనమ్

టీ॥ ఇంద్రియార్థేషు - విషయములయందు. వైరాగ్యం - విరక్తి. అనహంకారయేవచ-అహంకారములేకయుండుట, జన్మమృత్యు జరావ్యాధిదుఃఖదోషానుదర్శనం-జన్మ-జననము. మృత్యు-మరణము. జరా-ముదిమి వ్యాధి-రోగము. దుఃఖ-దుఃఖము. దోష-దోషము లను. అనుదర్శనమ్-తెలిసికొనుట

గ॥ అర్జునా యింద్రియ విషయములందాశలేక యుండుట. అహంకారములేకయుండుట. జననము. మరణము. ముదిమి. రోగ ములవలనకలిగెడి దుఃఖదోషములను తెలిసికొనుట

ప॥తే॥ విషయములయందు కోరిక-విడుచుటయును
లేకయుండు, టహంకృతి-లేశమైన
జరయు, మరణము, దుఃఖము-జన్మ, రోగ
ములను, వీనిదోషంబులు-తెలిసికొనుట..

గే॥ ఆశలేకను విషయములపై
అహంకృతి సంశూన్యుడై
జన్మ, మరణము, రోగ, జాలము
జరయు దుఃఖము తెలియుటఁ
అని కిరీటిక ॥శ్రీహరివి

10) శ్లో॥ అసక్తిరన భిష్వంగః
పుత్రదార గృహాదిషు
నిత్యంచ సమచిత్తత్వ
మిష్టానిష్టోప పత్తిషు...

ప వి. అసక్తిః, అనభిష్వంగః, పుత్రదారగృహాదిషు, నిత్యం, చ, సమచిత్తత్వం, ఇష్టానిష్టోపపత్తిషు,

టీ॥ పుత్రదారగృహాదిషు-సుతుడు, భార్య, గృహము, మొదలగు వానియందు, అసక్తిః-అసక్తి లేకయుండుట, అనభిష్వంగః-ప్రీతి లేకయుండుట, ఇష్టానిష్టోపపత్తిషు,-ఇష్టము, అనిష్టము కలుగునప్పుడు, నిత్యం-యెల్లప్పుడును, సమచిత్తత్వం-సమబుద్ధి కలిగియుండుట

గ॥ సుతుడు, భార్య, గృహము, మొదలగువానియందు, కోరిక లేకయుండుట, మమకారములేకయుండుట, శుభాశుభములయందెల్లప్పుడును సమబుద్ధి కలిగియుండుట

ప॥తే॥ సతిసుతుల మందిరములపై-సక్తిమాని
శుభము సంప్రాప్తమైన, య-శుభమొదవిన
యేల్లకాలంబులందున-యేకరీతి
సామ్య బుద్ధినిగలుగుట-సవ్యసాచి

గే॥ పుత్రదారా గృహాదులపై
పొందకుండుటా సక్తినిజ
అశుభ, శుభముల, యందు సామ్యము
అన్నివేళల యుండుటజ
అని కిరీటికి ॥శ్రీహరిని

11) శ్లో॥ మయిచానన్య యోగేన
భక్తి రవ్యభిచారిణీ
వివిక్తదేశసేవిత్వ
మరతిర్జన సంసది

ప.వి మయి, చ, అనన్యయోగేన, భక్తిః, అవ్యభిచారిణీ, వివిక్తదేశసేవిత్వం, అరతిః, జనసంసది

టీ॥ మయి-నాయందు, అనన్యయోగేన-ఏకాంతయోగముచేతను, అవ్యభిచారిణీ - చలింపనటువంటి భక్తి + చ-భక్తియును, వివిక్తదేశసేవిత్వం-ఏకాంతస్థల నివాసము, జనసంసది-జనసమూహమునందు అరతిః-అనురాగములేకయుండుట

గ॥ అర్జునా నాయందేకాగ్రబుద్ధితో, చలింపనటువంటి భక్తి గిలిగియుండుట, యేకాంత ప్రదేశమందుండుట జనసమూహముల యందు ప్రీతిలేకుండుట

ప॥తే॥ అన్యచింతలు లేనట్టి-యచలమైన
భక్తి, యేకాంతయోగంబు-బడయుటయును
నిర్జన నివాసమందున-నిలిచియుంట
ప్రజల సంఘంబుపై రక్తి-వదులుటయును

గే॥ అన్యచింతలులేక యుండియు
అచంచలమగు భక్తిచే
నన్ను నమ్మి నిరంతరంబును
ననుగొలిచి యేకాకియై
జనసమూహములందు నెప్పుడు
సంగమును విడనాడుచున్
అని కిరీటికి ॥ శ్రీహరిని॥

12) శ్లో॥ అధ్యాత్మజ్ఞాన నిత్యత్వం
తత్వజ్ఞానార్థ దర్శనం
ఏతజ్జ్ఞాన మితిప్రోక్త
మజ్ఞానంయదతోఽన్యథా

ప.చి అధ్యాత్మజ్ఞాననిత్యత్వం, తత్వజ్ఞానార్థదర్శనమ్ ఏతత్, జ్ఞానం, ఇతి, ప్రోక్తం, అజ్ఞానమ్ యత్ అతః, అన్యథా

టీ॥ అధ్యాత్మజ్ఞాననిత్యత్వం - పరమాత్మ స్వరూప జ్ఞానమందు మనస్సునెప్పుడు నిలుపుట, తత్వజ్ఞానార్థదర్శనం - మోక్షజ్ఞానమందు ప్రయోజన దృష్టియు, ఏతత్-ఇది యంతయు జ్ఞానమితి-జ్ఞానమని, ప్రోక్తః-చెప్పబడెను. అతః-దీనికంటె అన్యథా-ఇతరమైనది, యత్-యేది కలదో, తత్-అది, అజ్ఞానం-అజ్ఞానమని, ప్రోక్తం-చెప్పబడెను,

గ॥ అర్జునా పరమాత్మ జ్ఞానమునందు మనస్సు నెల్లప్పుడు నిలుపుట, మోక్షప్రాప్తియందే, ప్రయోజనదృష్టి యుంచుట వీని నన్నింటిని జ్ఞానమని పెద్దలు చెప్పుదురు. వీనికంటె నితరములన్నియు అజ్ఞానమని చెప్పబడును .

వ॥తే॥ ఆత్మసంబంధ జ్ఞానంబు-నందు కోర్కె-
మోక్షసంప్రాప్తి జ్ఞానంబు-పొందు నాశ
ననిరి వీనినన్నిటి జ్ఞాన-మనుచు బుధులు
అన్యమైనట్టి, వజ్ఞాన-మనిరి, పార్థ

గీ॥ ఆత్మపై మనసుంచి యుండుట
ఆత్మగోరుట ముక్తినే
అనిరి వీనిని జ్ఞాన మనచును
కాని వజ్ఞానంబులే
అని కిరీటికి ॥శ్రీహరిని

13) శ్లో॥ జ్ఞేయంయత్తత్ప్రవక్ష్యామి
యజ్ఞాత్వాఽమృతమశ్నుతే
అనాది మత్పరం బ్రహ్మ
నసత్తన్నాస దుచ్యతే...

ప.వి. జ్ఞేయం యత్. తత్. ప్రవక్ష్యామి. యత్. జ్ఞాత్వా. అమృతం. అశ్నుతే. అనాదిమత్. పరం. బ్రహ్మ. న. సత్. తత్. న. అసత్. ఉచ్యతే.

టీ॥ జ్ఞేయం-తెలియదగినది. యత్-యేదియో. యత్-దేనిని, జ్ఞాత్వా-తెలసికొని, అమృతం-మోక్షము, అశ్నుతే-పొందుచున్నాడో, తత్-దానిని. ప్రవక్ష్యామి-చెప్పుచున్నాను, అనాదిమత్ - ఆదిలేని దియగు, తత్పరంబ్రహ్మ-నిరతిశయమైన ఆ బ్రహ్మము. సత్-సత్తు అని, అసత్-అసత్తని, న + ఉచ్యతే-చెప్పబడదు

గ॥ అర్జునా దేనిని తెలిసికొనుటవలన మోక్షమును పొందు చున్నాడో దానిని చెప్పుచున్నాను ఏది ఆదిలేని పరబ్రహ్మమో, యేది సత్తనికాని, అసత్తనికాని చెప్పబడదో, ఆ జ్ఞేయమును చెప్పెద వినుము

ప॥తే॥ మోక్షమేది తెలిసినచో-పొందగలడొ
ఆదిలేని పరబ్రహ్మ-మేదియగునొ
చెప్పబడదే దసత్తని,-చెప్పబడదొ
సత్తనుచునట్టి జ్ఞేయంబు,-సవ్యసాచి
తెలియ జేసెద వినుమయ్య-తెల్లముగను. .

గే॥ ఏ, దసత్తని చెప్పబడదో
యేది సత్తని పలుకరో
ఆదిలేని, యాపరబ్రహ్మం
బేదియగునో దానినీ
యేదితెలిసిన ముక్తిగలునో
యది వచించెద భారతా
అని కిరీటికి ॥శ్రీహరిని

14) శ్లో ॥ సర్వతః పాణిపాదంత
త్సర్వతోఽక్షి శిరోముఖం
సర్వతః శ్రుతిమల్లోకే
సర్వమా వృత్యతిష్ఠతి.

ప.వి. సర్వతః, పాణిపాదం, తత్, సర్వతోఽక్షిశిరోముఖం, సర్వతఃశ్రుతిమత్, లోకే, సర్వం, ఆవృత్య, తిష్ఠతి .

టీ॥ తత్ - ఆ బ్రహ్మము. సర్వతః-అంతటను. పాణిపాదం-హస్తపాదములు కలిగినదియై, సర్వతః-అంతటను, అక్షిశిరోముఖం-కన్నులు, నోరులు, గలిగినదియై, సర్వతఃశ్రుతిమత్-అంతటను చెవులు గలదియై, సర్వం - సమస్తమును. అవృత్య-వ్యాపించి, లోకే_లోక మందు, తిష్ఠతి-ఉండును

గ॥ అర్జునా అట్టి బ్రహ్మము. అన్ని దిశలయందును, చేతులు, పాదములు, కన్నులు, తలలు, ముఖములు, చెవులు, కలిగినదై, సమస్త ప్రపంచమును, వ్యాపించియున్నది

ప॥తే॥ అట్టి బ్రహ్మము ఫల్గునా-యన్నిదిశల
కాళ్లు, ముఖములు, శిరసులు,-కనులు, చెవులు,
కలిగియుండిన దగుచును-వెలుగుచుండి
వ్యాప్తి బొందుచు జగమంత,-వరలుచుండు

గే॥ అట్టి బ్రహ్మముయెల్ల దిక్కుల
యంతటను వ్యాపించుచు
కలిగి శిరములు, చెవులు, చేతులు,
కాళ్లు, కన్నులు, పాదముల్
అన్ని జగముల నిండియున్నది
అమితమగు తేజంబుతో

అని కిరీటికి ॥శ్రీహరిని

15) శ్లో॥ సర్వేంద్రియ గుణాభాసం
సర్వేంద్రియ వివర్జితం

అసక్తం సర్వభృచ్చైవ
నిర్గుణం గుణభోక్తృచ...

ప.వి సర్వేంద్రియగుణాభాసం. సర్వేంద్రియవివర్జితం. అసక్తం, సర్వభృత్. చ. ఏవ. నిర్గుణం, గుణభోక్తృ చ

టీ॥ తత్-ఆబ్రహ్మము, సర్వేంద్రియగుణాభాసం - సకలేంద్రియ ములయొక్క గుణములను ప్రకాశింపజేయునదియును, సర్వేంద్రియ వివర్జితం - యే యింద్రియములు లేనిదియును, అసక్తం - సంగము లేనిదియును, సర్వభృత్ + చ + ఏవ-సకలమును భరించునదియును, నిర్గుణం-గుణములు లేనిదియును, గుణభోక్తృ + చ - గుణము లను భవించునట్లు తోచుచున్నదియు

గ॥ అర్జునా ఆబ్రహ్మము సకలేంద్రియములయొక్క గుణము లను ప్రకాశింపజేయునదియును, యే యింద్రియముల సంబంధము లేని దియును, సంగము లేనిదియును, సకలమును భరించునదియును, గుణములు లేనిదయ్యును, గుణములనుభవించుచట్లు తోచుచున్నది.

ప॥తే॥ ఇంద్రియంబులులేకుండి-యేవియేని
వెలుగజేయు నింద్రియగుణ-ములను పార్థ
సర్వము భరించుచుండు, నా-సక్తిలేక
భోక్తయైనను, గుణముల-హొందువదులు

గే॥ ఇంద్రియ వ్యాపారములచే
యీబ్రహ్మము ప్రకాశించు
దానివలె కనబడుచుండియు
వానికూడిక లేనిదొ ॥శ్రీహరిసి

త్రిగుణాత్మికము కానిదయ్యును
త్రిగుణములు కుడుచునదిగా
కనబడుచున్నదీ బ్రహ్మంబు
కాని కూడికలేనిదౌ
అని కిరీటికి ॥శ్రీహరిని

16) శ్లో॥ బహిరంతశ్చ భూతానా
మచరంచర మేవచ
సూక్ష్మత్వాత్త దవిజ్ఞేయం
దూరస్థంచాంతి కేచతత్....

ప వి బహిః, అంతః, చ, భూతానాం, అచరమ్, చరం, ఏవ, చ, సూక్ష్మత్వాత్, తత్, అవిజ్ఞేయం, దూరస్థం, చ, అంతికే, చ, తత్

టీ॥ తత్-ఆబ్రహ్మము, భూతానాం-ప్రాణులయొక్క, అంతశ్చ-లోపలను, బహిశ్చ-వెలుపలను, అచరం-చరింపనిదియు, చరంచ-కదలునదియు, సూక్ష్మత్వాత్-సూక్ష్మత్వము వలన, తత్-అది, అవిజ్ఞేయం-తెలియ నశక్యమైనదిగాను, దూరస్థం-దూరమందున్నదియును, అంతికే + చ-దగ్గరగా నున్నదియునునై యున్నది

గ॥ అర్జునా ఆ బ్రహ్మము ప్రాణులయొక్క లోపలను బయట నుండునదియును, చరింపనిదియు, చరించునదియునై యున్నది, సూక్ష్మమైన రూపముకలది గావున తెలిసికొన శక్యము గానిది, దూర మందున్నదియు, దగ్గర నున్నదియునై యున్నది

ప॥తే॥ అన్ని ప్రాణుల వెలుపల-నంతరమున
అచరమైనది, చరియించు-నదియుగాను
సూక్ష్మమైనట్టి దగుటచే-చూడఁబడదు
దూరమందును, దగ్గర-తోచుచుండు

గే॥ అన్ని ప్రాణులలోన బయటను
అంతటను వ్యాపించియుణ్ణా
సూక్ష్మమగు రూపంబుచేతను
చూడ శక్యముగానిదై
అజ్ఞానికది దూరమగుచును
అదియెజ్ఞానికి దగ్గరా
అని కిరీటికి ॥శ్రీహరిని॥

17) శ్లో॥ అవిభక్తంచ భూతేషు
విభక్తమివచ స్థితం
భూతభర్తృచ తద్ జ్ఞేయం
గ్రసిష్ణు ప్రభవిష్ణుచ..

ప వి అవిభక్తం, చ, భూతేషు, విభక్తం, ఇవ, చ, స్థితమ్, భూతభర్తృ, చ, తత్, జ్ఞేయం, గ్రసిష్ణు, ప్రభవిష్ణు, చ

టీ॥ తత్-ఆబ్రహ్మము, అవిభక్తం-విభజింపబడనిదియై, భూతేషు-సమస్త ప్రాణులయందు, విభక్తమివ - వేరుచేయబడిన దానివలె, స్థితం-ఉన్నది, భూతభర్తృచ-భూతముల భరించునదియు, గ్రసిష్ణు-హరించునదియును, ప్రభవిష్ణు-ఉత్పత్తి చేయునట్టిదియు, జ్ఞేయం-తెలియదగినదియునై యున్నది

గ॥ అర్జునా ఆబ్రహ్మము ప్రాణులయందు విభజింపబడనిదిరైు నను, విభజింపబడినదానివలెయున్నది. ప్రాణులను భరించునదియును హరించునదియును, పుట్టించునదియునై యున్నది.

ప॥తే॥ చేయబడనిది, విభజన,-చేసినట్లు
ప్రాణులందున బ్రహ్మము-పరగుచుండు
ప్రాణులభరించు, హరియించు-ప్రభవమదియె
కలుగజేయుచున్న దనుచు-తెలియు పార్థ

గే॥ అవిభక్తమైయుండి బ్రహ్మము
అన్ని ప్రాణులయందునూ
ఉలరుచున్న దనేకరూపము
లైన దానివలె భారతా
సకల ప్రాణిభరించి, లయమును
సలుపు సృష్టిని, తెలియుమా
అని కిరీటిని ॥శ్రీహరిని

18) శ్లో॥ జ్యోతిషామపి తజ్జ్యోతి
స్తమసః పరముచ్యతే
జ్ఞానం జ్ఞేయం జ్ఞానగమ్యం
హృదిసర్వస్య విష్ఠితమ్.

ప వి జ్యోతిషామ్, అపి. తత్. జ్యోతిః, తమసః, పరమ్, ఉచ్యతే, జ్ఞానం, జ్ఞేయం, జ్ఞానగమ్యం, హృది. సర్వస్య. విష్ఠితమ్.

టీ॥ తత్ - ఆబ్రహ్మము. జ్యోతిషామపి - ప్రకాశములకుగూడ, జ్యోతిః-ప్రకాశమైనదియు. తమసః - చీకటికి. పరం - వ్యతిరిక్తమై, నదియు, జ్ఞానం - జ్ఞానమును, జ్ఞేయం - తెలియదగినదియు. జ్ఞాన

గమ్యం-జ్ఞానముచేత పొందదగినదనియును. సర్వస్య-సమస్త ప్రాణుల యొక్క. హృది-హృదయమందు విష్ఠితమ్-ఉన్నదనియు. ఉచ్యతే - చెప్పబడుచున్నది

గ॥ అర్జునా ఆబ్రహ్మము తెలియదగినదనియు ప్రకాశములకు గూడ ప్రకాశమైనదనియు చీకటికంటె వేరైనదనియు. జ్ఞానమనియును జ్ఞానముచే పొందదగినదనియును సమస్త ప్రాణుల హృదయముల యందు నున్నదనియు చెప్పబడుచున్నది

ప॥తే॥ అన్నిజ్యోతులకది జ్యోతి-యగుచునుండు
తెలియుమజ్ఞానమునకన్న-దివ్యమనుచు
జ్ఞాన గోచరమైనది-జ్ఞానమనియు
నన్ని ప్రాణుల హృదియందు-నలరియుండు
తెలియదగిన దదియనుచు-తెలియు పార్థ

గే॥ ఆబ్రహ్మంబు ప్రకాశములకు
అయినదగుచు ప్రకాశము॥
జ్ఞాన గోచరమైన దగుచును
సర్వప్రాణుల యందును॥
నిలిచియున్నది హృదయములలో
కలిగి చీకటిపరమునై
అని కిరీటికి ॥శ్రీహరిని

19) శ్లో॥ ఇతి క్షేత్రం తథాజ్ఞానం
జ్ఞేయంచోక్తం సమాసతః
మద్భక్త ఏతద్విజ్ఞాయ
మద్భావాయోప పద్యతే. .

ప వి. ఇతి, క్షేత్రం, తథా, జ్ఞానం, జ్ఞేయం, చ, ఉక్తం, సమాసతః, మద్భక్తః, ఏతత్, విజ్ఞాయ, మద్భావాయ, ఉపపద్యతే

టీ॥ ఇతి-ఈప్రకారముగా, క్షేత్రంచ-క్షేత్రము, తథా-అటులే, జ్ఞానం-జ్ఞానము, జ్ఞేయంచ - తెలియదగినదియు, సమాసతః - సంగ్రహముగా, ఉక్తం-చెప్పబడెను. మద్భక్తః - నాభక్తుడు, ఏతత్-ఈయర్థమును, విజ్ఞాయ-తెలిసికొని, మద్భావాయ-నాభావముపొందుటకు, ఉపపద్యతే-అర్హుడగుచున్నాడు

గ॥ అర్జునా యీవిధముగా క్షేత్రమును అట్లే జ్ఞానమును, జ్ఞేయమును, సంగ్రహముగా నీకుచెప్పితిని దీనినెరింగిన నాభక్తుడు నన్ను పొందుట కర్హుడగుచున్నాడు

ప॥తే॥ జ్ఞేయమునటులె జ్ఞానము-క్షేత్రమిట్లు
సంగ్రహంబుగ తెలిపితి-సవ్యసాచి
దీని విషయంబు చక్కగా-తెలిసికొనిన
పొందు, నాభక్తుడగుచును-ముక్తిపదవ. .

గే॥ ఇట్టి క్షేత్రము జ్ఞానజ్ఞేయము
యీ ప్రకార మెరింగియుండ
నాదు భక్తుడు జ్ఞానవంతుడు
నన్ను జెందుచు ముక్తుడౌ

అని కిరీటికి ॥శ్రీహరిని

20) శ్లో॥ ప్రకృతిం పురుషంచైవ
విద్ధ్యనాదీ ఉభావపి
వికారాంశ్చ గుణాంశ్చైవ
విద్ధి ప్రకృతి సంభవాన్

ప.వి ప్రకృతిం, పురుషం, చ, ఏవ, విద్ధి, అనాదీ, ఉభౌ అపి, వికారాన్, చ, గుణాన్, చ, ఏవ, విద్ధి, ప్రకృతి సంభవాన్,

టీ॥ ప్రకృతిం-ప్రకృతిని,(మాయను) పురుషం + చ - పురుషుని,(క్షేత్రజ్ఞుని) ఉభౌ అపి-ఈరెండింటిని, అనాదీ-ఆదిలేని వానినిగా, విద్ధి-తెలియుము, వికారాంశ్చ-బుద్ధ్యాది వికారములను, గుణాంశ్చ-గుణములను, ప్రకృతిసంభవానేవ - ప్రకృతివలన పుట్టిన వానినిగానే, విద్ధి-తెలిసికొనుము

గ॥ అర్జునా ప్రకృతిని, పురుషుని, రెండింటిని ఆదిలేని వానినిగా తెలిసికొనుము, మనోబుద్ధులకు కలుగు వికారములను, గుణములను, ప్రకృతివలన పుట్టినవానిగా తెలిసికొనుము.

ప॥తే॥ ప్రకృతి పురుషులాదిసిలేని-వారలనుచు
తెలిసికొను, మీయుభయులను-తెల్లముగను
ప్రభవమగునని తెలియుము-ప్రకృతిచేత
సర్వగుణ వికారంబులు-సవ్యసాచి

గే॥ ప్రకృతి పురుష, లనాదులనుచును
భావించు, మనసు బుద్ధికి
సంభవించు వికారగుణములు
సర్వమును ప్రకృతిచేతన్
అనుచు తెలియుము నీవు పార్థా
ఆత్మలో నీవెప్పుడున్
అని కిరీటికి ॥శ్రీహరిని

21) శ్లో॥ కార్యకారణ కర్తృత్వే
హేతుః ప్రకృతిరుచ్యతే
పురుషః సుఖదుఃఖానాం
భోక్తృత్వే హేతురుచ్యతే...

ప.వి. కార్యకారణకర్తృత్వే, హేతుః, ప్రకృతిః, ఉచ్యతే, పురుషః, సుఖదుఃఖానాం, భోక్తృత్వే, హేతుః, ఉచ్యతే

టీ॥ ప్రకృతిః-మాయ, కార్యకారణకర్తృత్వే-శరీరసుఖదుఃఖాదులను పుట్టించుటయందు, హేతుః-కారణమని, ఉచ్యతే - చెప్పబడుచున్నది, పురుషః-పురుషుడు, సుఖదుఃఖానాం-సుఖదుఃఖములయొక్క- భోక్తృత్వే - అనుభవించుటయందు, హేతుః - కారణమని, ఉచ్యతే- చెప్పబడుచున్నాడు

గ॥ అర్జునా ప్రకృతి కార్య, కారణ, కర్తృత్వములకు కారణముగా చెప్పబడుచున్నది, పురుషుడు సుఖదుఃఖములనుభవించుటయందు హేతువుగా చెప్పబడుచున్నాడు

ప॥తే॥ కారణమును కర్తృత్వము-కార్యమునకు
ప్రకృతి యే హేతువనుచును-పలుకబడియె
అగును హేతువు సుఖదుఃఖ-మనుభవింప
పురుషుడనుచును తెలియుము-వీరవర్య

గే॥ కార్యకారణ కర్తృత్వములకు
కారణంబు ప్రకృతియగుఙా
మాయ యనుచును ప్రకృతినందురు
మాయచే సుఖదుఃఖముల్ శ్రీ

కలుగుచుండునటంచు నెరుగుము
కారణంబదియె, వానిఁ
అనుభవింపఁజేయుందు కారణ
మగును పురుషుడు తెలియుమా
ఓయి కిరీటికి ॥శ్రీహరిని

22) శ్లో॥ పురుషః ప్రకృతిస్థోహి
భుంక్తే ప్రకృతి జాఁగుణాఁ
కారణం గుణసంగోఽస్య
సదసద్యోని జన్మసు

ప.వి పురుషః, ప్రకృతిస్థః, హి, భుంక్తే, ప్రకృతిజాఁ, గుణాఁ, కారణం, గుణసంగః, అస్య, సదసద్యోనిజన్మసు

టీ॥ ప్రకృతిస్థః - ప్రకృతియందున్నవాడై, పురుషః - జీవుడు, (పురుషుడు) ప్రకృతిజాఁ-ప్రకృతివలన బుట్టిన, గుణాఁ-గుణములను, భుంక్తేహి-అనుభవించుచున్నాడు గదా? అస్య-ఈ పురుషుని, గుణసంగః-సుఖదుఃఖాది గుణాసక్తి, సదసద్యోనిజన్మసు-పుణ్యపాప యోనుల, జన్మించుటయందు, కారణం-హేతువు, భవతి-అగుచున్నది.

గ॥ పురుషుడు ప్రకృతియందున్నవాడై, ప్రకృతివలన బుట్టిన గుణము లనుభవించుచున్నాడు, ఈ పురుషునికి, సుఖదుఃఖరూపములైన, గుణములయందాసక్తి యుండుటచేత, పుణ్యపాప యోనుల యందు, జన్మములకు కారణమగుచున్నది

ప॥తే॥ ప్రకృతియందున్న పురుషుడు-ప్రకృతివలన
బుట్టు, గుణములనుభవము-పొందుచుండు

కోర్కె పురుషునకుంటచే-గుణములందు
పుట్టుటకు కారణంబగు-పుణ్యపాప,
జన్మములను, పుడమియందు-సవ్యసాచి

గీ॥ ప్రకృతియందునయున్న పురుషుడు
ప్రకృతి జన్యగుణంబులన్
అనుభవించుచు సంతతంబును
అతడు సుఖదుఃఖంబులన్ ॥అని॥
అనుభవింప గుణంబులాశచే
నగుచు జన్మకు హేతువున్
పుణ్యపాపములైన యోనుల
పుట్టుచుండును పుడమిపై
అని కిరీటికి ॥శ్రీహరిని

23) శ్లో॥ ఉపద్రష్టాఽనుమంతాచ
భర్తాభోక్తా మహేశ్వరః
పరమాత్మేతి చాప్యుక్తో
దేహేఽస్మిన్ పురుషఃపరః

ప.వి. ఉపద్రష్ట, అనుమంతా, చ, భర్తా, భోక్తా, మహేశ్వరః, పరమాత్మ, ఇతి, చ అపి ఉక్తః, దేహే, అస్మిన్, పురుషః, పరః

టీ॥ ఉపద్రష్టా-సాక్షిగా నుండువాడు (కార్యములను విచారించు కొనువాడు) అనుమంతా-అనుమతించునట్టియు. భర్తా-భరించునట్టియు, భోక్తా-అనుభవించునట్టియు, మహేశ్వరం - నియామకుడైనట్టియు పరమాత్మేతి-పరమాత్మయని. ఉక్తః - చెప్పబడినట్టి, పురుషః-పురుషుడు, అస్మిన్దేహే-ఈ దేహమందు, పరః-ఉత్కృష్టుడైనవాడు.

గ॥ అర్జునా నాదేహమునందు పరుడై సపురుషుడు, తటస్థుడును, అనుమతించువాడును, భరించువాడును, అనుభవించువాడును మహేశ్వరుడును, పరమాత్మయనియు చెప్పబడుచున్నాడు

ప॥తే॥ పురుషుడుండి దేహంబున-పరుడునగుచు
భర్త, భోక్త యుసాక్షియై-పరగుచుండు
ననుమతించు మహేశ్వరు-డగుచునుండు
వాడు, పరమాత్మయనిగూడ-పలుకబడియె

గే॥ ఆమోదించి యనుభవించుచు
అన్నిభరించి శ్రేష్ఠుడై
యజమానుండై చూచుచుండును
యన్నియింద్రియ కార్యముల్
ఈదేహమందుండు పురుషుని
యెంచబడె పరమాత్మగా
అని కిరీటికి ॥శ్రీహరిని

24) శ్లో॥ యఏవంవేత్తి పురుషం
ప్రకృతించగుణైః సహ
సర్వథావర్తమానోఽపి
నసభూయోఽభిజాయతే....

ప.వి. యః, ఏవం, వేత్తి, పురుషం, ప్రకృతిం, చ, గుణైః, సహ, సర్వథా, వర్తమానః, అపి, న, సః, భూయః, అభిజాయతే.

టీ॥ యః-ఎవ్వడు, ఏవం-ఈప్రకారముగా, పురుషః-పురుషుని గుణైఃసహ-గుణములతోగూడ, ప్రకృతించ-ప్రకృతిని, వేత్తి-ఎరుగు

చున్నాడో. సః - వాడు. సర్వథా - సర్వప్రకారములచేత. వర్త మానోఽపి-కర్మప్రవత్తిగలవాడైనను. భూయః - మరల. నాభిజాయతే-పుట్టడు (ముక్తుడగును)

గ॥ అర్జునా యెవడు యీవిధముగా పురుషుని గుణములతోగూడ ప్రకృతిని తెలుసికొనుచున్నాడో వాడు సర్వవిధముల వర్తించుచున్న వాడైనను, మరల జన్మింపక ముక్తుడగును

ప॥తే॥ ఎవ్వడు ప్రకృతి పురుషుల-నీవిధముగ
గుణవికార సహితముగ,-గురుతెరింగి
అన్నివిధముల వర్తించు-నాతడైన
పొందు మోక్షంబు భువిమరి-పుట్టకుండ

గే॥ ఈప్రకారము ప్రకృతి పురుషుల
కిట్టివని గుణవికారము
లెవడు తెలియుచు, వాడేరీతి
యీజగతి వర్తించుఁగా
పుట్టుకుండును జగతియందున
పొందుమోక్షము భారతా
అని కిరీటకి ॥శ్రీహరిని

25) శ్లో॥ ధ్యానేనాత్మని పశ్యంతి
కేచిదాత్మానమాత్మనా
అన్యేసాంఖ్యేన యోగేన
కర్మయోగేన చాపరే

ప.వి ధ్యానేన, ఆత్మని, పశ్యంతి, కేచిత్, ఆత్మానం, ఆత్మనా, అన్యే, సాంఖ్యేన, యోగేన, చ, అపరే

టీ॥ కేచిత్-కొందరు, ధ్యానేన - ధ్యానముచేతను, ఆత్మని-బుద్ధి యందు, ఆత్మనా-మనస్సుచేత, ఆత్మానం-పరమాత్మను పశ్యంతి-చూచుచున్నారు, అన్యే-మరికొందరు, సాంఖ్యేనయోగేన-జ్ఞానయోగ ముచేతను, అపరే - మరికొందరు, కర్మయోగేన - నిష్కామకర్మ యోగముచేతను, ఆత్మానం-పరమాత్మను పశ్యంతి-చూచుచున్నారు.

గ॥ అర్జునా ధ్యానముచేత, బుద్ధియందు, మనస్సుచేత, పర మాత్మను చూచుచున్నాను, మరికొందరు, జ్ఞానయోగముచేత, పర మాత్మను చూచుచున్నారు, మరికొందరు నిష్కామకర్మయోగము చేతను, పరమాత్మను చూచుచున్నారు

ప॥తే॥ ధ్యానయోగాన బుద్ధిలో-మనసుచేత
చూచుచున్నారు పరమాత్మ-చూడగలరు
సాంఖ్యయోగాన కొందరు-సవ్యసాచి
కర్మయోగాన కొందరు-గాంచుచుండ్రు

గే॥ ధ్యానయోగముచేత బుద్ధిలో
మనసుచే పరమాత్మునిణా
కాంచుచుండిరి, జ్ఞానయోగము
కలిగి కొందరు ఫల్గునా
కర్మయోగముచేత కొందరు
కాంచెదరు పరమాత్మునిణా
అని కిరీటికి ॥శ్రీహరిని

26) శ్లో॥ అన్యేత్వేవ మజానంతః
శ్రుత్వాఽన్యేభ్య ఉపాసతే
తేఽపిచాతితరంత్యేవ
మృత్యుంశ్రుతి పరాయణాః...

ప వి. అన్యే, తు, ఏవమ్, అజానంతః, శుత్వా అన్యేభ్యః, ఉపాసతే, తే, అపి, చ, అతితరంతి, ఏవ, మృత్యుం, శ్రుతి పరాయణాః

టీ॥ అన్యేతు-మరికొందరు, ఏవం-ఈప్రకారముగా అజానంతః-పరమాత్మనెరుగనివారలై, అన్యేభ్యః - ఇతరులైన యాచార్యుల వలన, శ్రుత్వా-విని, ఉపాసతే-ఉపాసనముచేయుచున్నారు, శ్రుతి పరాయణాః-వేదాంతశ్రవణపరులైన, తేఽపి-వారలును, మృత్యు-మృత్యువును, అతితరంత్యేవ-తప్పకదాటుచున్నారు

గ॥ అర్జునా మరికొందరు (ధ్యాన, సాంఖ్య కర్మయోగముల ద్వారా) పరమాత్మను తెలిసికొనలేనివారలై, ఇతరులవలన, పరమాత్మను గురించివిని, ఉపాసించుచున్నారు, శ్రవణాసక్తులైనవారు కూడా, మరణమును (మృత్యురూప సంసారసాగరమును) తప్పక దాటగలరు

ప॥ తే॥ ఇట్లు తెలియజాలనివార-లితర జనుల
వలన, పరమాత్మనుగురించి-తెలిసికొనుచు
సలుపుదురు, రుపాసనంబును-సవ్యసాచి
శ్రద్ధతోడను శ్రవణంబు-సలుపువారు
దాటిపోదురు మరణంబు-తప్పకుండ

గే॥ ముందు తెలిపినమార్గములచే
అందుకొనక పరాత్పరుఁ
వేదాంతము శ్రద్ధాభక్తితో
వినుచు గురువులసేవచే
పొంది సలుపుచు పూజకొందరు
పొందెదరు పరమాత్మునిఁ
అని కిరీటికి ॥శ్రీహరిని

27) శ్లో॥ యావత్సంజాయతేకించి
త్సత్వంస్థావర జంగమం
క్షేత్రక్షేత్రజ్ఞ సంయోగా
త్తద్విద్ధి భరతర్షభ

ప.వి. యావత్, సంజాయతే, కించిత్, సత్వం, స్థావరజంగమం, క్షేత్రక్షేత్రజ్ఞసంయోగాత్, తత్ విద్ధి, భరతర్షభ

టీ॥ భరతర్షభ - ఓయర్జునా, స్థావరజంగమం-స్థావరజంగమము లైన కించిత్ - సల్పమైన, సత్వం - వస్తువు, యావత్-యెంతయైన, సంజాయతే-పుట్టుచున్నదో, తత్-ఆవస్తువు, క్షేత్రంక్షేత్రజ్ఞసంయోగాత్ - ప్రకృతి, పురుషులసంయోగమువలన కలిగినదని, విద్ధి- తెలియుము

గ॥ అర్జునా లోకమందు స్థావరజంగమరూపమైన (చరాచర) సమస్త వస్తువులును, క్షేత్రక్షేత్రజ్ఞులయొక్క కూడికచేతనే పుట్టు చున్నవని తెలిసికొనుము ..

వ॥తే॥ చరము, లచరములై నట్టి-సర్వవస్తు
వులు, జగతి, నెప్పుడేచోట-పుట్టుచున్న
క్షేత్రక్షేత్రజ్ఞసంగము-చేత, ప్రభవ
మంద నని యెరుగు, మాని-సందియంబు.

గే॥ స్థావరజంగమ రూపములగు
సర్వవస్తు సమూహము—
ప్రకృతిపురుష సంసర్గముచే
ప్రభవమగునని తెలియుమా
అని కిరీటికి ॥శ్రీహరిని

28) శ్లో॥ సమం సర్వేషు భూతేషు
తిష్ఠంతం పరమేశ్వరమ్
వినశ్యత్స్వ వినశ్యంతం
యః పశ్యతి సపశ్యతి .

ప వి. సమం, సర్వేషు, భూతేషు, తిష్ఠంతం, పరమేశ్వరం, వినశ్యత్సు, అవినశ్యంతం, యః, పశ్యతి, సః, పశ్యతి

టీ॥ యః-ఎవ్వడు, సర్వేషు,భూతేషు-సమస్త ప్రాణులయందు, సమం-సమముగా తిష్ఠంతం-ఉన్నటువంటి, పరమేశ్వరం-పరమేశ్వరుని, తేషు-అప్రాణులు, వినశ్యత్సు-నశించుచుండగా, అవినశ్యంతం-నశించకయున్న వానినిగాను, పశ్యంతి - చూచున్నాడో, సః-వాడు, పశ్యతి-(నిజమును) చూచుచున్నాడు

గీ॥ అర్జునా సమస్త ప్రాణులయందు సమముగా యున్నటువంటి పరమాత్మను, అన్నిప్రాణులు నశించుచుండగా, నశింపకయున్న వానినిగా నెవడు చూచుచున్నాడో, అట్టివాడే నిజమును చూచు చున్నాడు

ప॥ ఆ॥ సర్వ ప్రాణులయందును-సముడునగుచు
నున్న, పరమాత్మ, నవి, నాశ-మొందుచున్న
నతడు నాశనమును పొంద-డని, యెరుంగు
వాడు, చూచుచున్నాడు-పార్థ నిజము

గే॥ అన్ని ప్రాణులయందు సమముగ
నలరియుండు పరాత్పరుణ్
నాశమొందిన యన్ని ప్రాణులు
నాశమొందని వానిగా
చూచుచుండినవాడె నిజముగ
చూచుచుండిన వాడగుణ్
అని కిరీటికి ॥శ్రీహరిని

28) శ్లో॥ సమంపశ్యన్ హిసర్వత్ర
సమవస్థిత మీశ్వరమ్
నహినస్త్యాత్మ నాత్మానం
తతోయాతి పరాంగతిమ్...

ప.వి. సమం, పశ్యన్, హి, సర్వత్ర, సమవస్థితమ్, ఈశ్వరం, న, హినస్తి, ఆత్మనా, ఆత్మానం, తతః, యాతి, పరాం, గతిమ్,

టీ॥ సర్వత్ర - సమస్త ప్రాణులయందు, సమం - సమముగా, సమవస్థితం-ఉన్నట్టి, ఈశ్వరం-పరమేశ్వరుని, పశ్యం-చూచుచున్న వాడు, ఆత్మనా-తనచేత, ఆత్మానం-తనను, న, హినస్తి-హింసించు కొనడు, తతః-అందువలన, పరా-ఉత్తమమైన, గతిం-మోక్షమును, యాతిః-పొందుచున్నాడుగదా?

గ॥ అర్జునా సమస్త ప్రాణులయందు, సమముగానున్నట్టి పరమాత్మను చూచువాడు, తనచేత తనను హింసించుకొనడు, అందు వలన వాడు శ్రేష్ఠమైన మోక్షమును పొందుచున్నాడు ..

ప॥తే॥ అన్ని ప్రాణులందుసముడై-యలరుచుండు
నట్టి, పరమాత్మకనుగొను-నట్టివాడు
తనను తనచేత, హింసింప-దలపదెపుడు
పొందునందుచే శ్రేష్ఠమౌ-ముక్తివాడు

గే॥ సర్వ ప్రాణులయందు నీశ్వరు
సమముగా గనువాడునై
తనను తనచే హింససలుపడు
దానివలనను శ్రేష్ఠమౌ
మోక్షమందునువాడు మీదట
పూర్ణ ప్రజ్ఞాపంచుడై
అని కిరీటికి ॥శ్రీహరి॥

30) శ్లో॥ ప్రకృత్యైవచ కర్మాణి
క్రియమాణాని సర్వశః
యః పశ్యతి తథాఽఽత్మాన
మకర్తారం సపశ్యతి ..

ప.వి. ప్రకృత్యా, ఏవ, చ, కర్మాణి, క్రియామాణాని, సర్వశః, యః, పశ్యతి, తదా, ఆత్మానం, అకర్తారం, సః, పశ్యతి.

టీ॥ యః-ఎవ్వడు, కర్మాణి-కర్మములను, ప్రకృత్యైవ-మాయ చేతనే, సర్వశః-సర్వ ప్రకారములుగా, క్రియమాణాని-చేయబడుచున్న వానిగా, యదా-ఎప్పుడు, పశ్యతి-చూచుచున్నాడో, తదా-అప్పుడు, సః-వాడు, ఆత్మానం-ఆత్మను, అకర్తారం-కర్తనుకాని వానినిగా చూచుచున్నాడు

గ॥ అర్జునా సర్వవిధములు కర్మలు ప్రకృతిచేతనే, చేయబడుచున్న వానినిగాను, ఆత్మను కర్తకాని వానినిగను, యెవడు చూచుచున్నాడో, ఆతడే నిజముగా చూచుచున్న వాడగుచున్నాడు.

ప॥తే॥ సలుపబడుచుండు ప్రకృతిచే-సర్వకర్మ
లనియు, నాత్మనుకర్తకా-దనియు, పూర్తి
తెలిసికొనిన వాడెవ్వడో-తెల్లముగను
వాడె నిజముగ చూచిన-వాడుపార్థ

గే॥ మాయచేతనె సర్వకర్మలు
చేయబడునని తెలియుచు॥
ఆతడాత్మను కర్తకాదని
ఆత్మనెరిగిన వాడగు॥
అని కిరీటికి
॥శ్రీహరిని

31) శ్లో॥ యథాభూత పృథగ్భావ
మేకస్థమను పశ్యతి

తత ఏవ చవిస్తారం
బ్రహ్మ సంపద్యతే తదా.

ప వి. యదా, భూతపృథగ్భావం, ఏకస్థం, అనుపశ్యతి, తతః, ఏవ, చ, విస్తారం, బ్రహ్మ, సంపద్యతే, తదా,

టీ॥ యదా-ఎప్పుడు, భూతపృథగ్భావం-భూతములచే, వేర్వేరు భావములను, ఏకస్థం-ఒక్కదానియందున్న వానిగా, తతః + ఏవ + చ-దాని వలననే, విస్తారం-విస్తారమును, అనుపశ్యతి-చూచుచున్నాడో, తదా-అప్పుడు, బ్రహ్మ-బ్రహ్మము, సంపద్యతే-అగుచున్నాడు (పొందు చున్నాడు)

గ॥ అర్జునా వేర్వేరుగాయున్న సమస్త ప్రాణులను, ఒక్క దానియందున్న వానిగాను మరియు దానివలననే, విస్తారమగుచున్న వానినిగాను యెవడు తెలిసికొనుచున్నాడో అతడు బ్రహ్మమగు చున్నాడు (ఆబ్రహ్మమునే అతడు పొందుచున్నాడు) .

ప॥తే॥ పలువిధంబులభేదమై-పరగుచుండు
ప్రాణిలోక దానియందున్న-వానిగాను
దానిచే విస్తరిలునట్టి-వానిగాను
తెలిసికొనువాడు, బ్రహ్మమై-చెలగుచుండు

గే॥ వేరువేరుగయున్న ప్రాణులు
చేరియున్నవి యొక్కచో
అందువలననె విస్తరించెను
అన్ని ప్రాణులు జగములుగా
అనియెరింగినవాడె బ్రహ్మము
అగును, పొందును మోక్షముగా
అని కిరీటికి ॥శ్రీహరిని

32) శ్లో॥ అనాదిత్వాన్నిర్గుణత్వా
త్పరమాత్మాఽయమవ్యయః
శరీరస్థోఽపి కౌంతేయ
నకరోతి నలిప్యతే

ప.వి. అనాదిత్వాత్, నిర్గుణత్వాత్, పరమాత్మా, అయమ్, అవ్యయః, శరీరస్థః, అపి, కౌంతేయ న, కరోతి, న, లిప్యతే

టీ॥ హేకౌంతేయ-ఓయిర్జునా, అనాదిత్వాత్-అది లేనందునను, నిర్గుణత్వాత్-గుణములు లేక పోవుటవలను, అవ్యయం-నాశరహితు డైన, అయంపరమాత్మా-ఈ పరమాత్మ శరీరస్థోఽపి-శరీరమందున్న ప్పటికిని, నకరోతి-(కర్మమును) చేయడు. నలిప్యతే-కర్మఫలము నంటడు

గ॥ అర్జునా ఆదిలేని వాడును, గుణములు లేనివాడును, నాశరహితుడైన ఈపరమాత్మ, శరీరమందున్నప్పటికిని, కర్మలు చేయడు, కర్మఫలముల నంటడు

ప॥తే॥ ఆదిలేనట్టి వాడునై -యవ్యయుండు
నగుచు, త్రిగుణ విహీనుండు-నగుచు, దేహ
మందువసించుచుండియు-నాతడేమి
కర్మసలుపడు, సంగంబు-గాంచకుండు

గే॥ లేనివాడై మొదలు గుణములు
లేనివాడై, నాశముఁ
అపరాత్పరుడన్ని భూతము
లన్ని తనువుల నుండియుఁ

చెందకుండును కర్మఫలమును
చేయకుండును కర్మముల్
అని కిరీటికి ॥శ్రీహ౨౨

33) శ్లో॥ యథా సర్వగతం సౌక్ష్మ్యా
దాకాశంనో పలిప్యతే
సర్వత్రావస్థితో దేహే
తథాఽఽత్మానోపలిప్యతే. .

ప.వి యథా, సర్వగతం, సౌక్ష్మ్యత్, ఆకాశమ్, న, ఉపలిప్యతే, సర్వత్ర, అవస్థితః, దేహే, తథా, ఆత్మా, న, ఉపలిప్యతే

టీ॥ సర్వగతం-సర్వవ్యాపియైన, ఆకాశం-ఆకాశము, సౌక్ష్మ్యత్-సూక్ష్మమగుట వలనను, యథా-ఎట్లు, నోపలిప్యతే-అంటబడదో, తథా-అట్లు. దేహే-దేహమునందు, సర్వత్ర-అంతటను, అవస్థితః + అపి-ఉన్నటువంటిదైనను, ఆత్మా-ఆత్మ, న + ఉపలిప్యతే-అంటబడదు.

గ॥ అర్జునా అంతటను వ్యాపించియుండు నాకాశము, సూక్ష్మమైన దగుటచే, దేనిని అంటబడని విధమున పరమాత్మ దేహమందు సర్వత్ర వ్యాపించియుండియు దేనికి నంటబడదు .

ప॥తే॥ అంతటను వ్యాప్తమైయుండు-నాకసంబు
సూక్ష్మమైనట్టి దగుటచే-సోకనట్లు
ఆత్మ, దేహమందంతట-వ్యాప్తమైన
దగుచునుండియు, దేనికి-నంటబడదు

గే॥ అంతటను వ్యాపించియుండియు
నాకాశమే వస్తువుల

అంటకుండనిపగిది, నాత్మకు
సన్నితనువుల నుండియుఁ
కర్మబంధములతని కంటవు
కాడుఁకర్మకు కర్తయుఁ
అని కిరీటికి ॥శ్రీహరిని

34) శ్లో॥ యథా ప్రకాశయత్యేకః
కృత్స్నం లోకమిమం రవిః
క్షేత్రం క్షేత్రీ తథాకృత్స్నం
ప్రకాశయతి భారత ..

ప వి యథా, ప్రకాశయతి, ఏకః, కృత్స్నం లోకం, ఇమం, రవిః, క్షేత్రం, క్షేత్రీ, తథా, కృత్స్నం, ప్రకాశయతి, భారత

టీ॥ హేభారత-ఓయర్జునా, ఏకః-ఒక్కడైన, రవిః-సూర్యుడు, ఇమం-ఈ, కృత్స్నం-సమస్తమైన, లోకం-లోకమును, యథా-ఎట్లు, ప్రకాశయతి-ప్రకాశింప జేయుచున్నాడో తథా-అట్లు, క్షేత్రీ-క్షేత్రజ్ఞుడు, కృత్స్నం-సమస్తమైన, క్షేత్రం-శరీరములను, ప్రకాశయతి-ప్రకాశింప జేయుచున్నాడు

గ॥ అర్జునా, ఒక్కడైన సూర్యుడు సమస్త లోకమును ఏ విధముగా ప్రకాశింప జేయుచున్నాడో, ఆ విధముగానే క్షేత్రజ్ఞుండైన పరమాత్మ, సమస్త దేహములను ప్రకాశింప జేయుచున్నాడు

ప॥తే॥ ఎట్లు సూర్యుఁడొక్కడగుచు-నెల్లలోక
ముల, ప్రకాశమొందగజేయ-గలుగుచుండు
నావిధంబుగ పరమాత్మ-యన్నిదేహ
ముల ప్రకాశింపగాజేయ గలుగుచుండు

గీ॥ ఎల్లి జగముల నొక్క సూర్యం
దెట్లు వెలుగగ జేయునో
క్షేత్రముల నన్నింటి వెలుగగ
జేయునొక క్షేత్రజ్ఞుడే
అని కిరీటికి ॥శ్రీహరిని

35) శ్లో॥ క్షేత్ర క్షేత్రజ్ఞయో రేవ
మంతరం జ్ఞానచక్షుషా
భూత ప్రకృతి మోక్షంచ
యేవిదుర్యాంతితే పరమ్

ప వి. క్షేత్రక్షేత్రజ్ఞయోః, ఏవం, అంతరం, జ్ఞానచక్షుషా, భూత ప్రకృతిమోక్షం, చ, యే విదుః యాంతి, తే, పరం

టీ॥ జ్ఞానచక్షుషా-జ్ఞానదృష్టి చేతను, ఏవం-ఈరీతిని, క్షేత్ర క్షేత్రజ్ఞయోః-క్షేత్ర క్షేత్రజ్ఞులయొక్క అంతరం-భేదమును, భూత ప్రకృతిమోక్షంచ-భూతముల ప్రకృతిని, మోక్షమును, యే-యెవరు, విదుః-తెలిసికొనుచున్నారో, తే-వారు, పరం-మోక్షమును, యాంతి-పొందుచున్నారు

గ॥ అర్జునా జ్ఞానదృష్టిచేత యీవిధముగా క్షేత్ర క్షేత్రజ్ఞుల యొక్క భేదమును భూతములయొక్కయు, మాయయొక్కయు, మోక్షమును, యెవరు తెలిసికొనుచున్నారో వారు మోక్షమును పొందుచున్నారు.

తే॥ ఎవడు జ్ఞానదృష్టివలన-యీవిధముగ
ప్రకృతి పురుషుల భేదంబు-ప్రాణిసంఘ
ముల, ప్రకృతియును, మోక్షంబు-తెలియునెవడు
పొందునాతండు శ్రేష్ఠమౌ-మోక్షపదము

గే॥ జ్ఞానదృష్టిచె ప్రకృతి పురుషుల
సర్వవిధముల భేదముల్
భూతసంఘము ప్రకృతిగతులను
మోక్షమెవ్వడు తెలియునో
పొందునాతం డుత్తమంబగు
మోక్షపదమును భారతా

అని కిరీటికి ॥శ్రీహరిని
శ్రీహరిని శ్రీకృష్ణ చిత్తమందు

గ॥ ఇది శ్రీ కవిరత్న రత్నాకరము వెంకటేశ్వర కవి విరచితమై గద్య పద్య గేయరూపంబును, శ్రీ కృష్ణార్జునుల సంవాదంబగు, శ్రీ భగవద్గీతా గద్య పద్య గేయామృతము నందు క్షేత్ర క్షేత్రజ్ఞ విభాగ యోగమను పదుమూడవ అధ్యాయము సంపూర్ణము.

హరిః ఓమ్ తత్సత్ హరిః ఓమ్
శాంతిః శాంతిః శాంతిః





అధ్యాయ సంగ్రహము - గుణత్రయ విభాగ యోగము

మ॥ జగదుత్పత్తికి హేతువౌ ప్రకృతిచే
సంబంధముగా బొందుచున్
త్రిగుణంబుల్ బహువిస్తరించి, జగముల్
త్రిప్పున్ సదాసంసృతిన్
త్రిగుణా తీతుడుగాని వాని, త్రిగుణా
తీతుండవై, దాంతివై
జగతిన్ మిథ్యగనెంచి, ముక్తిగను, సు
జ్ఞానంబుచే ఫల్గునా.

తా॥ అర్జునా జగదుత్పత్తికారణమైన ప్రకృతి, సత్వర, జస్తమోగుణములచేత, ప్రపంచమును విస్తరించి, ఆయాగుణముల యొక్క, సుఖ, భోగ, ప్రమాదములచేత, అజ్ఞానులను, సంసారమునందు త్రిప్పుననియు, త్రిగుణాతీతుడవై, దాంతివై, జగంబు మిథ్యగాభావించి, బ్రహ్మజ్ఞానివై, పరబ్రహ్మముతో నైక్యము బొందుమని, శ్రీ కృష్ణపరమాత్మ, పార్థునకు బోధించిన గుణత్రయ విభాగయోగమను పదునాలుగవ అధ్యాయము శ్రీ భగవద్గీతా గద్య పద్య గేయామృతమునందు అధ్యాయ సంగ్రహ పద్య తాత్పర్యములు.

హరిఃఓమ్ తత్సత్ శాంతిః శాంతిః శాంతిః

※ శ్రీ భ గ వా ను వా చ ※

1) శ్లో॥ పరం భూయః ప్రవక్ష్యామి
జ్ఞానానాం జ్ఞానముత్తమం
యజ్ఞాత్వామునయః సర్వే
పరాంసిద్ధిమితో గతాః

ప.వి పరం, భూయః, ప్రవక్ష్యామి, జ్ఞానానాం, జ్ఞానం, ఉత్తమం, యత్, జ్ఞాత్వా, మునయః, సర్వే పరాం సిద్ధిం, ఇతః, గతాః

టీ॥ యత్-దేనిని, జ్ఞాత్వా-తెలిసికొని, సర్వే-సమస్తమైన, మునయః-మునులు, ఇతః-ఈదేహానంతరము, పరాం-ఉత్కృష్టమైన, సిద్ధిం-గతిని, గతాః-పొందిరో (తత్-ఆ) పరం-శ్రేష్ఠమైన, జ్ఞానానాం-జ్ఞానములలోపల, ఉత్తమం-ఉత్తమమైనదియునగు జ్ఞానం-జ్ఞానమును, భూయః-మరల, ప్రవక్ష్యామి-చెప్పుచున్నాను

※ శ్రీ భగవంతుడు చెప్పుచున్నాడు ※

గ॥ అర్జునా యేజ్ఞానమును తెలిసికొని, సమస్త మునులు శ్రేష్ఠమైన మోక్షమును పొందిరో అట్టిజ్ఞానములలో నుత్తమమైన, జ్ఞానమును మరల నీకు చెప్పుచున్నాను

ప॥తే॥ ఎట్టి జ్ఞానంబునెరిగియు-నెల్ల మునులు
శ్రేష్ఠమైనట్టి మోక్షంబు-చెందినారొ
జ్ఞానములయందు నుత్తమ-జ్ఞానమైన
దానితెలిపెద, ఫల్గునా-వినుముమరల

గే॥ ఎట్టి జ్ఞానముతెలిసి పొందిరో
యెల్లమౌనుల మోక్షముకా

జ్ఞానములలో నుత్తమంబగు
జ్ఞానమును మరి తెలిపెదగా
అని కిరీటిని ॥శ్రీహరిని

2) శ్లో॥ ఇదంజ్ఞానము పాశ్రిత్య
మమ సాధర్మ్యమాగతాః
సర్గేఽపినోపజాయంతే
ప్రలయేన వ్యథంతిచ..

ప వి ఇదం జ్ఞానం. ఉపాశ్రిత్య. మమ. సాధర్మ్యం. ఆగతాః. సర్గే. అపి. న. ఉపజాయంతే. ప్రలయేన. వ్యధంతి. చ.

టీ॥ ఇదంజ్ఞానం-ఈజ్ఞానమును. ఉపాశ్రిత్య - పొంది. మమ-నాయొక్క. సాధర్మ్యం - స్వరూపమును. ఆగతాః-పొందినవారై. సర్గేఽపి-సృష్టికాలమందును. నోపజాయంతే-పుట్టరు. ప్రళయే-ప్రళయ కాలమందును. నవ్యథంతిచ-దుఃఖమును పొందరు

గ॥ అర్జునా యిట్టిజ్ఞానమును పొందినవారై నాయొక్క స్వరూపమును పొంది. సృష్టికాలమందు పుట్టరు. ప్రళయకాలమందును దుఃఖమును పొందరు

ప॥తే॥ ఇట్టి జ్ఞానంబుపొందిన-యట్టివారు
పొందుదురు నాస్వరూపము-పుణ్యచరిత
చెందకుందురు జన్మంబు-సృష్టియందు
వ్యథనుజెందరు వారలు-ప్రళయమందు

గే॥ పొందినవారలీ జ్ఞానమును
చెందినాదు స్వరూపముగా

పొందకుందురు జన్మసృష్టిలో
పొందరుబాధ, లయములో
అని కిరీటికి ॥శ్రీహరిని

3) శ్లో॥ మమయోని మహద్బ్రహ్మ
తస్మిన్ గర్భందధామ్యహమ్
సంభవః సర్వభూతానాం
తతోభవతి భారత .

ప.వి మమ. యోనిః, మహత్, బ్రహ్మ, తస్మిన్, గర్భం, దదామి, అహం, సంభవః, సర్వభూతానాం, తతః భవతి, భారత.

టీ॥ భారత-ఓయిర్జునా మహత్-అధికమైన, మమ-నాయొక్క, బ్రహ్మ-ప్రకృతి, యోనిః-భూతసృష్టి కారణము, తస్మిం-ఆప్రకృతి యందు, అహం-నేను, గర్భం గర్భమును, దదామి-ఉంచుచున్నాను, తతః-దానివలన సర్వభూతానాం-సమస్త ప్రాణులయొక్క సంభవః- ఉత్పత్తి, భవతి-అగుచున్నది

గ॥ అర్జునా గొప్పదైన నాయొక్కప్రకృతి సమస్త భూతసృష్టికి కారణమగుచున్నది, ఆప్రకృతియందు నేను గర్భకారణమైన బీజము నుంచుచున్నాను. దానివలన సమస్తప్రాణులు యుత్పత్తి యగు చున్నవి

ప॥తే॥ భూతసృష్టికికారణ-భూతమైన
ప్రకృతి నాదగుయోనియై-పరగుచుండు
నందు, నుంచెదబీజమే-నందువలన
ప్రాణులన్నియు జనియించు-పార్థభువిని

గే॥ అధికమగు నా ప్రకృతియందున
అన్ని ప్రాణుల సృష్టికిఁ
కారణంబగు దానియందున
గర్భబీజము నుంచెదఁ
సర్వప్రాణులు దానివలననే
జన్మమందును భారతా....
అని కిరీటికి ॥శ్రీహరిని

4) శ్లో॥ సర్వయోనిషు కౌంతేయ
మూర్తయః సంబవంతియాః
తాసాంబ్రహ్మ మహద్యోని
రహం బీజ ప్రదః వితా....

ప వి. సర్వయోనిషు, కౌంతేయ, మూర్తయః, సంభవంతి, యాః, తాసాం, బ్రహ్మ, మహత్, యోనిః, అహం. బీజప్రదః, పితా

టీ॥ కౌంతేయ - ఓయర్జునా, సర్వయోనిషు-సమస్త యోనుల యందును, యామూర్తయః - యేదేహములు, సంభవంతి - పుట్టు చున్నవో, తాసాం-ఆదేహములకు, మహత్ - అధికమైన, బ్రహ్మ-ప్రకృతి, యోనిః-గర్భధారణముచేయుతల్లి, అహం-నేను, బీజప్రదః-బీజమునొసగెడి, పితా-తండ్రిని.

గ॥ అర్జునా సమస్తయోనుల యందు, యేదేహములు పుట్టు చున్నచో ఆదేహములకు ప్రకృతి తల్లివంటిది, నేను బీజమునొసగెడి తండ్రివంటివాడను ..

ప॥తే॥ అన్ని యోనులందు జనించు-నన్ని దేహ
ములకు, ప్రకృతి తల్లి యనుచు-తెలిసికొనుము
నేను బీజమొసగుతండ్రి-ననుచు నీవు
తెలిసికొనుమయ్య ఫల్గునా-తెల్లముగను

గే॥ ఈ ప్రపంచమునందు బుట్టెడి
యీచరాచర ప్రాణికిన్
తల్లి వంటిది ప్రకృతియగు, నే
తండ్రినగుదును బీజమై
అని కిరీటికి ॥శ్రీహరిని

5) శ్లో॥ సత్వం రజస్తమ ఇతి
గుణాః ప్రకృతి సంభవాః
నిబధ్నంతి మహాబాహో
దేహేదేహిన మవ్యయమ్..

ప.వి. సత్వం, రజః, తమః, ఇతి, గుణాః, ప్రకృతిసంభవాః, నిబధ్నంతి, మహాబాహో, దేహే దేహినం, అవ్యయం

టీ॥ హేమహాబాహో - ఓయర్జునా, సత్వం-సత్వము, రజః-రజస్సు, తమః - తమస్సు, ఇతి - అనెడి, ప్రకృతిసంభవాః-ప్రకృతివలనబుట్టిన, గుణాః-గుణములు, అవ్యయం-నాశరహితుడైన, దేహినం-జీవుని, దేహే-దేహమునందు, నిబధ్నంతి - బంధించుచున్నవి

గ॥ అర్జునా సత్వము, రజస్సు, తమస్సు అనెడి ప్రకృతివలన బుట్టిన గుణములు, నాశరహితుడైన జీవుని, దేహమునందు బంధించుచున్నవి

ప॥తే॥ పుట్టుచున్నవి గుణములు-మూడు ప్రకృతి
వలన, సాత్విక, రాజస-ములును- తామ
సమును, బంధన మీగుణ-సముదయంబు
సలుపు, నవ్యయు జీవుని-సవ్యసాచి

గే॥ ప్రకృతివలననె మూడుగుణములు
ప్రభవమైనవి భారతా
సత్వ, రజము, తమంబులనియెడి
సంజ్ఞగలుగుచు దేహినిఁ
బద్ధునిజేసెను దేహమందున
ప్రబలమగు యీ త్రిగుణముల్
అని కిరీటికి ॥శ్రీహరిని

6) శ్లో॥ తత్రసత్వం నిర్మలత్వా
త్ప్రకాశక మనామయం
సుఖసంగేన బధ్నాతి
జ్ఞానసంగేన చానఘ ...

ప వి. తత్ర, సత్వం. నిర్మలత్వాత్, ప్రకాశకం. అనామయం, సుఖసంగేన. బధ్నాతి. జ్ఞానసంగేన, చ. అనఘ.

టీ॥ అనఘ - పాపరహితుడైన ఓయర్జున. తత్ర-అగుణముల యందు ప్రకాశకం-ప్రకాశము కలిగించునదియును, అనామయం-ఉపద్రవము లేనిదియునైన సత్వం-సత్వగుణము, నిర్మలత్వాత్-నిర్మలమగుట వలనను, సుఖసంగేన-సుఖాభిలాష చేతను జ్ఞానసంగేనచ-జ్ఞానాభిలాషచేతను, బధ్నాతి-బంధమును గలుగజేయుచున్నది

గ॥ అర్జునా ఆగుణములయందు ప్రకాశము కలిగించునదియును, ఉపద్రవము లేనిదియునైన, సత్వగుణము నిర్మలమగుటవలన, సుఖాభిలాషచేతను, జ్ఞానాభిలాషచేతను, జీవుని బంధించుచున్నది.

ప॥తే॥ అందు సత్వము నిర్మల-మైనదగుచు
కలుగజేయునదియును ప్ర-కాశమరయ
లేనిదై యుపద్రవమును-లేశమైన
జ్ఞాన సుఖములయందున-సంగమమున
బంధమునలుపు జీవుని-పార్థభువిని

గే॥ సత్వగుణ, మతినిర్మలంబై
స్వచ్ఛమగుచు ప్రకాశమై
యుపద్రవములులేని దగుచును
యుండి, పురుషుని బంధముగా
చేర్చి సంగము జ్ఞానసుఖముల
చేయుచున్నది భారతా
అని కిరీటికి ॥శ్రీహరిని

7) శ్లో॥ రజోరాగాత్మకం విద్ధి
తృష్ణాసంగ సముద్భవం
తన్నిబధ్నాతి కౌంతేయ
కర్మసంగేన దేహినమ్ .

ప.వి. రజః, రాగాత్మకం, విది, తృష్ణాసంగముద్భవం, తత్, నిబధ్నాతి, కౌంతేయ, కర్మసంగేన, దేహినమ్ .

టీ॥ హేకౌంతేయ-ఓయర్జునా, రజః-రజోగుణము రాగాత్మకం-అనురాగముతో కూడినదిగను, తృష్ణాసంగసముద్భవం - విషయాభిలాషవలనను, విషయాభిమానము వలనను పుట్టునదిగను, విద్ధి-తెలిసికొనుము, తత్-అరజోగుణము, దేహినం-దేహిని (జీవుని), కర్మసంగేన-కర్మాసక్తిచేతను, నిబధ్నాతి-బంధించుచున్నది

గ॥ అర్జునా రజోగుణము రాగము(ప్రీతి)తో కూడినదిగాను, విషయాభిలాషవలనను పుట్టినదానిగా తెలిసికొనుము, అరజోగుణము కర్మాసక్తిచేత జీవుని బంధించుచున్నది

ప॥తే॥ రాగమునకూడిన దగుచు-రాజసంబు
విషయవాంఛలచేతను-విషయసక్తి
వలన, పుట్టినట్టిదనుచు-తెలిసికొనుము
నలుపుజీవుని బంధంబు-సవ్యసాచి

గే॥ కోరికలచే నెల్ల కాలము
కూడి రజసము దేహినిఁ
కర్మాసక్తితో బద్ధునిజేయును
కలిగి రాగము మిక్కిలిఁ
అని కిరీటికి　　॥శ్రీహరిసి

8) శ్లో॥ తమస్త్వ జ్ఞానంజంవిద్ధి
మోహనం సర్వదేహినామ్
ప్రమాదాలస్య నిద్రాభి
స్తన్నిబధ్నాతి భారత ...

వ.వి. తమః, తు, అజ్ఞానజమ్, విద్ధి, మోహనం, సర్వదేహినామ్, ప్రమాదాలస్యనిద్రాభిః, తత్, నిబధ్నాతి, భారత,

టీ॥ భారత-ఓయర్జునా, అజ్ఞానజమ్ - అజ్ఞానమువలన కలిగిన, తమః + తు-తమోగుణమన్ననో, సర్వదేహినాం-సమస్త ప్రాణులకును, మోహనం - అవివేకమును కలుగజేయు దానినిగను, విద్ధి-తెలిసికొనుము, తత్-అది, ప్రమాదాలస్యనిద్రాభిః-మరపుచేతను, అలసత్వముచేతను, నిద్రచేతను, దేహినం - జీవుని, బధ్నాతి-బంధించుచున్నది

గ॥ అర్జునా తమోగుణము, అజ్ఞానమువలన పుట్టినదానిగా తెలిసికొనుము, అది సర్వప్రాణులను, మోహింపజేయుచున్నది. ఆగుణము జీవుని అలస్యముతోడను, నిద్రతోడను ప్రమాదముతోడను బంధించుచున్నది

ప॥తే॥ జ్ఞానహీనతచే, తామ-సముదయించు
ప్రాణులందర మోహాన-బడయజేయు
ఆలసత్వ, ప్రమాద, ని-ద్రాది లందు
బంధమొనరించు జీవుని-పార్థధరణి

గే॥ అజ్ఞానమునపుట్టి తామస
మన్ని ప్రాణుల మోహాముగా
పొందజేయును యెల్లకాలము
సందియములే దర్జునా
ఆలస్యముతో నిద్రతోడ
నజాగ్రత్తతో జీవునిగా

బద్ధునిజేయునటుల దోచును
ప్రబలమగు యీతామసమ్
అని కిరీటికి ॥శ్రీహరిని

9) శ్లో॥ సత్వం సుఖేసంజయతి
రజః కర్మణి భారత
జ్ఞానమావృత్యతు తమః
ప్రమాదే సంజయత్యుత

ప.వి. సత్వం సుఖే, సంజయతి, రజః, కర్మణి భారత, జ్ఞానం, ఆవృత్య, తు, తమః, ప్రమాదే, సంజయతి, ఉత,

టీ॥ భారత-ఓయర్జునా, సత్వం-సత్వగుణము, సుఖే-సుఖము నందు, సంజయతి-చేర్చుచున్నది, రజః-రజోగుణము, కర్మణి-కర్మములయందు, సంజయతి-చేర్చుచున్నది, తమః-తమోగుణము, జ్ఞానం-జ్ఞానమును, ఆవృత్య-ఆవరించి, ప్రమాదే - మరచియుండుట యందు, సంజయతి + ఉత-చేర్చుచున్నది గదా?

గ॥ అర్జునా సత్వగుణము, సుఖమునందు చేర్చుచున్నది, రజోగుణము కర్మలయందు చేర్చుచున్నది. తమోగుణము, జ్ఞానమును ఆవరించి ప్రమాదమునందు చేర్చుచున్నది

ప॥తే॥ చేర్చు సత్వంబు సుఖమందు,-చేర్చురజము
కర్మలెప్పుడు జేసెడి-కాంక్షయందు
జ్ఞానమావరించుచు, తామ-సంబు, సతము
చేర్చును ప్రమాదమందున-శిష్టచరిత

గే॥ చేర్చు సత్వగుణంబు సుఖమున
చేర్చు రజసము కర్మలో
తమము చేర్చు ప్రమాదమందున
దాచి జ్ఞానము పూర్తిగా
అని కిరీటికి ॥శ్రీహరి॥

10) శ్లో॥ రజస్తమశ్చాభి భూయ
సత్వంభవతి భారత
రజఃసత్వం తమశ్చైవ
తమఃసత్త్వం రజస్తథా

ప వి రజః, తమః, చ అభిభూయ, సత్వం, భవతి, భారత, రజః సత్వం, తమః, చ, ఏవ, తమః, సత్వం, రజః, తథా.

టీ॥ భారత -ఓయర్జునా, రజశ్చ-రజస్సును, తమశ్చ-తమస్సును, అభిభూయః - తిరస్కరించి, సత్వం - సత్వగుణము, భవతి-కలుగుచున్నది, రజః-రజస్సును సత్వం-సత్వమును, అభిభూయః-తిరస్కరించి, తమశ్చ-తమోగుణము, భవతి-కలుగుచున్నది, తథా-అట్లే, తమః-తమస్సును, సత్వం-సత్వమును, అభిభూయః-తిరస్కరించి, రజః-రజోగుణము, భవతి-కలుగుచున్నది

గ॥ అర్జునా, రజోగుణమును, తమోగుణమును, తిరస్కరించి, సత్వగుణము కలుగుచున్నది, రజోగుణమును, సత్వగుణమును, తిరస్కరించి, తమోగుణము కలుగుచున్నది, తమోగుణమును, సత్వగుణమును తిరస్కరించి రజోగుణము కలుగుచున్నది

ప॥తే॥ సత్వమెచ్చు, రజస, తమ-సంబు, లణచి
అణచి, రజము, సత్వము, తమ-మధికమగును
తామసగుణము, సత్వగు-ణముల నణచి
అధికమగుచుండు, రాజస-మనఘచరిత

గే॥ అణచి రజసతమో గుణంబుల
అగును వృద్ధియు సాత్వికమ్
అణచి సత్వరజోగుణంబుల
అగును వృద్ధియు తామసం
అణచి తామస సత్వగుణములు
అగును పెంపును రాజసమ్

అని కిరీటికి ॥శ్రీహరిని

11) శ్లో॥ సర్వద్వారేషు దేహేఽస్మిౙా
ప్రకాశ ఉపజాయతే
జ్ఞానంయదా తదా విద్యా
ద్వివృద్ధం సత్వమిత్యుత.

ప.వి. సర్వద్వారేషు, దేహే, అస్మిం, ప్రకాశః, ఉపజాయతే. జ్ఞానం, యదా, తదా, విద్యాత్, వివృద్ధం, సత్వం, ఇతి, ఉత,

టీ॥ అస్మిౙా-రః, దేహే-దేహమునందు, సర్వద్వారేషు-సర్వ ద్వారములయుందును, ప్రకాశః-ప్రకాశమగు, జ్ఞానం-జ్ఞానము. యదా-ఎప్పుడు, ఉపజాయతే-పుట్టుచున్నదో, తదా-అప్పుడు సత్వం-సత్వ గుణము, వివృద్ధం + ఇతి - వృద్ధిజెందినదని, విద్యాత్ + ఉత-తెలిసికొనవలయును గదా? .

గ॥ అర్జునా యెపుడు శరీరద్వారములైన, జ్ఞానేంద్రియ మూల ముగా జ్ఞానప్రకాశమైన తెలివి పుట్టుచున్నదో అప్పుడు సత్వగుణము హెచ్చెనదని తెలిసికొనుము

ప॥తే॥ అఖిల యింద్రియద్వారము-లందునెపుడు
దేహమందు ప్రకాశమౌ-తెలివిపుట్టు
నపుడు దేహమున మిగుల-యధికమైన
దనుచు తెలియుము సత్వంబు-నమలచరిత

గే॥ జ్ఞానేంద్రియ మూలంబున
జ్ఞానరూప వికాసముణా
యెపుడుకలుగునొ యీ దేహమున
అపుడునిర్మల సాత్వికమ్
వృద్ధిజెందినదనుచు ఫల్గున
విశదముగ నీవెరుగుమా
అని కిరీటికి ॥శ్రీహరిని

12) శ్లో॥ లోభః ప్రవృత్తిరారంభః
కర్మణామశమః స్పృహా
రజస్యేతాని జాయంతే
వివృద్ధే భరతర్షభ...

ప.వి లోభః, ప్రవృత్తిః, ఆరంభః, కర్మణామ్, అశమః, స్పృహా, రజసి, ఏతాని, జాయంతే, వివృద్ధే, భరతర్షభ,

టీ॥ భరతర్షభ - అర్జునా, రజసి - రజోగుణము, వివృద్ధేసతి- వృద్ధి పొందుచుండగా లోభః-లోభగుణము, ప్రవృత్తిః-సామాన్య చేష్టయు, కర్మణాం - కర్మములయొక్క, ఆరంభ ః -ఆరంభమును, అశమః-శమము లేకపోవుటయు, స్పృహా-ఇచ్ఛయు, ఏతాని-ఈచిహ్నములు, జాయంతే-పుట్టుచున్నవి

గ॥ అర్జునా రజోగుణము వృద్ధిపొందినపుడు, లోభగుణమును, కర్మాసక్తియు, ఇంద్రియనిగ్రహము లేకపోవుటయు, వ్యాపకము, అశాంతి, ఆశ మొదలగు గుణములు కలుగుచున్నవి

ప॥తే॥ అధికమగుచుండ రాజస-మను గుణంబు
అపుడులోభ ప్రవృత్తియు-ఆశ, కర్మ
సలుపు నాసక్తియు నశాంతి-కలుగుచుండు
ననుచు తెలియుము ఫల్గునా-మనసునందు

గే॥ కర్మాసక్తియు ధనాపేక్షము
కామమెప్పుడు కలుగునో
అపుడు తెలియుము యీదేహమున
యధికమైనది రాజసం

అని కిరీటికి ॥శ్రీహరిని

13) శ్లో॥ అప్రకాశోఽప్రవృత్తిశ్చ
ప్రమాదో మోహమేవచ
తమస్యేతాని జాయంతే
వివృద్ధే కురునందన

ప.వి. అప్రకాశః, ప్రవృత్తిః, చ, ప్రమాదః, మోహః, ఏవ, చ, తమసి, ఏతాని, జాయంతే, వివృద్ధే, కురునందన.

టీ॥ కురునందన-ఓయర్జునా. అప్రకాశః-వివేకము లేకపోటయు, ప్రమాదః-అజాగ్రత్త, మోహః-అజ్ఞానము, ఏతాని-ఈలక్షణములు, తమసి-తమోగుణము, వివృద్ధేసతి-వృద్ధిపొందినపుడు, జాయంతే-పుట్టుచున్నవి

గ॥ అర్జునా తమోగుణమభివృద్ధి చెందినపుడు, అజ్ఞానము, నిర్వ్యాపారము, ప్రమాదము మూఢభావము యిట్టి గుణములు కలుగుచున్నవి

ప॥తే॥ అధికమగుచుండ తామస-మనుగుణంబు
అప్రవృత్తియు, నజ్ఞాన-మంతెగాక
సలుపగూడని కార్యముల్-సలుపు తలపు
పొందు మోహప్రమాదముల్-పుణ్యచరిత

గే॥ అవివేకంబ జ్ఞానంబును
అలసత, మోహము, జడత
లెపుడుకలుగునో యీదేహమున
యపుడు తామసమధికమౌ
ననుచు తెలియుము నీవు పార్థా
యన్నియును విశదంబుగా
అని కిరీటికి ॥శ్రీహరిని

14) శ్లో॥ యదాసత్త్వే ప్రవృద్ధేతు
ప్రలయంయాతి దేహభృత్
తదోత్తమ విదాంలోకా
నమలాన్ ప్రతిపద్యతే.

ప.వి. యదా, సత్వే, ప్రవృద్ధే, తు, ప్రలయం, యాతి, దేహభృత్, తదా, ఉత్తమవిదాం, లోకాన్, అమలాన్, ప్రతిపద్యతే..

టీ॥ యదా-యెప్పుడు సత్వే-సత్వగుణము, ప్రవృద్ధేతు-వృద్ధి పొందుచుండగా దేహభృత్-దేహధారి(జీవుడు) ప్రలయమ్-మరణమును, యాతి-పొందుచున్నాడో, తదా-అప్పుడు, ఉత్తమవిదాం-ఉత్తమ జ్ఞానులయొక్క. అమలాం-నిర్మలములైన, లోకాన్-లోకములను, ప్రతిప్రద్యతే-పొందుచున్నాడు.

గ॥ అర్జునా యెప్పుడు సత్వగుణమభివృద్ధి పొందుచున్నదో అపుడు జీవుడు దేహమును విడిచినయెడల (మరణము పొందిన) నిర్మలమైన ఉత్తమజ్ఞానులు పొందెడి పుణ్యలోకములను, పొందుచున్నాడు

ప॥ తే॥ సత్వగుణ మెప్పుడభివృద్ధి-జరుగుచుండు
నపుడు జీవుండు, మరణంబు-నందెనేని
పుణ్యకర్మలు సలిపిన-పుణ్యజనులు
పొందు నిర్మలంబైనట్టి-పుణ్యలోక
ములను, పొందుచుండునతడు-పురుషశ్రేష్ఠ

గే॥ ఎపుడు హెచ్చునో సత్వగుణము
అపుడీ దేహి మృత్యువున్

పొందగలిగిన పుణ్యజనములు
పుణ్యకర్మలు సలుపుచున్
పొందుచుండెడి పుణ్యలోకము
పొందుచుండును భారతా
అని కిరీటికి ॥శ్రీహరిని

15) శ్లో॥ రజసి ప్రలయంగత్వా
కర్మసంగిషు జాయతే
తథా ప్రలీనస్తమసి
మూఢయోనిషు జాయతే .

ప వి. రజసి ప్రలయమ్, గత్వా. కర్మసంగిషు, జాయతే, తథా, ప్రలీనః, తమసి, మూఢయోనిషు, జాయతే

టీ॥ రజసి-రజోగుణము వృద్ధిపొందినప్పుడు, ప్రలయం-మరణమును, గత్వా-పొంది కర్మసంగిషు-కర్మానురక్తులగు మనుష్యుల యందు, జాయతే-పుట్టుచున్నాడు. తదా-అటులే. తమసి - తమోగుణము వృద్ధిపొందినపుడు, ప్రలీన-మృతిపొందినవాడు. మూఢయోనిషు-మూఢప్రాణులయందు, జాయతే-పుట్టుచున్నాడు (పశు, పక్షి, శునక, సూకరాదులయందు)

గ॥ అర్జునా రజోగుణమభివృద్ధి జెందినపుడు, మరణించిన, కర్మాసక్తిగల మనుజలోకమునందు పుట్టుచుండును, తమోగుణమభివృద్ధి జెందినపుడు మరణించిన మూఢప్రాణుల యందు (పశు, పక్షి, శునక సూకరాదులయందు) పుట్టుచుండును.

ప॥తే॥ అధికమగుచుండ రజసంబు-నపుడుజచ్చి
కర్మసంగమౌ మనుజలో-కానబుట్టు
అధికమగుచుండ, తామస-మపుడుజచ్చి,
మూఢయోనులయందున-పుట్టుచుండు

గే॥ ఎపుడు హెచ్చునో రజోగుణం
బపుడు మరణముపొందినఁ
పుట్టు మానుషలోకమందున
భూరి కర్మాసక్తుడై ॥అని॥
యెపుడు హెచ్చునో తామసగుణము
అపుడు మరణముపొందినఁ
జననమందును మూఢయోనుల
శునకసూకర జన్మముల్

అని కిరీటికి ॥శ్రీహరిని

16) శ్లో॥ కర్మణః సుకృతస్యాహుః
సాత్వికం నిర్మలం ఫలం
రజసస్తు ఫలం దుఃఖ
మజ్ఞానంతమసఃఫలమ్ ...

ప.వి. కర్మణః సుకృతస్య, ఆహుః, సాత్వికం, నిర్మలం, ఫలం, రజసః, తు, ఫలం, దుఃఖం, అజ్ఞానం, తమసః, ఫలం..

టీ॥ సుకృతస్య-సత్వగుణమువలన బుట్టిన, కర్మణః-కర్మమునకు, సాత్వికం-సత్వప్రధానమైన, నిర్మలం - ప్రకాశ బహుళమైన, ఫలం-ఫలమును ఆహుః-చెప్పుదురు రజసస్తు-రజోగుణాత్మమునకు,

ఫలం-ఫలమును, దుఃఖః-దుఃఖకరమైన దానినిగా, ఆహుః-చెప్పు దురు. తథా-అట్లే, తమసః-తామసకర్మమునకు ఫలం-ఫలమును. అజ్ఞానం-అజ్ఞానమునుగా. ఆహుః-చెప్పుదురు.

గ॥ అర్జునా సత్వగుణముచే జనించిన కర్మకు నిర్మలమగు. సుఖము. ఫలమనియు. రజోగుణముచే కలిగిన కర్మకు దుఃఖప్రాప్తి ఫలమనియు. తమోగుణముచే జనించినకర్మకు అజ్ఞానము ఫలమనియు. చెప్పుచున్నారు

ప॥తే॥ సాత్వికంబగు కర్మకు-సాత్వికమగు
అమలమైనట్టి సౌఖ్యంబు-నగును ఫలము
కలుగు దుఃఖంబు రాజస-కర్మఫలము
తమసకర్మకు నజ్ఞాన-తమముఫలము

గే॥ సత్వగుణమున పుట్టుకర్మకు
సౌఖ్యఫలమని తెలియుమా
రాజసంబునబుట్టు కర్మకు
ప్రాప్తఫలమది దుఃఖమే
తమోగుణమున బుట్టుకర్మకు
తగిన ఫలమజ్ఞానమే
అని కిరీటికి ॥శ్రీహరిని

17) శ్లో॥ సత్వాత్సంజాయతే జ్ఞానం
రజసోలోభ ఏవచ
ప్రమాదమోహౌ తమసో
భవతోఽజ్ఞానమేవచ....

ప.వి. సత్వాత్, సంజాయతే, జ్ఞానం, రజసః లోభః, ఏవ, చ, ప్రమాదమోహౌ, తమసః, భవతః, అజ్ఞానం, ఏవ, చ.

టీ॥ సత్వాత్-సత్వగుణమువలన, జ్ఞానం-జ్ఞానము, సంజాయతే-కలుగుచున్నది, రజసః-రజోగుణము వలన, లోభః-లోభగుణము, సంజాయతే-పుట్టుచున్నది, తమసః-తమోగుణము వలన, ప్రమాద మోహౌ - ప్రమాదమును మోహమును, భవతః - కలుగుచున్నవి, అజ్ఞానం + ఏవ + చ-అజ్ఞానమున్ను, భవతి-కలుగుచున్నది .

గ॥ అర్జునా సాత్వికగుణమువలన జ్ఞానము కలుగుచున్నది, రజోగుణమువలన లోభము కలుగుచున్నది, తామసగుణముచేత ప్రమాధము, మోహము, అజ్ఞానమున్ను కలుగుచున్నవి .

ప॥తే॥ సత్వగుణమున, జ్ఞానంబు-సంభవించు
కలుగులోభము, రజసము-వలనమిగుల
కలుగుచుండును, తమసము-వలన, జ్ఞాన
శూన్యతయు, నజాగ్రతయును,-శూరవర్య

గే॥ కలుగు జ్ఞానము సాత్వికంబున,
కలుగులోభము రజమునఁ
కలు, గజాగ్రత తామసముచే
కలుగు నజ్ఞానంబునుఁ
అని కిరీటికి ॥శ్రీహరివి

18) శ్లో॥ ఊర్ధ్వంగచ్ఛంతి సత్వస్థా
మధ్యేతిష్ఠంతి రాజసాః

జఘన్య గుణవృత్తిస్థా
అధోగచ్ఛంతి తామసాః.

ప.వి. ఊర్ధ్వం, గచ్ఛంతి, సత్వస్థాః, మధ్యే, తిష్ఠంతి, రాజసాః, జఘన్యగుణవృత్తిస్థాః, అధః, గచ్ఛంతి, తామసాః

టీ॥ సత్వస్థా - సాత్వికులు, ఊర్ధ్వం - దేవాదిలోకములకు. గచ్ఛంతి-పోవుచున్నారు, రాజసాః-రజోగుణము గలవారు, మధ్యే-మనుష్యలోకమందు, తిష్ఠంతి-ఉందురు, జఘన్యగుణవృత్తిస్థా-నికృష్టమైన గుణప్రవృత్తిగల, తామసాః-తమోగుణముగలవారు, అధః-క్రిందికి (నరకమునకు) గచ్ఛంతి-పోవుచున్నారు

గ॥ అర్జునా సాత్వికులు దేవాదిలోకములకు పోవుచున్నారు. రజోగుణముగలవారు మానుషలోకము చెందుచున్నారు, తమోగుణముగలవారు పశు, పక్షి, క్రిమి, కీటకాదులై జనించుచున్నారు.

ప॥తే॥ సాత్వికులు వెళ్లుచుందురు-స్వర్గమునకు
మర్త్యలోకాన రజసులు-మనుజులగుచు
పుట్టుచుందురు మరిమరి-పుట్టిగిట్టి
అధమ జన్మముపొందుచు-నధమగతిని
పక్షి, పశువులై తమసులు-పార్థభువిని

గే॥ పొందుచుండెద రూర్ధ్వలోకము
పుణ్యవంతులు సాత్వికుల్
పొందుచుందురు మనుజలోకము
పొంది పాపము రాజసుల్

పొందుదురు పశుపక్షియోనుల
పూర్ణపాపులు తామసుల్
అని కిరీటికి ॥శ్రీహరిని

19) శ్లో॥ నాన్యం గుణేభ్యః కర్తారం
యదా ద్రష్టాఽను పశ్యతి
గుణేభ్యశ్చ పరం వేత్తి
మద్భావంసోఽధి గచ్ఛతి

ప.వి. న. అన్యమ్. గుణేభ్యః. కర్తారం. యదా. ద్రష్టా. అనుపశ్యతి. గుణేభ్యః. చ. పరం. వేత్తి. మద్భావం. సః. అధి గచ్ఛతి.

టీ॥ యదా-ఎప్పుడు. ద్రష్టా-ఆత్మదర్శి (తెలిసినవాడు) గుణేభ్యః-గుణములకంటె. అన్యం-ఇతరమును. కర్తారం - కర్తనుగా. నానుపశ్యతి-చూడడో. గుణేభ్యః-గుణములకంటె. పరం-శ్రేష్ఠుడైన (గుణవ్యాపార సాక్షిభూతుని). వేత్తి-తెలియుచున్నాడో. అప్పుడు సః-వాడు. మద్భావం-నాస్వరూపమును. అదిగచ్ఛతి-పొందుచున్నాడు.

గ॥ అర్జునా తెలిసినవాడు (ఆత్మజ్ఞాని. గుణములే. కర్తలనియు. తనను గుణములకంటె. వేరగువానినిగా తెలిసికొనుచున్నాడో. అప్పుడతడు. నాస్వరూపమును పొందుచున్నాడు. మోక్షమును పొందుచున్నాడు

ప॥తే॥ ద్రష్టయగువాడు కర్తను-తానుగాను
అగును గుణములు కర్తల-టంచునెరిగి

వేరుతానని, గుణములు-వేరటంచు
తెలిసినప్పుడు ననుబొంది-కలసియుండు.

గే॥ కర్తలగును, గుణంబులనుచును
కర్తతాను కాననుచుఞ
తాను వేరని గుణములు వేరు
అనుచు తెలిసిన వాడునౌ
నతడుచెందును, నా స్వరూపము
అర్జునా ముక్తుండునౌ:
అని కిరీటికి ॥శ్రీహరిని

20) శ్లో॥ గుణానేతా నతీత్య త్రీఞ
దేహీదేహ సముద్భవాఞ
జన్మ మృత్యు జరాదుఃఖై
ర్విముక్తోఽ మృతమశ్నుతే ....

ప.వి గుణాఞ, ఏతాఞ, అతీత్య, త్రీఞ, దేహీ, దేహసముద్భవాఞ, జన్మమృత్యుజరాదుఃఖైః, విముక్తః, అమృతం, అశ్నుతే..

టీ॥ దేహీ-జీవుడు, దేహసముద్భవాఞ-దేహమువలన బుట్టిన, త్రీఞ-మూడైన, ఏతాఞ గుణాఞ-ఈగుణములను, అతీత్య-అతిక్రమించి, జన్మమృత్యుజరాదుఃఖైః-జననము మరణము, ముదిమి, అను దుఃఖములచేతను, విముక్తః-విడువబడినవాడై, అమృతమును మోక్షమును, అశ్నుతే-పొందుచున్నాడు

గ॥ అర్జునా జీవుడు దేహమువలన బుట్టిన, యీ సత్వ రజో గుణములను యెపుడు దాటిపోవుచున్నాడో, అపుడు జనన, మరణ

జరా, రూపమైన. సంసార దుఃఖమునుండి. విడువబడినవాడై.
మోక్షమును బొందుచున్నాడు

ప॥తే॥ దేహము వలన కలుగు, యీ-త్రిగుణగణము
నెరిగి, వానిని పూర్తిగా-మీరు వాడు,
జనన, మరణము, జరయను-సర్వదుఃఖ
ములను వదలి• మోక్షంబును-పొందగలడు

గే॥ జనన మరణము జరాదులనెడి
సర్వవ్యధలకు హేతువౌ
దేహమువలన కలిగి యుండిన
త్రిగుణముల సంపూర్తిగా
దాటిపోయినవాడు పొందును
ధనంజయా మోక్షమునే

అని కిరీటికి ॥శ్రీహరిని

—:అర్జున ఉవాచ:—

21) శ్లో॥ కైర్లింగైస్త్రీ న్గుణానేతా
నతీతో భవతిప్రభో
కిమాచారః కథం చైతాం
స్త్రీణ్ గుణా నతివర్తతే...

ప.వి కైః, లింగైః, త్రీణ్, గుణాణ్, ఏతాణ్, అతీతః.
భవతి, ప్రభో, కిమాచారః. కథం. చ, ఏతాణ్, త్రీణ్. గుణాణ్.
అతివర్తతే.

టీ॥ హేప్రభో - ఓకృష్ణపరమాత్మా, ఏతాన్ - ఈ, త్రీన్ - మూడైన, గుణాన్-గుణములను, కైః-ఎటువంటి, లింగైః-లక్షణ ములచేత, అతీతః - అతిక్రమించినవాడు, భవతి-అగుచున్నాడు, కిమాచారః - యెట్టియాచారము గలవాడు, ఏతాన్ - ఈ, త్రీన్ - మూడైన, గుణాం-గుణములను, కథంచ-ఎట్లు, అతివర్తతే-అతిక్ర మించుచున్నాడు

✱ అర్జును డడుగుచున్నాడు ✱

గ॥ ఓ శ్రీకృష్ణా ఈ త్రిగుణములను దాటిపోయిన వానికేమి గురుతులుండును, వాడెట్టి యాచారముగలవాడై యుండును, వాదే విధముగా యీ మూడుగుణములను మీరిపోవుచున్నాడో తెలియ జేయుము

ప॥తే॥ ఇట్టి త్రిగుణముల్ దాటువా-డెట్టి చిహ్న
ములను కలిగియుండగలడో-తెలుపుకృష్ణ
వానియాచార మెట్టిది,-వాడు, వాని,
నేవిధంబుగ మీరునో-యెరుగజెపుమ

గే॥ మూడు గుణములు దాటియుండిన
వాడు యే గతియుండునో
వానియాచారంబు యెట్టిది
వాని కుండెడి గురుతులున్
మూడు గుణముల నెటుల దాటునొ
ముఖ్యమార్గము తెలుపుమా

అనుచు నడిగెను కృష్ణమూర్తిని
అర్జునుడు రణభూమిలో ॥శ్రీ॥

— శ్రీ భగవానువాచ — శ్రీ భగవంతుడు చెప్పుచున్నాడు.

22) శ్లో॥ ప్రకాశంచ ప్రవృత్తించ
మోహమేవచ పాండవ
న ద్వేష్టి సంప్రవృత్తాని
నని వృత్తాని కాంక్షతి...

ప.వి ప్రకాశం, చ, ప్రకృతిం, చ, మోహం, ఏవ చ, పాండవ న, ద్వేష్టి, సంప్రవృత్తాని, న, నివృత్తాని కాంక్షతి,

టీ॥ పాండవ - ఓయర్జునా. (త్రిగుణాతీతుడైనయోగి,) సంప్రవృత్తాని-సంప్రాప్తములైన, ప్రకాశంచ-ప్రకాశమును, ప్రవృత్తించ-ప్రవృత్తిని, మోహమేవచ - మోహమును, నద్వేష్టి - ద్వేషింపడు. నివృత్తాని-విడిచిపోయిన వానిని, నకాంక్షతి-కోరడు

గ॥ అర్జునా గుణాతీతుడైనయోగి, సత్వగుణమువలన కలిగిన, ప్రకాశమునుగాని. రజోగుణమువలన కలిగిన ప్రవృత్తిగాని. తమోగుణమువలన గలిగినమోహమునుగాని ద్వేషింపడు, అవి తనను వదలి పోయిను వానిని కోరడు

ప॥తే॥ త్రిగుణములు మీరిపోయిన-దివ్యయోగి
సత్వ, రజతమో గుణముల-సంభవంబు,
లగు ప్రకాశ, ప్రవృత్తిమో-హంబులనెడి
వానిపై, వైరముగొనడు-వాని, కోర
డెపు, డవి వదలిపోయిన-యించుకేని

గే॥ మూడు గుణముల చేత జరిగెడి
ముఖ్యమగు నన్నింటిపై
ఇచ్ఛా ద్వేషము లుంచకుండును
యించుకేనియు నెప్పుడున్
అని కిరీటికి ॥శ్రీహరిని

23) శ్లో॥ ఉదాసీన వదాసీనో
గుణై ర్యోనవి చాల్యతే
గుణా వర్తంత యిత్యేవ
యోఽవతిష్ఠతి నేంగతే ...

వ.వి. ఉదాసీనవత్ ఆసీనః, గుణైః, యః, న, విచాల్యతే, గుణాః, వర్తంతే, ఇతి, ఏవ. యః అవతిష్ఠతి, న, ఇంగతే,

టీ॥ ఉదాసీనవత్-తటస్థునివలె, ఆసీనః,ఉన్న, యః-ఎవ్వడు. గుణైః-గుణములచేత, నవిచాల్యతే - చలింపబడడో. గుణాః - గుణములు. వర్తంతఇత్యేవ-వర్తించుచున్నవని, యః-ఎవడు, అవతిష్ఠతి-ఉండునో, నేంగతే-చలింపడో

గ॥ అర్జునా గుణాతీతుడు గుణములయందును, గుణకార్యముల యందును, లక్ష్యము లేనివాడై యుదాసీనుడుగా యుండును, జరుగుచున్న సర్వకార్యములు, గుణవ్యాపారమని తలంచి, చలింపక యుండును

ప॥తే॥ ఎవడు దాసీనత వహించి-యెల్లకార్య
ములను, గుణములచేతను,-చలన రహితు

డగుచు, గుణముల వర్తన-మని తలంచి
నిశ్చలంబుగ బుద్ధిని-నిలుపువాడు.

గే॥ మూడు గుణముల కార్యంబులను
వాడు లక్ష్యము చేయక౼
యెల్లపనులు గుణకార్యములని
యెంచుచలనము పొందక౼
అని కిరీటికి ॥శ్రీహరిని

24) శ్లో॥ సమదుఃఖ సుఖస్వస్థః
సమలోష్టాశ్మ కాంచనః
తుల్యప్రియాప్రియో ధీర
స్తుల్యనిందాత్మ సంస్తుతిః

ప.వి. సమదుఃఖసుఖః, స్వస్థః, సమలోష్టాశ్మకాంచనః, తుల్యప్రియాప్రియః. ధీరః, తుల్యనిందాత్మసంస్తుతిః

టీ॥ సమదుఃఖసుఖః - సుఖదుఃఖములయందు సమబుద్ధిగలవాడును, స్వస్థః - ఆత్మయందే సుఖించువాడును. సమలోష్టాశ్మకాంచనః - మట్టిగడ్డను, రాయిని, బంగారమును, సమముగా చూచువాడును. తుల్యప్రియాప్రియః - ప్రియా ప్రియములయందు, సముడును, ధీరః-ధైర్యము గలవాడును

గ॥ అర్జునా సుఖదుఃఖములయందు, సమబుద్ధి గలవాడును, ఆత్మయందే సుఖించువాడును, మట్టిగడ్డ, రాయిని, బంగారమును, సమముగా చూచువాడును, ప్రియాప్రియముల యందు సముడును, ధైర్యము గలవాడును, నిందాస్తుతులయందు సమతగలవాడు .

ప॥ తే॥ సుఖము దుఃఖంబు సమముగా-జూచువాడు
కాంచనము, మన్ను, రాయిని-కాంచు సమత
అప్రియ ప్రియము సమత-నరయువాడు
స్తోత్రములనిందలసమము-జూచువాడు
ధీరుడు త్రిగుణాతీతుడు-ధీవరేణ్య.

గే॥ సుఖము దుఃఖము సమముగాగను
చూచుప్రియు, మప్రియములఁ
పాషాణంబును, మట్టియుండను
బంగారంబు, సమముగా ॥అ॥
చూచుచుండు త్రిగుణాతీతుడు
స్తోత్రనిందల సమముగా
కలిగియుండును మిగులధైర్యము
కలతబొందడు దేనికిఁ.

అని కిరీటికి ॥శ్రీహరిని

25) శ్లో॥ మానావమానయో స్తుల్య
స్తుల్యో మిత్రారిపక్షయోః
సర్వారంభ పరిత్యాగీ
గుణాతీతః సఉచ్యతే

ప వి. మానావమానయోః, తుల్యః, తుల్యః, మిత్రారిపక్షయోః, సర్వారంభపరిత్యాగీ, గుణాతీతః, సః, ఉచ్యతే

టీ॥ మానావమానయోః-మానావ మానసములయందు. తుల్యః-సముడును మిత్రారిపక్షయోః-శత్రు మిత్ర పక్షములయందు తుల్యః-

సముడును. సర్వారంభపరిత్యాగీ-సకల కార్యారంభములను విడిచిన వాడును. యః-యెవ్వడో. సః-వాడు. గుణాతీతః - గుణాతీతుడని. ఉచ్యతే-చెప్పబడును

గ॥ అర్జునా గౌరవాగౌరవములను సమముగా చూచువాడును. శత్రుమిత్రులయందు, సమత్వము గలవాడును. సకల కార్యములను విడిచిన వానిని త్రిగుణాతీతుడని చెప్పబడుచున్నాడు .

ప॥తే॥ గౌర వాగౌరవములను-గాంచి సమత
శత్రుమిత్రుల గను వాని-సమము గాను
అన్ని పనులను విడనాడి-నట్టివాని
నందురిల, త్రిగుణాతీతు-డనుచు పార్థ

గే॥ మాన మవ మానంబులందును
మంచి చెడుగులయందును॥
శత్రులందును మిత్రులందును
సముడుగా వర్తించెడి॥
విడిచియుండును సర్వపనులను
వాడు త్రిగుణాతీతుడౌ
అని కిరీటికి ॥శ్రీహరిని

26) శ్లో॥ మాంచయోఽ వ్యభిచారేణ
భక్తి యోగేన సేవతే
సగుణాꣳ సమతీత్యైతాꣳ
బ్రహ్మ భూయాయ కల్పతే

ప.వి. మామ్. చ. యః. అవ్యభిచారేణ భక్తియోగేన సేవతే, సః. గుణాః. సమతీత్య. ఏతాన్ బ్రహ్మ భూయాయ. కల్పతే.

టీ॥ యః-ఎవ్వడు. మాం-నన్ను. అవ్యభిచారేణ-నిశ్చలమైన. భక్తియోగేన-భక్తియోగముచేత. సేవతే - సేవించుచున్నాడో. సః- వాడు. ఏతాన్ గుణాన్-ఈ గుణములను. సమతీత్య - అతిక్రమించి. బ్రహ్మభూయాయ-బ్రహ్మభావము కొరకు కల్పతే-సమర్థుడగుచున్నాడు.

గీ॥ అర్జునా యెవడు నిశ్చలమైన భక్తియోగముచేత, నన్ను సేవించుచున్నాడో వాడీగుణములను అతిక్రమించి, బ్రహ్మభావమును పొందుటకు సమర్థుడగుచున్నాడు

ప॥తే॥ ఎవడు నిశ్చలభక్తితో-నెల్ల వేళ
సనుపుచుండునో నా సేవ-నవ్యసాంచి
వాడు త్రిగుణములను మీరి-బ్రహ్మభావ
మందుటకు, తగునర్హత-నందగలడు . .

గే॥ సర్వకాలము నన్ను గొలుచుచు
చలనమొందని భక్తుడై
బ్రహ్మ భావము పొందనర్హుడు
పార్థవాడగు జ్ఞానియై
వాడు త్రిగుణాతీతుడగుచును
వాడు పొందును మోక్షమున్
అని కిరీటికి ॥శ్రీహానిధి

27) శ్లో॥ బ్రహ్మణోహి ప్రతిష్ఠాఽహ
మమృతస్యావ్యయస్యచ

శాశ్వతస్యచ ధర్మస్య
సుఖస్యైకాంతి కస్యచ

ప.వి బ్రాహ్మణః. హి. ప్రతిష్ఠా అహమ్. అమృతస్య. వ్యయస్య. చ శాశ్వతస్య చ. ధర్మస్య. సుఖస్య ఏకాంతికస్య చ

టీ॥ అహం-నేను అమృతస్య-నాశరహితుడను అవ్యయస్య-నిర్వికారుడునగు బ్రహ్మణః-పరమాత్మకును. శాశ్వతస్య-నిత్యమైన. ధర్మస్యచ-ధర్మమునకును, ఐకాంతికస్య-అచంచలమైన. సుఖస్య-ఆనందమునకును, ప్రతిషాహి-ఆధారమైనవాడను కదా

గ॥ అర్జునా నేను నాశములేని. వికారములేని. పరబ్రహ్మము నకును, శాశ్వతమైన ధర్మమునకును. చలనములేని ఆనందమునకును (మోక్షమునకును) ఆధారమైనవాడను కదా .

ప॥తే॥ నిర్వికారమునై నట్టి-నిత్యమైన
బ్రహ్మమునకును స్థిరమునై-పరగు ధర్మ
మునకు, చంచలమెప్పుడు-లేని సౌఖ్య
పదమునకు, నేనెయగుదును-ప్రాపు పార్థ
ప్రాపు = ఆశ్రయము

గే॥ అమృతుండును, నవ్యయుండును
నైన యా పరబ్రహ్మకున్
శాశ్వతంబగు ధర్మమెప్పుడు
సర్వవిధముల నిలువగా
అచంచలమౌ యానందమునకు
ఆధారుడను ఫల్గునా

అని కిరీటికి బోధజేసెను
అచ్యుతుడు రణభూమిలో
శ్రీహరి శ్రీ ....

గ॥ ఇది శ్రీ కవిరత్న రత్నాకరము వెంకటేశ్వర కవి విరచితమై గద్య పద్య గేయరూపంబును, శ్రీ కృష్ణార్జునుల సంవాదంబగు, శ్రీ భగవద్గీతా గద్య పద్య గేయామృతము నందు గుణత్రయ విభాగయోగమను పదునాలుగవ అధ్యాయము సంపూర్ణము.

హరిః ఓమ్ తత్సత్ హరిః ఓమ్
శాంతిః శాంతిః శాంతిః





అధ్యాయ సంగ్రహము - పురుషోత్తమ ప్రాప్తియోగము

మ॥ సంసారంబను వృక్షమున్, గురుకృపన్
సం శూన్య రా గుండవై
ధ్వంసంబున్ పరిపూర్తిగా సలుపుమా
వైరాగ్య ఖడ్గంబుచే
సంసక్తిన్ విడనాడి, సర్వమున, ను
జ్ఞానుండవై, భక్తినన్
సంసేవించి సతంబు, ముక్తిగను మా
సర్వజ్ఞతం పాండవా

తా॥ అర్జునా పరబ్రహ్మము మూలమై, వ్యాపించియున్న అశ్వత్థమనెడి సంసార వృక్షమును, గురుకృపవలన కలిగిన జ్ఞానముచేత వైరాగ్యమను ఖడ్గముచే ఛేదించి, సంసక్తిని విడిచి జ్ఞానవంతుడవై, భక్తితో నన్ను సేవించి, నాయందైక్యము పొంది, కృతార్థుడవగుమని శ్రీ కృష్ణ పరమాత్మ, పార్థునకు బోధించిన పురుషోత్తమ ప్రాప్తి యోగమను పదునైదవ అధ్యాయము శ్రీ భగవద్గీతా గద్య పద్య గేయామృతమునందు, అధ్యాయ సంగ్రహ పద్య తాత్పర్యములు.

హరిః ఓమ్ తత్సత్ హరిః ఓమ్

శాంతిః శాంతిః శాంతిః

※ శ్రీ భ గ వా ను వా చ ※

※ శ్రీ భగవంతుడు చెప్పుచున్నాడు ※

1 శ్లో॥ ఊర్ధ్వమూల మధః శాఖ
మశ్వత్థం ప్రాహురవ్యయమ్
ఛందాంసి యస్య పర్ణాని
యస్తం వేద సవేద విత్..

ప.వి. ఊర్ధ్వమూలం, అధఃశాఖమ్, అ శ్వ త్థ మ్, ప్రాహుః, అవ్యయం, ఛందాంసి యస్య, పర్ణాని, యః, తమ్, వేద, సః, వేదవిత్

టీ॥ ఊర్ధ్వమూలం-ఊర్ధ్వ-బ్రహ్మము, మూలం - మూలముగా (వేరు) గలిగినట్టియు, అధఃశాఖమ్-అధః-క్రిందను, (మహదహంకార ములు) శాఖం-శాఖలుగా గలిగినట్టియు, అశ్వత్థం - అశ్వత్థమనెడి సంసారవృక్షమును, అ వ్య య ం - నాశరహితమైనట్టి దానినిగను ప్రాహుః-చెప్పుదురు, యస్య-ఏయీ అశ్వత్థవృక్షమునకు, ఛందాంసి- వేదములు, పర్ణాని-ఆకుల వంటివో, తం-ఆవృక్షమును, యః-ఎవడు, వేద-మెరుగుచున్నాడో, సః-వాడు, వేదవిత్-వేదార్థమును తెలిసిన వాడు

గ॥ అర్జునా ఊర్ధ్వమున(పైన) మూ ల ము గలదియును, క్రిందను కొమ్మలు గలదియునగు, అశ్వత్థమనెడి వృక్షమును, నాశర హితమైనట్టి దానినిగా చెప్పిరి. దానినెవడు తెలిసికొనుచున్నాడో, వాడు వేదార్థమును తెలిసినవాడు

ప॥చే॥ ఊర్ధ్వమందున మూలంబు-నున్న దాని
క్రింది భాగాన శాఖలు-పొందు దాని

వేదముల, నాకులగుచును-వెలయు దాని
అవ్యయంబగు నశ్వత్థ-మనిరి, దాని
విధ మెరింగినవాడగు-వేద విదుడు

గే॥ బ్రిహ్మమే మూలంబునగుచును
పర్ణములు వేదంబులై
శాఖలు గలిగి క్రింది భాగము
సంసారమగా వృక్షముగా
అనాదియగు నశ్వత్థ వృక్ష
మనుచు తెలిపిరి పండితుల్
అట్టి వృక్షము నెవడు తెలియునో
అతడు వేదార్థ విదుడౌ

అని కిరీటికి ॥శ్రీహరిని

2) శ్లో॥ అధశ్చోర్ధ్వం ప్రసృతాస్తస్య శాఖా
గుణప్రవృద్ధా విషయ ప్రవాలాః
అధశ్చ మూలాన్యను సంతతాని
కర్మానుబంధీని మనుష్యలోకే

ప.వి. అధః ఊర్ధ్వః, ప్రసృతాః, తస్య శాఖాః, గుణప్రవృద్ధాః, విషయప్రవాలాః, అధః, చ, మూలాని, అనుసంతతాని, కర్మానుబంధీని, మనుష్యలోకే,

టీ॥ తస్య - ఆ యశ్వత్థవృక్షముయొక్క, శాఖాః - కొమ్మలు, గుణప్రవృద్ధాః-గుణములచేత ప్రవృద్ధములైనవియు, విషయప్రవాలాః విషయములనెడి చిగుళ్లు గలదియునై, అధః + చ - క్రిందికిని,

ఊర్ధ్వం-మీదికిని, ప్రసృతాః-వ్యాపించియున్నవి, మూలాని-వేరులు, కర్మానుబంధీని-కర్మానుబంధము గలవియై, మనుష్యలోకే - మనుజ లోకమునందు. అధః + చ-క్రిందను, అనుసంతతాని - విస్తరించి యున్నవి

గ॥ అర్జునా ఆ యశ్వత్థముయొక్క కొమ్మలు, గుణములచేత వృద్ధి పొందింపబడినవియును, విషయమువనెడి చిగుళ్లు గలవియై, క్రిందికిని మీదికిని, వ్యాపించియున్నవి. వేరులు కర్మానుబంధము కలవియై, మనుష్యలోకమునందు క్రింద విరివిగా వ్యాపించియున్నవి

ప॥ తే॥ అట్టి సంసార మశ్వత్థ-మనెడి తరువు
విషయ పల్లవములు గల-వియగు, శాఖ
లధమ మూర్ధ్వంబుగాపలు-విధము పాఱిక
కర్మ మనుబంధ మొప్పగా-కలిగివేర్లు
మనుజలోకాన వ్యాప్తమై-మనియెక్రింద

గే॥ అట్టిదౌనశ్వత్థ వృక్షము
అన్ని శాఖలు పూర్తిగా
మూడు గుణములచేత మిక్కిలి
పొందినవి యైవృద్ధినిఁ
విషయంబులను చిగుళ్ల చేత
విరివియై క్రిందు మీదఁ
వ్యాపకంబై మనుజలోకము
నందు కర్మానుబంధమై

విస్తరించెను క్రింది భాగము
వీరవర్య ధనంజయా

అని కిరీటికి ॥శ్రీహరిని

3) శ్లో॥ నరూప మస్యేహతథోప లభ్యతే
నాంతో నచాదిర్నచ సంప్రతిష్ఠా
అశ్వత్థమేనం సు విరూఢమూల
మసంగశస్త్రేణ దృఢేన ఛిత్వా

ప.వి న, రూపం, అస్య, ఇహ, తథా, ఉపలభ్యతే. న, అంతః, న, చ, ఆదిః, న, చ, సంప్రతిష్ఠా, అశ్వత్థం, ఏనం, సువిరూఢ మూలం, అసంగశస్త్రేణ, దృఢేన, ఛిత్వా.

టీ॥ ఇహ-ఈలోకమునందు, అస్య-ఈసంసారమను అశ్వత్థము యొక్క, రూపం-స్వరూపమును, నోపలభ్యతే-తెలియఁబడదు, తథా-అట్లే, అంతః-తుదయును, ఆదిశ్చ - మొదలును, సంప్రతిష్ఠా-స్థితియును నోపలభ్యతే-తెలియబడదు, సువిరూఢమూలం - దృఢమైన వేళ్లు కలిగిన, ఏనం-ఈ, అశ్వత్థం-సంసారమను అశ్వత్థవృక్షమును, దృఢేన-దృఢమైన, అసంగశస్త్రేణ-విరక్తియనెడి అయుధముచేత, ఛిత్వా-ఛేదించి

గ॥ అర్జునా ఈ సంసారమను అశ్వత్థవృక్షము యొక్క స్వరూపము తెలియబడదు, అట్లే తుదియును, మొదలును, స్థితియును, తెలియబడదు దృఢమైన మూలములుగల ఈవృక్షమును దృఢమైన విరక్తియనెడి ఆయుధముచే ఛేదింపవలెను

ప॥చే॥ అట్టి సంసారమశ్వత్థ-మనబరంగు
దీని రూపంబు మొదలును-తెలియబడదు
దీని యత్యంబు, స్థితియును-తెలియబడదు
అట్టి దృఢమూల, మశ్వత్థ-మనెడి తరువు
ఛేదన, మసంగ శస్త్రాన-చేయవలయు

గే॥ అట్టి వృక్షము యొక్క రూపము
సంతుదెలియు, టసాధ్యమే
దాని యాద్యంతములు గానీ
దానిస్థితి దెలియబడదూ
బలముగల మూలంబు గలిగిన
పాదంబు విరక్తియణా
శస్త్రమున ఛేదింపవలయును
సాధనంబున భారతా

అని కిరీటికి ॥శ్రీహరిని

4) శ్లో॥ తతః పదం తత్పరి మార్గితవ్యం
యస్మింగతా ననివర్తంతి భూయః
తమేవ చాద్యం పురుషం ప్రపద్యే
యతః ప్రవృత్తిః ప్రసృతాపురాణీ...

ప.వి. తతః, పదం, తత్, పరిమార్గితవ్యం, యస్మిన్, గతాః, న, నివర్తంతి, భూయః, తమ్, ఏవ, చ, ఆద్యం, పురుషం, ప్రపద్యే, యతః ప్రవృత్తిః, ప్రసృతా, పురాణీ

టీ॥ తతః-అ తరువాత, యస్మిన్-ఏ పదమందు, గతాః-ప్రవేశించినవారు, భూయః-మరల, ననివర్తంతి-మరలరో, యతః-ఎవరివలన, పురాణీ - అనాదియైన ప్రవృత్తిః - సంసారవృక్ష ప్రవృత్తి, ప్రసృతా-ప్రవర్తించెనో, ఆద్యం - మూలకారణమైన, తంపురుషం-ఆపరమాత్మను, ప్రపద్యే - శరణు బొందుచున్నానని, తత్పదం-ఆ మోక్షస్థానమును, పరిమార్గితవ్యం-వెదుకతగినది

గ॥ అర్జునా అట్లు ఛేదించిన తరువాత యేపరమాత్మవలన అనాదియైన యీసంసార ప్రవృత్తి కలగెనో, యేపరమాత్మను పొందినవారికి, మరల జన్మములు కలుగవో, అట్టి పరమాత్మనే శరణుపొందుచున్నానని, ప్రయత్నము చేయవలెను

ప॥తే॥ ఇట్లు ఛేదించి, యా మీద-యీ ప్రవృత్తి
యెవరిచేతను కలిగెనో-యెరుగవలయు,
నే పదంబును పొందిన-యెవరుగాని
మరల జన్మింపకుందురో-యెరిగి, పిదప
అట్టి పరమాత్మ శరణంబు-నందవలెను

గే॥ ఇట్లు త్రుంచిన మీద యెవరితో
యీ సంసార ప్రవృత్తియున్
కలిగియుండెనో యతని పొందిన
కలుగవనుచును జన్మముల్
శరణుపొందగ పరమ పురుషుని
సలుప వలయు ప్రయత్నమున్

౫ శ్లో॥ నిర్మానమోహాజిత సంగదోషా
అధ్యాత్మ నిత్యావిని వృత్తకామా
ద్వంద్వై ర్విముక్తాంః సుఖదుఃఖ సంజ్ఞై
ర్గచ్ఛంత్య మూఢాః పద మవ్యయంతత్

ప.వి. నిర్మానమోహాః, జితసంగదోషాః, అధ్యాత్మనిత్యాః వినివృత్తకామాః, ద్వంద్వైః, విముక్తాః, సుఖదుఃఖసంజ్ఞైః, గచ్ఛంతి, అమూఢాః పదం అవ్యయం, తత్,

టీ॥ నిర్మాణమోహాః-మానమోహములు లేనివారును, జితసంగదోషాః-జయింపబడిన సంగదోషములు గలవారును. అధ్యాత్మనిత్యాః-జ్ఞాన విద్యాసక్తులైన వారును. వినివృత్తకామాః-కామములను విడిచిన వారును. సుఖదుఃఖసంజ్ఞైః - సుఖదుఃఖ రూపములైన ద్వంద్వైః-ద్వంద్వములచేత, విముక్తాః-విడువబడిన వారును.(అగు) అమూఢాః-జ్ఞానులు. అవ్యయం - నాశరహితమైన, తత్పదం - ఆస్థానమును, గచ్ఛంతి-పొందుచున్నారు ...

గ॥ అర్జునా మాన, మోహములను వదలినవారును, నిస్సంగులును, అధ్యాత్మయోగులు, కామవర్జితులు, సుఖదుఃఖములను ద్వంద్వములనుండి, విడువబడినవారునైన జ్ఞానులు, నిత్యమైన మోక్షపదమును, పొందుచున్నారు

ప॥ చే॥ వదలి మాన మోహములను,వదలికాంక్ష
వదలి దుఃఖము సుఖమను-ద్వంద్వములను
జ్ఞానులై, బ్రహ్మనిష్ఠులై-సంగహీను
లవ్యయంబగు, మోక్షంబు-నందగలరు....

గీ॥ లేనివారును మానమోహము
లేనివారును సంగముఁ
విడిచియుండినవారు కామము
విడుచువారును ద్వంద్వముల్
పొందియుండినవారు జ్ఞానము
పొందుచు రవ్యయ మోక్షముఁ . .
అని కిరీటికి ॥శ్రీహరిని

6) శ్లో॥ నతద్భాసయతే సూర్యో
న శశాంకో న పావకః
యద్గత్వానని వర్తంతే
తద్ధామ పరమం మమ

ప వి న, తత్, భాసయతే, సూర్యః, న, శశాంకః, న, పావకః, యత్ గత్వా, న, నివర్తంతే, తత్. ధామ, పరమం, మమ,.

టీ॥ తత్-ఆ పరమపదమును, సూర్యః-సూర్యుడును, శశాంకః-చంద్రుడును, పావకః-అగ్నిహోత్రుడును, నభాసయతే - ప్రకాశింపచేయజాలరు. యత్-యేస్థానమును, గత్వా - పొంది, ననివర్తంతే-తిరుగరో, పరమం-ఉత్కృష్టమైన తత్-అది, మమ - నాయొక్క, ధామ-స్థానము

గ॥ అర్జునా ఆ పరమపదమును, సూర్యుడును, చంద్రుడును, అగ్నిహోత్రుడును, ప్రకాశింపజేయజాలరు. యేస్థానమును పొందిన మీదట పునర్జన్మ లేకుండునో, అట్టి శ్రేష్ఠమైన పదమే నాయొక్క స్థానమని, తెలియుము

ప॥తే॥ పావకుడు, చంద్రుడద్దాని-భాస్కరుండు
సలుపలేరు ప్రకాశింప-సవ్యసాచి
యెట్టిస్థానంబు పొందియు-న్నట్టివారు
చెందరోజన్మ మరియట్టి-శ్రేష్ఠమైన
పదమెనాదని తెలియుము-భావమందు

గే॥ అట్టి అవ్యయ పరమపదమును
అగ్ని సూర్యుడు చంద్రుడుణ
చేయజాలరు ప్రకాశింపగ
శ్రేష్ఠమది నాస్థానమౌ
చేరి నాదగు యాస్థానమును
తిరిగి పొందరు జన్మముల్.

అని కిరీటికి ॥శ్రీహరిని

7) శ్లో॥ మమైవాంశో జీవలోకే
జీవభూతః సనాతనః
మనః షష్ఠా నీంద్రి యాణి
ప్రకృతిస్థాని కర్షతి

ప. వి మమ, ఏవ, అంశః, జీవలోకే, జీతభూతః, సనాతనః, మనఃషష్ఠాని, ఇంద్రియాణి, ప్రకృతిస్థాని, కర్షతి.

టీ॥ సనాతః - అనాదియైన, మమ - నాయొక్క, అంశఏవ- అంశమే, జీవలోకే - జీవలోకమునందు జీవభూతః - జీవస్వరూపమైనదై, ప్రకృతిస్థాని-మాయ యందున్న, మనఃషష్ఠాని-మనస్సుతో చేరి యారైన ఇంద్రియాణి - యింద్రియములను, కర్షతి-ఆకర్షించు చున్నది

గ॥ అర్జునా నిత్యమైన నాయంశమే, జీవరూపము ధరించి, జీవలోకమునందు, ప్రకృతియందున్న, మనస్సుచేరి యారగు, జ్ఞానేంద్రియములను ఆకర్షించుచున్నది

ప॥తే॥ జీవుడగుచు నా యంశమే-జీవలోక
మందు, ప్రకృతి సంబంధంబు-నందియుండి
మానసంబుతో చేరియా-రైన యింద్రి
యముల, నయ్యాదాకర్షణ-మాచరించు

గే॥ జీవరూపము దాల్చియుండిన
శ్రేష్ఠమగు నా యంశమే
జీవలోకమునందు మాయతో
చేరియుండిన దగుచునూ
చేరి మనసుతొ నింద్రియంబుల
యారు నాకర్షించుచున్
అని కిరీటికి ॥శ్రీహరిని

8, శ్లో॥ శరీరం యదవాప్నోతి
యచ్చాప్యుత్క్రామతీశ్వరః
గృహీత్వైతాని సంయాతి
వాయుర్గంధానివాశయాత్...

ప.వి. శరీరం యత్, అవాప్నోతి, యత్, చ, అపి, ఉత్క్రామతి, ఈశ్వరః, గృహీత్వా, ఏతాని సంయాతి, వాయుః గంధాన్, ఇవ, ఆశయాత్,

టీ॥ ఈశ్వరః-దేహేంద్రియాది సంఘాతములకు (ప్రభువగు) జీవుడు యచ్చ - ఏశరీరమును, ఉత్క్రామతి - విడుచుచున్నాడో, యచ్ఛరీరం - ఏశరీరమును, అవాప్నోతి - పొందుచున్నాడో, తదా- అప్పుడు, వాయుః-వాయువు ఆశయాత్-(పుష్పాది)స్థానము నుండి, గంధానివ - గంధములను వలనే. ఏతాని-యీ యింద్రియములను, గృహీత్వా-గ్రహించుకొని సంయాతి-పోవుచున్నాడు

గ॥ అర్జునా జీవుడు యేశరీరమును విడుచుచున్నాడో, యే రెండవ శరీరమును పొందుచున్నాడో, అప్పుడు వాయువు, పుష్పాది స్థానములనుండి, గంధములవలెనే యీ యింద్రియముల గ్రహించుకొని వెడలి పోవుచున్నాడు

ప॥తే॥ ఎపుడు జీవుండువిడుచునో-యే తనువును
యే శరీరములను పొందు-నెప్పుడపుడు
వాయువు, కుసుమాదులనుండి-వాసనవలె
కై కొనుచు నింద్రియాదుల-కడయుచుండు

గే॥ ఏ శరీరము వదలి జీవుడు
ఇతర దేహము పొందునో
గాడ్పు గంధమువలెను యాపడు
కదలిపోవుచు దేహముణ
మనసులో జ్ఞానేంద్రియంబుల
గొనుచు బోవును వెంటనే
అని కిరీటికి ॥శ్రీహరి॥

9) శ్లో॥ శ్రోత్రంచక్షుః స్పర్శనంచ
రసనం ఘ్రాణమేవచ

అధిష్ఠాయ మనశ్చాయం
విషయా నుపసే వతే....

ప.వి. శ్రోత్రం, చక్షుః, స్పర్శనం, చ, రసనం, ఘ్రాణం, ఏవ, చ. అధిష్ఠాయ. మనః, చ, అయమ్, విషయాన్, ఉపసేవతే,

టీ॥ అయం-యీ జీవుడు, శ్రోత్రం - చెవిని, చక్షుః - కంటిని, స్పర్శనం + చ-తక్కును (చర్మం), రసనం-నాలుకను, ఘ్రాణం + ఏవ + చ-ముక్కును, మనః + చ-మనస్సును, అధిష్ఠాయ-ఆశ్రయించి. విషయాన్-శబ్దాది విషయములను, ఉపసేవతే-అనుభవించుచున్నాడు.

గ॥ అర్జునా జీవుడు జ్ఞానేంద్రియములైన, త్వక్, చక్షు, శ్రోత్ర రసన, ఘ్రాణేంద్రియములను, మనసునధిష్ఠించి, యింద్రియ విషయములైన శబ్ద, స్పర్శ రూప, రస, గంధములను అనుభవించు చున్నాడు

ప॥తే॥ జీవుడు శరీరమందున-చెవిని, కన్ను,
ముక్కు, నాలుక, యనుచర్మ-మును, మనస్సు
నాశ్రయించుచు శబ్దాదు-లైన, విషయ
ముల, ననుభవించుచున్నాడు-పురుషవర్య

గే॥ ఆశ్రయించి జ్ఞానేందిౢయముల
నాశ్రయించుచు మనసునున్
అనువించును విషయ సుఖముల
నన్ని తనువుల జీవుడే..

అని కిరీటికి ॥శ్రీహరిని

10) శ్లో॥ ఉత్క్రామంతం స్థితంవాపి
భుంజానం వాగుణాన్వితం
విమూఢా నాను పశ్యంతి
పశ్యంతి జ్ఞానచక్షుషః

ప వి. ఉత్క్రామంతం, స్థితం, వా, అపి, భుంజానమ్, వా, గుణాన్వితం, విమూఢాః, న, అనుపశ్యంతి, పశ్యంతి, జ్ఞానచక్షుషః.

టీ॥ ఉత్క్రాంతం-(ఒకదేహమునుండి మరియొక దేహమునకు) వెళ్లుచున్నవాడును, స్థితం-శరీరమునందుండు వాడును, భుంజానంవా-శబ్దాది విషయము లనుభవించుచున్నవాడును, గుణాన్వితంవా + అపి - గుణములతో కూడిన వాడునునగు, ఏనం - యీ జీవుని విమూఢాః - అజ్ఞానులు, అనుపశ్యంతి-చూడరు, (తెలిసికొనజాలరు) జ్ఞానచక్షుషః-జ్ఞానదృష్టి గలవారలు, పశ్యంతి-చూచుచున్నారు

గ॥ అర్జునా ఒకశరీరమునుండి మరియొక శరీరమునకు వెడలు చున్నవాడును, శరీరమునందున్న వాడును గుణములతో కూడిన వాడునునగు, యీజీవుని అజ్ఞానులు చూడజాలరు, జ్ఞానదృష్టి గలవారలు, చూచుచున్నారు.

ప॥తే॥ తనవునందున యీ జీవు-డనయముండి
వెడలుచుండుట, యుండుట-విషయసుఖము
లనుభవించుట, యజ్ఞాను-లరయలేరు
కాంచుచుందురు జ్ఞాన దృష్టిని-గలుగువారు....

గే॥ వదలి దేహము కదలునపుడును
కదలకుండెడి యప్పుడును

గుణములతోడ సతతంబునూ
కూడియుండిన వానినిఁ
అనుభవింపగ విషయ సుఖముల
చూడజాలరు జ్ఞాన దృష్టిచె
చూచుచుందురు జ్ఞానులై ——
అని కిరీటికి　　॥శ్రీహరిని

11) శ్లో॥ యతంతో యోగి నశ్చైనం
పశ్యం త్యాత్మన్యవ స్థితం
యతంతోఽ ప్యకృతాత్మానో
నైనం పశ్యం త్యచేతసః

ప.వి. యతంతః, యోగినః, చ, ఏనం, పశ్యంతి, ఆత్మని, అవస్థితం, యతంతః, అపి, అకృతాత్మానః, న, ఏనమ్, పశ్యంతి, అచేతసః

టీ॥ యోగినః-యోగులు, యతంతః-యత్నము చేయుచున్న వారలై. ఏనం-ఈ యాత్మను. ఆత్మని - తనయందు. అవస్థితం-ఉన్నదానినిగా, పశ్యంతి - చూచుచున్నారు. అకృతాత్మానః-ఆత్మజ్ఞానములేని, అచేతసః-అవివేకులు. యతంతోఽపి-యత్నము చేయుచున్న వారలైనను, ఏనం-ఈ యాత్మను, నపశ్యంతి-చూడజాలరు

గ॥ అట్టి యోగులు యత్నము చేయుచున్న వారలై దేహమందున్న, ఆత్మస్వరూపమును తెలిసి చూచుచున్నారు, ఆత్మజ్ఞానము లేని మూఢులు, యత్నము చేయుచున్న వారలైనను, ఈయాత్మను చూడజాలరు .

ప॥తే॥ యత్న మొనరించుచును యోగు లైనవారు
ఆత్మ తమయందు, నున్నట్టి-దనుచుచూచు
చుందు, రజ్ఞానులాత్మను-చూడలేరు
సలిపియత్నంబు నెంతయు-సవ్యసాచి

గే॥ తగిన యత్నము సలిపి యోగులు
తన శరీరము నందునన్
ఆత్మ రూపుండైన జీవుని
నరయు చుందురు జ్ఞానులై
మూఢ జనములు సలిపి యత్నము
చూడ రాత్మను వారిలో
అని కిరీటికి ॥శ్రీహరిని

12) శ్లో॥ యదాదిత్య గతం తేజో
జగద్భా సయతేఽఖిలమ్
యచ్చంద్రమసి యచ్చాగ్నౌ
తత్తే జోవిద్ధి మామకమ్ .

ప వి. యత్, ఆదిత్యగతం, తేజం, జగత్, భాసయతే, అఖిలం, యత్, చంద్రమసి, యత్, చ అగ్నౌ, తత్, తేజః విద్ధి, మామకమ్.

టీ॥ ఆదిత్యగతం-సూర్యగతమైన, య త్తేజః-ఏతేజస్సు, అఖిలం-సమస్తమైన, జగత్-లోకమును, భాసయితే - ప్రకాశింపజేయుచున్నదో, చంద్రమసి-చంద్రుని యందలి, అగ్నౌ-అగ్ని యందలి. యత్-ఏతేజస్సుగలదో తత్-ఆతేజస్సును, మామకం-నాసంబంధమైన దానినిగా, విద్ధి-తెలియుము.

గు॥ అర్జునా యేతేజస్సు సూర్యుని యందుండి, సమస్త జగత్తును ప్రకాశింపజేయుచున్నదో చంద్రుని యందును అగ్ని యందును, యే తేజస్సున్నదియో, ఆతేజస్సు నా సంబంధమైన దానినిగా తెలిసికొనుము .

ప॥తే॥ ఎట్టి తేజస్సు చేరవి-య్యెల్లలోక
ముల ప్రకాశింపగాజేయ-గలుగుచుండు
నగ్ని, శశియందును, గలుగు-నట్టితేజ
మంతయును, నాదుసంబంధ-మైన దనుచు
తెలిసి కొనుమయ్య ఫల్గునా-తెల్లముగను

గే॥ ఏ తేజంబంతర్గతమై
యీ సూర్యుడగ్ని శశియుఁగా
యెల్లజగముల వెలుగజేతురో
యెరుగు మది నా తేజమే ....

అని కిరీటికి　　॥శ్రీహరిని

13) శ్లో॥ గామా విశ్వచ భూతాని
ధారయామ్యహ మోజసా
పుష్ణామి చౌషధీః సర్వాః
సోమోభూత్వా రసాత్మకః

ప.వి. గామా, అవిశ్య, చ, భూతాని, ధారయామి, అహం, ఓజసా, పుష్ణామి, చ, ఓషధీః, సర్వాః, సోమః, భూత్వా, రసాత్మకః,

టీ॥ అహం-నేను, గాం-భూమిని, ఆవిశ్య-ప్రవేశించి, భూతాని-ప్రాణులను, ఓజసా-బలముచేత, ధారయామి + చ-ధరించుచున్నాను,

రసాత్మకః-రసస్వరూపుడగు, సోమః-చంద్రుడును, భూత్వా-అయి, సర్వాః-సమస్తమైన, ఓషధీః + చ-ఓషధులను, పుష్ణామి-పోషించు చున్నాను.

గ॥ అర్జునా నేను భూమియందు ప్రవేశించి, బలముచేత, ప్రాణులను ధరించుచున్నాను. రసస్వరూపుడైన చంద్రుడనై సమస్త ఓషధులను పోషించుచున్నాను

ప॥తే॥ ధరప్రవేశించి బలముచే-ధారణంబు
సలుపుదన్ని ప్రాణులను, ర-సాత్మకుడగు
చంద్రుడగుచున, పోషింతు-సర్వమైన
సస్యసము దాయమును, నేను-సవ్యసాచి

గే॥ ధాత్రియందునచేరి ప్రాణుల
తాల్చుచుంటిని బలముచే
చంద్రుడను నేనగుచు పోషణ
సలుపుచుంటిని యోషధుల్
అని కిరీటికి ॥శ్రీహరిని

14) శ్లో॥ అహం వైశ్వా నరో భూత్వా
ప్రాణినాం దేహ మాశ్రితః
ప్రాణా పానసమా యుక్తః
ప చామ్యన్నం చతుర్విధమ్ ...

ప.వి. అహం, వైశ్వానరః, భూత్వా, ప్రాణినాం, దేహం, ఆశ్రితః, ప్రాణాపానసమాయుక్తః, పచామి, అన్నం, చతుర్విధమ్.

టీ॥ అహం-నేను, వైశ్వానరః-జఠరాగ్నిగను, భూత్వా-అయి, ప్రాణినాం - ప్రాణులయొక్క, దేహం-దేహమును, ఆశ్రితః-ఆశ్రయించిన వాడనగుచు, ప్రాణాపానసమాయుక్తః - ప్రాణాపానాది వాయువులతోగూడిన వాడనై, చతుర్విధః-భక్ష్య, భోజ్య, లేహ్య, చోష్య, రూపములైన, నాల్గువిధముల, అన్నం-అన్నమును, పచామి-పచనము చేయుచున్నాను

గ॥ అర్జునా నేను జఠరాగ్నినై, అన్ని ప్రాణులయొక్క-దేహములందున్నవాడనై, ప్రాణాపాన వాయువులతోచేరి, వారలు భుజించు నాలుగువిధములగు, భక్ష్య, భోజ్య, చోష్య, లేహ్య, పదార్థములను జీర్ణము చేయుచున్నాను .

ప॥తే॥ ప్రాణులన్నింటి దేహాల-బరగుచుండి
నేను జఠరాగ్నినై, వారు-తినెడి, నాల్గు
విధములగు పదార్థములను-వీర్యవర్య
పచన మొనరింతు ప్రాణమ-పానములను
వాయువులతోడ గూడిన-వాడనగుచు

గే॥ అన్ని ప్రాణుల దేహములందు
అలరియుండిన వాడనై
దేహముల జఠరాగ్ని నగుచును
తినిన నాల్గు విధాన్నముల్
ప్రాణాపానములతో గూడి
పచనమును నే సలిపెదన్

అని కిరీటికి　　॥శ్రీహరిని

15) శ్లో॥ సర్వాశ్యచాహం హృది సన్నివిష్టో
మత్తః స్మృతి, ర్జ్ఞానమపోహనంచ
వేదైశ్చ సర్వైరహ మేవవేద్యో
వేదాంత కృద్వేద విదేవచాహం..

ప.వి. సర్వస్య. చ. అహం. హృది. సన్నివిష్టః. మత్తః. స్మృతిః. జ్ఞానం అపోహనం. చ. వేదైః. చ. సర్వైః. అహం ఏవ. వేద్యః. వేదాంతకృత్ ఏవ. చ. అహం.

టీ॥ సర్వస్య-సమస్త ప్రాణులయొక్క హృది-హృదయముల యందు. అహం-నేను. సన్నివిష్టః-ప్రవేశించియున్నాను. (కావున) మత్తః-నావలన స్మృతి-తెలివియు. జ్ఞానం-జ్ఞానమును. అపోహనం-మఱపును (భవతి-కలుగుచున్నవి) సర్వైర్వేదైః-సమస్త వేదముల చేత. వేద్యః - తెలియదగినవాడను. వేదాంతకృత్ - వేదాంతములు చేసిన వాడను వేదవిత్ + చ-వేదమును తెలిసినవాడను. అహమేవ-నేనే

గ॥ అర్జునా నేను సమస్త ప్రాణుల, హృదయములయందున్న వాడను నావలననే. తెలివియు. జ్ఞానమును. మఱపును. కలుగు చున్నవి. నేనే సమస్త వేదములచేత తెలియదగిన వాడను. సమస్త వేదాంతములను చేసినవాడను నేనే, వేదములను తెలిసినవాడను నేనే.

ప॥ తే॥ అన్నిప్రాణుల హృదయంబులందు నుందు
జ్ఞానము, తెలివి, మరపును-నా వలననె
కలుగు, వేదములవలన-తెలియదగిన
వాడ, వేదాంత కర్తనే-వేద విదుడ....

గే॥ అన్నిప్రాణుల హృదయమందున
యున్నవాడని తెలియుననా
కలుగువారికి నావలన నే
తెలివి, జ్ఞానము, మాంద్యము॥
వేదాంతములు నేను చేసితి
వేదములుచే పూర్తిగా।
తెలియ దగినవాడను నేనే
తెలిసిన వాడను నేనే
అని కిరీటికి ॥శ్రీహరిని

16) శ్లో॥ ద్వావిమౌ పురుషౌ లోకే
క్షరశ్చాక్షర యేవచ
క్షరః సర్వాణి భూతాని
కూటస్థోఽక్షర ఉచ్యతే

ప.వి. ద్వౌ. ఇమౌ. పురుషౌ. లోకే. క్షరః. చ అక్షరః ఏవ. చ. క్షరః. సర్వాణి. భూతాని. కూటస్థః. అక్షరః. ఉచ్యతే

టీ॥ లోకే-లోకమునందు. క్షరశ్చ-క్షరుడనియు. అక్షరయేవచ-అక్షరుడనియు. ద్వావిమౌ-వీరిద్దరును, పురుషౌ-పురుషులు.(వీరిలో) క్షరః-క్షరపురుషుడు, సర్వాణి-సమస్త భూతములనియు. అక్షరః-అక్షరపురుషుడు. కూటస్థః-జీవుడనియు, ఉచ్యతే-చెప్పబడుచున్నాడు.

గ॥ అర్జునా లోకమునందు, క్షరుడు. అక్షరుడని రెండువిధము లైన పురుషులు గలరు. సకల భూతములును. క్షరమనియును, కూటస్థుడగు జీవుడక్షరుడనియు చెప్పబడును

ప॥తే॥ జగతి యందక్షరుడనియు-క్షరుడటంచు
రెండువిధముల పూరుషు-లుండగలరు
అన్నిప్రాణుల క్షరుడని-యనిరి బుధులు
జీవుడక్షరుడనుచు-చెప్పబడియె

గే॥ క్షరుడటంచు నక్షరుడనుచును
పురుషులిరువురు జగతిలో
అక్షరుని కూటస్థుడందురు
అన్నిప్రాణులు క్షరుడగు॥
అని కిరీటికి ॥శ్రీహరిని

17) శ్లో॥ ఉత్తమః పురుష స్త్వన్యః
పరమాత్మే త్యుదాహృతః
యేలోకత్రయమా విశ్య
బిభ ర్త్యవ్యయ ఈశ్వరః

ప.వి. ఉత్తమం. పురుషః. తు అన్యః. పరమాత్మా, ఇతి, ఉదాహృతః, యః, లోకత్రయం, ఆవిశ్య, బిభర్తి, అవ్యయః, ఈశ్వరః,

టీ॥ యః - ఏ, అవ్యయః - నాశరహితుడును, ఈశ్వరః-ఈశ్వరుడును, లోకత్రయం-మూడు లోకములను, ఆవిశ్య-ప్రవేశించి, బిభర్తి-భరించుచున్నాడో (సః-అ) అన్యః - ఇతరుడైన, పురుషః-పురుషుడు, ఉత్తమః-ఉత్తముడు, పరమాత్మా + ఇతి-పరమాత్మయని, ఉదాహృతః-చెప్పబడుచున్నాడు

గ॥ అర్జునా యీ యిద్దరికంటె వేరైన. శ్రేష్ఠుడైన పురుషుడు పరమాత్మయని చెప్పబడుచున్నాడు, యేపరమాత్మ మూడు లోకము

లను ప్రవేశించి భరించుచున్నాడో అతడే నాశరహితుడైన పరమాత్మ యని చెప్పబడెను

ప॥తే॥ వీరికంటెను వేరొండు-పురుషుడుండు
శ్రేష్ఠుడై పరమాత్మగా-చెప్పబడును
అవ్యయుడు, మూడులోకాల-యందువేరి
యన్నిభరియించు నీశ్వరు-డతడు పార్థ

గే॥ కలడు శ్రేష్ఠుడు వీరి కంటెను
తెలియు మీశ్వరుడాతడే
అతడు బ్రోచును మూడుజగముల
నాతడే పరమాత్మయుణా.

అని కిరీటికి ॥శ్రీహరిని

18) శ్లో॥ యస్మాత్క్షర మతీతోఽహ
మక్షరాదపిచోత్తమః
అతోఽస్మి లోకే వేదేచ
ప్రథితః పురుషోత్తమః

ప.వి. యస్మాత్. క్షరం. అతీతః, అహం, అక్షరాత్, అపి, చ. ఉత్తమం. అతః, అస్మి. లోకే, వేదే, చ, ప్రథితః. పురుషోత్తమః

టీ॥ యస్మాత్-ఏకారణము వలన, అహం-నేను, క్షరం - క్షర పురుషుని, అతీతః-అతిక్రమించిన వాడనో, అక్షరాదపి - అక్షరుని కంటెగూడ, ఉత్తమః ఉత్తముడనైతినో, అతః-యీకారణమువలన

లోకేచ-లోకమందును, ప్రథితః-ప్రసిదుడనై, పురుషోత్తమః-పురుషోత్తముడను. అస్మి-అగుచున్నాను....

గ॥ అర్జునా నేను క్షరపురుషుని మీరిన వాడనై, అక్షరునికంటె శ్రేష్ఠుడైనందువలన, లోకమునందును, వేదములయందును, పురుషోత్తముడని ప్రసిద్ధి చెందియున్నాను

ప॥తే॥ క్షరుని మీరినవాడై న-కారణమున
అక్షరుని కన్న యుత్తము-డగుటచేత
నన్ని జగముల, వేదంబు-లందునేను
పురుషోత్తముడను కీర్తి-పొందియుంటి

గే॥ క్షరునిమీరి, యక్షరుకంటె
చాల శ్రేష్ఠుండగుటచే
వేదమందును, లోకమందును
వెలయుచుంటి ప్రసిద్ధుడై
పరమాత్మ స్వరూపుడనైన
పురుషోత్తముడైతినే....
అని కిరీటికి ॥శ్రీహరిని

19) శ్లో॥ యోమామేవమసమ్మూఢో
జానాతి పురుషోత్తమం
ససర్వవిద్భజతిమాం
సర్వభావేన భారత...

ప.వి. యః, మామ్, ఏవం, అసమ్మూఢః, జానాతి, పురుషోత్తమమ్, సః సర్వవిత్, భజతి, మామ్, సర్వభావేన, భారత..

టీ॥ భారత-ఓయర్జునా, యః-ఎవ్వడు, అసమ్మూఢః - మోహ వర్జితుడై, ఏవం-ఈప్రకారముగా, పురుషోత్తం-పురుషోత్తముడనై న, మామ్-నన్ను, జానాతి-తెలియుచున్నాడో, సః - వాడు, సర్వవిత్-సర్వము తెలిసినవాడై, సర్వథావేన-సమస్త విధములచేత, మామ్-నన్ను, భజతి-భజించుచున్నాడు

గ॥ అర్జునా యెవడు జ్ఞానవంతుడై, నన్నిట్లు పురుషోత్తముని గాను, తెలిసికొనుచున్నాడో, వాడు సర్వమును తెలిసినవాడై సకల విధములచేతను నన్ను పొందుచున్నాడు (భజించుచున్నాడు)

ప॥తే॥ ఎవడు జ్ఞానవంతుడగుచు-నీ విధముగ
పూరుషోత్తముడని, నను-నెరుగ గలడో
వాడు సర్వము తెలిసిన-వాడు నగుచు
సకల విధములననుపొందు-సవ్యసాచి

గే॥ ఎవడు మోహము వదలినవాడై
యెరిగి పురుషోత్తమునినా
పొంది జ్ఞానము తెలిసి సర్వము
పొందు ననుభజియించుచు
అని కిరీటికి ॥శ్రీహరిని

20) శ్లో॥ ఇతిగుహ్యాతమంశాస్త్ర
మిదముక్తం మయాఽనఘ
ఏతద్బుద్ధ్వా బుద్ధిమాన్స్యా
త్కృతకృత్యశ్చ భారత....

ప.వి. ఇతి, గుహ్యతమమ్, శాస్త్రం, ఇదం, ఉక్తం, మయా, అనఘ, ఏతత్, బుద్ధ్వా, బుద్ధిమాన్, స్యాత్, కృతకృత్యః, చ, భారత,

టీ॥ అనఘ-పాపరహితుడవైన, భారత-ఓయర్జునా, గుహ్యతమం-మిక్కిలి రహస్యమైన, ఇదం-ఈశాస్త్రమును, మయా-నాచేత, ఉక్తం-చెప్పబడెను, ఇతి-యీప్రకారము, ఏతత్ - యీశాస్త్రమును, బుద్ధ్వా-తెలిసికొని, బుద్ధిమాన్-బుద్ధిగలవాడును, కృతకృత్యశ్చ-కృతకృత్యుడును (ధన్యుడు) స్యాత్-అవును

గ॥ అర్జునా మిక్కిలి రహస్యమైన, యీశాస్త్రమును, నేనీ విధముగా నీకు చెప్పితిని దీనిని తెలిసికొనినవాడు, బుద్ధిమంతుడును, కృతకృత్యుడును కాగలడు

ప॥తే॥ చాల గోప్య మైనట్టియీ-శాస్త్ర మెల్ల
నేను పూర్తిగా తెలిపితి-నీకు పార్థ
దీని నెవ్వాడు చక్కగా-తెలిసికొనిన
బుద్ధిమంతుడు ధన్యుడై-పొందు శుభము. .

గే॥ అతి రహస్యంబైన శాస్త్రము
నంత దెలిపితి నీకు నే
తెలిసికొనునే బుద్ధిమంతుడు
దీనిచేతను ధన్యుడౌ .

అని కిరీటికి ॥శ్రీహరిని

గ॥ ఇది శ్రీ కవిరత్న రత్నాకరము వెంకటేశ్వర కవి విరచితమై గద్య పద్య గేయరూపంబును, శ్రీ కృష్ణార్జునుల సంవాదంబగు, శ్రీ భగవద్గీతా గద్య పద్య గేయామృతము నందు పురుషోత్తమప్రాప్తి యోగమను పదునైదవ అధ్యాయము సంపూర్ణము.

హరిః ఓమ్ తత్సత్ హరిః ఓమ్

శాంతిః శాంతిః శాంతిః





అధ్యాయ సంగ్రహము - దైవాసుర సంపద్విభాగ యోగము

శా॥ దైవీ, రాక్షస, మనగ బరంగు, ప్రకృతుల్
దైత్యంబు బంధంబగున
దైవీ సంపద మోక్షహేతువు సుమీ,
దైవాంశుడే నీవుసుమ
దైవీయుంబగు శాంతి, దాంతి, దయయుఙ
ధైర్యంబులంబెంచి, నా
సేవల్ జేయుచు, నన్ను బొంది, కనుమా
శ్రేయంబు నీవర్జునా....

తా॥ అర్జునా దైవాసురములను రెండు ప్రకృతులు గలవు. అందుదైవాంశమునబుట్టిన మోక్షహేతువగుననియు, రాక్షసాంశమున బుట్టినవారు జనన, మరణములకు, కారణులగుదురు, నీవు దైవాంశ సంభూతుడవే కావున, దైవీసంపదనుబెంచి, నన్ను సేవించి, ధ్యానించి, మోక్షమును పొందుమని, శ్రీకృష్ణపరమాత్మ పార్థునకు బోధించిన, దైవాసుర సంపద్విభాగ యోగమను, పదునారవ అధ్యాయము శ్రీ భగవద్గీతా గద్య పద్య గేయామృతమునందు, సంగ్రహ అధ్యాయ పద్య తాత్పర్యములు.

హరిః ఓమ్ తత్సత్ హరిః ఓమ్

శాంతిః శాంతిః శాంతిః

1 శ్లో॥ అభయం సత్వసంశుద్ధిః
జ్ఞానయోగ వ్యవస్థితిః
దానం దమశ్చ యజ్ఞశ్చ
స్వాధ్యాయస్తప ఆర్జవం

ప వి. అభయం, సత్వసంశుద్ధిః, జ్ఞానయోగవ్యవస్థితిః, దానం, దమః, చ, యజ్ఞః, చ, స్వాధ్యాయః, తపః, ఆర్జవం

టీ॥ అభయం - భయము లేక యుండుటయు, సత్వసంశుద్ధిః- త్రికరణశుద్ధియు, (మనశ్శుద్ధి) జ్ఞానయోగవ్యవస్థితిః-జ్ఞానయోగ నిష్ఠ యందుండుట, దానం-దానము, దమశ్చ-బాహ్యేంద్రియ నిగ్రహము, యజ్ఞశ్చ-యజ్ఞమును, స్వాధ్యాయః -వేదాధ్యనయమును, తపః-తపస్సు, ఆర్జవము-సత్ప్రవర్తనము

గ॥ అర్జునా భయము లేక యుండుట, మనశ్శుద్ధి, జ్ఞానయోగ నిష్ఠ యందుండుట, దానము చేయుట, బాహ్యేంద్రియ నిగ్రహము, యజ్ఞములు, వేదాధ్యనముచేయుట, తపోనిష్ఠుడగుట, సత్ప్రవర్తనము.

ప॥ తే॥ నిర్భయము జ్ఞానయోగాన-నిల్చుటయును
దాన మొనరించుచుండుట-తపము, యజ్ఞ
ములు సలుపుటయు, స్వాధ్యాయ-మును సలుపుట
మానసము శుద్ధి, దమమును-మంచినడత....

గే॥ భయవిహీనము చిత్తశుద్ధియు
బాహ్యేంద్రియ నిగ్రహమ్
సలుపుచుండుట వేదాధ్యనము

సలుపుచుండుట దానముల్
సలుపుచుండుట యజ్ఞ, తపములు
సత్ప్రవర్తకు డగుటయు॥
అని కిరీటికి ॥శ్రీహరి॥

2) శ్లో॥ అహింసా సత్యమ క్రోధ
త్యాగః శాంతి రపైశునమ్
దయా భూతేష్వలోలత్వం
మార్దవం హ్రీరచాపలమ్

ప.వి. అహింస, సత్యం, అక్రోధః, త్యాగః, శాంతిః, అపై శునమ్, దయా, భూతేషు, అలోలత్వమ్, మార్దవం, హ్రీః, అచాపలమ్

టీ॥ అహింస-హింస చేయకుండుట, సత్యం-సత్యము, అక్రోధః-కోపము లేక యుండుట, త్యాగః-త్యాగము, శాంతిః-శాంతస్వభావము, అపైశునమ్-చాడీలు చెప్పకుండుట, భూతేషు-సర్వప్రాణుల యందు, దయా-దయగలిగి యుండుట, అలోలత్వం-విషయచాపల్యము లేక యుండుట, మార్దవం - మృదుత్వము, హ్రీ-సిగ్గు, అచాపలమ్-చాపల్యములేక యుండుట

గ॥ అర్జునా హింస చేయకుండుట, నిజము పలుకుట, క్రోధము లేక యుండుట, త్యాగము శాంతము కలిగియుండుట, చాడీలు చెప్పకుండుట, సిగ్గు, చపలత్వము లేక యుండుట

ప॥తే॥ లేకయుండుట కోపంబు-లేకయుంట
సిగ్గు, చపలత, చాడీలు-చెప్పకుంట

కలిగియుండుట దయ, సత్య-ములను శాంత
ము, మరి, త్యాగము, మార్దవ-ముల, నహింస
విషయములపైన యాసక్తి-విడుచుటయును...

గే॥ పలుకుచుండుట నిజమునెప్పుడు
సలుపకుండుట హింసయుగా
లేకయుండుట సిగ్గు, కోపము
లేకయుండుట చపలముగా ॥అని॥
కలిగియుండుట శాంతి, వితరణ,
కలిగి దయ, మృదుత్వముగా,
కలిగియుందురు దైవాంశజులు.
తెలియుము మీగుణ గణములగా

అని కిరీటికి ॥శ్రీహరిని

3 శ్లో॥ తేజః క్షమా ధృతిః శౌచ
మద్రోహో నాతి మానితా
భవంతి సంపదం దైవీ
మభిజాతస్య భారత...

ప వి. తేజః, క్షమా, ధృతిః, శౌచం, అద్రోహః, నాతి, మానితా, భవంతి, సంపదం, దైవీం, అభిజాతస్య, భారత

టీ॥ భారత-ఓయర్జునా, తేజః - ప్రతిభతో కూడియుండుట, క్షమా-ఓర్పు, ధృతి - ధైర్యము, శౌచం - శుచిత్వము, అద్రోహః-పరులకు ద్రోహము చేయకయుండుట, నాతిమానితా - గర్వము లేక

యుండుట, దైవీం-దేవతా సంబంధమైన, సంపదం-సంపదనుగూర్చి, అభిజాతస్య-పుట్టిన వానికి, భవంతి-కలుగుచున్నవి .

గ॥ అర్జునా సాహసముతో కూడియుండుట ఓర్పు, ధైర్యము, శుచిత్వము, పరులకు ద్రోహము చేయకుండుట, గర్వము లేక యుండుట, మొదలగు యీ గుణములు దైవాంశమున బుట్టిన వారికి కలుగును

ప॥తే॥ క్షమయు ధైర్యంబు తేజస్సు-కలిగియుంట
ద్రోహగర్వముల్ పూర్తిగా-తొలగియుంట
పారిశుధ్యంబు నెప్పుడు-బడసియుంట
యిట్టి సుగుణంబులన్నియు-నెల్లవేళ
కలిగియుందురు దైవాంశ-కలిగిపుట్టి

గే॥ లేకయుండుట గర్వమింతయు
లేకయుండుట ద్రోహముఁ
కలిగియుండుట ధైర్యక్షమములు
కలిగియుండుట శుద్ధియుఁ
కలిగియుందురు దైవాంశజులు
తెలియు మీ గుణగణములఁ .

అని కిరీటికి ॥శ్రీహరిని

4) శ్లో॥ దంభో దర్పోఽభి మానశ్చ
క్రోధః పారుష్య మేవచ
అజ్ఞానం చాభిజాతస్య
పార్థ సంపద మాసురీమ్ .

ప.వి. దంభః, దర్పః, అభిమానః, చ, క్రోధః, పారుష్యం, ఏవ, చ, అజ్ఞానం, చ, అభిజాతస్య, పార్థ, సంపదం, ఆసురీమ్

టీ॥ పార్థ-అర్జునా, ఆసురీం-అసుర సంబంధమైన, సంపదం-సంపదనుబట్టి, అభిజాతస్య-పుట్టిన వానికి, దంభః-కపటము, దర్పః-గర్వము, అభిమానః-అభిమానము, క్రోధః-కోపము, పారుష్యం-పరుషత్వము, అజ్ఞానం-అవివేకమును, భవంతి-కలుగుచున్నవి

గ॥ అర్జునా, కపటము, అభిమానము, గర్వము, కోపము కఠినపు మాటలు అవివేకము, యీ గుణములన్నియు రాక్షసాంశ మందు పుట్టిన వారికుండును

ప॥తే॥ గర్వ, మవివేక, మభిమాన,-కపటములును
కఠినమైనట్టి మాటలు,-కలిగియుండు
టన్నివేళల కోపంబు-నధికముగను
కలిగియుందురు దైత్యాంశ-కలిగి పుట్టి

గే॥ కలిగి కపటము కఠినమాటలు
గర్వమభిమానంబులుఁ
కలిగి క్రోధం, బవివేకమును
కాని గుణము లనేకముల్
కలిగియుందురు దైత్యాంశజులు
తెలియు మీ గుణగణములఁ
అని కిరీటికి ॥శ్రీహరిని

5) శ్లో॥ దైవీ సంపద్విమోక్షాయ
నిబంధాయా సురీమతా

మాశుచః సంపదం దైవీ
మభిజాతోఽసి పాండవ..

ప వి. దైవీ. సంపత్, విమోక్షాయ. నిబంధాయ. ఆసురీ. మతా. మా. శుచః. సంపదం. దైవీం. అభిజాతః. అసి. పాండవ

టీ॥ దైవీ-దేవతా సంబంధమైన, సంపత్-సంపద, విమోక్షాయ-బంధనివృత్తి కొరకును, మతా-సమ్మతమైనది.ఆసురీ-అసుర సంబంధమైన, సంపత్-సంపద, నిబంధాయ-బంధన హేతువుగను, మతా-సమ్మతమైనది. పాండవ-ఓయర్జునా, త్వం-నీవు దైవీ - దేవతా సంబంధమైన, సంపదం-సంపదనుబట్టి, అభిజాతః - పుట్టిన వాడవు, అసి-అయితివి, మాశుచః-దుఃఖింపకుము...

గ॥ అర్జునా దైవాంశబుట్టుట మోక్షసాధకమగుచున్నది. రాక్షసాంశమున బుట్టుట జననమరణ రూపసంసార బంధమగుచున్నది నీవు దైవాంశమున బుట్టినవాడవు కావున దుఃఖింపకుము

ప॥తే॥ అమరసంపద, మోక్షంబు-నందజేయు
అసురసంపద, బంధంబు-పొసగజేయు
నీవు దైవాంశసంభూతు-డవుట వలన
శోకమందకు ఫల్గునా-సుంతయేని

గే॥ పుట్టుటవలన, దైవాంశమున
మోక్షసాధక మగునదిజా
పుట్టుటవలన దైత్యాంశమున
పూర్తి సంసృతి హేతువౌ

షట్టియుంటివి, దైవాంశమున
పొందకుండుము దుఃఖముకా
అని కిరీటికి ॥శ్రీహరిని శ్రీ

6) శ్లో॥ ద్వౌ భూతసర్గౌ లోకేఽస్మిన్
దైవ ఆసుర ఏవ చ
దైవో విస్తరశః ప్రోక్త
ఆసురం పార్థ మే శృణు

ప.వి. ద్వౌ, భూతసర్గౌ, లోకే, అస్మిన్, దైవః, ఆసురః ఏవ, చ. దైవః, విస్తరశః. ప్రోక్తః. ఆసురం, పార్థ, మే. శృణు

టీ॥ పార్థ - ఓయర్జునా, అస్మిన్‌లోకే - యీలోకమునందు. దైవశ్చ-దేవతా సంబంధమనియు. అసురశ్చ-అసుర సంబంధమనియు, భూతసర్గౌ-సృజింపబడుచుండు ప్రాణులు, ద్వౌ-రెండు విధములుగా నున్నవి, దైవః - దేవతా సంబంధమైన భూతసృష్టి, విస్తరశః-విస్తారముగా, ప్రోక్తః-చెప్పబడెను. ఆసురం - అసుర సంబంధమైన భూతసృష్టిని. మే-నావలన, శృణు-వినుము

గ॥ అర్జునా లోకమునందు ప్రాణులకు దైవసంబంధమనియు. ఆసుర సంబంధమనియు, రెండు విధములుగ జన్మములున్నవి. దేవతా సంబంధమైన ప్రాణుల జన్మగుణములు విస్తారముగా చెప్ప బడెను. దైత్యాంశ సంబంధ జన్మగుణములను గురించి చెప్పెద వినుము .

సీ॥తే॥ జననమగు రెండువిధముల-జగతియందు
ప్రాణు, లసుర దైవములన-బరగుచుండు
దేవతాంశంబు సర్వంబు-తెలుపబడెను
విను, మసుర జన్మగుణములు-విస్తరముగ

గే॥ అసురాంశంబు దైవాంశంబు
లనుచునుండును జన్మముల్
తెలిపితిని దైవాంశ గుణములు
తెలిపెద విను దైత్యముల్

అని కిరీటికి ॥శ్రీహరిని

7) శ్లో॥ ప్రవృత్తించ నివృత్తించ
జనాన విదురాసురాః
న శౌచం నాపి చాచారో
న సత్యంతేషు విద్యతే. ..

ప.వి ప్రవృత్తిం, చ. నివృత్తిం, చ, జనాః. న, విదుః, ఆసురాః, నశౌచం. న, అపి, చ ఆచారః, న, సత్యం. తేషు, విద్యతే,

టీ॥ ఆసురాః - అసుర స్వభావము కలిగిన, జనాః - జనులు, ప్రవృత్తించ-ధర్మప్రవృత్తిని. నివృత్తించ-అధర్మ నివృత్తిని, నవిదుః-తెలియజాలరు. తేషు-వారియందు, శౌచం-శుచిత్వము, ఆచారోఽపి-ఆచారమును, సత్యంచ-యదార్థ భావమును, నవిద్యతే-ఉండదు

తా॥ [illegible] అసుర స్వభావముగల జనులు, కర్మమార్గమును [illegible] జ్ఞానమార్గమునుగాని, యెరుగరు. వారియందు శుచిత్వము, [illegible]ంగాని ఉండవు

ప॥తే॥ అసుర గుణములు గలిగిన-యట్టిజనులు
జ్ఞాన పథము, కర్మపథము-కాని, తెలియ
జాల, రుండదు శుచియును-సవ్యసాచి
మంచినడతయు, నిజముండ-దించుకేని....

గే॥ కలిగియుండరు సదాచారము
కలిగియుండరు శుద్ధియు॥
తెలియరు, ధర్మాధర్మంబులు
కలిగియుండరు సత్యము॥
కలిగియుందురు దైత్యాంశజులు
తెలియు మీ గుణగణముల॥

అని కిరీటికి ॥శ్రీహరిని

8) శ్లో॥ అసత్య మప్రతిష్ఠంతే
జగదాహు రనీశ్వరమ్
అపరస్పర సంభూతమ్
కి మన్యత్కామహైతుకమ్

ప.వి. అసత్యం, అప్రతిష్ఠమ్. తే. జగత్, అహుః, అనీశ్వరమ్, అపరస్పరసంభూతం, కిమ్ అన్యత్, కామహైతుకమ్ .

టీ॥ తే-ఆ యసురజనులు. జగత్ - జగత్తును అసత్యం-లేని దానినిగాను, అప్రతిష్ఠం-ప్రతిష్ఠలేని దానినిగాను. అనీశ్వరం-నియామకుడు లేని దానినిగాను, అహుః-చెప్పుదురు. అపరస్పరసంభూతం-

(స్త్రీపురుషుల) పరస్పర సంబంధమువలన, పుట్టినిది. అన్యత్కిం- వేరేమియున్నది. కామహైతుకమ్ - కామమే హేతువుగా కలిగినది (అని చెప్పుదురు)

గీ॥ అర్జునా అసుర స్వభావముగల జనులు. జగత్తు అసత్యమనియు. ప్రతిష్ఠ (గౌరవము) లేనిదనియు. ఈశ్వరుడు లేడనియు. చెప్పుదురు. జగత్తు కామహేతువైన స్త్రీపురుషుల సంయోగము వలన కలుగుచున్నదనియు. వేరుకారణము లేదనియు. చెప్పుదురు.

ప॥తే॥ అసురజను, లనెదరసత్య-మని జగంబు
న(ప్రతిష్ఠ, మనీశ్వర-మని, వచింత్రు
కామహేతువు వలననే-కలుగుచుండు
స్త్రీ పురుషుల సంయోగము-చేత జగతి
కాని, లేదిక, వేరొక-కారణంబు....

గే॥ నమ్మరు జగము, పరమాత్మని
నమ్మరు, సత్యధర్మముల్
కలిగె లోకము, స్త్రీ పురుషులచే
కామహేతు విదంతయు॥
పలుకుదురు పరమాత్మ లేడని
కలిగి యాసుర గుణములు॥
అని కిరీటికి ॥శ్రీహరిని

9) శ్లో॥ ఏతాం దృష్టి మవష్టభ్య
నష్టాత్మానోఽల్ప బుద్ధయః
ప్రభవంత్యుగ్ర కర్మాణః
క్షయాయ జగతోఽహితాః. ..

ప.వి. ఏతాం, దృష్టిం, అవష్టభ్య. నష్టాత్మానః, అల్పబుద్ధయః, ప్రభవంతి. ఉగ్రకర్మాణః. క్షయాయ. జగతః, అహితాః.

టీ॥ ఏతాందృష్టిం - యీజ్ఞానమును, అవష్టభ్య - అవలంబించి, నష్టాత్మానః-నష్టాత్ములై, అల్పబుద్ధయః - స్వల్పబుద్ధిగల వారలై ఉగ్రకర్మాణః - హింసాది క్రూరకర్మలు గలవారలై, అహితాః- శత్రువులై, జగతః-లోకముయొక్క, క్షయాయ-నాశనము కొరకు, ప్రభవంతి-పుట్టుచున్నారు ..

గ॥ అర్జునా యిట్టిభావము నవలంబించి. నష్టాత్ములై. అల్పబుద్ధి గలవారలై, క్రూరకర్మములు గలవారై, శత్రువులై, జగత్తుయొక్క. నాశనముకొరకు పుట్టుచున్నారు

ప॥తే॥ ఇట్టి భావంబు నెపుడు వ-హించి, వార
అల్పబుద్ధి, నష్టాత్ములు-నగుచు-క్రూర
మైన కర్మముల్ సలుపుచు-నహితులగుచు
జగతి నాశంబు కొఱకునై-సంభవింత్రు....

గే॥ ఇట్టి భావము కలిగియుండుచు
యెపుడు వారలు శత్రులై
క్రూరకర్మలు చేయుచుందురు
కూడి యల్పపుబుద్ధితో
సలుపుచుందురు లోకనాశన
సర్వకర్మలు ప్రీతితో..
అని కిరీటికి ॥శ్రీహరిని

10) శ్లో॥ కామమాశ్రిత్య దుష్పూరం
దంభమాన మదాన్వితాః

మోహా ద్గృహీత్వాఽసద్గ్రాహాన్
ప్రవర్తంతేఽశుచివ్రతాః....

ప.వి. కామం, ఆశ్రిత్య, దుష్పూరం, దంభమానమదాన్వితాః, మోహాత్, గృహీత్వా, అసద్గ్రాహాన్, ప్రవర్తంతే, అశుచివ్రతాః.

టీ॥ దుష్పూరం - నిండింప, నశక్యమైన, కామం - కోరికను. ఆశ్రిత్య - ఆశ్రయించి. మోహాత్ - అజ్ఞానమువలన. అసద్గ్రాహాన్- అన్యాయపు పరిగ్రహములను. గృహీత్వా-గ్రహించి. అశుచివ్రతాః- అశాస్త్రీయ నియమము గలవారలై (అసహ్యవ్రతములు గలవారలై) దంభ, మాన, మదాన్వితాః-కపట, అభిమాన, మదములతో కూడిన వారలై, ప్రవర్తంతే-ప్రవర్తించుచున్నారు

గ॥ అర్జునా అట్టివారు తనివితీరని, కోరికలు గలవారై, కపటము, అభిమానము, మదములతో కూడినవారలై, దురాచారులును, అసహ్య వ్రతములు గలవారై ప్రవర్తించుచున్నారు

ప॥తే॥ మెండుకోర్కెలు గోరుచు-నుండి వారు
కపట, మభిమాన, మదముల-కలిగియుండి
అశుచి వ్రతములు నేవేళ-నాచరించి
అతిదురాచారు, లవివేకు-లగుచునుంద్రు

గే॥ కూడి దంభము మాన మదముల
కోరుచును నిక్షేపముల్
అశాస్త్రీయ నియమంబులతో
నధికమగు కోరికలతో

గడుపుచుందురు కాలమంతయు
కలిగి యాసుర గుణములఁ
అని కిరీటికి　　॥శ్రీహరిని

11) శ్లో॥ చింతా మపరిమేయాం చ
ప్రలయాంతా ముపాశ్రితాః
కామోపభోగపరమా
ఏతావదితి నిశ్చితాః

ప.వి. చింతామ్. అపరిమేయామ్. చ. ప్రలయాంతామ్. ఉపాశ్రితాః. కామోపభోగపరమాః. ఏతావత్. ఇతి. నిశ్చితాః

టీ॥ ప్రలయాంతాః-మరణమే, తుదగాగలిగిన, అపరిమేయాం-అపరిమితమైన చింతాం-చింతను ఉపాశ్రితాః-ఆశ్రయించిన వారలై, కామోపభోగపరమాః - కోరికల ననుభవించుటయే. పరమార్థము గలవారై, ఏతావదితి-యింతేయని, నిశ్చితాః-నిశ్చయించిన వారలై.

గ॥ అర్జునా మరణమే తుదిగా గలిగినట్టి, అపరిమితమైన చింతల నాశ్రయించిన వారలై కోరిక లనుభవించుటమే పరమార్థమని నిశ్చయించిన వారలై

ప॥తే॥ అంత్యకాలంబె, తుదిగాగ-యైనయట్టి
అపరిమితమైన, చింతల-నాశ్రయించి
అనుభవించుటె కోర్కెల-నంతకంటె
యేదిశ్రేష్ఠంబు లేదని-యెంచుచుంద్రు

గే॥ అంత్యకాలమె. తుదిగ గలిగిన
అపరిమితమగు, చింతలన్
కలిగి కోర్కెల ననుభవించుటె
తలచి పరమార్థంబుగా
అంతకంటెను లేదు శ్రేష్ఠం
బనుచు తలచెడి వారలై
అని కిరీటికి ॥శ్రీహరిని

12) శ్లో॥ ఆశాపాశశతై ర్బద్ధాః
కామక్రోధపరాయణాః
ఈహంతే కామభోగార్థ
మన్యాయే నార్థసంచయాన్

ప.వి. ఆశాపాశశతైః బద్ధాః, కామక్రోధపరాయణాః, ఈహంతే, కామభోగార్థం, అన్యాయేన అర్థసంచయాన్

టీ॥ ఆశాపాశశతైః - నూరువిధములైన ఆశాపాశములచేత, బద్ధాః - కట్టబడినవారలై, కామక్రోధపరాయణాః - కామ క్రోధ పరాయణులై, కామభోగార్థం-కామభోగముల కొరకు, అన్యాయేన-అన్యాయముచేత, అర్థసంచయాన్ - పదార్థ సముదాయములను, ఈహంతే-కోరుచున్నారు.

గ॥ అర్జునా నూరువిధములైన యాశాపాశములచే, కట్టబడిన వారలై, కామక్రోధములతో కూడినవారలై, కామభోగముల కొరకు, అన్యాయముచేత ధనము నార్జింప గోరుచున్నారు .

ప॥చే॥ పలువిధము, లాశపాశాల-బద్ధులగుచు
క్రోధగుణము, కామంబుచే-కూడియుండి,

కామభోగముల్ పొందెడి-కాంక్షచేత
ధనము, నక్రమమున, కూర్ప-దలచుచుంద్రు

గే॥ పలుతెరంగుల యాశచేతను
సలిపి యన్యాయంబులఁ
కామభోగము లందవలెనను
కాంక్షగలిగిన వారలై
కూడి కామక్రోధములతో
కూర్చుచుందురు విత్తముఁ
అని కిరీటికి ॥శ్రీహరిని

13) శ్లో॥ ఇద మద్య మయా లబ్ధ
మిమం ప్రాప్స్యే మనోరథం
ఇద మస్తీద మపి మే
భవిష్యతి పునర్ధనమ్

ప.వి. ఇదం, అద్య, మయా, లబ్ధం, ఇమం, ప్రాప్స్యే, మనోరథం, ఇదం, అస్తి, ఇదం, అపి, మే, భవిష్యతి, పునః, ధనం,.

టీ॥ అద్య-యిప్పుడు, మయా-నాచేతను, ఇదం-యీధనమును, లబ్ధం-పొందబడెను, ఇమంమనోరథం-ఈసంకల్పమును, ప్రాప్స్యే-పొందగలను, ఇదంధనం - ఈధనము, మే - నాకు, అస్తి-కలదు, ఇదమపి-ఈధనమున్ను, మే - నాకు, పునః - మరల, భవిష్యతి-లభింపగలదు

గ॥ అర్జునా యిప్పుడు నా చేత యీధనము పొందబడెను, ఈమనోరథమును పొందగలను ఈధనము నాకుకలదు, ఈధనమున్ను మరల నేను పొందిగలనని తలంచుచుందురు..

ప॥తే॥ ఇపుడు గడియించినాను, నే-నింత ధనము
పొందగల నీయభీష్టము-ముందు నేను
ముందు నాకింత ధనమును-చెందగలదు
కలదు నాకింత ధనమని-తలచుచుండు.

గే॥ సంపాదించితి నేనింత ధనమును
సంపాదించెద ముందుకుఞ
ఇంతవిత్తము కలదు నాకడ
ఇంక చేరును యెంతయో
అనుచు పలుకును గర్వమొందుచు
అసుర గుణముల గూడియుఞ
అని కిరీటికి ॥శ్రీహరిని

14) శ్లో॥ అసౌమయాహతః శత్రు
ర్హనిష్యేచాపరా నపి
ఈశ్వరోఽహ మహంభోగీ
సిద్ధోఽహంబలవాఞ సుఖీ....

ప.వి. అసౌ మయా, హతః, శత్రుః హనిష్యే, చ, అపరాఞ, అపి, ఈశ్వరః, అహం, అహం, భోగీ, సిద్ధః, అహం, బలవాఞ, సుఖీ

టీ॥ అసౌశత్రుః - ఈశత్రువు, మయా-నాచేత, హతః-చంపబడెను, అపరానపి-ఇతర శత్రువులను, హనిష్యే-సంహరింపగలను, అహం-నేను, ఈశ్వరః-అధిపుడను, అహం-నేను, భోగీ-భోగవంతుడను, అహం-నేను, సిద్ధః-సంపన్నుడను, అహం-నేను, బలవాఞ-బలవంతుడను, అహం-నేను, సుఖీ-సుఖవంతుడను

గ॥ అర్జునా ఇప్పుడు యీశత్రువు నాచేత చంపబడెను, ఇతర శత్రువులను, సంహరింపగలను, నేనధిపుడను, నేను భోగవంతుడను, నేను బలవంతుడు, సుఖవంతుడని తలంచుచుండును

ప॥తే॥ ఇపుడు చంపితీశత్రువు-నితర శత్రు
జాల. మికమీద, పూర్తిగా-సంహరింతు
నేనధిపుడను, సిద్ధుండ,-నేనె భోగి,
నేనె బలవంతుడను-సుఖి-నని, తలంచు

గే॥ చంపితిని నే, శత్రులనిపుడు
చంపెద, నితర శత్రులన్
నే నధిపుడ, సిద్ధుడ, భోగిని
నేనె బలుడ, సుఖాత్ముడన్
అనుచు తలచుచునుండు మదిలో
నసుర గుణములు కలుగుచున్....

అని కిరీటికి ॥శ్రీహరిని

15) శ్లో॥ ఆఢ్యోఽభి జన వా నస్మి
కోఽన్యోఽస్తి సదృశోమయా
యక్ష్యే దాస్యామి మోదిష్య
ఇత్యజ్ఞానవి మోహితాః .

ప.వి. అఢ్యః, అభిజనవాన్, అస్మి, కః, అన్యః, అస్తి సదృశః, మయా యక్ష్యే, దాస్యామి, మోదిష్యే, ఇతి, అజ్ఞానవిమోహితాః

టీ॥ అధ్యః-ధనము గలవాడను, అభిజనవాన్ - సత్కులము కలవాడను, అస్మి-అయితిని, మయా-నాతోడ, సదృశః-సమానుడు, అన్యః-మరియొకడు, కః-యెవడు, అస్తి-కలడు. యక్ష్యే-యజ్ఞము చేసెదను. దాస్యామి-ఇచ్చెదను. మోదిష్యే-సంతోషించెదను. ఇతి-యీప్రకారముగా. అజ్ఞానవిమోహితాః-అవివేకముచేత మోహపెట్టబడిన వాడై

గ॥ అర్జునా నేను ధనము గలవాడను, గొప్పకులము కలవాడను, నాకు సమానులు మరియొకరు లేరు. నేను యజ్ఞము చెసెదను. నేను దానధర్మములను చేసెదను, సంతోషించెదను. అని యీ విధముగా అజ్ఞానముచేత తలంచుచున్నాడు

ప॥తే॥ నే నధిక ధనవంతుడ-నేను గొప్ప
కులము కలవాడ, నాసమా-నులును లేరు
నేను యజ్ఞము చేసెద-నేను దాన
మాచరింతు, సంతసమొందు-దని, తలంచు
నన్నివిధముల యజ్ఞాని-యగుచు వాడు

గే॥ నేను ధనికుడ, కులమున గొప్ప
నేను సలిపెద యజ్ఞముల్
లేరు నాసము లెవ్వరనుచును
లేరు నాసరి దాతలున్
అనుచు సంతోషించుచుండును
ఆత డజ్ఞానంబుచే...

అని కిరీటికి ॥శ్రీహరిని

16) శ్లో॥ అనేక చిత్త విభ్రాంతా
మోహజాల సమావృతాః
ప్రసక్తాః కామభోగేషు
పతంతి నరకేఽశుచౌ.

ప.వి. అనేకచిత్తవిభ్రాంతాః, మోహజాలసమావృతాః. ప్రసక్తాః, కామభోగేషు పతంతి, నరకే, అశుచౌ

టీ॥ అనేకచిత్తవిభ్రాంతాః-నానావిధ చిత్తవైకల్యములు కలవారై మోహజాలసమావృతాః - మోహపాశములచేత చుట్టబడిన వారలై, కామభోగేషు-కామానుభవములందు. ప్రసక్తాః-ఆసక్తులైన వారలై, అశుచౌ -అశుచియైన, నరకే-నరకమందు, పతంతి-పడుచున్నారు

గ॥ అర్జునా పలువిధములైన చిత్తభ్రమలు కలవారై మోహమనెడి వలలో చిక్కినవారలై. కామభోగాసక్తులై అశుచియైన ఘోర నరకమునందు పడుచున్నారు

ప॥తే॥ బహువిధంబుల, చిత్తవి-భ్రాంతి బొంది
మోహమను, వలలోచిక్కి-మూర్ఖులగుచు
కామభోగాలపై నాశ-కలిగియుండి
అశుచియౌ, ఘోరనరకంబు-నందగలరు

గే॥ పొంది చిత్త విభ్రాంతి వారలు
మోహపాశాబద్ధులై
మునిగి కామములందు విరతము
పొందెదరశుచి నరకముఞా...

అని కిరీటికి ॥శ్రీహరిని శ్రీ

17) శ్లో॥ ఆత్మసంభావితాః స్తబ్ధా
ధనమానమదాన్వితాః
యజంతే నామయజ్ఞైస్తే
దంభే నా విధిపూర్వకమ్ . .

ప.వి. ఆత్మసంభావితాః, స్తబ్ధాః, ధనమానమదాన్వితాః, యజంతే, నామయజ్ఞైః తే, దంభేన, అవిధిపూర్వకమ్ .

టీ॥ ఆత్మసంభావితాః - తమ గొప్పతనము తామే చెప్పుకొను వారును, స్తబ్ధాః-పెద్దలనిరాకరించు వారలై, ధనమానమదాన్వితాః-ధన మానమదములతో కూడిన వారలై, తే-ఆయవివేకులు, నామ యజ్ఞైః-నామమాత్ర యజ్ఞముల చేతను, దంభేన - దంభము చేతను, అవిధిపూర్వకం - విధి రహితముగాను, యజంతే - యజ్ఞము చేయు చున్నారు

గ॥ అర్జునా అట్టి యజ్ఞానులు, తమ్ముతామే పొగడుకొనుచు, పెద్దల నిరాకరించి, ధన మాన. మదములతో కూడుకొన్నట్టి వారలై, దంభముచేత, శాస్త్ర సమ్మతముగాని, యజ్ఞములను చేయుచుందురు.

వ॥తే॥ తమనుతామే పొగడుకొని- స్తబ్ధులగుచు
ధనముచేతను, మాన, మ-దములతోడ
కూడుకొని కపటంబుగ-మూఢులగుచు
శాస్త్రవిధిగాని యజ్ఞముల్-సలుపుచుంద్రు

గే॥ తమ్ముతామే పొగడుకొనుచును
ధనము, మాన, మదంబునకా

శాస్త్ర సమ్మతికాని యజ్ఞము
సలుపుదురు డంబమునకై....
అని కిరీటికి  ॥శ్రీహరిని

18) శ్లో॥ అహంకారం బలం దర్పం
కామం క్రోధంచ సంశ్రితాః
మామాత్మ పరదేహేషు
ప్రద్విషంతోఽభ్యసూయకాః

ప.వి. అహంకారం. బలం, దర్పం, కామం, క్రోధం. చ, సంశ్రితాః, మామ్, ఆత్మపరదేహేషు. ప్రద్విషంతః. అభ్యసూయకాః.

టీ॥ అహంకారం-అహంకారమును, బలం-బలమును, దర్పం-దర్పమును, కామం-కామమును, క్రోధం-క్రోధమును. ఆశ్రితాః-ఆశ్రయించిన వారలై ఆత్మపరదేహేషు-తమయందును, యితరుల యందునున్న, మాం-నన్ను, ప్రద్విషంతః - ద్వేషించుచున్న వారలై, అభ్యసూయకాః - పరశ్రేయస్సును సహింపని వారలై, యే-ఎవరు, వర్తంతే-ఉన్నారో

గ॥ అర్జునా అహంకారము. బలమును, దర్పమును, కామమును. కోపమును గలవారలై తమయందును యితర దేహములయందున్న నన్ను, అసూయతో జూచువారలై ద్వేషించుచున్నారు.

ప॥తే॥ బల, మహంకార, దర్పముల్-గలిగివారు
కామమును, కోపము, మిగుల-కలిగియుండి,
పరులయందును, తమయందు-పరగుచుండు
నన్నసూయతో, ద్వేషించు-చున్నవారు.

గే॥ కలిగి క్రోధ మహంకారములు
కలిగి కామబలంబులన్
పరులయందు, తమ దేహముల
పరగుచుండు నను వారల్
పరమాత్మను, నను ద్వేషింతురు
క్రూరులగుచు నసూయతో
అని కిరీటికి ॥శ్రీహరిని

19) శ్లో॥ తానహం ద్విషతః క్రూరాన్
సంసారేషు నరాధమాన్
క్షిపామ్యజస్ర మశుభా
నాసురీష్వేవ యోనిషు .

ప.వి. తాన్, అహం, ద్విషతః, క్రూరాన్, సంసారేషు, నరాధమాన్, క్షిపామి, అజస్రం, అశుభాన్, ఆసురీషు ఏవ, యోనిషు,

టీ॥ అహం-నేను, ద్విషతః-ద్వేషులైన, క్రూరాన్-క్రూరులైన, అశుభాన్ - అశుభులునగు తాన్నరాధమాన్-ఆ మనుష్యాధములను, అజస్రం-నిరంతరమును, సంసారేషు-సంసారముల యందు, ఆసురీషు-అసుర సంబంధములైన, యోనిష్వేవ-యోనుల యందే క్షిపామి-ఉంచుచున్నాను

గ॥ అర్జునా నేను అట్లు ద్వేషించుచున్న వారలను, క్రూరులను, అశుభులుననగు, ఆ నరాధములను యెల్లప్పుడు సంసారముల యందు ఆసురసంబంధమైన యోనులయందే పుట్టించుచున్నాను

ప॥ తే॥　అవిధంబుగ ద్వేషులై-యశుభులైన,
వారల, నరాధములనైన-క్రూరజనుల
అసురసంసార సంబంధ-మైన యోను
లందెపుడు, పుట్టగా జేయు-చుందు నేను

గే॥　అట్టివారల నరాధముల
నధిక క్రూరపు మనుజులఁ
ఇట్టి నీచుల నాకు శత్రుల
నెల్లకాలము నీచమౌ
అసుర యోనులయందు జన్మము
నందునట్లును జేయుదుఁ
అని కిరీటికి　॥శ్రీహరిని

20) శ్లో॥　ఆసురీంయోని మాపన్నా
మూఢా జన్మనిజన్మని
మామప్రాప్యైవ కౌంతేయ
తతోయాంత్యధమాంగతిమ్ .

ప వి.　అసురీం, యోనిం ఆపన్నాః, మూఢాః, జన్మని, జన్మని, మామ్, అప్రాప్య, ఏవ, కౌంతేయ, తతః, యాంతి, అధమాం, గతిం

టీ॥　కౌంతేయ-ఓయర్జునా మూఢాః - అవివేకులు, జన్మని, జన్మని - ప్రతిజన్మమందును, ఆసురీంయోనిం - అసుర యోనిని, ఆపన్నాః-పొందినవారలై, మాం-నన్ను, అప్రాప్యైవ-పొందకయే, తతః-ఆతరువాత, అధమాంగతిం - నికృష్టగతిని, యాంతి-పొందు చున్నారు .

గ॥ అర్జునా అసురసంబంధమైన జన్మమును పొందిన మూఢులు ప్రతిజన్మమునందును నన్ను పొందకనే అంతకంటె, అధమమైన గతిని పొందుచున్నారు

ప॥తే॥ అసురసంబంధ జన్మంబు-నంది వారు
జన్మ జన్మములందున-చచ్చి పుట్టి
మూఢులగుచు నన్నెప్పుడు-పొందలేక
అంతకన్న, నధమజన్మ-మందుచుంద్రు

గే॥ అసురజన్మల పొందు మూఢులు
అసురజన్మల సారెకుశా
పొంది చచ్చుచు, పుట్టి చచ్చుచు
పొందుచుందు రధోగతిశా
పొందకుందురు నన్ను నెప్పుడు
మూఢులై పాపాత్ములై

అని కిరీటికి ॥శ్రీహరిని

21) శ్లో॥ త్రివిధం నరకస్యేదం
ద్వారం నాశన మాత్మనః
కామః క్రోధ స్తథాలోభ
స్తస్మా దేత త్రయంత్యజేత్.

ప.వి త్రివిధం, నరకస్య, ఇదం, ద్వారం, నాశనమ్, ఆత్మనః, కామః, క్రోధః, తథా, లోభః, తస్మాత్, ఏతత్, త్రయం, త్యజేత్

టీ॥ కామః-కోరికయనియు, క్రోధః-కోపమనియు, తథా-అటే, లోభః-లోభమనియు, త్రివిధం మూడువిధములు గలిగిన, ఇదం-ఇది,

నరకస్య-నరకమునకు, ద్వారం-వాకిలి, ఆత్మనః-తనకు, నాశనంచ-నాశనకరమైనది, తస్మాత్-అందువలన, ఏతత్రయం-ఈమూడింటిని, త్యజేత్-విడువవలయును

గ॥ అర్జునా కామము, క్రోధము, లోభమను యీ మూడును నరకమునకు, ద్వారమైనవియును తనను నాశనము చేయునట్టివి, అందువలన యీ మూడింటిని విడువవలయును

ప॥తే॥ తనను నాశంబుజేసెడి-వైన యవియు
నరకమునకు ద్వారంబులై-బరగుచుండు
క్రోధగుణము, కామము, లోభ-గుణములనగ
వదలవలయు, నీ మూటిని-పార్థ పూర్తి

గే॥ ఘోర దుర్గతికివి ద్వారములు
క్రోధ, లోభము, కామముల్
వదలవలయును వీని పూర్తిగ
వదలకున్న, వినాశమే

అని కిరీటికి ॥శ్రీహరిని

22) శ్లో॥ ఏతైర్విముక్తః కౌంతేయ
తమోద్వారైః త్రిభిర్నరః
ఆచరత్యాత్మనః శ్రేయ
స్తతోయాతి పరాంగతిమ్....

ప.వి. ఏతైః, విముక్తః, కౌంతేయ, తమోద్వారైః త్రిభిః, నరః ఆచరతి ఆత్మనః, శ్రేయః, తతః, యాతి, పరామ్, గతిమ్.

టీ॥ కౌంతేయ-ఓయర్జునా, త్రిభిః - మూడైన ఏతైః-ఈ, తమోద్వారైః-నరకద్వారములచేత విముక్తః - విడువబడిన నరః- నరుడు, ఆత్మనః-తనకు, శ్రేయః-శ్రేయస్సును, ఆచరతి-ఆచరించు చున్నాడు, తతః - ఆతరువాత, పరాంగతిం - మోక్షగతిని, యాతి- పొందుచున్నాడు

గ॥ అర్జునా నరకద్వారములైన, కామ క్రోధ, లోభములను, యీ మూడుగుణములను వదలినవాడు తనకు శ్రేయస్సు నాచరించు కొన్నవాడై, తరువాత మోక్షమును పొందుచున్నాడు

ప॥తే॥ నరకమునకు ద్వారంబులై-పరగునట్టి
మూడు గుణములచేతను-ముక్తుడెవ్వ
డాతడు, తనకు శ్రేయంబు-నాచరించు
వాడునై, పొందు మోక్షంబు-పార్థ పిదప

గే॥ నరకద్వారములైన మూటిని
యెరిగి వదలిన వాడునై
తనకు శ్రేయము పొందజేయుచు
తాను పొందు మోక్షము

॥ కిరీటికి ॥శ్రీహరిని

24) శ్లో॥ యః శాస్త్రవిధిముత్సృజ్య
వర్తతే కామకారతః

న స సిద్ధి మవాప్నోతి
న సుఖం న పరాంగతిమ్

ప.వి యః, శాస్త్రవిధిం ఉత్సృజ్య, వర్తతే కామకారతః, న. సః. సిద్ధిం, అవాప్నోతి, న. సుఖం, న, పరాం, గతిమ్

టీ॥ యః-ఎవ్వడు, శాస్త్రవిధిమ్-శాస్త్రవిధిని, ఉత్సృజ్య-విడిచి, కామకారతః-యథేచ్ఛముగా (తనయిష్టానుసారము) వర్తతే-వర్తించుచున్నాడో, సః-వాడు, సిద్ధిం-సిద్ధిని, న + అవాప్నోతి - పొందడు, పరాంగతిం-మోక్షగతిని, న + అవాప్నోతి-పొందడు

గ॥ అర్జునా యెవడు శాస్త్రవిధిని విడిచి కోరిక ననుసరించి వర్తించుచున్నాడో, వాడు సిద్ధిని పొందడు సుఖమును మోక్షమును పొందడు.

ప॥తే॥ శాస్త్రవిధులను విడనాడి-సర్వమెవ్వ
డనుసరించుచు, కోర్కెల-కనుగుణముగ
నడచి, సిద్ధిని, మోక్షంబు-వాడు పొంద
జాలడు, సుఖమునైనను-సవ్యసాచి

గే॥ శాస్త్రపద్ధతి విడిచి స్వేచ్ఛగ
సంచరించిన సిద్ధి సుఖ
పొందజాలడు సుఖము కొంచెము
పొందజాలడు మోక్షముఖ .

అని కిరీటికి ॥శ్రీహరిని

24) శ్లో॥ తస్మాచ్ఛాస్త్రం ప్రమాణంతే
కార్యాకార్యవ్యవస్థితౌ
జ్ఞాత్వాశాస్త్ర విధానోక్తం
కర్మకర్తుమిహార్హసి .

ప.వి తస్మాత్, శాస్త్రం ప్రమాణం, తే, కార్యాకార్యవ్యవస్థితౌ, జ్ఞాత్వా, శాస్త్రవిధానోక్తం, కర్మ, కర్తుం, ఇహం అర్హసి,

టీ॥ తస్మాత్-అందువలన, కార్యాకార్యవ్యవస్థితౌ-కార్యాకార్య నిర్ణయమునందు, తే - నీకు, శాస్త్రం - శాస్త్రము, ప్రమాణం-జ్ఞాన సాధనము, (అందువలన) శాస్త్రవిధానోక్తం - శాస్త్రవిధిచేత, చెప్ప బడిన, కర్మ-కర్మమును, జ్ఞాత్వా-తెలిసికొని, ఇహ - యీలోకము నందు, కర్తుం-చేయుటకు, అర్హసి-తగుదువు

గ॥ అర్జునా నీకు కార్యాకార్యములు నిర్ణయించుటయందు శాస్త్రము ప్రమాణముగావున, నీవు శాస్త్రమునందు నిర్ణయింపబడిన కర్మము తెలిసికొని చేయుట కర్హుడవు

ప॥తే॥ చేయదగినట్టి కర్మంబు,-చేయరాని
కర్మ యిదియని తెలుపగా-కలదు శాస్త్ర
మది, ప్రమాణమనుచు నమ్మి,-యావిధముగ
సలుప కర్మమర్హుడ వీవు-సవ్యసాచి,

గే॥ శాస్త్రములను ప్రమాణములనుచు
సర్వకాలము నమ్ముచుణా
శాస్త్రసమ్మతమైన కర్మలు

సలుపుచుండుట, ధర్మమౌ
సలుప నర్హుడవీవు భారత
శాస్త్రసమ్మత కర్మముల్
అని కిరీటికి　　॥శ్రీహరిని

గ॥ ఇది శ్రీ కవిరత్న రత్నాకరము వెంకటేశ్వర కవి విరచితమై గద్య పద్య గేయరూపంబును, శ్రీ కృష్ణార్జునుల సంవాదంబగు, శ్రీ భగవద్గీతా గద్య పద్య గేయామృతము నందు దైవాసుర సంపద్విభాగ యోగమను పదునారవ అధ్యాయము సంపూర్ణము.

హరిః ఓమ్ తత్సత్ హరిః ఓమ్
శాంతిః శాంతిః శాంతిః





## శ్రద్ధాత్రయ విభాగ యోగము - అధ్యాయ సంగ్రహము

మ॥ కలుగున్ పూర్వపు, కర్మవాసనలచే
కాయంబు త్రైగుణ్యముల్
సలుపున్ కర్మలు, యజ్ఞ, దాన, తపముల్
సత్వాది భేదంబుచే
కలుగున్ జ్ఞానము, ముక్తి, సాత్వికమునన్
కౌంతేయ లోపంబులున్
తొలగున్ సత్తన, నీశ్వరార్పణమునై
తోతెంచు శ్రేష్ఠత్వమున్

తా॥ మానవునికి పూర్వజన్మ వాసనవలన శరీరము, త్రిగుణములుగా గలిగి, దానిననుసరించి, కర్మము, యజ్ఞము, దానము, తపములు, సలుపును. సాత్విక శ్రద్ధావంతుడే జ్ఞానము సంపాదించి, సత్కర్మములను బ్రహ్మార్పిత మొనరించి, ముక్తుడగును. యజ్ఞ, దాన, తపములయందు లోపము కలిగినచో పరబ్రహ్మవాచకమైన, ఓమ్ తత్సత్ అనిన, ఈశ్వరార్పణమై శ్రేష్ఠత్వమును, పొందు. అందువలన మోక్షము కలుగునని శ్రీకృష్ణపరమాత్మ పార్థునకు బోధించిన, శ్రద్ధాత్రయ విభాగ యోగమను, పదునేడవ అధ్యాయము శ్రీభగవద్గీతా గద్య పద్య గేయామృతమునందు, సంగ్రహ అధ్యాయ పద్య తాత్పర్యములు.

హరిః ఓమ్ తత్సత్ హరిః ఓమ్
శాంతిః శాంతిః శాంతిః

—.అర్జున ఉవాచ:—

※ అర్జును డడుగుచున్నాడు ※

1 శ్లో॥ యే శాస్త్రవిధిముత్సృజ్య
యజంతే శ్రద్ధయాఽన్వితాః
తేషాం నిష్ఠాతుకా కృష్ణా
సత్వమాహోరజ స్తమః.

ప.వి. యే. శాస్త్రవిధిం ఉత్సృజ్య. యజంతే శ్రద్ధయా. అన్వితాః. తేషాం. నిష్ఠా. తు. కా. కృష్ణ. సత్వం ఆహో. రజః. తమః.

టీ॥ హేకృష్ణ-ఓకృష్ణస్వామి. యే-ఎవరు. శాస్త్రవిధిం-శాస్త్రాచారమును. ఉత్సృజ్య-విడిచి. శ్రద్ధయా - శ్రద్ధతోడను. అన్వితా- కూడినవారలై. యజంతే-పూజించుచున్నారో. తేషాం - వారలయొక్క. నిష్ఠా-నిలుకడ. కా-ఎట్టిది. సత్వమాహో-సాత్వికమా (లేక) రజః-రాజసమా? తమః-తామసమా?

గ॥ ఓకృష్ణా యెవరు శాస్త్రాచారమును విడిచి శ్రద్ధతో కూడిన వారలై పూజించుచున్నారో. వారలయొక్క నిలుకడ యెట్టిది? సాత్వికమా లేకరాజసమా? తామసమా?

ప॥ తే॥ శాస్త్రవిధులను విడనాడి-సర్వమెవరు
సలుపుచుందురో పూజలు-శ్రద్ధతోడ
వారి నిలుకడయెట్టిది-వాసుదేవ...
సాత్వికమ, రాజసమ, తామసమ, తెలుపుము

గే॥ శాస్త్రవిచారము వదలువారు
సలుప పూజలు శ్రద్ధతో
వారలేగతి పొందుచుందురు
వారి గుణమదియే దగుణా
సాత్వికాది గుణంబులందున
సర్వమును విశదంబుగా.
అనుచునడిగెను ॥శ్రీహరిని

✱ శ్రీభగవానువాచ—శ్రీకృష్ణమూర్తి చెప్పుచున్నాడు ✱

2) శ్లో॥ త్రివిధా భవతి శ్రద్ధా
దేహినాం సా స్వభావజా
సాత్వికీ రాజసీ చైవ
తామసీ చేతితాంశృణు .

ప వి త్రివిధా, భవతి, శ్రద్ధా, దేహినాం, సా స్వభావజా, సాత్వికీ, రాజసీ, చ ఏవ, తామసీ, చ, ఇతి, తామ్, శృణు .

టీ॥ దేహినాం - దేహధారులగు ప్రాణులకు, స్వభావజా - స్వభావమువలన కలుగుచున్న, సా - ఆ, శ్రద్ధా - శ్రద్ధ, సాత్వికీ- సాత్వికము, రాజసీ-రాజసము, తామసీ-తామసమనియు, త్రివిధా- మూడువిధములు, భవతి - అగుచున్నది, తాం - దానిని గురించి, శృణు-వినుము

తా॥ అర్జునా ప్రాణులకు స్వభావముచేత కలుగుచున్న, ఆశ్రద్ధ మూడువిధములుగా నున్నది వానిని వివరించెద శ్రద్ధగా వినుము

ప॥తే॥ సర్వజనులకు స్వాభావ-జనితమగుచు
త్రివిధ విధముల శ్రద్ధయు-భువినిగలుగు
సాత్వికము, రాజసము, తామ-సంబటంచు
వినుము భారత తెలిపెద-విశదముగను...

గే॥ పూర్వజన్మ వాసన వలనను
పొందు దేహికి శ్రద్ధయుఁ
వినుము సాత్విక రజస తామస
మనుచు మూడు విధంబులుఁ

అని కిరీటికి ॥శ్రీహరిని

3) శ్లో॥ సత్వాను రూపా సర్వస్య
శ్రద్ధాభవతి భారత
శ్రద్ధామయోఽయం పురుషో
యోయచ్ఛ్రద్ధః స ఏవ, సః

ప.వి. సత్వానురూపా, సర్వస్య, శ్రద్ధా, భవతి, భారత, శ్రద్ధామయః, అయం, పురుషః, యః, యచ్ఛ్రద్ధః, సః, ఏవ, సః,

టీ॥ భారత - ఓయర్జునా, సర్వస్య - సమస్తమైన ప్రాణులకు, సత్వానురూపా - అంతఃకరణమున, కనుగుణమైన, శ్రద్ధా - శ్రద్ధ, భవతి - కలుగుచున్నది. అయం-ఈ పురుషః-పురుషుడు. శ్రద్ధామయః-శ్రద్ధామయుడు. యః-ఎవడు, యత్ + శ్రద్ధః - ఎటువంటి శ్రద్ధగలవాడో సః - వాడు సః + ఏవ - అట్టి శ్రద్ధకలిగినవాడే (భవతి-అగుచున్నాడు)

గ॥ అర్జునా సమస్తప్రాణులకు పూర్వజన్మ కర్మఫలము ననుసరించి, శ్రద్ధ కలుగుచున్నది ఆ కారణమువలన పైమూడు గుణము లలో, యేగుణము కలుగునో, ఆగుణము ననుసరించి, శ్రద్ధ, కలుగు చున్నది

ప॥తే॥ సర్వప్రాణికి వారల-పూర్వజన్మ
కర్మఫలము ననుసరించి-కలుగు శ్రద్ధ
అట్టి కారణమువలన-యెట్టిగుణము
కలుగువారల, కాశ్రద్ధ-కలుగు పార్థ

గే॥ పూర్వజన్మపు, కర్మఫలముచే
పుట్టుచుండును శ్రద్ధయుఁ
ఏగుణము కలుగు కర్మఫలమున
కాగుణము శ్రద్ధ కలుగుఁ

అని కిరీటికి ॥శ్రీహరి॥

4 శ్లో॥ యజంతే, సాత్వికాదేవాన్
యక్షరక్షాంసి రాజసాః
ప్రేతాన్ భూతగణాంశ్చాన్యే
యజంతే తామసాజనాః...

ప ఏ యజంతే, సాత్వికాః దేవాన్, యక్షరక్షాంసి, రాజసాః, ప్రేతాన్, భూతగణాన్, చ, అన్యే, యజంతే, తామసాః, జనాః,

టీ॥ సాత్వికాః - సత్వగుణనిష్ఠులు, దేవాన్ - దేవతలను, యజంతే - పూజించుచున్నారు రాజసాః - రజోగుణనిష్ఠులు, యక్షరక్షాంసి - యక్షులను, రాక్షసులను, యజంతే - పూజించుచున్నారు,

తామసాః-తమోగుణనిష్ఠులు, అన్యే-మరికొందరు, జనాః-మనుజులు, ప్రేతాన్-ప్రేతములను, భూతగణాంశ్చ-భూతగణములను, యజంతే-పూజించుచున్నారు

గు॥ అర్జునా సాత్వికులు దేవతలను పూజించుచున్నారు, రజోగుణము గలవారలు యక్ష రాక్షసులను, పూజించుచున్నారు. తామస గుణముగల జనులు ప్రేతములను, భూతగణములను, పూజించు చున్నారు ..

ఆ॥ తే॥ సలుపుచురు పూజ సాత్వికుల్-శ్రద్ధ సురల
రాజసగుణులు యక్షుల-రాక్షసులను
ఇతర మనుజులు, తామసు-లెల్ల వేళ
భూతముల పూజజేతురు-ప్రేతములను

గీ॥ సలుపుచుందురు పూజ వేల్పుల
సాత్వికులు తగుశ్రద్ధతో
పూజజేసరు యక్షసురుల
రాజసులు తగుశ్రద్ధతో
పూజజేతురు తామసగుణులు
భూత ప్రేత గణములన్

అని కిరీటికి ॥శ్రీహరిని

5) శ్లో॥ అశాస్త్రవిహితం ఘోరం
తప్యంతే యే తపోజనాః
దంభాహంకారసంయుక్తాః
కామరాగబలాన్వితాః...

ప.వి. అశాస్త్రవిహితం, ఘోరం తప్యంతే, యే, తపః, జనాః, దంభాహంకారసంయుక్తాః, కామరాగబలాన్వితాః

టీ॥ దంభాహంకారసంయుక్తాః - దంభము అహంకారములతో గూడినవారలై, కామరాగబలాన్వితాః - కోరిక, అనురాగ, బలము పీనితో కూడుకొనిన వారలై, యేజనాః-ఏజనులు అశాస్త్రవిహితం-శాస్త్రోక్తముగానట్టి, ఘోరం-భయంకరమునైన, తపః-తపస్సును, తప్యంతే-తపించుచున్నారో

గ॥ అర్జునా దంభము, అహంకారము, కలిగి కామ, రాగ, బలములతో కూడినవారలై, యేమనుజులు శాస్త్రసమ్మతముగాని ఘోరతపమును చేయుచున్నారో

ప॥తే॥ గర్వమునగూడి, దంభము-కలిగి మిగుల
కామ, రాగము, బలమును,-కలిగియుండి
శాస్త్రసమ్మతముగాని,-చాల ఘోర
మైన, తపముల, సలుపు-నట్టి, వారు...

గే॥ కలిగిదంబము నహంకారము
కామ, రాగ, బలంబుతో
కూడియెవ్వ, డశాస్త్ర పద్ధతి
ఘోరతపములు సలుపునో
అని కిరీటికి ॥శ్రీహరిని

6) శ్లో॥ కర్శయంతః శరీరస్థం
భూతగ్రామమచేతసః

మాంచైవాంతః శరీరస్థం
తాన్విద్ధ్యాసురనిశ్చయాన్. .

ప.వి. కర్శయంతః, శరీరస్థం, భూతగ్రామం, అచేతసః, మాం, చ, ఏవ, అంతఃశరీరస్థం, తాన్, విద్ధి, అసురనిశ్చయాన్.

టీ॥ ఏచేతసః - ఏయవివేకులు, శరీరస్థం - శరీరమందున్న, భూతగ్రామం - ఇంద్రియ సమూహమును, అంతఃశరీరస్థం - శరీరము లోపలనున్న, మాంచ-నన్ను కర్శయంతః-కృశింపజేయుచున్నారో, తాన్-వారలను అసురనిశ్చయాన్-రాక్షససంబంధమైన నిశ్చయము గలవారలనుగా, విద్ధి-తెలియుము

గ॥ అర్జునా వారవివేకులై, తమశరీరమందున్న యింద్రియ సమూహమును, నన్నును, కృశింపజేయుచున్నారో. అట్టివారిని. అసుర ప్రకృతి స్వభావము గలవారని తెలిసికొనుము

ప॥తే॥ తెలివిలేనట్టి వారలై-దేహమందు
గలుగు యింద్రియ సముదయ-ములను, నన్ను
సన్నగిలునట్లు జేయుచు-నున్నవారి
నాసుర ప్రకృతిజనితు-లని యెరుంగు.

గే॥ శరీరమునగల యింద్రియములు
సాక్షిభూతుం డగునన్నున్
సంపువానిని కృశత్వంబును
తెలియు, మసుర ప్రకృతిగా .

అని కిరీటికి ॥శ్రీహరిః శ్రీ

7) శ్లో॥ ఆహారస్త్వపి సర్వస్య
త్రివిధో భవతి ప్రియః
యజ్ఞస్తప స్తథా దానం
తేషాం భేదమిమంశృణు.

ప.వి. ఆహారః, తు, అపి- సర్వస్య- త్రివిధః, భవతి ప్రియః
యజ్ఞం, తపః, తథా- దానం, తేషాం, భేదం, ఇమం, శృణు,

టీ॥ సర్వస్య-సమస్త ప్రాణులకును, త్రివిధం-మూడువిధములు గలిగిన, ఆహారః - ఆహారము ప్రియః - ఇష్టమైనది, భవతి- అగుచున్నది. తథా-అట్లే, యజ్ఞః-యజ్ఞమును, తపః - తపస్సును. దానం-దానము, ప్రియః - ప్రియమైనది తేషాం - వానియొక్క. ఇమంభేదం-ఈభేదమును, శృణు-వినుము

గ॥ అర్జునా సమస్తప్రాణులకు, మూడువిధములైన, అహారము యిష్టమైనదిగా అగుచున్నది, అవిధముగానే, యజ్ఞము, దానము, తపము, మూడువిధముల ప్రియమగుచున్నది, వానియొక్క భేదము ఐను చెప్పెద వినుము

ప॥తే॥ అన్నిప్రాణుల కాహార-మగును ప్రియము
త్రివిధ విధముల భేదమై-దీనివలెనె
తపము, యజ్ఞాదికర్మలు,-దానములును,
వినుము తెలిపెద, వానిని-విశదముగను..

గే॥ ఆహారము, యజ్ఞ, తపము,
అవియు మూడువిధంబులో

వినుము తెలిపెద వానిభేదము
వివరముగనే నన్నియుణా
అని కిరీటికి ॥శ్రీహరిని

8) శ్లో॥ ఆయుఃసత్వబలారోగ్య
సుఖప్రీతి వివర్ధనాః
రస్యాః స్నిగ్ధాః స్థిరాహృద్యా
ఆహారాః సాత్వికప్రియాః.

ప వి ఆయుఃసత్వ బలారోగ్య సుఖప్రీతివివర్ధనాః, రస్యాః, స్నిగ్ధాః, స్థిరాః, హృద్యాః, ఆహారాః, సాత్వికప్రియాః.

టీ॥ ఆయుసత్వబలారోగ్యసుఖప్రీతివివర్ధనాః - ఆయుః - ఆయుష్షును, సత్వః-సత్వమును బల-బలమును, ఆరోగ్య-ఆరోగ్యమును, సుఖ-సౌఖ్యమును, ప్రీతి-సంతోషమును, వివర్ధనాః-వృద్ధిపొందించునవియును, రస్యాః-రసముగలవియును, స్నిగ్ధా-చమురుగలవియును, స్థిరా-చిరకాలముండునవియును, హృద్యాః - ప్రియములైనవియును నగు, ఆహారాః-ఆహారములు, సాత్వికప్రియాః - సత్వగుణముకలవారికి ప్రియములు

గ॥ అర్జునా ఆయువును, సత్వగుణమును బలమును, ఆరోగ్యమును సుఖమును, సంతోషమును, వృద్ధిపొందించునవియు, రసవంతములు చమురుగలవియు, చిరకాలముండునవియు, చూచుటకు ప్రియములైనవియునగు, ఆహారములు సాత్వికుల కిష్టములగుచున్నవి

ఎ॥తే॥ ఆయువు, బలము, రసవంత-మగునవియును
సత్వమారోగ్య సౌఖ్యంబు-సంతసమును

స్థిరములైనట్టి వానిని-స్నిగ్ధములును
సాత్వికుల కిష్టమగుచుండు-సవ్యసాచి . .

గే॥ నేతితో రసయుక్తమగుచును
విలుచునవి చిరకాలముగ
ఆయువును, సుఖ, బలము సత్త్వము
ఆరోగ్య హర్షంబులగ
పెంపుజేసెడి యాహారంబులు
ప్రీతినొసగెడి వానినిగ
కోరియుందురు సత్త్వప్రకృతులు
నారయుక్త పదార్థముల్
అని కిరీటికి ॥శ్రీహరిని

9) శ్లో॥ కట్వమ్ల లవణా త్యుష్ణ
తీక్ష్ణ రూక్ష విదాహినః
ఆహారారాజసస్యేష్టా
దుఃఖశోకామయ ప్రదాః

ప వి కట్వమ్లలవణాత్యుష్ణ తీక్ష్ణరూక్షవిదాహినః, ఆహారాః, రాజసస్య, యిష్టాః దుఃఖశోకామయప్రదాః

టీ॥ కట్వమ్లలవణాత్యుష్ణతీక్ష్ణరూక్షవిదాహినః - కటు-చేదుగాను. ఆమ్ల-పుల్లగాను. లవణ-ఉప్పుగాను. అత్యుష్ణ - మిక్కిలివేడిగాను. తీక్ష్ణ - కారముగాను రూక్ష - రసహీనముగాను, దుఃఖశోకామయ ప్రదాః-దుఃఖమును శోకమును, రోగమును, కలుగజేయునవిగాను, (యు-ను) ఆహారాః-ఆహారములు రాజసస్య-రజోగుణముగలవానికి-ప్రియాః-ప్రియములు

గ॥ అర్జునా దుఃఖము, శోకము, రోగమును కలుగజేయు నట్టివియును. మిక్కిలి చేదు, పులుసు, ఉప్పును కలిగినట్టివియును, మిక్కిలివేడి, కారము కఠినమైనవియును, అతిదాహమును కలిగించు పదార్థములు, రజోగుణము గలవానికి, యిష్టముగా నుండును

ప॥ తే॥ ఉష్ణ, తీక్ష్ణము, రూక్షము-నుప్పు, చేదు
పులుసు, కారము, దాహము-కలుగజేయు
నట్టి, దుఃఖము శోకము-వ్యాధికరము
లైనవి, రజసులకు ప్రీతి-యగుతినుటకు....

గే॥ కలుగు వారు రజోగుణంబును
పులుసు కారము యుప్పును—
కలిగి తీక్ష్ణము, చేదు వేడియు
కఠినమై దుఃఖంబును—
కూర్చునట్టివి, రోగ, శోకము
కోరి తినెదరు ప్రీతితో ..

అని కికటికి　　॥శ్రీహరిని

10) శ్లో॥ యాత యామంగతరసం
పూతి పర్యుషితంచయత్
ఉచ్ఛిష్ట మపిచా మేధ్యం
భోజనం తామసప్రియం .

ప.వి. యాతయామం, గతరసం, పూతి పర్యుషితం, చ, యత్ ఉచ్ఛిష్టం, అపి, చ, అమేధ్యం, భోజనమ్, తామసప్రియమ్

టీ॥ యాతయామం - వండినతరువాత. జాముగడచినదియును, గతరసం-రసముపోయినదియును, పూతి - దుర్గంధము కలదియును, పర్యుషితం-ఒకరోజు నిలువయున్నదియు (చద్దిది) ఉచ్ఛిష్టం-తినగా మిగిలినదియు, (ఎంగిలి) అమేధ్యం-అపవిత్రమైనదియు భోజనం-ఆహారము. యత్-యేదో, తత్ - ఆయాహారము, తామసప్రియం-తామసగుణముగలవారి కిష్టమైనవి

గ॥ అర్జునా వండిన తరువాత జాముపెళ్లి చల్లనైనదియు, రసములేనిది, దుర్గంధముకలది, పాసిపోయినది, భుజింపగా మిగిలినది, అపవిత్రమైనదియునగు పదార్థములు తామసుల కిష్టముగా యుండును

ఆ॥ తే॥ వండిజాము గడచినవి,-పాసినవియు,
తిని మిగిలినదియు, రసము-లేనిదియును,
చల్లనై, యపవిత్రము,-చాలచెడ్డ
వాసనగలవి, ప్రియము, తా-మసజనులకు

గే॥ జాముగడిచియు చల్లనై నవి
సారహీనము చల్దియుణ్
అపవిత్రము నతిదుర్గంధము
నౌ వాని, నుచ్ఛిష్టముణ్
కోరుచుందురు తామసగుణులు
కోరిభుజింతురు ప్రీతిణ్
అని కిరీటికి ॥శ్రీహరిని

11) శ్లో॥ అఫలాకాంక్షి భిర్యజ్ఞో
విధి దృష్టోయ ఇజ్యతే

యష్టవ్యమేవేతి మనః
సమాధాయ ససాత్వికః...

ప.వి అఫలాకాంక్షిభిః, యజ్ఞం, విధిదృష్టః, యః ఇజ్యతే, యష్టవ్యం, ఏవ, ఇతి, మనః సమాధాయ, సః, సాత్వికః,

టీ॥ విధిదృష్టః-శాస్త్రసమ్మతమైనదియు, యష్టవ్యం + ఏవ + ఇతి-యజ్ఞముచేయుటయే విధియని, మనః-మనస్సును సమాధాయ-సమాధానపరచుకొని, అఫలాకాంక్షిభిః - ఫలాపేక్షలేని వారిచేతను, యః-ఏ, యజ్ఞః - యజ్ఞము, ఇజ్యతే - చేయబడుచున్నదో, సః-ఆయజ్ఞము, సాత్వికః-సత్వగుణప్రధానమైనది

గ॥ అర్జునా, శాస్త్రసమ్మతమైన యజ్ఞము, ఫలాపేక్షలేక, చేయుట మంచిదని, మనస్సున నిశ్చయించి, యేయజ్ఞము చేయబడు చున్నదో అది సత్వగుణ ప్రధానమైనదని తెలిసికొనుము .

ప॥తే॥ శాస్త్ర సమ్మతి యజ్ఞముల్ సలుప వలయు
వనుచు, మనసునందున నిశ్చయంబుజేసి
ఫలము వర్జించి, యజ్ఞముల్-సలుపుచున్న
వన్నియును, సాత్వికంబుల-టంచెరుంగు ..

గే॥ ఫలము కోరక, శాస్త్రవిధిచే
సలుప యజ్ఞము శ్రేష్ఠమౌ
ననుతలంచు చేయు యజ్ఞము
వినుముసాత్వికమైనదౌ

అని దీనికి ॥శ్రీహరిని

12) శ్లో॥ అభిసంధాయతు ఫలం
దంభార్థ మపిచైవయత్
ఇజ్యతే భరతశ్రేష్ఠ
తం యజ్ఞం విద్ధిరాజసమ్...

ప వి అభిసంధాయ, తు ఫలం, దంభార్థం, అపి, చ, ఏవ, యత్, ఇజ్యతే, భరతశ్రేష్ఠ, తమ్, యజ్ఞం, విద్ధి, రాజసం

టీ॥ హేభరతశ్రేష్ఠ - ఓయర్జునా, యత్ - ఏయజ్ఞము, ఫలం_ ఫలమును, అభిసంధాయ + తు_అపేక్షించికాని, దంభార్థం + అపి + చ + ఏవ-దంభముకొరకుగాని, ఇజ్యతే-చేయబడుచున్నదో తం-అ, యజ్ఞం-యజ్ఞమును, రాజసం-రాజసయజ్ఞముగను, విద్ధి-తెలిసికొనుము.

గ॥ అర్జునా యేయజ్ఞము, ఫలమపేక్షించికాని, దంభముకొరకు గాని చేయబడుచున్నదో ఆయజ్ఞము రాజసయజ్ఞముగా తెలిసి కొనుము

ప॥ తే॥ ఫలమపేక్షించి యజ్ఞముల్-సలుపుచున్న
గౌరవము పొందవలెనను-కాంక్షచేత,
సలుపుచుండెడి యజ్ఞముల్-సవ్యసాచి
తెలిసికొను, రాజసములంచు-తెల్లముగను

గే॥ ఎవడు యజ్ఞము చేయుచుండునో
యేదియోమది కోరుచుణా
ఫలముకోరుచు దంభమునకై
సలుప రాజస మదియగుణా

అని కిరీటికి ॥శ్రీహరిని

13) శ్లో॥ విధిహీన మసృష్టాన్నం
మంత్రహీన మదక్షిణమ్
శ్రద్ధావిరహితం యజ్ఞం
తామసం పరిచక్షతే .

ప.వి. విధివిహీనం, అసృష్టాన్నం, మంత్రహీనం, అదక్షిణం, శ్రద్ధావిరహితం, యజ్ఞం, తామసం, పరిచక్షతే

టీ॥ అర్జునా, విధిహీనం-శాస్త్రవిధిరహితమైనదియును, అసృష్టాన్నం-అన్నదానము లేనిదియును, మంత్రహీనం-మంత్రయుక్తము, కానిదియును, అదక్షిణం - దక్షిణ లేనిదియును, శ్రద్ధావిరహితం-శ్రద్ధలేనిదియునగు, యజ్ఞం-యజ్ఞమును, తామసం-తామసయజ్ఞమని, పరిచక్షతే-చెప్పుచున్నారు

గ॥ అర్జునా శాస్త్రసమ్మతముకానిదియు, అన్నదానము లేనిదియు, మంత్రయుక్తము కానిదియు దక్షిణ, శ్రద్ధలేనిదియునగు యజ్ఞము తామసయజ్ఞమని చెప్పుచున్నారు .

ప॥తే॥ శాస్త్రసమ్మతి లేనిది-శ్రద్ధ లేక
అన్న దానంబు లేనట్టి-దగుచు, మంత్ర
హీనమైనది, దక్షిణ-లేనిదైన
యజ్ఞమును తామ సంబని-యనిరి పార్థ

గీ॥ కానిదింతయు శాస్త్రసమ్మతి
లేని దన్నము దానముగా
లేక శాస్త్రము తెలుపు దక్షిణ,
లేక శ్రద్ధయు మంత్రముగా

సలుప యజ్ఞము తామసంబగు
తెలియుమియ్యది భారతా
అం కిరీటికి ।శ్రీహరిని

14) శ్లో॥ దేవ ద్విజ గురుప్రాజ్ఞ
పూజనం శౌచ మార్జవం
బ్రహ్మచర్య మహింసాచ
శారీరంతప ఉచ్యతే...

ప వి. దేవద్విజగురుప్రాజ్ఞపూజనః, శౌచం, ఆర్జవం, బ్రహ్మ చర్యం, అహింసా, చ, శారీరం, తపః, ఉచ్యతే

టీ॥ దేవద్విజగురుప్రాజ్ఞ పూజనం - దేవ - దేవతలు, ద్విజ- బ్రాహ్మణులు, గురు-గురువులు, ప్రాజ్ఞ-పండితులనగు వారియొక్క, పూజనం-పూజయును, శౌచం - శుచిత్వము, ఆర్జవం - సత్ప్రవర్తన, బ్రహ్మచర్యం-బ్రహ్మచర్యము, అహింసాచ - హింస చేయకుండుట యును, శారీరం-శరీరసంబంధమైన, తపః - తపస్సుగను ఉచ్యతే- చెప్పబడుచున్నది

గ॥ అర్జునా దేవతలను, బ్రాహ్మణులను, గురువులను, పండితులను, పూజించుట శుచిత్వము, సత్ప్రవర్తన బ్రహ్మచర్యము, అహింస, అనునవి శారీరసంబంధమైన తపస్సులని చెప్పబడు చున్నవి

ప॥తే॥ ద్విజాల, గురువుల, పండితుల్-దేవతలను
కొలుచుచుండుట, శుచితము-కలిగియుండు
బ్రహ్మచర్య మహింసను-బడసియుంట

సత్ప్రవర్తన, మివియన్ని-సవ్యసాచి
యీ శరీరతపములని-యెరుగుమెపుడు

గీ॥ దేవబ్రాహ్మణ గురువుబుధుల
తెలిసి పూజలు సలుపుటన్
అహింసయు, బ్రహ్మచర్యము
ఆర్జవంబు, శుచిత్వముగా,
శారీర ప్రధాన, తపములని
స్వాంతమందు దలంపుమా...
అని కిరీటికి ॥శ్రీహరిని

15) శ్లో॥ అనుద్వేగ కరం వాక్యం
సత్యం ప్రియహితంచయత్
స్వాధ్యాయాభ్యసనం చైవ
వాఙ్మయం తపఉచ్యతే...

ప వి అనుద్వేగకరం, వాక్యం, సత్యం, ప్రియహితం, చ, యత్, స్వాధ్యాయాభ్యసనం చ, ఏవ, వాఙ్మయం, తపః, ఉచ్యతే,

టీ॥ అనుద్వేగకరం-ఉద్వేగకరము కానిదియు, సత్యం-సత్యమైనదియును, ప్రియ-ప్రియమై, హితం + చ-హితమైనదియునగు, వాక్యం-వాక్యమును, సాధ్యాయాభ్యసనః - వేదాధ్యనమును వాఙ్మయం - వాక్కుతో సంబంధించిన, తపః - తపస్సుగను, ఉచ్యతే-చెప్పబడుచున్నది

గీ॥ అర్జునా పరుల మనస్సు నొప్పించనిదియు, సత్యమును, ప్రియమును, హితమునైన, సంభాషణయు వేదాధ్యనము, వాక్కునకు సంబంధించిన తపస్సుగా చెప్పబడెను .

ఆ॥ తే॥ పరులమనసున కెప్పుడు-బాధలేని
సత్యము, ప్రియము,హితము-చాలగలిగి
పలుకుచుండుటయును, వేద-పఠనమెపుడు
సలుప, వాగ్రూప తపమగు-సవ్యసాచి...

గే॥ ఇతర ప్రాణికి బాధలేకను
ప్రీతి విశ్వాసంబులున్
కలుగు నిజమగు పలుకు, వేదము
సలుపు, టభ్యాసంబును
వాగ్రూపములగు తపములనుచు
వాని నెరుగుము పాండవా
అని కిరీటికి ॥శ్రీహరిః

16) శ్లో॥ మనః ప్రసాదః సౌమ్యత్వం
మౌన మాత్మ వినిగ్రహః
భావ సంశుద్ధి రిత్యేత
త్తపో మానస ముచ్యతే...

ప.వి. మనః ప్రసాదః, సౌమ్యత్వం, మౌనం, ఆత్మవినిగ్రహః, భావసంశుద్ధిః, ఇతి, ఏతత్, తపః, మానసం, ఉచ్యతే

టీ॥ మనఃప్రసాదః - చిత్తనైర్మల్యమును (మనసు పవిత్రముగ నుంచుట) సౌమ్యత్వం-మంచివృత్తియు. మౌనం-మౌనమును, ఆత్మవినిగ్రహః-మనోనిగ్రహమును, భావసంశుద్ధిః-కపటములేమియు, ఇత్యేతత్-అనునది, మానసం- మనస్సునకు సంబంధించిన, తపః- తపస్సు, ఉచ్యతే-చెప్పబడుచున్నది

గ॥ అర్జునా మనస్సు నిర్మలముగానుంచుట, మనోనిగ్రహము, సద్వృత్తియు, మితముగా మాటలాడుట, కపటము లేకయుండుట అనునవి, మనస్సంబంధమైన తపస్సులని చెప్పబడును

ప॥తే॥ మానసిక నిర్మలత్వము-మంచి వృత్తి
నిగ్రహించి మనస్సును-నిశ్చలముగ
లేకయుండుట కపటంబు-లేశమైన
మౌనమివి మానసతపము-లనెరి పార్థ

గే॥ మంచివృత్తియు చిత్తశుద్ధియు
మౌనము మనోనిగ్రహమ్
ఏనుము కపటములేక యుండుట
మానసిక తపమౌనిదే

అని కిరీటికి ॥శ్రీహరిని

17) శ్లో॥ శ్రద్ధయా పరయాతప్తం
తపస్తత్త్రివిధం నరైః
అఫలాకాంక్షిభిర్యుక్తైః
సాత్వికం పరిచక్షతే...

ప వి శ్రద్ధయా పరయా, తప్తం, తపః, తత్ త్రివిధం, నరైః, అఫలాకాంక్షిభిః, యుక్తైః, సాత్వికం, పరిచక్షతే

టీ॥ అఫలాకాంక్షిభిః - ఫలము కోరని వారును. యుక్తైః - యోగులునునైన, నరైః - నరులచేతను. పరయా - ఉత్తమమైన,

శ్రద్ధయా-శ్రద్ధతో, తప్తం-తపింపబడిన తత్-ఆ, త్రివిధం-మూడు విధములైన, తపః-తపస్సును, సాత్వికం-సాత్వికముగను, పరిచక్షతే-చెప్పుచున్నారు.

గII అర్జునా ఫలముకోరని యోగులైన నరులచేత ఉత్తమమైన శ్రద్ధతో నాచరింపబడిన. శరీరము. వాక్కు, మనస్సుకు సంబంధించిన మూడువిధములగు తపస్సులను. సాత్విక తపస్సులని చెప్పుచున్నారు

ప.IIవేII ఫలము కోరనియోగులు పరమశ్రద్ధ
గలిగినట్టి వారలాంచు-సలుపబడిన
త్రివిధ విధముల తపములు-తెలిసికొనుము
సాత్వికతపంబులని, నీవు-సవ్యసాచి.

గేII ఫలము కోరక శ్రద్ధచేతను
నలుపు ఒడెడివి యోగులై
మనసు, దేహము వాక్కు తపముల
వినుము సాత్విక తపములా
అని కిరీటికి ॥శ్రీహరి॥

18) శ్లోII సత్కారమాన పూజార్థం
తపోదంభేన చైవయత్
క్రియతే తదిహ ప్రోక్తం
రాజసం చల మధ్రువం...

ప.వి సత్కారమానపూజార్థం, తపః. దంభేన. చ. ఏవ. యత్. క్రియతే. తత్ ఇహ, ప్రోక్తం, రాజసం, చలమ్, అధ్రువం,.

టీ॥ సత్కారమానపూజార్థం - సత్కారము కొరకును, బహుమానము కొరకును, పూజకొరకును, దంభేన - దంభముచేత, యత్తప్తః - యేతపస్సు, క్రియతే - చేయబడుచున్నదో, ఇహ - యీలోకమందు, చలం - నిలకడ లేనిదిగాను, అధ్రువం - స్థిరము గానిదిగాను, తత్తపః-ఆతపస్సు రాజసం-రజోగుణసంబంధమైనదని, ప్రోక్తం-చెప్పబడెను .

గ॥ అర్జునా పరులచేత, సత్కరింపబడుటకు, గౌరవింపబడుటకు పూజింపబడుటకు, దంభముకొరకు చేయునట్టి, తపము రజోగుణ సంబంధమైనదనియు, చంచలమైనది, నశించునట్టిదని, పెద్దలు చెప్పిరి.

వ॥తే॥ పరులచేతను పూజింప-బడుటకొరకు
గౌరవంబును పొందంగ-దలిచి మదిని
దంభము కొరకు చేసెడి-తపములన్ని
చంచలము రాజసములును-క్షయకరంబు
అని వచించిరి, ఫల్గునా-యార్యులెల్ల .

తే॥ సత్కారము బహుమానములకు
బడుపడంబము కొరకునై
పరులచే పూజింపబడుటకు
భావమందు తలంచుచున్
సలుపునట్టి తపంబు రజమగు
చంచలంబు వినాశమున్...
అని కిరీటికి ॥శ్రీహరిని

19) శ్లో॥ మూఢ గ్రాహేణాత్మనోయ
త్పీడయా క్రియతే తపః

పరస్యోత్సా దనార్థంవా
తత్తామస ముదాహృతమ్

ప.వి. మూఢగ్రాహేణ, ఆత్మనః యత్, పీడయా, క్రియతే, తపః, పరస్య, ఉత్సాదనార్థం, వా తత్, తామసం, ఉదాహృతమ్

టీ॥ మూఢగ్రాహేణ - అవివేక నిశ్చయముచేత, ఆత్మనః- దేహముయొక్క పీడయాచ-పీడచేతను, పరస్య - పరునియొక్క, ఉత్సాదనార్థంవా - వినాశముకొరకునైనను, యత్తపః - ఏతపస్సు, క్రియతే-చేయబడుచున్నదో, తత్-అతపస్సు, తామసం-తామసమని, ఉదాహృతమ్-చెప్పబడెను

గ॥ అర్జునా మూర్ఖమైన పట్టుదలచేత, తనకుకష్టము కలిగించు నదిగాని, ఎదుటియొక్క నాశనముకొరకు చేయబడుతపస్సు తామస తపస్సని చెప్పబడుచున్నది

ప॥తే॥ మూర్ఖమగు పట్టుదలతోడ-మోహమొంది
తనకు కష్టంబు కల్గించు-దానినైన
అన్యజన వినాశముగోరి-యాచరించు
తపము తెలియుము తామస-తపమటంచు

గే॥ అవివేకమున తనకు దుఃఖము
నైన పైనను కోపియై
ఇతరుల వినాశంబు కొరకై
యెవడు తపమొనరించునో
యనిరి దానిని తామసంబని
యాత్మవేత్తలు భారతా
అని కిరీటికి ॥శ్రీహరి॥

20) శ్లో॥ దాతవ్యమితి యద్దానం
దీయతేఽనుపకారిణే
దేశేకాలేచ పాత్రేచ
తద్దానం సాత్త్వికంస్మృతమ్ ..

ప. వి. దాతవ్యం, ఇతి యత్, దానం, దీయతే, అనుపకారిణే, దేశే కాలే, చ, పాత్రే, చ, తత్, దానం సాత్త్వికమ్, స్మృతమ్.

టీ॥ దాతవ్యమితి - ఇయ్యవలయునని, యద్దానం - ఏదానము, దేశే-ఉత్తమక్షేత్రమందును, కాలేచ-పుణ్యకాలమునందును, పాత్రేచ-యోగ్యునియందును, అనుపకారిణే-ప్రత్యుపకారము చేయలేని వానికొరకు, దీయతే-ఇయ్యబడుచున్నదో, తద్దానం-ఆదానము, సాత్త్వికమ్-సాత్త్వికమని స్మృతం-తలంపబడియున్నది

గ॥ అర్జునా, దానమొనర్చుట యావశ్యకంబని తలంచి, దేశ కాల పాత్రంబుల గురించి, ప్రత్యుపకారము చేయలేని వారికొసంగు దానము, సత్వగుణ ప్రధానమైనదని చెప్పబడుచున్నది

ప॥ తే॥ దానమును చేయవలెనని-తానుతలచి
దేశకాలము పాత్రముల్-తెలిసి చేయ
జాల, డుపకారమనుచును-దెలిసి, సలుపు
దానమును, సాత్వికంబగు-దానమరిరి

గే॥ దేశకాలము పాత్రమునుగని
తెలిసి ప్రత్యుపకారముగా
చేయజాలని వాడటంచును
చేయు దానము సత్వమౌ

అని కిరీటికి ॥శ్రీహరిని

21) శ్లో॥ యత్తుప్రత్యుపకారార్థం
ఫలముద్దిశ్య వా పునః
దీయతేచ పరిక్లిష్టం
తద్రాజస ముదాహృతమ్

ప.వి. యత్, తు, ప్రత్యుపకారార్థం, ఫలం, ఉద్దిశ్యవా, పునః,
దీయతే, చ, పరిక్లిష్టం, తత్, దానం, రాజసం, ఉదాహృతమ్

టీ॥ యత్తు-ఏదానము, ఫలముద్దిశ్యవా-ఫలమునుద్దేశించియైనను,
పునః-మరల, ప్రత్యుపకారార్థం-ప్రత్యుపకారము కొరకునైనను, పరి
క్లిష్టం - అతికష్టముతోను దీయతే - యియ్యబడుచున్నదో తత్-
ఆదానము, రాజసం-రాజసమని, ఉదాహృతమ్-చెప్పబడెను

గ॥ అర్జునా ఫలమునుద్దేశించిగాని, ప్రత్యుపకారము నుద్దేశించి
గాని, మనస్సు నొచ్చుకొనుచు, అతికష్టముతో యొసంగునట్టి,
దానము రాజసదానమని చెప్పబడెను

ప॥తే॥ ప్రత్యుపకృతినిగోరుచు-ఫలము కొండ
వలయు ననియెడికోరిక-కలిగిగాని
చాలకష్టంబు పొందుచు-నొసగునట్టి
దానమును రాజసంబగు-దానమనెను.

గే॥ ఫలము గోరుచు చేయు దానము
బాధతోడ నొసంగగా
చేయు ప్రత్యుపకారమును మ
చేయు దానము రాజసం....

అని కిరీటికి ॥శ్రీహరివి

22) శ్లో॥ అదేశకాలే యద్దానం
మపాత్రేభ్యశ్చ దీయతే
అసత్కృత మవజ్ఞాతమ్
తత్తామసము దాహృతమ్

ప.వి అదేశకాలే, యత్, దానమ్, అపాత్రేభ్యః, చ, దీయతే, అసత్కృతం, అవజ్ఞాతం, తత్, తామసం ఉదాహృతమ్

టీ॥ అదేశకాలే-అనుచితమైన దేశకాలములయందును, అపాత్రేభ్యః + చ-అపాత్రులకును, అసత్కృతం-సద్భావము లేకుండను అవజ్ఞాతం - అవమానయుక్తమైన, యత్-ఏ దానం - దానమును, దీయతే-యియ్యబడుచున్నదో తత్-అది, తామసః-తామసదానమని, ఉదాహృతం-చెప్పబడినది

గ॥ అర్జునా అనుచితమైన దేశకాలములయందును అపాత్రులకును, సద్భావము లేకుండ, నిర్లక్ష్యముతో వేయుచుండు దానమును, తామసదానమని చెప్పబడినది

ప॥తే॥ అనుచితమగు దేశము కాల-మంద పాత్రు
లైన వారికి, సత్కార-హీనముగను
అవమతిని సలుపబడెడి-దైనయట్టి
దానమును తామసంబగు-దానమనిరి

గే॥ దేశకాలము పాత్రంబులను
తెలియక విపరీతముగ
యిచ్చెడి దానం, అపాత్రులకు
పలుకు దుష్కామమ్మయిగా

అసి కిరీటికి ॥శ్రీహరిని శ్రీ

23) శ్లో॥ ఓమ్ తత్సదితి నిర్దేశో
బ్రహ్మణస్త్రివిధః స్మృతః
బ్రాహ్మణాస్తేన వేదాశ్చ
యజ్ఞాశ్చ విహితాః పురా

ప వి ఓమ్‌తత్సత్, ఇతి, నిర్దేశః, బ్రహ్మణః, త్రివిధః, స్మృతః, బ్రాహ్మణాః, తేన, వేదాః, చ యజ్ఞాః చ, విహితాః, పురా

టీ॥ ఓమ్‌తత్సదితి-ఓమ్, తత్, సత్ అని, త్రివిధః-మూడు ప్రకారములు గలిగిన, బ్రహ్మణః - పరమాత్మయొక్క, నిర్దేశః - నామోచ్చారణము, స్మృతః-చెప్పబడెను, తేన-దానిచేత, బ్రాహ్మణాశ్చ - బ్రాహ్మణులును వేదాశ్చ-వేదములును, యజ్ఞాశ్చ - యజ్ఞములును, పురా-పూర్వకాలమందు, విహితాః-నిర్మింపబడినవి.

తా॥ అర్జునా పరబ్రహ్మముయొక్క నామమును, ఓమ్, తత్, సత్, అని మూడువిధములుగా చెప్పబడెను, పూర్వమందు ఆపర బ్రహ్మముచేతనే, బ్రాహ్మణులు, వేదములు, యజ్ఞములు నిర్మింపబడెను.

ప॥తే॥ బ్రహ్మమునకు నామంబులు-ప్రణవమనియు
తత్తనియు, సత్తనియుత్రివి-ధంబులైన
వా పరబ్రహ్మచేతనే-యాది, వేద
ములును, బ్రాహ్మణుల్, యజ్ఞముల్-కలిగెపార్థ

గే॥ పలికెదరు ఓమ్‌తత్సత్తనుచు
పరబ్రహ్మము నామముల్
మూడువిధముల చెప్పబడియెను
పూర్వమందు ధనంజయా

పీసి వలననె కలిగెక్రతువులు
విప్రులును వేదంబులుణ
అని కిరీటికి ॥శ్రీహరిని

24) శ్లో॥ తస్మా దోమిత్యుదాహృత్య
యజ్ఞదాన తపః క్రియాః
ప్రవర్తంతే విధానోక్తాః
సతతం బ్రహ్మవాదినమ్....

ప.వి. తస్మాత్, ఓమ్, ఇతి, ఉదాహృత్య, యజ్ఞదానతపః క్రియాః, ప్రవర్తంతే, విధానోక్తాః, సతతం, బ్రహ్మవాదినామ్

టీ॥ తస్మాత్-అకారణమువలన, విధానోక్తాః - శాస్త్రోక్తము లైన, బ్రహ్మవాదినాం-బ్రహ్మవాదులయొక్క, యజ్ఞదానతపఃక్రియాః-యజ్ఞదాన, తపస్సు, లనెడి క్రియలు, సతతం - యెల్లప్పుడును, ఓమితి-ఓమ్అని, ఉదాహృత్య-ఉచ్చరించి, ప్రవర్తంతే - ఆరంభింప బడుచున్నవి

గ॥ అర్జునా ఆకారణమువలన శాస్త్రోక్తములైన, యజ్ఞ, దాన, తపములను, కర్మములను, బ్రహ్మవాదులు ప్రారంభించు నపుడు ఓంకారమును ప్రథమమున పలుకుచున్నారు

ఆ॥తే॥ బ్రహ్మవాదులు సలిపెడి-పలువిధంబు
లైన, శాస్త్రోక్త కర్మల-కాదియందు
ఓమ్మనెడి యక్షరంబు, దా-ముచ్చరించి

త...., యజ్ఞములు, మరి-దానములను
...చుందురు సతతంబు-సవ్యసాచి

గే॥ అందువలన శాస్త్రోక్తములైన
యజ్ఞదాన తపంబులన్
ప్రారంభించుచు బ్రహ్మవాదులు
పలికెదరు ఓమ్మటంచుగా

అని కిరీటి॥ ॥శ్రీహరి॥

25) శ్లో॥ తదిత్యనభిసంధాయ
ఫలం యజ్ఞ తపః క్రియాః
దానక్రియాశ్చవివిధాః
క్రియంతే మోక్ష కాంక్షిభిః .

ప. వి. తత్ ఇతి, అనభిసంధాయ, ఫలం, యజ్ఞతపః క్రియాః, దానక్రియాః, చ, వివిధాః, క్రియంతే, మోక్షకాంక్షిభిః

టీ॥ మోక్షకాంక్షిభిః - ముముక్షువులచేత, తదితి - తత్తనెడి. బ్రహ్మాభిధానమునుచ్చరించి. ఫలం - ఫలమును, అనభిసంధాయ - కోరక, యజ్ఞతపః క్రియాః - యజ్ఞ-క్రతువులును, తపః - తపస్సులును. క్రియాశ్చ - దానక్రియలను, క్రియంతే - చేయబడుచున్నవి .

గ॥ అర్జునా ముముక్షువులు, బహువిధములైన యజ్ఞములను, తపస్సులను, దానములను, చేయునపుడు ఫలమును కోరకుండ, తత్తని యుచ్చరించుచు, వానిని చేయుచుందురు .

ప॥తే॥　మోక్షకాంక్షులు, తత్తని ముందుపలికి
ఫలముపై, నాశ సంప్రాప్తి-వదలివై ప
తపములను యజ్ఞములుమరి-దానములను
సలుపుచుందురు ఫల్గునా-సంతతంబు

గీ॥　ఫలము కోరక దాన, తపములు
　　సలుపుచును వడుశ్రద్ధచే
పలికితత్తని మోక్షకాంక్షులు
　　ప్రారంభింతురు యజ్ఞముల్ . . .
అని కిరీటికి　　॥శ్రీహరిని

26) శ్లో॥　సద్భావే సాధుభావేచ
　　సదిత్యే తత్ప్రయుజ్యతే
ప్రశస్తే కర్మణి తథా
　　సచ్ఛబ్దః పార్థయుజ్యతే

ప.వి. సద్భావే, సాధుభావే, చ, సత్, ఇతి, ఏతత్, ప్రయుజ్యతే, ప్రశస్తే, కర్మణి, తథా, సత్, శబ్దః పార్థ, యుజ్యతే

టీ॥ హేపార్థ-ఓయర్జునా. సద్భావే - సత్తనెడియర్థమందును సాధుభావేచ-మంచిఎనెడియర్థమందును. సత్ఇతి-సత్అనెడి, ఏతత్-ఇది, ప్రయుజ్యతే - వాడబడుచున్నది, తథా - అటులే, ప్రశస్తే-ప్రశస్తమైన, కర్మణి-కర్మమందును, (సత్అనెడి) శబ్దః-శబ్దము యుజ్యతే-వాడబడుచున్నది

గ॥ అర్జునా ఆ, సత్తనుశబ్దము, కలఎనెడియర్థమందును, మంచిదనెడియర్థమందును వాడబడుచున్నది. అట్లే, ప్రశస్తమైన కర్మలయందును వాడబడుచున్నది

ప॥తే॥ సత్తనెడి యర్థమందును-సాధుభావ
మందు, సత్తను శబ్దంబు-నల్లె శ్రేష్ఠ
మైన, పలువిధ కర్మంబు-లందుగూడ
వాడబడుచుండు నెప్పుడు-పార్థభువని

గే॥ సత్తనెడి యర్థమందును
సాధుభావము నందునన్
సత్తను శబ్దంబును శ్రేష్ఠమౌ
బహువిధంబుల కర్మల
వాడుచుందురు భువిని సతతము
పండితులును ధనంజయా.

27) శ్లో॥ యజ్ఞే తపసి దానేచ
స్థితిః స దితిచోచ్యతే
కర్మచై వ తదర్థీయం
సదిత్యేవాభి ధీయతే

ప.వి. యజ్ఞే, తపసి, దానే, చ, స్థితిః, సత్, ఇతి, చ, ఉచ్యతే, కర్మ చ, ఏవ, తదర్థీయం, సత్, ఇతి, ఏవ, అభిధీయతే,

టీ॥ యజ్ఞేచ-యజ్ఞమందును, తపసి-తపస్సునందును, దానేచ-దానమునందును, స్థితిః-స్థితి, యా-ఏదో, సా-అది, సదితి-సత్తనియు, ఉచ్యతే-పలుకబడుచున్నది, తదర్థీయం-అభగవదర్థీయమైన, కర్మ-కర్మమును సదితి-సత్తని, అభిధీయతే-పలుకబడుచున్నది

గ॥ అర్జునా యజ్ఞమందును, తపస్సునందును, దానమునందును గలస్థితికి, సత్తని చెప్పబడుచున్నది, అభగవత్ప్రీతగాచేయు, కర్మలన్నిటికి సత్తని చెప్పబడుచున్నది

వ॥తే॥ తపము నందును యజ్ఞంబు-దానమందు
గలుగునిష్ఠకు సత్తని-పలుకుచుండ్రు
దాని సంబంధ కర్మలౌ-వానికెల్ల
సత్తని వచించుచుందురు-సవ్యసాచి

గే॥ పలుకు దురుక్రతు దానతముల
గల నిష్ఠ సత్తటంచు
పలుకుదురు ఘనవత్రీతిగా
సలుపు కర్మలు సత్తనుచు
అని కిరీటికి ॥శ్రీహరిని

28) శ్లో॥ అశ్రద్ధయా హుతం దత్తం
తపస్తప్తం కృతం చయత్
అసదిత్యుచ్యతే ప్రార్థ
నచతత్ప్రేత్యనో ఇహ

ప వి. అశ్రద్ధయా, హుతం, దత్తం, తపః, తప్తం, కృతం, చ, యత్, అసత్, ఇతి, ఉచ్యతే, పార్థ, న, చ తత్, ప్రేత్య, నో, ఇహ,

టీ॥ హేపార్థ-ఓయర్జునా, అశ్రద్ధయా-అశ్రద్ధచేత, యత్-ఏ, హుతం హోమము, కృతం-చేయబడినదో, యత్ - ఏది, దత్తం-యియ్యబడినదో, తపః - తపస్సు, తప్తం - చేయబడినదో తత్-ఆసమస్తమును, అసదితి-అసత్తని, ఉచ్యతే - పలుకబడుచున్నది, ఇహ-యీలోకమునందును, నచ - ఫలింపదు, ప్రేత్యచ-లోకాంతరమందును నో-ఫలింపదు



## మోక్ష సన్యాస యోగము - అధ్యాయ సంగ్రహము

మ॥ ఫలముల్ గోరక, కర్మముల్ సలుపుచున్
బ్రహ్మార్పణంబుగ, నీ
కులధర్మంబును, వీడకా త్రిగుణముల్
గుర్తించి, సర్వంబునన్
చలనంబింతయు లేని చిత్తమున, నన్
సర్వేశ్వరున్ గొల్చినన్
కలుగున్ మోక్షము, కల్మషంబు దొలగన్
కౌంతేయ తథ్యంబుగా ...

తా॥ అర్జునా సమస్త కర్మములందు త్రిగుణములను గుర్తించి, ఈశ్వరార్పణబుద్ధితో, సత్కార్మములను సలిపి, కుల ధర్మమును విడువక, రాగద్వేషములు మాని, ధైర్యముతో మనస్సునిలిపి, నన్నే ప్రాప్యస్థానముగా దలంచి, సర్వధర్మము లను పరిత్యజించి, నన్నుపూజించి, నాకు నమస్కరించి, నన్ను ధ్యానించితివేని, నీవు సర్వపాపములనుండి, విముక్తుడవై మోక్ష మును పొందగలవని శ్రీకృష్ణపరమాత్మ పార్థునకు బోధించెను. మోక్ష సన్యాసయోగము, పదునెనిమిదవ అధ్యాయము శ్రీభగ వద్గీతా గద్య పద్య గేయామృతమునందు, సంగ్రహ అధ్యాయ పద్య తాత్పర్యములు.

హరిః ఓమ్ తత్సత్ హరిః ఓమ్

శాంతిః శాంతిః శాంతిః

పు॥ కలరూపుగా వివరింపవింటివి కదా
కౌంతేయ నీ మోహముగా
కలతగా మానిజివా, వచింపుమనినగా
గాండీవి సానందతన్
పలికెగా, మోహమువీడె, జ్ఞానమొదవెగా
పాలింతు, నీయాజ్ఞలగా
కలతగా మానితి, నీ యనుగ్రహముచే
కన్గొంటి నీతత్వమున్

తా॥ అర్జునా నాచే చెప్పబడిన అతి రహస్యమైన గీతార్థ మును, చక్కగా వింటివికదా? నీయజ్ఞానజనిత మోహము తొలిగినదా? వచింపుమని శ్రీకృష్ణపరమాత్మ యడుగగా, పర మాత్మా నీ యనుగ్రహ మహిమచే, నాయజ్ఞానము తొలిగినది, జ్ఞానము కలిగినది, నీయాజ్ఞను శిరసావహించి పాలింతునని పార్థుడు శ్రీకృష్ణపరమాత్మకు తెలిపెనని తెలిపెడి మోక్షసన్యాస యోగమను, పదునెనిమిదవ అధ్యాయము, శ్రీ భ గ వ ద్గీ తా గద్య పద్య గేయామృతమునందు అధ్యాయ సంగ్రహ పద్య తాత్పర్యములు ...

హరిః ఓమ్ తత్సత్ హరి ఓమ్
శాంతిః శాంతిః శాంతిః

—:అర్జున ఉవాచ:—

✻ అర్జును డడిగెను ✻

1) శ్లో॥ సన్యాసస్య మహాబాహో
తత్వమిచ్ఛామి వేదితుం
త్యాగస్యచ హృషీ కేశ
పృధక్కేశి నిషూదన ....

ప వి. సన్యాసస్య, మహాబాహో, తత్వమ్ ఇచ్ఛామి, వేదితుం, త్యాగస్య, చ, హృషీకేశ పృథక్, కేశి నిషూదన

టీ॥ హేమహాబాహో-ఓకృష్ణపరమాత్మా, హృషికేశ-ఇంద్రియ నియామకుడైన కృష్ణా, కేశినిషూదన - శ్రీ కృష్ణా, సన్యాసస్య-సన్యాసముయొక్కయు, త్యాగస్య - త్యాగముయొక్కయు, తత్వం-యదార్థమును, పృథక్ - వేర్వేర, వేదితుం - తెలియుటకొరకు, ఇచ్ఛామి-కోరుచున్నాను

గ॥ ఓకృష్ణపరమాత్మా, హృషీకేశ, శ్రీకృష్ణా, సన్యాసము యొక్కయు, త్యాగముయొక్కయు, తత్వమును, వేర్వేరుగా తెలిసికొన గోరుచున్నాను

ప॥తే॥ పరమ పూరుష, మాధవా-పద్మనాభ
త్యాగతత్వంబు, సన్యాస-తత్వమెల్ల
తెలిసి కొనగోరుచుంటిని-దేవ దేవ
వేరు వేరుగ విసిపింపు-విశదముగను ...

గే॥ కరుణతోడ వచింపు కేశవ
కామితార్థ ప్రదాతవై
సన్యాసము త్యాగముల స్థితి
సర్వమును విశదంబుగా
అనుచునడిగెను కృష్ణమూర్తిని
అర్జునుడు రణభూమిలో ॥శ్రీహరి

2) శ్లో॥ శ్రీభగవానువాచ-శ్రీభగవంతుడు చెప్పుచున్నాడు
కామ్యానాం కర్మణాంన్యాసం
సన్యాసం కవయో విదుః
సర్వకర్మ ఫల త్యాగం
ప్రాహుస్త్యాగం విచక్షణాః

ప ఓ కామ్యానాం, కర్మణాం, న్యాసం, సన్యాసం, కవయః, విదుః, సర్వకర్మఫలత్యాగం, ప్రాహుః, త్యాగం, విచక్షణాః

టీ॥ కవయః-పండితులు, కామ్యానాంకర్మణాం-కామ్యకర్మముల యొక్క, న్యాసం-పరిత్యాగమును, సన్యాసం-సన్యాసముగా, విదుః-తెలిసికొనియున్నారు, విచక్షణాః-విద్వాంసులు, సర్వకర్మఫలత్యాగం-సకలకర్మములయొక్క ఫలమును వదలుట, త్యాగం - త్యాగమని, ప్రాహుః-తెలిపిరి .

గ॥ అర్జునా కొందరు పండితులు, ఫలమునుకోరి చేయబడు కర్మములనువదలుట సన్యాసమని తెలిపిరి, సర్వకర్మముల ఫలమును వదలుట త్యాగమని కొందరు పండితులు తెలిపియుండిరి .

ప॥ తే॥ కామ్యఫలదాయకములైన-కర్మలన్ని
త్యాగమొనరింప, సన్యాస-మనిరి కవులు
సర్వ కర్మల ఫలమును-సన్యసింప
త్యాగమదియని పండితు-లనిరి పార్థ

గే॥ సలుపకుండుట కామ్య కర్మలు
సన్యాసమనిరి పండితుల్
అన్ని కర్మల ఫలము వదలుట
యన్ని వేళలయందునూ
త్యాగమనుచును జెప్పియుండిరి
తత్వవిదులు ధనంజయా

అని కిరీటికి ॥శ్రీహరిని

3) శ్లో॥ త్యాజ్యందోష వదిత్యేకే
కర్మప్రాహుర్మనీషిణః
యజ్ఞదాన తపః కర్మ
నత్యాజ్యమితి చాపరే .

ప.వి. త్యాజ్యం, దోషవత్, ఇతి ఏకే, కర్మ, ప్రాహుః, మనీషిణః, యజ్ఞదానతపఃకర్మ, న, త్యాజ్యం, ఇతి, చ- అపరే

టీ॥ ఏకే-కొందరు, మనీషిణః-పండితులు, కర్మ-కర్మమును, దోషవత్-దోషముకలది కావున, త్యాజ్యమితి - త్యజింపదగినదని, ప్రాహుః-చెప్పుదురు అపరే - మరికొందరు, యజ్ఞదానతపఃకర్మ-యజ్ఞము, దానము, తపస్సులనెడి కర్మములను, నత్యాజ్యమితి-విడువదగనివని, ప్రాహుః-చెప్పుదురు

గ॥ అర్జునా కొందరు పండితులు అన్నికర్మములను దోషములు గలవానిగా తలంచి విడిచిపెట్టదగినవని చెప్పుదురు మరికొందరు పండితులు, యజ్ఞము దానము తపములనెడి కర్మలు విడువకూడ నివియును, చెప్పిరి

వ॥తే॥ కర్మలన్నియు దోషముల్-కలవిగాన
వదలవలెనని పండితుల్ పలికినారు
యజ్ఞములు, తపములు, దాన-మనెడి, కర్మ
ములను విడువతగనివని-పలికినారు
మరియు కొందరు పండితుల్-వీర వర్య.

గే॥ అన్ని కర్మలయందు దోషము
ఉన్న దంచు తలంచుచుణా
విడువలెనని కొందరందురు
వేదోక్తమగు యజ్ఞముల్
విడువరాదని దాన తపములు
నిశద పరచిరి కొందరుణా

అని కిరీటికి ॥శ్రీహరిని

4) శ్లో॥ నిశ్చయం శృణుమే తత్ర
త్యాగే భరత సత్తమ
త్యాగోహి పురుష వ్యాఘ్ర
త్రివిధః సంప్రకీర్తితః ..

ప ఫి నిశ్చయం, శృణు, మే, తత్ర, త్యాగే భరతసత్తమ, త్యాగః హి, పురుషవ్యాఘ్ర త్రివిధః సంప్రకీర్తితః

టీ॥ హేభరతసత్తమ-ఓయర్జునా, తత్రత్యాగే - ఆత్యాగమందు, మే - నాయొక్క, నిశ్చయం - నిశ్చయమును శృణు - వినుము, హేపురుషవ్యాఘ్ర-ఓయర్జునా, త్యాగః త్యాగము, త్రివిధః-మూడు ప్రకారములు గలదిగా, సంప్రకీర్తితోహి చెప్పబడినదిగదా

గ॥ ఓయర్జునా ఆత్యాగమునందు నానిశ్చయమును చెప్పెద వినుము, ఆత్యాగము మూడువిధములుగా చెప్పబడియున్నదిగదా॥

ప॥ తే॥ భరత సత్తమ ఫల్గునా-పాండు పుత్ర
తెలియజేసెద నీకునై-తెల్లముగను
వినుము నా నిర్ణయము త్యాగ-విషయమందు
తెలుపబడియెను, త్యాగంబు-త్రివిధ విధము

గే॥ తెలిపెద విను నానిశ్చయము
తెల్లముగ త్యాగంబునకా
మూడు విధములు కలిగియుండును
ముఖ్యముగ త్యాగంబులో
అని కిరీటికి ॥శ్రీహరిని

౫) శ్లో॥ యజ్ఞదాన తపః కర్మ
నత్యాజ్యం కార్యమేవతత్
యజ్ఞోదానం తపశ్చైవ
పావ నాని మనీషిణామ్. .

ప వి యజ్ఞ దానతపఃకర్మ, న త్యాజ్యం, కార్యం ఏవ తత్, యజ్ఞః దానం తపః చ ఏవ పావనాని, మనీషిణామ్

టీ॥ తత్-ఆ, యజ్ఞదానతపఃకర్మ-యజ్ఞము, దానము, తపస్సు లనెడి కర్మములు, కార్యమేవ - చేయదగినవే, నత్యాజ్యం - విడువ దగినవి కావు, యజ్ఞః - యజ్ఞము, దానం - దానమును, తపశ్చ- తపస్సును, మనీషిణాం-పండితులకు, పావనాని-పవిత్రమైనవి

గ॥ అర్జునా యజ్ఞము, దానము, తపస్సనెడి కర్మములు, పండితులను, పవిత్రులను చేయుచున్నవి, కావున యజ్ఞ దాన, తప ములను, చేయవలయును, కాని, విడువకూడదు

ప॥తే॥ యజ్ఞములు, దానము, తపము-లనెడి కర్మ
ములను, విడువకూడ దెపుడు-సలుపుచుండు
పావనులుగ పండితులను-పార్థ కాన
యజ్ఞ, తప, దానములు, చేయు-మనిరి బుధులు

గే॥ యజ్ఞ, దానము, తపము, కర్మలు
నవశ్య కర్తవ్యములౌ
పండితులను సల పుచుండును
పావనులుగా భారతా
సలుపవలెనని, రందు కొరకై
సర్వబుధుల వ్రాసిని॥

అని కిరీటికి ॥శ్రీహరిని

6) శ్లో॥ ఏతాన్యపితు కర్మాణి
నంగం త్యక్త్వా ఫలానిచ
కర్తవ్యా నీతియే పార్థ
నిశ్చితం మత ముత్తమమ్...

ప.వి ఏతాని. అపి. తు. కర్మాణి. సంగం. త్యక్త్వా. ఫలాని. చ. కర్తవ్యాని. ఇతి. మే. పార్థ. నిశ్చితమ్. మతం. ఉత్తమమ్.

టీ॥ హేపార్థ-ఓయర్జునా. ఏతాని-ఈ. కర్మాణి - కర్మములు. సంగం-కోరికను. ఫలానిచ-ఫలములను. త్యక్త్వా-విడిని. కర్తవ్యాని-చేయదగినవి. ఇతి-ఇట్లని. నిశ్చితం - నిశ్చయింపబడిన. ఉత్తమం-ఉత్కృష్టమైన. మే-నాయొక్క. మతం-సమ్మతిము(అభిప్రాయము).

గ॥ అర్జునా పైన తెలిపిన మూడువిధములైన. యజ్ఞ. దాన. తపములను. కర్మములను. కోరికను. ఫలాపేక్షయును. వదలి. చేయవలయునని. నానిశ్చయమైన ఉత్తమాభిప్రాయము

ప॥తే॥ యజ్ఞములు, దానము. తపము-లనఁదగు
యిట్టి కర్మలు. ఫలసంగ-మింతలేక
నలుపవలయు. మమతలేక.-సవ్యసాచి
నీకు నాయొక్క-యుత్తమ-నిశ్చయంబు
తెలియజేసితి సంపూర్తి,తెల్లముగను .

గే॥ విడిచి సంగము వదలి ఫలమును
మూడు విధముల కర్మముల్
సలుపవలెనని నా నిశ్చయము
సమ్మతంబును నాకదే

అని కిరీటికి ॥శ్రీహరిని

7) శ్లో॥ నియతస్యతు సన్యాసః
కర్మణోనోప పద్యతే

మోహాత్తస్య పరిత్యాగ
స్తామసః పరికీర్తితః .

ప వి నియతస్య, తు, సన్యాసః కర్మణః, న, ఉపపద్యతే. మోహాత్, తస్య, పరిత్యాగః, తామసః, పరికీర్తితః .

టీ॥ నియతస్య - నియమితమైన, కర్మణః - కర్మముయొక్క, సన్యాసః-విడుచుట. నోపపద్యతే - తగదు మోహాత్ - అజ్ఞానము వలనను, తస్య-ఆ నిత్యకర్మముయొక్క, పరిత్యాగః - విడుచుట, తామసః - తమోగుణసంబంధమైన అజ్ఞానమని, పరికీర్తితః- చెప్పబడినది

గ॥ అర్జునా నియమితమైన నిత్యకర్మములను, వదలుటకు వీలులేదు, అజ్ఞానమువలన, ఆకర్మములను వదలుట, తమోగుణ సంబంధమైన అజ్ఞానమని చెప్పబడినది

ప॥తే॥ నిత్య, నైమిత్తికంబగు-నిఖిలమైన
వేదసమ్మత కర్మముల్-విడువరాదు
పొందిమోహమా కర్మముల్-పూర్తి విడువ
తలచుమయ్యది తామస-తాగమనుచు...

గే॥ వేదోక్తమగు నిత్య కర్మలు
విడువకూడదు యెప్పుడును
అజ్ఞానముచే వాని వొడువ
నదియె తామస త్యాగమౌ

అని కిరీటికి ॥శ్రీహరిసి

8) శ్లో॥ దుఃఖమిత్యేవ యత్కర్మ
కాయక్లేశ భయాత్త్యజేత్
సకృత్వారాజసం త్యాగం
నైవత్యాగ ఫలం లభేత్.

ప.వి. దుఃఖం, ఇతి, ఏవ యత్, కర్మ కాయక్లేశభయాత్, త్యజేత్, సః, కృత్వా, రాజసం, త్యాగం, న, ఏవ, త్యాగఫలం, లభేత్

టీ॥ యః - ఎవ్వడు, కాయక్లేశభయాత్ - శరీరకష్టభీతివలన, యత్కర్మ-ఏకర్మమును, దుఃఖమిత్యేవ-దుఃఖకరమైనదని, త్యజేత్-విడుచుచున్నాడో, సః - వాడు, రాజసం - రజోగుణసంబంధమైన, త్యాగం-త్యాగమును, కృత్వా-చేసి, త్యాగఫలం - కర్మత్యాగఫలమును, నైవలభేత్-పొందడు

గ॥ అర్జునా దేహమునకు కష్టము కలుగునని భయపడి, దుఃఖమును కలుగజేయునని, తలంచి, కర్మలనెవడు వదలుచున్నాడో, వాడు రాజసత్యాగమును చేసిన వాడగును, కర్మత్యాగఫలమును పొందడు

ప॥తే॥ తనువునకు, కష్టము కలుగు-ననుభయంబు,
కలుగు దుఃఖమనుచునెంచి,-కర్మములను
విడువ, రాజసత్యాగంబు-వాడు జేసి
కర్మసన్యాస ఫలమును-గాంచ లేడు

గే॥ కలుగు కష్టము దేహమున కని
కష్టమిచ్చేడి కర్మముల్
బాని విడిచిన భయము చేతను
త్యాగమది, రజసంబునౌ
కర్మ ఫలమును త్యాగ ఫలమును
కలుగకుండును వానికి
అని కిరీటికి ॥శ్రీహరి॥

9) శ్లో॥ కార్యమిత్యేవ యత్కర్మ
నియతం క్రియతేఽర్జున
సంగంత్యక్త్వా ఫలంచైవ
సత్యాగః సాత్త్వికో మతః

ప వి. కార్యం, ఇతి ఏవః యత్, కర్మ, నియతం, క్రియతే, అర్జున, సంగం, త్యక్త్వా, ఫలమ్, చ, ఏవ, సః, త్యాగః, సాత్త్వికః, మతః.

టీ॥ హేఅర్జునా - ఓయర్జునా, సంగం - ఆసక్తిని, ఫలంచ - ఫలమును, త్యక్త్వా-విడిచి, యత్-ఏ, నియతంకర్మ-నిత్యకర్మము, కార్యమిత్యేవ - చేయదగినదేయని క్రియతే - చేయబడుచున్నదో, సత్యాగః-ఆత్యాగము సాత్త్వికమితి-సత్వగుణమువలను పుట్టినదని, మతః-అభిమతము

గ॥ అర్జునా ఆసక్తిని ఫలమును వదలి వేదోక్తమైన నిత్య కర్మలు చేయదగినవేయని, ఏవడు చేయుచున్నాడో, అట్టివాని త్యాగము సాత్త్వికత్యాగమని యెరుంగుము

ప॥తే॥ కర్మలందు సంగము, ఫల-కాంక్ష వదలి
సలుపదగినవి వేదోక్త-సర్వ కర్మ
లనుచు తలచి, సలుపుచుండు-నట్టి వాని
త్యాగమును సాత్వికంబగు-త్యాగ మనిరి

గీ॥ వేదోక్తమగు నిత్య కర్మలు
విడిచి సంగము ఫలమును౯
సలుపుచుండిన శ్రద్ధ చేతను
సాత్విక త్యాగంబగు౯
అని కిరీటికి ॥శ్రీహరిని

10) శ్లో॥ నద్వేష్ట్యకుశలం కర్మ
కుశలే నాను షజ్జతే
త్యాగీ సత్వ సమా విష్టో
మేధావీ చిన్న సంశయః

ప.వి. న, ద్వేష్టి, అకుశలం, కర్మ, కుశలే, న, అనుషజ్జతే, త్యాగి సత్వసమావిష్టః, మేధావీ, చిన్నసంశయః

టీ॥ సత్వసమావిష్టః-సత్వగుణముచేత వ్యాపింపబడినవాడును, మేధావీ-ఆత్మజ్ఞానము కలిగినవాడును, ఛిన్నసంశయః-భేదింపబడిన సందేహము గలిగినవాడునగు, త్యాగి - ఫలత్యాగియైన పురుషుడు, అకుశలం-అశుభకరమైన, కర్మ-కర్మమును, నద్వేష్టి - ద్వేషింపడు, కుశలే-సుఖకరమైన కర్మమునందు, నానుషజ్జతే-ఆసక్తుడుకాడు

గ॥ అర్జునా సత్వగుణముచేత కూడినవాడును ప్రజ్ఞావంతుడును, సంశయముతీసినవాడును, త్యాగశీలుడు, దుఃఖకరములైన కర్మములను ద్వేషింపడు, సుఖకరమైన కర్మములయందాసక్తుడు కాడు

ప॥తే॥ సత్వ గుణశాలి, ప్రాజ్ఞుండు,-సంశయంబు
లేవి త్యాగశీలుడు, దుఃఖ-మునుకలుగగ
జేయు కర్మల, ద్వేషంబు-చెందకుండు
సౌఖ్యకర కర్మములయందు-సక్తి వదలు

గే॥ సాత్వికంబగు గుణము కలిగిన
జ్ఞానవంతుడు నిత్యముగ
సంశయంబును వదలి పూర్తిగ
చాలదుఃఖపు కర్మలగ
వైరముంచడు, సౌఖ్యకర్మల
వాడు పొందడు సక్తియుగ

అని కిరీటికి ॥శ్రీహరిని

11) శ్లో॥ నహిదేహ భృతా శక్యం
త్యక్తుంకర్మా ణ్యశేషతః
యస్తు కర్మ ఫల త్యాగీ
సత్యాగీ త్యభి ధీయతే

ప ఎ. న, హి. దేహభృతా, శక్యం, త్యక్తుం, కర్మాణి, అశేషతః, యః. తు. కర్మఫలత్యాగీ, సః, త్యాగీ, ఇతి, అభిదీయతే,

టీ॥ దేహభృతా - దేహధారిచేత, అశేషతః - సంపూర్ణముగా, కర్మాణి-కర్మములను, త్యక్తుం-విడుచుటకొరకు, నశక్యంహి-శక్యము కాదుగదా?, యస్తు-యెవను, కర్మఫలత్యాగీ-కర్మఫలములను విడుచు చున్నాడో, సః-వాడు, త్యాగీ - త్యాగముగలవాడని, అభిదీయతే-చెప్పబడుచున్నాడు

గ॥ అర్జునా దేహధారులకు సంపూర్ణముగ కర్మములను విడుచుటకు శక్యముగాదు. యెవడు కర్మములుచేయుచు. ఫలమును విడుచుచున్నాడో, వాడే త్యాగియని చెప్పబడుచున్నాడు .

ప॥తే॥ కాదు శక్యంబు సర్వంబు-కర్మములను
వదల దేహదారులకెల్ల-వదలి ఫలము
సలుపుచుండిన కర్మల-సవ్యసాచి
త్యాగియని వానిసందురు-తత్వవిదులు

గే॥ శక్యముగాదు కర్మలు విడువ
శరీరధారు లెవ్వరుకా
విడిచి ఫలమును, కర్మ సలిపిన
వాడు నిజముగ త్యాగియౌ
అని వచించిరి తత్వవేత్తలు
అర్జునా సంపూర్తిగా
అని కిరీటికి ॥శ్రీహరిని

12। శ్లో॥ అనిష్ట మిష్టం మిశ్రించ
త్రివిధం కర్మణః ఫలం
భవత్య త్యాగినాం ప్రేత్య
నతు సన్యాసినాం క్వచిత్ ...

ప వి. అనిష్టం, ఇష్టం, మిశ్రం, చ. త్రివిధం, కర్మణః. ఫలం, భవతి. అత్యాగినాం. ప్రేత్య న, తు, సన్యాసినామ్, క్వచిత్

టీ॥ అనిష్టం-యిష్టము కానిదనియు, ఇష్టం-యిష్టమైనదనియు. మిశ్రం - ఇష్టానిష్టమిశ్రమైనదనియు. త్రివిధం - మూడువిధములు

ఫలిగిని, కర్మణః-కర్మములయొక్క, ఫలం-ఫలము, అత్యాగినాం-త్యాగులకానివారలకు, ప్రేత్య - జన్మాంతరమును పొంది, భవతి-కలుగుచున్నది సన్యాసినాంతు - కర్మఫలత్యాగులకైతే, క్వచిదపి-ఎప్పుడును. నభవతి-కలుగదు

గ॥ అర్జునా కర్మఫలములు ప్రియములైనవి అప్రియములైనవి. ప్రియాప్రియములైనవని మూడువిధములు, కర్మ ఫల త్యాగము చేయనివారికి జన్మాంతరములందు పొందుచున్నవి కర్మఫలమును విడిచినవారికి ఆఫలము. లెప్పుడును కలుగివు

ప॥తే॥ ప్రియము, నప్రియమును, ప్రియా-ప్రియములనెడి
త్రివిధములు కర్మ ఫలములు-తెలిసికొనుచు
త్యాగమొనరింప,కేకర్మ-మాచరింప
పొందు ఫలంబు జన్మాంతర-మందు పార్థ
త్యాగి కంటవు ఫలముల-టంచెరుగు

గే॥ ఇష్ట మనిష్టము మిశ్రింబని
ఇట్లు ఫలములు త్రివిధమౌ
కర్మ ఫలమును విడువకుండిన
కలుగు జన్మాంతరములన్
కర్మ ఫలమును సలుప త్యాగము
కలుగవే జన్మానికిన్ ...

అని కిరీటికి ॥శ్రీహరి॥

13) శ్లో॥ పంచైతాని మహా బాహో
కారణాని నిబోధమే

సాంఖ్యే కృతాంతే ప్రోక్తాని
సిద్ధయే సర్వ కర్మణామ్

ప. వి. పంచ, ఏతాని, మహాబాహో, కారణాని, నిబోధ, మే, సాంఖ్యే, కృతాంతే, ప్రోక్తాని, సిద్ధయే, సర్వకర్మణాం

టీ॥ హేమహాబాహో - ఓయర్జునా, సర్వకర్మణాం - సమస్త కర్మములయొక్కయును, సిద్ధయే - సిద్ధికొరకు, కృతాంతే - కర్మ సిద్ధాంతమును తెలిపెడి సాంఖ్యే-సాంఖ్యమునందు, ప్రోక్తాని-చెప్ప బడిన, ఏతాని-ఈ, పంచ-అయిదైన కారణాని - కారణములను, మే-నావలనను, నిబోధ-తెలిసికొనుము

గ॥ అర్జునా సమస్తకర్మములయొక్క సిద్ధికొరకు, సిద్ధాంత మును తెలిపెడి, సాంఖ్యశాస్త్రమందుచెప్పబడిన అయిదుకారణములను చెప్పెదను వినుము

ప॥తే॥ అన్ని కర్మల సంసిద్ధి-నంద జేయ
సర్వకర్మల సిద్ధాంత-సాంఖ్యమందు
నైదు కారణములు గల-వవ్వి, నీకు
తెలియజేసెద వినుమయ్య-తెల్లముగను

గే॥ సాంఖ్య శాస్త్రమునందు తెలిపిన
సర్వ కర్మల సిద్ధికిన్
అయిదు హేతువులుండు భారత
అవ్వి వినుము వచించెదన్

అని కిరీటికి ॥శ్రీహరిని

14) శ్లో॥ అధిష్ఠానం తథా కర్తా
కరణంచ పృథగ్విధమ్
వివిధా చపృథక్చేష్టా
దైవం చై వాత్ర పంచమమ్....

ప.వి. అధిష్ఠానం, తథా, కారణం, చ, పృధగ్విధం, వివిధాః, చ, పృధక్, చేష్టాః, దైవం, చ, ఏవ, అత్ర పంచమమ్

టీ॥ అధిష్ఠానమ్ - దేహమును, తథా-అటులే, కర్తా - కర్త (అహంకారమనేకథోక్త), పృథగ్విధం-నానావిధములైన, కరణం-(శ్రోత్రాతి) ఇంద్రియములను వివిధాచ-నానావిధమైన, పృథక్-వేర్వేరైన, చేష్టా + చ-క్రియలును, అత్ర-వీనియందు, దైవః + చ + ఏవ-ఈశ్వరుడును, పంచమం-అయిదవకారణము.

గ॥ అర్జునా, శరీరము, అహంకారము, యింద్రియములు, పంచప్రాణముల వ్యాపారము, వీనియధిమాన దేవతల ప్రేరణము, అని యీవిధముగా అయిదు కారణములున్నవి .

ప॥తే॥ ఈశరీర మహంకార-మింద్రియంబు
లైదు, విధప్రాణముల వ్యవ-హారము, మరి
వీని యధిమానదైవత-ప్రేరణంబు
యీ విధిగనైదు హేతువు-లెరుగు పార్థ

గే॥ శారీరంబు నహంకారము
సర్వేంద్రియంబులు గా
పంచప్రాణముల వ్యాపారము
ప్రముఖాధి దైవతములు గా

అయిదు హేతువులుండు భారత
అన్ని కర్మల సిద్ధికిఁ
అని కిరీటికి ॥శ్రీహరిని

15) శ్లో॥ శరీరవాఙ్మనోభిర్య
త్కర్మ ప్రారభతే నరః
న్యాయం వా విపరీతం వా
పంచైతే తస్య హేతవః..

ప.వి. శరీరవాఙ్మనోభిః, యత్, కర్మ, ప్రారభతే, నరః, న్యాయం, వా, విపరీతం, వా, పంచ, ఏతే, తస్య, హేతవః,.

టీ॥ నరః-మనుష్యుడు, శరీరవాఙ్మనోభిః-శరీరము, వాక్కు, మనసులచేత, న్యాయంవా-మంచిదైనను, విపరీతంవా-అన్యాయమైన దైనను, యత్కర్మ - ఏకర్మమును, ప్రారభతే - ప్రారంభించు చున్నాడో, తస్య - ఆకర్మమునకు, ఏతేపంచ - ఈఅయిదును, హేతవః-కారణములు

గ॥ అర్జునా మనుష్యుడు, మనస్సు వాక్కు, శరీరము వీని చేత మంచిదిగాని, చెడ్డదిగాని యేకర్మమును ప్రారంభించునో, అప్పుడీయైదును, కారణములని తెలియుము

ప॥తే॥ అవ్వి మంచివైనను చెడ్డ-వైనగాని
కాయము, మనస్సు వాక్కు-చే-కర్మలెవ్వి
యైన, మనుజుడు, మొదలిడు-నప్పుడైదు
కారణము లివ్వి తెలియుము-వీరవర్య

గే॥ మనసు, వాక్కును, శరీరముతో
మంచిచెడు కర్మంబులకా
ప్రారంభించినపుడు మనుజుడు
పైన వేయగు హేతువుల్
అని కిరీటికి ॥శ్రీహరి॥

16) శ్లో॥ తత్రైవం సతి కర్తార
మాత్మానం కేవలంతుయః
పశ్యత్యకృత బుద్ధిత్వా
న్నస పశ్యతి దుర్మతిః

ప.వి. తత్ర, ఏవమ్, సత్తి, కర్తారం, ఆత్మానం, కేవలం, తు, యః, పశ్యతి, అకృతబుద్ధిత్వాత్, న, సః, పశ్యతి దుర్మతిః,

టీ॥ తత్ర-అకర్మయందు, (కారణము) ఏవంసతి-ఇట్లుండగా, యః-ఎవడు, ఆత్మానం కేవలంతు-తననొకనినే, కర్తారం-కర్తగాను, పశ్యతి-చూచుచున్నాడో, సః-అట్టి, దుర్మతిః-అవివేకి, అకృతబుద్ధిత్వాత్-సంస్కరింపబడని బుద్ధిగలవాడగుటచేతను, నపశ్యంతి-తెలిసికొకున్నాడు .

గ॥ అర్జునా ప్రతికర్మకు కారణములై యుండగా, యెవడు కర్మకు తానొకడే, కర్తనని, తలంచుచున్నాడో, అట్టి అజ్ఞాని ఆత్మతత్త్వము నెరుగజాలడు (నిజమెరుగడు)

ప॥తే॥ కర్మలన్నింటికీ రీతి-కారణములు
కలిగియుండ, నేనని కర్త-కర్మమునకు

తలచుచుండు, వాడవివేకి-తత్వమెరుగ
జాలడెప్పుడు భువియందు-సవ్యసాచి...

గే॥ కలిగియుండగ కర్మంబులకు
కారణము లైదెప్పుడుఁ
తలచునెవ్వడు కర్తనేన
తెలివిలేకను కర్మకుఁ
ఆత్మతత్వము నెరుగజాలం
డాతడజ్ఞా నుండనై
అని కిరీటికి ॥శ్రీహరిని

17) శ్లో॥ యస్యనాహం కృతోభావో
బుద్ధిర్యస్య నలిప్యతే
హత్వాపి సఇమాఁ లోకాఁ
న్నహంతినని బధ్యతే

ప.వి. యస్య, న, అహంకృతః, భావః, బుద్ధిః, యస్య, న, లిప్యతే, హత్వా, అపి, సః, ఇమాఁ, లోకాఁ, న, హంతి, న, నిబధ్యతే

టీ॥ యస్య - ఏపురుషునికి, అహంకృతః - నేనే కర్తననెడి, భావః-భావము, న-లేదో, యస్య - ఎవనియొక్క, బుద్ధిః - బుద్ధి, నలిప్యతే-లిప్తముగాదో, (విషయములయందు సంగముకాదో) సః-వాడు, ఇమాఁ-ఈ, లోకాఁ-ప్రాణులను, హత్వాపి - చంపియు, నహంతి-చంపినవాడు కాడు, నిబధ్యతే-బద్ధుడును కాడు

గ॥ అర్జునా యెవ్వడహంకారము చెందక, కర్మఫలకాంక్ష లేని వాడై యుండునో, వాడీజనులనందరిని చంపినవాడైనను, చంపిన వాడు కాజాలడు, బద్ధుడునుకాడు

ఆ॥తే॥ ఎవడుపొంద, దహంకార-మింతయేని
లేనివాడునై ఫలకాంక్ష-లేశమైన
జగతియందునవాడె ల్ల-జనుల చంపి
చంపకుండిన వాడునౌ-సవ్యసాచి
అంటకుండునుబంధంబు-లతని కవని

గే॥ ఫలము కోరక, గర్వమొందక,
సలిపినను యేకర్మముగా
చంపినను, యీ జనులనందర
చంపకుండిన వాడగుగా
కర్మఫలమును పొందదాతడు
కాడు కర్మకు కర్తయుగా
అని కిరీటికి ॥శ్రీహరిని॥

18) శ్లో॥ జ్ఞానం జ్ఞేయం పరిజ్ఞాతా
త్రివిధాకర్మ చోదనా
కరణం, కర్మ, కర్తేతి,
త్రివిధః కర్మ సంగ్రహః ....

ప వి జ్ఞానం, జ్ఞేయం, పరిజ్ఞాతా, త్రివిధా, కర్మచోదనా, కరణం కర్మ, కర్తా, ఇతి, త్రివిధః, కర్మ, సంగ్రహః,

టీ॥ కర్మచోదనా-కర్మోపదేశము, జ్ఞానమితి - జ్ఞానమనియు, జ్ఞేయమితి - తెలియదగినదనియు, పరిజ్ఞాతా - తెలియువాడనియు, త్రివిధా-మూడువిధములు గలది, కర్మసంగ్రహః-కర్మసంగ్రహము, కరణం-కరణమనియు, కర్మ-కర్మమనియు, కర్తేతి-కర్తయనియు త్రివిధం-మూడువిధములు గలది

గీ॥ కర్మోపదేశము (కర్మప్రవృత్తి) జ్ఞానమనియు, తెలియదగినదనియు, తెలియువాడనియు, మూడువిధములుగలది. కర్మసంగ్రహము, కరణమనియు కర్మమనియు, కర్తయనియు, మూడువిధములుగలది

ప॥తే॥ జ్ఞానమని జ్ఞేయమని పరి-జ్ఞాతమనియు
కలవు, త్రివిధవిధంబులు కర్మ విధులు
కర్తయును కర్మమనియును-కరణమనియు
కర్మయును మూడు విధములు-కలదిపార్థ

గే॥ కర్మోపదేశము మూడు గతులు
కలిగియుండును భారతా
జ్ఞానమనియును, జ్ఞేయమనియును
జ్ఞానము కలవాడనియును
కరణ, కర్మయు కర్తయనియును
కర్మయును మూడు విధముల్
అని కిరీటికి ॥శ్రీహరిని

19) శ్లో॥ జ్ఞానం కర్మచ కర్తాచ
త్రిధైవ గుణభేదతః

ప్రోచ్యతే గుణ సంఖ్యానే
యథా వచ్ఛృణు తాన్యపి ..

ప.వి. జ్ఞానం, కర్మ, చ, కర్తా, చ, త్రిధా, ఏవ, గుణ భేదతః, ప్రోచ్యతే, గుణసంఖ్యానే, యథావత్, శృణు తాని, అపి

టీ॥ గుణసంఖ్యానే-సాంఖ్యశాస్త్రమునందు, జ్ఞానంచ-జ్ఞానమును, కర్మచ-కర్మమును, కర్తాచ-కర్తయు, గుణ భేదతః-గుణ భేదములను బట్టి, త్రిధైవ - మూడువిధములుగా, ప్రోచ్యతే - చెప్పబడుచున్నది, తాన్యపి-వానిని కూడ, యథావత్-యథార్థముగను, శృణు-వినుము.

గ॥ అర్జునా సాంఖ్యశాస్త్రములలో జ్ఞానమును, కర్మమును, కర్తయును, సత్వాధి గుణభేదములచే, నొకటొకటి మూడువిధములు గానే, చెప్పబడియున్నది, వానిని సాంఖ్యశాస్త్రమురీతిగ వినుము.

ప॥తే॥ శాస్త్రములలో, కర్తయు, కర్మ-జ్ఞానములను
చెప్పిరి, గుణవిభేదము-చేత, మూడు
విధములుగ, వినుమెరిగింతు-విశదముగను
సాంఖ్యశాస్త్రంబు రీతిగ-సవ్యసాచి...

గే॥ శాస్త్రములలో మూడు విధములు
జ్ఞాన కర్మము, కర్తలకా
సాత్వికాది గుణభేదముచే
సాంఖ్యశాస్త్రము రీతిగా
తెలుపబడియెను వేరు వేరుగ
తెలిపెదను విను పాండవా ...

అని కిరీటికి ॥శ్రీహరిని

20) శ్లో॥ సర్వభూతేషుయే నైకం
భావ మవ్యయ మీక్షతే
అవిభక్తం విభక్తేషు
తద్జ్ఞానం విద్ధిసాత్వికమ్ ...

ప.వి. సర్వభూతేషు, యేన, ఏకం, భావం, అవ్యయమ్, ఈక్షతే, అవిభక్తం, విభక్తేషు తత్, జ్ఞానం, విద్ధి, సాత్వికమ్.

టీ॥ ఏన-యేజ్ఞానముచేత, విభక్తేషు - భిన్నములైన, సర్వభూతేషు-సర్వప్రాణులయందును, అవిభక్తం-అఖండమైనదియును, అవ్యయం - నాశరహితమైనదియును, ఎకం - ఒకటైనదియునైన, భావం-భావమును, ఈక్షతే-చూచుచున్నాడో, తద్జ్ఞానం-అజ్ఞానమును, సాత్వికం-సత్వగుణమువలన, పుట్టినదానిగా, విద్ధి-తెలియుము

గ॥ అర్జునా వేరువేరుగాయుండు సమస్త ప్రాణులయందును, అఖండమైన నాశరహితమైన, ఒకటైన పరమాత్మను, యేజ్ఞానము చేత చూచుచున్నాడో, అట్టిజ్ఞానమును సాత్వికజ్ఞానమని తెలిసికొనుము.

ప॥తే॥ వలువిధంబుల భేదమై-పరుగుచుండు
సర్వప్రాణులయందుండు-స్వామియొకడె
అవ్యయంబు, నఖండంబు-నైన వాడు
ననుచు, నేజ్ఞానమున చూను-నట్టి జ్ఞాన
మును, తెలిసికొను సాత్యిక-జ్ఞానమనుచు...

గే॥ ఎల్లభూతములందు యుండిన
ఈశ్వరుడు తానొక్కడే

అవ్యయుండును, యవిభక్తుండు
నైనవాడని యాత్మలో
యే జ్ఞానముచేత చూచునో
అజ్ఞానమగు సాత్వికమ్
అని కిరీటికి ॥శ్రీహరిని

21) శ్లో॥ పృథక్త్వేనతు యజ్ఞానం
నానాభావాన్ పృథగ్విధాన్
వేత్తి సర్వేషు భూతేషు
తద్జ్ఞానం విద్ధి రాజసమ్

ప.వి. పృధక్త్వేన, తు, యత్ జ్ఞానం, నానాభావాన్, పృథగ్విధాన్, వేత్తి, సర్వేషు, భూతేషు, తత్, జ్ఞానం, విద్ధి, రాజసమ్

టీ॥ యద్జ్ఞానం- ఏజ్ఞానము, (చేత) సర్వభూతేషు - సమస్త ప్రాణులయందును, పృధక్త్వేన - భేదభావముచేత, పృథగ్విధాన్- భిన్నప్రకారములైన వానినిగా నానా,భావాన్-నానాస్వరూపములైన వానినిగా, వేత్తి - తెలియుచున్నాడో, తద్జ్ఞానం - ఆజ్ఞానమును, రాజసం-రజోగుణసంబంధమైన దానిగా, విద్ధి-తెలియుము

గ॥ అర్జునా సర్వప్రాణులయందొక్కడై యున్న పరమాత్మను వేర్వేరు ప్రాణులయందు భిన్నడై యున్నాడని, యేజ్ఞానము చేత తెలిసికొనుచున్నాడో, అట్టి జ్ఞానమును రాజసజ్ఞానమని తెలిసికొనుము.

ప.తే॥ అన్నిప్రాణులయందుండు-నాత్మనెవడు
వేరువేరుగ నాత్మలై-వెలయుననుచు

నెట్టి జ్ఞానము చేతవా-డెంచుచుండు
నట్టి జ్ఞానము రాజస-మని యెరుంగు .

గే॥ సర్వభూతములందు యుండిన
సర్వేశ్వరుడు భిన్నుడని
యే జ్ఞానము భేదము తలచునో
అజ్ఞానము రజసమగుణ
అని కిరీటికి ॥శ్రీహరిని

22) శ్లో॥ యత్తుకృత్స్నవదే కస్మి
న్కార్యేసక్త మహైతుకమ్
అతత్వార్థ వదల్పంచ
తత్తామస ముదాహృతమ్

ప.వి. యత్, తు, కృత్స్నవత్, ఏకస్మిణ, కార్యే, సక్తం, అహైతుకమ్. అతత్వార్థవత్, అల్పం, చ, తత్, తామసం, ఉదాహృతమ్

టీ॥ యద్‌జానము-ఏజ్ఞానము ఏకస్మిణ - ఒకటైన, కార్యే-కార్యమునందు, కృత్స్నవత్-సమస్తమునందువలెను, సక్తం-ఆసక్తమైనదియును, అహైతుకమ్-కారణముకానిదియును అతత్వార్థవత్-యదార్థముకానిదియును, అల్పంచ-స్వల్పమైనదియునై యున్నదో, తత్-అజ్ఞానము, తామసం-తామసజ్ఞానమని. ఉదాహృతమ్-చెప్పబడి యున్నది

గీ॥ అర్జునా హేతుయుక్తము కానిదియును, పరమార్థముకానిది యును అల్పమైనదియును నైన ఒకవిషయమందే, సమస్త జ్ఞానము

న్నట్లు తలచు చుండె జ్ఞానమును, తామసజ్ఞానమని చెప్పబడు చున్నది.

ప॥తే॥ అల్పమగుచు, నసత్యమై-యలరుచుండి
హేతుయుక్తముగానట్టి-యేదొయొకటి
సర్వ సంసద్ధి యిదియని-సక్తిగలుగు
నట్టిజ్ఞానము తామస-మనియెరుంగు ...

గే॥ అల్పంబగుచు నసత్యంబునై
యలరుచుండెడి దానినిఁ
హేతుయుక్తము కాని దేదియొ
యెంచు సర్వంబనుచునూ
అట్టి జ్ఞానము తామసంబని
యనిరి భారత పండితుల్
అని కిరీటికి ॥శ్రీహరిని

28) శ్లో॥ నియతం సంగ రహిత
మరాగ ద్వేషతః కృతమ్
అఫలప్రేప్సునా కర్మ
యత్తత్సాత్త్విక ముచ్యతే

ప.వి. నియతం, సంగరహితం, అరాగద్వేషతః. కృతమ్, అఫలప్రేప్సునా. కర్మ. యత్. తత్, సాత్వికమ్, ఉచ్యతే

టీ॥ యత్కర్మ-ఏకర్మము, నియతం-నిత్యమైనదై, సంగ రహితం-అసక్తి రహితమైనదై, అఫల ప్రేప్సునా-ఫలాపేక్ష లేనివాని చేత అరాగద్వేషతః-రాగద్వేషరాహిత్యమువలన, కృతం-చేయబడునో

తత్ ఆకర్మము సాత్త్వికం-సత్త్వగుణ సంబంధమైనదని, ఉచ్యతే-చెప్ప బడుచున్నది.

గ॥ అర్జునా యేకర్మ (శాస్త్రసమ్మతమై) నిత్యమైనదై, ఫలా పేక్ష, ఆసక్తి, అభిమానము, రాగద్వేషములు లేకుండ, చేయబడు చున్నదో, అట్టి కర్మము సాత్విక కర్మయని చెప్పబడుచున్నది

ప॥తే॥ శాస్త్ర సమ్మతమైనదై-సంగరహిత
మైనదగుచేసు, నిత్యమైయలరుదాని
వదలి ఫలకాంక్ష, వైరంబు-వదలి, రాగ
మును వదలి, సలిపెడి కర్మ-మనిరి పార్థ
సాత్వికంబైన కర్మగా-సర్వబుధులు

గే॥ శాస్త్ర సమ్మతమైన కర్మము
సంగరహితము, నిత్యమై
లేక రాగము, ద్వేషంబులును,
లేక ఫలమున యాశయు
సత్వగుణ ప్రధాన మదియని
సమ్మతించిరి పండితుల్..

అని కిరీటికి ॥శ్రీహరిని

24) శ్లో॥ యత్తు కామేప్సునా కర్మ
సాహంకారేణ వాపునః
క్రియతే బహుళా యాసం
తద్రాజ సముదాహృతమ్....

ప.వి. యత్, తు, కామేప్సునా, కర్మ, సాహంకారేణ, వా, పునః క్రియతే, బహులాయాసం తత్ రాజసమ్, ఉదాహృతమ్

టీ॥ కామేప్సునా - కోరిక గలవానిచేతగాని, సాహంకారేణవా - అహంకారముతోకూడిన వానిచేతగాని. బహులాయాసం - అధికాయాసము గలిగిన, యత్కర్మతు - ఏ కర్మము, క్రియతే చేయబడుచున్నదో, తత్పునః - ఆ కర్మము, రాజసమితి - రజోగుణము వలన పుట్టినదని, ఉదాహృతం - చెప్పబడినది

గ॥ అర్జునా ఫలాపేక్షగల వానిచేతగాని, అహంకారముతో గూడినట్టి వానిచేతగాని, మిక్కిలి కష్టము నొసగు యేకర్మచేయబడుచున్నదో, దానిని రాజస కర్మయని చెప్పబడినది

ప॥తే॥ కలిగి ఫలకాంక్ష, గర్వంబు-కలిగి, మిగుల
అధిక కష్టంబు చేకూర్చు-నట్టిదైన
యెట్టి కర్మంబు సలుపంగ-నెంచునెవడు
దాని రాజస కర్మగా-తలచుపార్థ....

గే॥ కూడి గర్వము కోరికలతో
కూడి మిక్కిలి కష్టముగా
చేయు కర్మను రాజసంబని
చెప్పియుండిరి పండితుల్

అని కిరీటికి ॥శ్రీహరిని

25) శ్లో॥ అనుబంధం క్షయంహింసా
మనపేక్ష్యచ పౌరుషం

మోహాదారభ్యతే కర్మ
యత్తత్తామస ముచ్యతే

ప వి. అనుబంధం క్షయం, హింసామ్, అనపేక్ష్య చ పౌరుషం. మోహాత్, ఆరభ్యతే, కర్మయత్. తామసమ్, ఉచ్యతే

టీ॥ అనుబంధం - పర్యవసానము, క్షయం - నాశనమును, హింసా - పీడను - పౌరుషం - సామర్థ్యమును, అనపేక్ష్యచ - విచారింపక, మోహాత్ - అజ్ఞానమువలన, యత్కర్మ - ఏకర్మము, ఆరభ్యతే - ఆరంభింపబడుచున్నదో తత్ - ఆ కర్మము, తామసం- తామసమని, ఉదాహృతమ్ - చెప్పబడెను

గ॥ కర్మముయొక్క పర్యవసానమును నాశనమును, పీడను సామర్థ్యమును, విచారింపక అజ్ఞానము వలన, యేకర్మ మారంభింపబడుచున్నదో. ఆ కర్మ తామస కర్మమని చెప్పబడెను

ప॥తే॥ ఇట్టి కర్మంబునొనరింప-యెట్టిబాధ
కలుగు, నాశనమెంతగా-కలుగు, శక్తి
తలప, కజ్ఞానమువలన-సలుపబడెడి
కర్మమును, తామసంబగు-కర్మమనిరి. .

గే॥ అజ్ఞానమున ముందుకలిగెడి
హాని యాలోచింపకజ
కలిగి దర్పము హింస, నాశము,
సలుపు, కర్మము తామసమ్

అని కిరీటికి ॥శ్రీహరిని

26) శ్లో॥ ముక్తసంగోనహం వాదీ
ధృత్యుత్సాహసమన్వితః
సిద్ధ్య సిద్ధ్యో ర్నిర్వికారః
కర్తాసాత్విక ఉచ్యతే . .

ప.వి. ముక్తసంగః, అనహం వాదీ, ధృత్యుత్సాహ సమన్వితః, సిద్ధ్య సిద్ధ్యోః, నిర్వికారః కర్తా, సాత్వికః ఉచ్యతే

టీ॥ ముక్తసంగః-విడువబడిన యాసక్తి గలిగినవాడును, అనహం వాది - అహంవాది కానట్టివాడును, ధృత్యుత్సాహసమన్వితః-ధైర్యము ఉత్సాహములతో కూడినవాడును, సిద్ధ్య సిద్ధ్యోః - కార్యము సిద్ధించినను సిద్ధింపకపోయినను నిర్వికారః - వికారము లేనివాడు నైన, కర్తా - కర్త, సాత్వికం - సత్వగుణము కలవాడని, ఉచ్యతే, చెప్పబడుచున్నాడు .

గ॥ అర్జునా విడువబడిన యాసక్తిగలవాడును, అభిమానము లేనివాడును, ధైర్యము ఉత్సాహముతో కూడినవాడును, ఫలా ఫలములయందు చలింపనివాడునగు కర్తసత్వగుణము కలకర్తయని చెప్పబడుచున్నాడు

ప॥తే॥ లేనివాడును ఫలకాంక్ష-లేశమేని
లేని వాడభిమానము-లేశమైన
కూడి ధైర్యముత్సాహమణ-గుణము లేపుడు
కార్యసిద్ధి కసిద్ధికి-కలతలేక
కర్మములు సల్పు, సాత్విక-కర్తపార్థ.. .

గీ॥ వదలియుండిన వాడు ప్రీతిని
వదలు వానిని గర్వముగా
సిధ్యసిద్ధులయందు కొంచెము
చెందకుండ వికారముగా
కలిగి ధీరత యుత్సాహంబులు
కర్త సాత్వికు డనబడుగా ....
అని కిరీటికి ॥శ్రీహరిని

27) శ్లో॥ రాగీ కర్మ ఫలప్రేప్సు
ర్లుబ్ధో హింసాత్మకోఽశుచిః,
హర్ష శోకాన్వితః కర్తా
రాజసః పరికీర్తితః .

ప.వి. రాగీ, కర్మఫలప్రేప్సుః లుబ్ధః, హింసాత్మకః, అశుచిః హర్ష శోకాన్వితః, కర్తా రాజసః, పరికీర్తితః,

టీ॥ రాగీ — అనురాగము కలిగినవాడును, కర్మ ఫలప్రేప్సు— కర్మఫలమును నాశించెడివాడును, లుబ్ధః — లోభియును, హింసాత్మకః – హింసాస్వభావము గలవాడును, అశుచిః — శుచిత్వములేని వాడును హర్షశోకాన్వితః — సంతోష దుఃఖములతో కూడినవాడు నైన, కర్తా — కర్త, రాజసః — రాజసుడని, పరికీర్తితః — చెప్ప బడును

గ॥ అర్జునా అనురాగము కలవాడును, కర్మఫలమును కోరు వాడును, లోభియును, హింసించు స్వభావముకలవాడును, శుచిత్వము లేనివాడును, దుఃఖ సంతోషములతో కూడివాడునగు కర్తను రాజస కర్తయని చెప్పబడుచున్నాడు

ప॥తే॥ కలిగి ఫలకాంక్ష రాగియై-కలిగి లోభ
గుణము, సంతోష, దుఃఖముల్-కూడి యుండి
అశుచి, హింసా స్వభావంబు-నలరియుండు
కర్తనవిరి, రాజసగుణ-కర్తయనుచు...

గే॥ కర్మ ఫలమును కోరు వాడును
కలుగు వాడును రాగముగా
సలుపువాడును హింసపరులకు
కలిగి దుఃఖము శోకముగా
అశుచి లోభము గలుగువానిని
యనిరి రాజసకర్తగా

అని కిరీటికి ॥శ్రీహరిని

28) శ్లో॥ అయుక్తః ప్రాకృతః స్తబ్ధః
శఠో నైకృతికోఽలసః
విషాదీ దీర్ఘ సూత్రీచ
కర్తా తామస ఉచ్యతే

ప వి. అయుక్తః, ప్రాకృతః, స్తబ్ధః, శఠః, నైకృతికః, అలసః, విషాదీ, దీర్ఘసూత్రీ, చ, కర్తా, తామసః, ఉచ్యతే,

టీ॥ అయుక్తః-యుక్తుడుకానివాడును, ప్రాకృతః-పామరుడును, స్తబ్ధః-జడప్రాయుడును, శఠః-మోసగాడును, నైకృతికః-వంచకుడును, అలసః-సోమరియును, విషాదీ-దుఃఖస్వభావము గలవాడును, దీర్ఘసూత్రీ-ఆలస్యముగా పనులు చేయునట్టివాడును, నగు, కర్తా-కర్తను, తామసః-తామసుడని, ఉచ్యతే-పలుకబడుచున్నాడు

గ॥ అర్జునా యుక్తుడు కానివాడును, పామరుడు, జడ ప్రాయుడు, మోసగాడు, వంచకుడు, సోమరియు, దుఃఖస్వభావము గలవాడు, కాలయాపన చేయువానిని, తామసకర్తయని చెప్పబడు చున్నాడు

ప॥తే॥ పామరు, డయుక్తుడు, జడుడు-వంచకుండు
సోమరియు, మోసగాడును,-శోకయుతుడు
కాలయాపన పరుడగు-కర్తననిరి
తామసంబగు కర్తని-తత్వవిదులు

గే॥ అవివేకుడును బుద్ధిహీనుడు
ఆలస్యుండు కరినుడుగా
మందుండును దుఃఖశీలుడును
మాయావియో కర్తనుగా
పలికిరి తామస కర్తయనుచు
పండితులు వివరంబుగా....
అని కిరీటికి ॥శ్రీహరిని

29) శ్లో॥ బుద్ధేర్భేదం ధృతేశ్చైవ
గుణతస్త్రి విధం శృణు
ప్రోచ్యమాన మశేషేణ
పృథక్త్వేన ధనంజయ....

ప.వి. బుద్ధేః, భేదం, ధృతేః, చ, ఏవ, గుణతః, త్రివిధం, శృణు, ప్రోచ్యమానం, అశేషేణ, పృథక్త్వేన, ధనంజయ

టీ॥ హేధనంజయ-ఓయర్జునా, అశేషేణ-నిశ్శేషముగా, పృథక్త్వేన - వేరుపరచుటచేత, ప్రోచ్యమానం - చెప్పబడుచున్నదియు, గుణతః-సత్వాదిగుణమువలన, త్రివిధం-మూడువిధములు గలిగినట్టి, బుద్ధేశ్చ-బుద్ధియొక్కయు, ధృతేశ్చ - ధైర్యముయొక్కయు, భేదం-భేదమును, శృణు-వినుము

గ॥ అర్జునా గుణభేదములచేత, బుద్ధియు ధైర్యము, మూడు విధములుగా చెప్పబడినది, వానిని నిశ్శేషముగా వేర్వేరుగా చెప్పెద వినుము

ప॥తే॥ తెలివియును, ధైర్యగుణమును-త్రివిధగతుల
చెప్పిరి గుణపభేదము-చేత, బుధులు
వేరు వేరుగ నన్నింటి-విశదముగను
వినుము తెలిపెద శ్రద్ధతో-వీర వర్య ..

గే॥ కలిగియుండు గుణభేదముచే
తెలివి, ధైర్యము, త్రివిధముల్
వినుము తెలిపెద నిశ్శేషముగా
విశదంబుగ ధనంజయా .

అని కిరీటికి ॥శ్రీహరిని

30) శ్లో॥ ప్రవృత్తించ నివృత్తించ
కార్యా కార్యే భయాభయే
బంధం మోక్షంచ యావేత్తి
బుద్ధిః సా పార్థ సాత్వికీ .

ప.వి. ప్రవృత్తిమ్, చ, నివృత్తిం, చ, కార్యాకార్యే, భయాభయే, బంధం, మోక్షం, చ, యా, వేత్తి, బుద్ధిః, సా, పార్థ, సాత్వికీ.

టీ॥ హేపార్థ-ఓయర్జునా, యా బుద్ధిఃఏబుద్ధి, ప్రవృత్తించ-కర్మమార్గమును, నివృత్తించ-మోక్షమార్గమును, కార్యాకార్యే-కార్యమును. అకార్యమును, భయాభయే - భయమును. అభయమును, బంధం-బంధమును, మోక్షంచ-మోక్షమును. వేత్తి-యెరుగుచున్నదో. సా-ఆబుద్ధి, సాత్వికీ-సత్వగుణమువలన కలిగినది

గ॥ అర్జునా కర్మ మార్గము, మోక్షమార్గము కార్యమును, అకార్యమును, భయము, అభయమును, బంధమును మోక్షములను తెలిసికొనునట్టిబుద్ధి సాత్వికబుద్ధి యనబడును

వ॥తే॥ మార్గమిది ముక్తికని, కర్మ-మార్గమిదియె
యనుచు, కార్యమిది, యకార్య-మనుచు, నభయ
మిది, భయమిది, బంధము, మోక్ష-మెరుగునట్టి
బుద్ధినెరుగుము, సాత్విక-బుద్ధియనుచు...

తే॥ కర్మ మార్గము మోక్ష మార్గము
కర్తవ్యా కర్తవ్యము
బంధమోక్షము లెరుగుబుద్ధిని
భయాభయముల నెరుగుచు
అట్టిబుద్ధిని సాత్వికంబని
యనుమతించిరి పండితుల్

అని కిరీటికి ॥శ్రీహరిని

31) శ్లో॥ యయా ధర్మ మధర్మంచ
కార్యం చాకార్యమేవచ
అయథా వత్ప్రజా నాతి
బుద్ధిఃసా పార్థ రాజసీ .

ప.వి. యయా, ధర్మం, అధర్మం, చ, కార్యం, చ, అకార్యం, ఏవ, చ, అయథావత్, ప్రజానాతి, బుద్ధిః, సా, పార్థ, రాజసీ.

టీ॥ హేపార్థ-ఓయర్జునా, యయా - ఏబుద్ధిచేత, ధర్మం-ధర్మ మును, అధర్మంచ-అధర్మమును, కార్యంచ-కార్యమును, అకార్య మేవచ-అకార్యమును, అయథావత్-యదార్థము కానట్లుగను, ప్రజా నాతి-తెలిసికొనుచున్నదో, సాబుద్ధిః - ఆబుద్ధి, రాజసీ - రజోగుణ ప్రధానమైనది

గ॥ అర్జునా ధర్మాధర్మములయొక్కయు, కార్యాకార్యముల యొక్కయు, నిజమును తెలియజాలని బుద్ధిని, రాజసగుణముచే కలిగినదని తెలిసికొనుము

ప॥తే॥ ధర్మమగునిది యనుచు, న-ధర్మమిద్ది
కార్యమిదియగుననుచు, న-కార్యమిద్ది
యనుచు, సత్యమును తెలిసి-కొననియట్టి
బుద్ధి రాజస సంబంద-బుద్ధియనుచు
తెలిసికొనుమయ్య ఫల్గునా-తెల్లముగను....

గే॥ ఏది ధర్మ, మధర్మమేదో
యేది కార్య, మకార్యమో

నిజము తెలియని, వానిబుద్ధిని
　　　　నిశ్చయించిరి పండితుల్
అట్టిబుద్ధిని రాజసంబని
　　　　యనివచించిరి పాండవా
అని కిరీటికి　　　　॥శ్రీహరిని

౩౨) శ్లో॥ అధర్మం ధర్మమితియా
　　　　మన్యతే తమసాఽవృతా
　　సర్వార్థాన్ విపరీతాంశ్చ
　　　　బుద్ధిస్సా పార్థ తామసీ ..

ప.వి. అధర్మం, ధర్మం, ఇతి, యా, మన్యతే, తమసా, ఆవృతా, సర్వార్థాన్, విపరీతాన్, చ, బుద్ధిః సా, పార్థ, తామసీ

టీ॥ హేపార్థ-ఓయర్జునా, యాబుద్ధిః-యేబుద్ధి, తమసా-తమస్సుచేత, ఆవృతా-కప్పబడినదై, అధర్మం-అధర్మమును, ధర్మం + ఇతి-ధర్మమనియును, సర్వార్థాన్-సమస్తవిషయములను, విపరీతాన్ + చ -విరుద్ధభావముగల వానినిగను, మన్యతే-తలంచుచున్నదో, సా-అ, బుద్ధిః-బుద్ధి, తామసీ-తమోగుణ ప్రధానమైనది ..

గ॥ అర్జునా యేబుద్ధి అవివేకముచేత, కప్పబడినదై, అధర్మమును, ధర్మమనియెంచుచు, సమస్తవిషయములను విరుద్ధములుగా తలంచునో అట్టిబుద్ధి తామసగుణప్రధానమైనది ..

వ॥తే॥　తమసమున కప్పబడినదై,-తనదుబుద్ధి
　　ధర్మమైనట్టి దాని,న-ధర్మమనుచు

తలచు, నన్నింటి విపరీత-ములుగ,నట్టి
బుద్ధినెరుగుము, తామస,-బుద్ధియనుచు

గే॥ తామసముచే కప్పబడుచును
తనదు బుద్ధి సంపూర్తిగా
అవివేకమున, యధర్మంబుల
ననుచు ధర్మములనియునూ
యెల్లవాటిని, విపరీతముగా
యెంచుచుండెడి బుద్ధిసి౹౹
తామసంబున కలిగెననుచును
తలచుచుండుము భారతా

అని కిరీటికి ॥శ్రీహరిని

33) శ్లో॥ ధృత్యాయయా ధారయతే
మనఃప్రాణేంద్రియక్రియాః
యోగేనా వ్యభిచారిణ్యా
ధృతిఃసా పార్ధ సాత్వికీ

ప.వి. ధృత్యా, యయా. ధారయతే, మనఃప్రాణేంద్రియక్రియాః, యోగేన, అవ్యభిచారిణ్యా, ధృతిః, సా. పార్థ, సాత్వికీ

టీ॥ హేపార్థ-ఓయర్జునా, యోగేనా-యోగముచేత, అవ్యభిచారిణ్యా-చలింపనటువంటి, యయాధృత్యా - ఏధైర్యముచేత, మనఃప్రాణేంద్రియక్రియాః - మనస్సు. ప్రాణము, యింద్రియములు అనువాని చేష్టలను, ధారయతే - నియమించుచున్నాడో, సాధృతి-అధైర్యము, సాత్వికీ-సత్వగుణ ప్రధానమైనది .

గ॥ అర్జున యెవడు మనస్సు, ప్రాణములు, యింద్రియములు వీని యొక్క క్రియలను. నిశ్చలమైన యోగముచేత, నియమింప బడుచున్నాడో వాని ధైర్యము సత్వగుణము ప్రధానమైనది

ప॥చే॥ ఎవడు ప్రాణముల, మనసు,-నింద్రియముల
పనులనన్నింటి నెప్పుడు-బాగుగాను
నిశ్చలంబగు యోగాన-నిలుపువాని
ధైర్యమెరుగుము, సాత్విక-ధైర్యమును

గే॥ మనసు నింద్రియ ప్రాణములగతి
మంచి యోగశ్శక్తిచే
నియమించెడి వాని ధైర్యము
నిజము సాత్విక మదియగుణ
అని కిరీటికి ॥శ్రీహరిని

34) శ్లో॥ యయాతు ధర్మ కామార్థాన్
ధృత్యాధారయతేఽర్జున
ప్రసంగేన ఫలాకాంక్షీ
ధృతిః సా పార్థ రాజసీ ...

ప.వి. యయా, తు, ధర్మకామార్థాన్, ధృత్యా ధారయతే, అర్జున, ప్రసంగేన, ఫలకాంక్షీ, ధృతిః, సా, పార్థ, రాజసీ

టీ॥ హేపార్థ—ఓయర్జునా, యయా-ఏ, ధృత్యాతు - ధైర్యము చేతను, ఫలాకాంక్షీ - ఫలా
ధర్మకామార్థాన్ - ధర్మమ

ధరించుచున్నాడో, సా-అ, ధృతి - ధైర్యము, రాజసీ - రజోగుణ ప్రధానమైనది.

గీ॥ అర్జునా యెవడు ఫలాపేక్షతో, ధర్మమును, అర్థమును, కామమును, సర్వదా కోరుచున్నాడో, వానిధైర్యము రాజసధైర్య మని తెలిసికొనుము

ప॥తే॥ ఫలముకోరుచు నెవ్వాడు-పరమశ్రద్ధ
గలిగి, ధర్మమర్థంబును-కామములను
కోరుచున్నాడో సతతంబు-ధరణి, వాని
ధైర్యమెరుగుము, రాజస-ధైర్యమనుచు..

గే॥ ఏధైర్యమున ఫలాసక్తిచే
యెపుడు కోరుచు ధర్మము
అర్థకామము లాధైర్యంబు
ననిరి రాజస మర్జునా...
అని కిరీటికి ॥శ్రీహరి॥

35) శ్లో॥ యయా స్వప్నం భయం శోకం
విషాదం మదమేవచ
నవి ముంచతి దుర్మేధా
ధృతిః సా పార్థ తామసీ...

ప.వి. యయా, స్వప్నం, భయం, శోకమ్, విషాదం, మదం, ఏవ, చ, న, విముంచతి, దుర్మేధాః, ధృతిః సా, పార్థ, తామసీ

టీ॥ హేపార్థ - ఓయర్జునా, దుర్మేధాః - దుర్బుద్ధిగలవాడు, యయా-ఏధైర్యముచేత, స్వప్నం-నిద్రయను, భయం-భయమును,

శోకం-దుఃఖమును, విషాదం-విషాదమును, మదమేవచ-మదమును, నవిముంచతి-విడువడో, సాధృతి-ఆధైర్యము, తామసీ - తమోగుణ ప్రధానమైనది

గ॥ అర్జునా దుర్బుద్ధిగలవాడు, యేధైర్యముచేత, నిద్రను, భయమును, దుఃఖమును, చింతను మదమును విడువకుండునో, ఆధైర్యము తామసధైర్యమని తెలిసికొనుము

ప॥తే॥ కుత్సితంబైన బుద్ధిని-కూడియుండి
భయము, దుఃఖము, చింతకా-వరము, నిద్ర
వదలకుండడో యెప్పుడు-వానియొక్క-
ధైర్యమెరుగుము తామస-ధైర్యమనుచు

గే॥ ఏ ధైర్యమున కుత్సితబుద్ధీ
నెపుడు విడువక దుఃఖముశ
చింత, భయమును, నిద్ర, మదమును
చెందియుండిన వానిదో
అట్టి ధైర్యము తామసమనుచు
ననిరి పెద్దలు ఫల్గునా
అని కిరీటికి ॥శ్రీహరివి

36) శ్లో॥ సుఖం త్విదానీం త్రివిధం
శృణుమే భరతర్షభ
అభ్యాసాంద్రమతేయత్ర
దుఃఖాంతంచ నిగచ్ఛతి ..

ప.వి. సుఖం, తు, ఇదానీమ్, త్రివిధం, శృణు, మే, భరతర్షభ, అభ్యాసాత్, రమతే, యత్ర, దుఃఖాంతమ్, చ, నిగచ్ఛతి

టీ॥ హేభరతర్షభ-ఓయర్జునా, యత్ర - ఏస్థితియందు, అభ్యాసాత్-అభ్యాసమువలనను, రమతే-క్రీడించుచున్నాడో, దుఃఖాంతం + చ-దుఃఖనాశనముగూడ, నిగచ్ఛతి-పొందుచున్నాడో, మే-నావలన, ఇదానీ-ఇప్పుడు, త్రివిధం-మూడువిధములైన, సుఖం-సుఖవిషయమును, శృణు-వినుము

గ॥ అర్జునా అభ్యాసమువలనను, యేస్థితియందు, దుఃఖనాశనమును, ఆనందానుభవము పొందుచున్నాడో, ఆసుఖము మూడు విధముల భేదమును నావలన వినుము

ప॥తే॥ ఎట్టియలవాటువల్ల, తా-నెట్టి స్థితిలో
పొందు దుఃఖనాశంబును-పొందు, నంద
మట్టి సుఖము త్రివిధములై-యలరు, వాని
వినుము వివరింతు ఫల్గునా-విశదముగను

గే॥ ఎట్టిస్థితిలో దుఃఖనాశము
యెట్టి, యభ్యాసంబుచే
అనందంబును పొందుచుండునో
అట్టి సౌఖ్యము భారతా
కలిగియుండును గుణభేదముచే
కౌంతేయ సుఖము త్రివిదం
వినుము తెలిపెద సంపూర్ణముగ
విశదంబుగ ధనంజయా....
అని కిరీటికి ॥శ్రీహరిని

37) శ్లో॥ యత్త దగ్రే విషమివ
పరిణామేఽమృతోపమమ్
తత్సుఖం సాత్త్వికం ప్రోక్త
మాత్మబుద్ధి ప్రసాదజమ్

ప.వి యత్, తత్, అగ్రే, విషం, ఇవ, పరిణామే, అమృతో పమమ్, తత్, సుఖమ్, సాత్త్వికమ్, ప్రోక్తం, ఆత్మబుద్ధిప్రసాదజమ్.

టీ॥ యత్ + తత్-ఏది, అగ్రే - మొదటను, విషం + ఇవ- విషమువలెను, పరిణామే-అంతమునందు, అమృతోపమమ్-అమృత సమానమునై, ఆత్మబుద్ధిప్రసాదజమ్-తనయొక్కబుద్ధి నైర్మల్యము వలన కలుగుచున్నదో, తత్ - ఆ, సుఖం - సుఖము, సాత్త్వికమ్- సాత్త్వికమని, ప్రోక్తం-చెప్పబడినది

గ॥ అర్జునా యే సు ఖ ము మెదట విషమువలెను, చివరకు అమృతసమానమైయుండునో, తనబుద్ధియుక్క నిర్మలత్వముచేత కలుగునట్టి యాసుఖము సాత్త్వికమని తెలియుము

ప॥తే॥ ఆదియందున విషముగా-నంతమందు
నదియె, యమృత సమమునై-యలరుచుండు
తనదుబుద్ధి నిర్మలముచే-తను కలిగెడి
సుఖమెరుగు మదిసాత్త్విక-సుఖము గాను

గే॥ మొదలు విషముగ తోచుచుండియు
తుదకు నమృత సమానమై
తనదుబుద్ధి నిర్మలముచే
తనకు కలిగెడిదైవదొ

ఆ సుఖంబును సాత్వికంబని
యనిరి బుధులు ధనంజయా
అని కిరీటికి ॥శ్రీహరిని

38) శ్లో॥ విషయేంద్రియ సంయోగా
ద్యత్త దగ్రేఽమృతోపమమ్
పరిణామే విషమివ
తత్సుఖం రాజసంస్మృతమ్

వ.వి. విషయేంద్రియసంయోగాత్, యత్ తత్. అగ్రే, అమృతోపమమ్, పరిణామే. విషం, ఇవ, తత్, సుఖం, రాజసం, స్మృతమ్ ...

టీ॥ విషయేంద్రియసంయోగాత్ - విషయేంద్రియ సంబంధము వలన. యత్తత్-ఏయాసుఖము, అగ్రే-మొదటను, అమృతోపమమ్-అమృతతుల్యముగను. పరిణామే - అంతమందు, విషమివ-విషము వలెను, (భవతి-అగుచున్నదో) తత్సుఖం - ఆసుఖము, రాజసం-రాజసమైనదని, స్మృతం-చెప్పబడెను .

గ॥ అర్జునా విషయేంద్రియ సంబంధమువలన, కలిగి మొదట అమృతముగాను, కడపట విషముగానుండు సుఖము రాజసమని తెలియుము .

ప॥తే॥ కలయ, విషయేంద్రియంబుల-వలన కలిగి
యాదియందది, యమృతమ్మై-యలరియుండి
అంతమందున విషమునై-యలరునట్టి
సుఖమెఱంగుము రాజస-సుఖముగాను....

గే॥ విషయేంద్రియ సంయోగముచే
వివిధ విధముల పాండవా
మొదట నమృతంబగుచుతోచుచు
తుదకు విషమగు సుఖమును॥
పలికిరి దాని రాజసంబని
వందితులు వివరంబుగా
అని కిరీటికి ॥శ్రీహరిని

౩౯) శ్లో॥ యదగ్రేచానుబంధేచ
సుఖం మోహనమాత్మనః
నిద్రాలస్య ప్రమాదోత్థం
తత్తామస ముదాహృతమ్....

ప.వి. యత్, అగ్రే, చ, అనుబంధే, చ, సుఖమ్, మోహనం, ఆత్మనః, నిద్రాలస్యప్రమాదోత్థమ్, తత్, తామసం, ఉదాహృతమ్.

టీ॥ యత్-ఏది, అగ్రే + చ-ఆరంభమునందును, అనుబంధే + చ-అంతమునందును, ఆత్మనః-తనకు, మోహనం-మోహమును కలుగ జేయునదియును, నిద్రాలస్యప్రమాదోత్థం - నిద్ర, అలసత్వము, ప్రమాదము వీనివలన పుట్టినదియునైన, తత్-ఆ, సుఖం-సుఖము, తామసం-తామసమని, ఉధాహృతం-చెప్పబడినది

గ॥ అర్జునా నిద్ర, అలసత్వము, ప్రమాదము వలన కలిగి, మొదటను కడపటను, తనకు మోహము కలిగించు నట్టి సుఖము తామసమని తెలియును

ప॥తే॥ అలసతయు, ప్రమాదము, నిద్ర-వలన కలిగి
మొదట, కడపటను, తనకు-మోహమొదవ

జేయుచుండెడి, దానిని-శిష్ట చరిత
తామసంబగు సుఖమని-తలచుచుండు...

గే॥ ఆలస్యంబుచె నిద్రచేత
నాదియంతయు లంచుసుఖ
తనకు భ్రాంతిని తోచు సౌఖ్యము
దానివనిరి తామసముగా

అని కిరీటికే ॥శ్రీహరి॥

40) శ్లో॥ నతదస్తి పృథివ్యాంవా
దివి దేవేషు వాపునః
సత్వం ప్రకృతి జైర్ముక్తం
యదేభిస్యా త్రిభిర్గుణైః ..

ప వి. న, తత్, అస్తి పృథివ్యాం, వాది దేవేషు, వా, పునః, సత్వం ప్రకృతిజైః, ముక్తం, యత్, ఏభిః, స్యాత్, త్రిభిః, గుణైః

టీ॥ ప్రకృతిజైః - ప్రకృతివలన కలిగినటువంటి, ఏభిః-ఈ, త్రిభిః-మూడైన, గుణైః-గుణములచేతను, ముక్తం - విడువబడిన, సత్వం-ప్రాణి, యత్-ఏది, స్యాత్-కలదో, తత్-అది, పృథివ్యాం + వా-భూలోకమునందుగాని, దివి-స్వర్గలోకమునందు. దేవేషు + వా-దేవతలయందుగాని న + అస్తి-లేదు . ..

గా॥ అర్జునా ప్రకృతి చేత జనించిన, సత్వాది మూడు గుణముల చేత విడువబడిన ప్రాణి భూమియందుగాని, స్వర్గమందుగాని దేవతల యందుగాని లేదు. ....

ప॥తే॥ ప్రకృతిచేతను జన్మమై-పరగుచుండు
మూడు గుణములచేతను-ముక్తుడైన
ప్రాణి, భువియందు, దివియందు,-పార్థ, దేవ
గణమునందు, మనుజులందు-కానబడడు....

గే॥ సత్వము, రజము, తమమను మూడు
సంభవించును ప్రకృతిచే
లేదు గుణములు మూడు వదలిన
వాడు భూమియందు, దివిని
అమరులందున కానంబడడు
అటులె మానవులందును॥
అని కిరీటికి ॥శ్రీహరిని

41) శ్లో॥ బ్రాహ్మణ క్షత్రియ విశాం
శూద్రాణాంచ పరంతప
కర్మాణి ప్రవిభక్తాని
స్వభావ ప్రభవైర్గుణైః.

ప.వి. బ్రాహ్మణ క్షత్రియవిశాం, శూద్రాణాం - చ, పరంతప
కర్మాణి ప్రవిభక్తాని, స్వభావప్రభవైః, గుణైః

టీ॥ హేపరంతప-ఓయర్జునా బ్రాహ్మణ, క్షత్రియవిశాం బ్రాహ్మణ క్షత్రియ, వైశ్యులకును శూద్రాణాం + చ - శూద్రులకును, స్వభావ ప్రభవైః-స్వభావము వలన కలిగినటువంటి, గుణైః-గుణములచేతను కర్మాణి - కర్మములు ప్రవిభక్తాని - వేర్వేరుగను విభజింపబడినవి

గ॥ అర్జునా బ్రాహ్మణులకు, క్షత్రియులకు వైశ్యులకు, శూద్రులకు, వారివారి. స్వభావము వలన పుట్టిన. గుణములను బట్టి. కర్మములు వేరువేరుగా విభజింప బడినవి

ప॥తే॥ బ్రాహ్మణులకును, క్షత్రియ-వైశ్యులకును
శూద్రవర్ణము వారికి-శూరవర్య
వారి వారల గుణముల-బట్టి, కర్మ
ములను, వేరు వేరగు విధ-ముల విభజన
సలుపబడియుండె, వినుమయ్య-తెలుపగలను

గే॥ బ్రహ్మక్షత్రి వైశ్యశూద్రులకు
వారి గుణములచేతనే
వారి వారి, నియమిత కర్మలు
వారికి విభజింపబడెగా ...

అని కిరీటికి ॥శ్రీహరిని

42) శ్లో॥ శమోదమ స్తపఃశౌ చం
క్షాంతిరార్జవ మేవచ
జ్ఞానం విజ్ఞాన మాస్తిక్యం
బ్రహ్మ కర్మ స్వభావజమ్...

ప.వి శమః, దమః, తపః, శౌచం, క్షాంతిః, ఆర్జవం. ఏవ, చ, జ్ఞానం, విజానం. ఆస్తిక్యం, బ్రహ్మకర్మ స్వభావజమ్,

టీ॥ శమః-అంతరింద్రియ నిగ్రహము, దమః-బాహ్యేంద్రియ నిగ్రహము, తపః-తపస్సు, శౌచం-శుచిత్వము. క్షాంతి-ఓర్పుఆర్జవం + ఏవ + చ-ఋజుత్వము (మంచినడవడిక. జ్ఞానమ్, శాస్త్రజ్ఞానము

విజ్ఞానమ్-స్వానుభవజ్ఞానము, ఆస్తిక్యం-వేదశాస్త్రములయందు విశ్వాసము, స్వభావజం,స్వభావమువలన గలిగిన, బ్రాహ్మం - బ్రాహ్మణులకు నియమితమైన కర్మ-కర్మము

గ॥ అర్జునా అంతరింద్రియనిగ్రహము, బాహ్యేంద్రియనిగ్రహము తపస్సు,శుచిత్వము, ఓర్పు మందినడవడిక, శాస్త్రజ్ఞానము, అనుభవ జ్ఞానము, వేదశాస్త్రములందు నమ్మకము, ఇవి బ్రాహ్మణులకు నియమితమైన కర్మములు

ప॥తే॥ దమము. శమ, మార్దవంబును-తపము, క్షాంతి,
శౌచ, మాస్తిక్య విజ్ఞాన-జ్ఞానములును
బ్రాహ్మణులకివి యెల్ల, స్వ-భావజన్య
మైన కర్మలని, తెలియు-మవనియందు...

గే॥ శమము, దమమును, తపము శుద్ధియు
శాస్త్రీయ మగు జ్ఞానముగా
అనుభవజ్ఞానము విశ్వాసము
ఆస్తికత్వము యోరిమిగా
బ్రాహ్మణులకివి, సహజకర్మలు
భావమందు తలంచుమా...

అని కిరీటికి ॥శ్రీహరిని

43) శ్లో॥ శౌర్యం తేజో ధృతిర్దాక్ష్యం
యుద్ధే చాప్య పలాయనమ్
దాన మీశ్వర భావశ్చ
క్షాత్రం కర్మ స్వభావజమ్

ప.వి. శౌర్యం, తేజః, ధృతిః, దాక్ష్యం, యుద్ధే, చ, అపి, అపలాయనం, దానం, ఈశ్వరభావః చ, క్షాత్రం, కర్మ, స్వభావజమ్

టీ॥ శౌర్యం-శూరత్వము, తేజః-తేజస్సు ధృతిః - ధైర్యమును దాక్ష్యం-శక్తి(సామర్థ్యము) యుద్ధే-యుద్ధమునందు అపలాయనంచ-పారిపోకుండుటయును, దానం - దానమును, ఈశ్వరభావశ్చ-సకల జనులనేలుటయు, స్వభావజం - స్వభావమువలన బుట్టిన, క్షాత్రం-క్షత్రియులకు నియమితమైన, కర్మ-కర్మము. .

గ॥ అర్జునా శూరత్వము, తేజస్సు, ధైర్యము, సామర్థ్యము, యుద్ధమునందు పారిపోకుండుట, దానము సకలజనులనేలుట, యివి క్షత్రియులకు సాభావిక కర్మలని తెలియుము

ప॥తే॥ ధైర్య దక్షత్వ,-తేజస్సు-శౌర్యములును
పారిపోకుండ నిలుచుట-భండనమున
జనులనేలుట, దానము-సలుపుచుంట
క్షత్రియులకివి, స్వాభావ-కర్మలగును...

గే॥ శౌర్యము, తేజము, సామర్థ్యము
ధైర్యమును దానంబుగా
ప్రజలనేలుట యుద్ధమందున
పారిపోవక యుండుటగా
స్వాభావికమగు కర్మంబులు
క్షత్రియులకు ధనంజయా....

అని కిరీటికి ॥శ్రీహరిని

44) శ్లో॥ కృషిగోరక్ష వాణిజ్యం
వైశ్యంకర్మ స్వభావజమ్
పరిచర్యాత్మకం కర్మ
శూద్రస్యాపి స్వభావజమ్....

ప.వి. కృషిగోరక్షవాణిజ్యం, వైశ్యకర్మస్వభావజం, పరిచర్యాత్మకం, కర్మ, శూద్రస్య, అపి, స్వభావజమ్

టీ॥ కృషిగోరక్షవాణిజ్యం-వ్యవసాయము, గోపాలనము, వ్యాపారము, స్వభావజం - స్వభాసిద్ధమైన. వైశ్యం - వైశ్యులకుచితమైన, కర్మ-కర్మము, శూద్రస్య + అపి - శూద్రునకు. పరిచర్యాత్మకం-సేవారూపమైన. కర్మ-కర్మము, స్వభావజం-స్వభావసిద్ధమైనది

గ॥ అర్జునా వ్యవసాయము, పశుపాలనము, వ్యాపారము, ఇవి వైశ్యునకు స్వాభావికకర్మలు. సేవసలుపుట, శూద్రులకు స్వాభావిక కర్మలని తెలియుము

ప॥తే॥ పశువుల పరిపాలనము, వ్యా-పారము, కృషి,
వైశ్యులకు కర్మలివ్వి స్వ-భావమగును
సతము శూద్రులు పరిచర్య-సలుపుచుంట
వారి స్వాభావకర్మమై-వరలుచుండు

గే॥ వ్యాపారము కృషి గోరక్షయు
వైశ్యుల సహజ కర్మముల్
శూద్రులకు స్వాభావ కర్మము
శశ్రూష ధనంజయా

అని కిరీటికి　　॥శ్రీహరిని

45) శ్లో॥ స్వే స్వే కర్మణ్యభిరత
సంసిద్ధిం లభతేనరః
స్వకర్మనిరతః సిద్ధిం
యథావిందతితచ్ఛృణు .

ప.వి. స్వే, స్వే, కర్మణి, అభిరతః, సంసిద్ధిం, లభతే, నరః, స్వకర్మనిరతః, సిద్ధిం, యథా, విందతి, తత్, శృణు

టీ॥ నర-మానవుడు, స్వే స్వేకర్మణి-తనతన కర్మమందు, అభిరతః-ఆసక్తుడైనవాడై, సంసిద్ధిం-సిద్ధిని, లభతే - పొందుచున్నాడు, స్వకర్మనిరతః-స్వకీయకర్మమునందాసక్తుడైనవాడు, యథా-ఏప్రకారముగా, సిద్ధిం-సిద్ధిని, విందతి-పొందుచున్నాడో, తత్-ఆకర్మవిధానము, శృణు-వినుము

గ॥ అర్జునా మానవులు వారివారి కులధర్మములైన కర్మముల యందాసక్తిగలిగి, యేవిధముగా సిద్ధినిపొందుచున్నారో ఆవిధమును తెలియజేసెద వినుము

ప॥తే॥ స్వకుల ధర్మ కర్మములం నా-సక్తిగలిగి
యే విధంబుగ సిద్ధిని,-యీ మనుజులు
పొందుచుందురా విధము సం-పూర్తిగాను
తెలియజేసెద విను, పార్థ-తెల్లముగను

గే॥ కులధర్మము లందాసక్తిని
కలిగి పొందగ సిద్ధినికా
యే విధంబుగ పొందుమనుజుడు
ఆ విధము విను ఫల్గునా
అని కిరీటికి ॥శ్రీహరిని

46) శ్లో॥ యతః ప్రవృత్తి ర్భూతానాం
యేన సర్వమిదంతతమ్
స్వకర్మణాతమభ్యర్చ్య
సిద్ధిం విందతి మానవః

ప.వి యతః, ప్రవృత్తిః, భూతానాం, యేన, సర్వం, ఇదం, తతం, స్వకర్మణా, తమ్, అభ్యర్చ్య, సిద్ధిం, విందతి, మానవః

టీ॥ యతః-ఏయీశ్వరునివలన, భూతానాం - ప్రాణులయొక్క, ప్రవృత్తిః-పుట్టుక, (భవతి-అగుచున్నదో,) యేన-యేయీశ్వరునిచేత, ఇదంసర్వం-యీసమస్తమైన జగత్తు, తతం-వ్యాపింపబడెనో, మానవః-మనుష్యుడు, స్వకర్మణా - స్వకీయమైన కర్మముచేత, తం-ఆయీశ్వరుని, అభ్యర్చ్య-పూజించి, సిద్ధిం-సిద్ధిని, విందతి-పొందుచున్నాడు

గ॥ అర్జునా యేయీశ్వరునివలన, ప్రాణులయొక్క యుత్పత్తి కలుగుచున్నదో, యే యీశ్వరునిచేత యీసమస్తమైన జగత్తు వ్యాపింపబడియున్నదో అట్టి యీశ్వరుని మానవులు, స్వకీయమైన తమతమ కర్మలచేత పూజించి సిద్ధిని పొందుచున్నారు

వ॥తే॥ ఎల్లప్రాణులయుత్పత్తి-నెవడు సలుపు
యెల్లజగముల వ్యాపించి-యెవడు గలడొ
స్వీయ కర్మలనాతని-సేవసలిపి
పొందుదురు సిద్ధి మానవుల్-పూర్తిపార్థ...

గే॥ ఏ పరమేశ్వరుని చేతనే
యెల్లప్రాణులు పుట్టునో

యీ ప్రపంచములన్ని యంతట
నెవనిచే వ్యాపించునో
అట్టి యీశ్వరు గొలిచి సిద్ధిని
అందగలరు స్వకర్మచే ....
అని కిరీటికి ॥శ్రీహరిని

47) శ్లో॥ శ్రేయాన్ స్వధర్మోవి గుణః
పరధర్మాత్స్వ నుష్ఠితాత్...
స్వభావ నియతం కర్మ
కుర్వన్నాప్నోతి కిల్బిషమ్

ప.వి. శ్రేయాన్, స్వధర్మః విగుణః. పరధర్మాత్. స్వనుష్ఠితాత్. స్వభావనియతం. కర్మ. కుర్వన్. న. అప్నోతి. కిల్బిషం.

టీ॥ స్వధర్మః-స్వధర్మము, విగుణః-గుణహీనమైనను, స్వనుష్ఠితాత్-చక్కగా నాచరింపబడిన, పరధర్మాత్-ఇతర ధర్మమున కంటె, శ్రేయాన్-శ్రేష్ఠమైనది, స్వభావనియతం-స్వభావముచేత, నియమితమైన, కర్మ-కర్మమును, కుర్వం - చేయుచున్న జనుడు, కిల్బిషం-పాపమును. న + అప్నోతి-పొందడు ..

గా॥ అర్జునా తనకు కులధర్మము గుణహీనమైనను చక్కగా ఆచరింపబడిన, ఇతర ధర్మమునకంటే శ్రేష్ఠమైనదని తెలియుము, తమతమ కులధర్మముల నాచరించు జనులు పాపములను పొందరు.

ప॥తే॥ స్వకుల ధర్మంబు, గుణహీన-సహితమైన
పరుల ధర్మంబు మంచిదై-పరుగుచున్న
స్వీయ ధర్మంబె, మిక్కిలి-శ్రేష్ఠమగును

స్వకుల ధర్మంబు సలిపెడి,-సజ్జనుండు
చెందకుండును పాపంబు,-శిష్ట చరిత్ర....

గీ॥ శ్రేష్ఠమౌ పరధర్మముకన్న
శ్రేష్ఠమౌను, స్వధర్మమే
తన కులధర్మము నీచమనుచు
తలచి వదలిన పాపమే
తన కులధర్మమనుసరించుచు
తానుపొందదు పాపముగా.

అని కిరీటికి ॥శ్రీహరిని

48) శ్లో॥ సహజం కర్మ కౌంతేయ
సదోషమపి నత్యజేత్
సర్వారంభాహి దోషేణ
ధూమేనాగ్నిరివావృతాః

ప.వి. సహజం, కర్మ, కౌంతేయ, సదోషం, అపి, న, త్యజేత్, సర్వారంభాః, హి, దోషేణ, ధూమేన, అగ్నిః, ఇవ, ఆవృతాః.

టీ॥ హేకౌంతేయ-ఓయర్జునా, సదోషమపి - దోషయుక్తమైన దైనను, సహజం - స్వభావజన్యమైన, కర్మ - కర్మమును, న + త్యజేత్ - విడువకూడదు, హి - యేకారణమువలన, సర్వారంభాః- సమస్త కర్మములును, ధూమేన-పొగచేత, అగ్నిరివ-అగ్నివలెనే, దోషేణ-దోషముచేత, ఆవృతాః-ఆవరింపడియున్నది

గ॥ అర్జునా దోషముతో కూడియుండినదైనను, స్వభావజన్యమైన కులధర్మములను విడువకూడదు. అగ్నిని పొగకప్పిన విధముగా అన్నికర్మలయందును దోషమావరింపబడియున్నది .

ప॥తే॥ సహజమగు కర్మమది, దోష-సహితమైన
విడువరాదని తెలియుము-వీర వర్య
అన్నికర్మల దోషంబు-నంటియుండు
అగ్నియందున, ధూమంబు-నంటి నట్లు

గే॥ అగ్ని పొగచే కప్పిన రీతి
అన్ని కర్మములందునుగా
కలిగియుండును దోషజాలము
కాని విడువ నశక్యమే
విడువకూడదు స్వకుల ధర్మము
కూడియుండిన దోషముల్ ...
అని కిరీటికి ॥శ్రీహరిని

49) శ్లో॥ అసక్తబుద్ధిః సర్వత్ర
జితాత్మా విగత స్పృహః
నైష్కర్మ్యసిద్ధిం పరమాం
సన్యాసే నాది గచ్ఛతి....

ప.వి. అసక్త బుద్ధిం॥, సర్వత్రె, జితాత్మా. విగత స్పృహః నైష్కర్మ్య సిద్ధిం, పరమామ్, సన్యాసేన, అధిగచ్ఛతి

టీ॥ సర్వత్ర - సమస్తమందును, అసక్తబుద్ధిః - సంగర హిత బుద్ధి గలిగిన, జితాత్మా - జయింపబడిన మనస్సు కలిగిన, విగత

స్పృహః - ఆశలేనివాడై, సన్యాసేన — కర్మఫల త్యాగముచేత, పరమాం - ఉత్కృష్టమైన, నైష్కర్మ్యసిద్ధిం - నిష్కామకర్మ సిద్ధిని, అధిగచ్ఛతి - పొందుచున్నాడు

గ॥ అర్జునా యెవడు సమస్తమందును సంగమువదలినవాడై, మనస్సును స్వాధీనముచేసికొని, ఆశలు వదలినవాడై, కర్మఫల త్యాగము చేయుచుండునో, వాడు శ్రేష్ఠమైన నిష్కామ కర్మఫలమును పొందుచున్నాడు

వ॥తే॥ [1]సర్వమందును సంగంబు-సన్యసించి
మనసు నిర్జించి, కోర్కెల-మానివేసి
కర్మఫలమును విడనాడి-కర్మసలిపి
పొందు నైష్కర్మ్య సిద్ధిని-పూర్తియతడు

గే॥ వదలి యాశలు, కర్మఫలమును
వదలి మనసు వశంబులో
చేసికొని నైష్కర్మ్యసిద్ధిని
చెందునాతడు శ్రేష్ఠుడై

అని కిరీటికి ॥శ్రీహరిని

50) శ్లో॥ సిద్ధిం ప్రాప్తోయథా బ్రహ్మ
తథాఽఽప్నోతి నిబోధమే
సమాసేనైవ కౌంతేయ
నిష్ఠాజ్ఞానస్య యాపరా....

ప.వి. సిద్ధిం, ప్రాప్తః, యథా, బ్రహ్మ, తథా, ఆప్నోతి, నిబోధ, మే, సమాసేన ఏవ, కౌంతేయ, నిష్ఠాజ్ఞానస్య, యా, పరా,

టీ॥ హేకౌంతేయ-ఓయర్జునా, సిద్ధిం-సిద్ధిని, ప్రాప్తః-పొందినవాడు, యథా-ఎట్లు, బ్రహ్మ-పరమాత్మను, ఆప్నోతి-పొందుచున్నాడో, తథా-అట్లే, జ్ఞానస్య - జ్ఞానముయొక్క, పరా-ఉత్తమమైన, నిష్ఠా— నిష్ఠ, యా—ఏదియో, సమాసేన + ఏవ — సంక్షేపముగనే, మే— నావలన, నిబోధ—తెలిసికొనుము

గ॥ అర్జునా సిద్ధిని పొందిన పిదప, వాడు పరమాత్మను పొందుటకు, మిక్కిలి శ్రేష్ఠమైన, జ్ఞాననిష్ఠను నీకు సంక్షేపముగ చెప్పెద వినుము .

ప॥తే॥ సిద్ధిపొందిన తరువాత-శ్రేష్ఠమైన
బ్రహ్మమును పొందుటకుగాన-పరమమైన
జ్ఞాననిష్ఠను తెలిపెద-సంగ్రహముగ
వినుము దానిని శ్రద్ధతో-వీరవర్య .

గే॥ చెంది-సిద్ధిని పరబ్రహ్మను
పొందుటకు శ్రేష్ఠంబునౌ
జ్ఞాననిష్ఠను నీకు తెలిపెద
వినుము సంక్షేపంబుగా....

అని కిరీటికి ॥శ్రీహరిని

51) శ్లో॥ బుద్ధ్యా విశుద్ధయా యుక్తో
ధృత్యాఽఽత్మానం నియమ్యచ

శబ్దాదీన్ విషయాన్ స్త్యక్త్వా
రాగద్వేషౌ వ్యుదస్యచ

ప.వి. బుద్ధ్యా. విశుద్ధయా, యుక్తః, ధృత్యా, ఆత్మానం, నియమ్య, చ, శబ్దాదీన్, విషయాన్, త్యక్త్వా, రాగద్వేషౌ, వ్యుదస్య, చ,

టీ॥ విశుద్ధయా-శుద్ధమైన, బుద్ధ్యా-బుద్ధితో, యుక్తః-కూడిన వాడును, ధృత్యా-ధైర్యముతో, ఆత్మానం-మనస్సును, నియమ్యచ-వశమొనర్చుకొని, శబ్దాదీన్-శబ్దము మొదలైన, విషయాన్-విషయములను, త్యక్త్వా-విడిచియు, రాగద్వేషౌ - రాగద్వేషములను, వ్యుదస్యచ-విడిచిపెట్టియును

గ॥ అర్జునా శుద్ధమైన బుద్ధితో కూడినవాడై, ధైర్యముచేత, మనస్సును, వశ్యమొనరించుకొని, శబ్దాది విషయములను వదలి రాగద్వేషములను విడువవలయును

వ॥తే॥ శుద్ధమైనట్టి రీతిని-బుద్ధినిలిపి
నిశ్చలంబుగ ధీరత-నిలిపి మనసు
విడిచి శబ్దాదులైనట్టి-విషయములను
వదలవలె ద్వేషరాగాల-పార్థ పూర్తి

గే॥ పరిశుద్ధంబగు బుద్ధి తోడను
ధీరతను నిలిపి మనసున్
విషయముల రాగద్వేషముల
విడువవలయును పూర్తిగా

అని కిరీటికి ॥శ్రీహరిని

52) శ్లో॥ వివిక్తసేవీ లఘ్వాశీ
యతవాక్కాయమానసః
ధ్యానయోగపరో నిత్యం
వైరాగ్యం సముపాశ్రితః .

ప వి పవిక్తసేవీ, లఘ్వాశీ యతవాక్కాయమానసః, ధ్యానయోగపరః, నిత్యం, వైరాగ్యం, సముపాశ్రితః

టీ॥ వివిక్తసేవీ - రహస్యస్థలమందున్నవాడై, లఘ్వాశీ - మితాహారియును, యతవాక్కాయమానసః-స్వాధీనమైన మనోవాక్కాయములుగలవాడై, నిత్యం - యెల్లప్పుడును, ధ్యానయోగపరః - ధ్యానయోగాసక్తుడై, వైరాగ్యం - వైరాగ్యమును, సముపాశ్రితః- ఆశ్రయించినవాడై .

గ॥ అర్జునా రహస్యస్థలమందున్నవాడై. మితాహారముగలవాడై, వాక్కును మనస్సును, శరీరమును, స్వాధీనమొనర్చుకొని యెల్లప్పుడు ధ్యానయోగాసక్తుడై, వైరాగ్యమునుజెంది

ప॥తే॥ గోప్యమైనట్టి స్థలమందు-కూడియుండి
సలుపుచును మితాహారము-సంతతంబు
వాక్శరీమానసముల-వశమొనర్చి
సంతతము ధ్యానయోగంబు-సలుపుచుండి
యాశ్రయించుచు వైరాగ్య-మహరహంబు ..

గే॥ గోప్యమగుస్థలమందు నిలిచియు
కూడి వైరాగ్యంబుతో
వాక్కు దేహము మానసములను

వశము నందుంచుకొనుచు॥
మితముగల యాహారపరుడై
సతముధ్యానాసక్తుడై
అని కిరీటికి　　॥శ్రీహరి

53) శ్లో॥ అహంకారం బలం దర్పం
కామం క్రోధం పరిగ్రహమ్
విముచ్య నిర్మమశ్శాంతో
బ్రహ్మభూయాయ కల్పతే

ప.వి. అహంకారం, బలం, దర్పం, కామం, క్రోధం, పరిగ్రహం, విముచ్య, నిర్మమః, శాంతః, బ్రహ్మభూయాయకల్పతే.

టీ॥ అహంకారం-అహంకారమును, బలం-బలమును, దర్పం-దర్పమును, కామం - కోరికను, క్రోధం - కోపమును, పరిగ్రహం-ద్రవ్యసంగ్రహము, విముచ్య-విడిచి, నిర్మమః - మమకారము లేని వాడును, శాంతః-శాంతుడును, బ్రహ్మభూయాయ - బ్రహ్మత్వము పొందుటకు, కల్పతే.-సమర్థుడగును

గ॥ అర్జునా అహంకారము, బలమును, దర్పమును, కామము, క్రోధము, బాహ్యవస్తుపరిగ్రహము వదలి, శాంతిని పొందినవాడు పరబ్రహ్మమును పొందుటకు, సమర్థుడగుచున్నాడు

ప॥తే॥ బలమహంకార, దర్పంబు,-వదలి క్రోధ
కామ వస్తుసంగ్రహ మమ-కారములను
వదలి, శాంతిని బొందిన-వాడు, బ్రహ్మ
భావమును పొందనర్హుడౌ-పార్థ భువిని

గే॥ బలము దర్పమహంకారమును
పరిగ్రహమును వదలియుఁగా
విడిచి క్రోధము, కామరాగము
విడిచి మమకారంబులఁగా
శాంతుడై బ్రహ్మంబు పొందగ
శక్తి గలిగిన వాడునౌ
అని కిరీటికి ॥శ్రీహరి॥

54) శ్లో॥ బ్రహ్మభూతః ప్రసన్నాత్మా
న శోచతి న కాంక్షతి
సమః సర్వేషు భూతేషు
మద్భక్తింలభతే పరామ్

ప.వి. బ్రహ్మభూతః, ప్రసన్నాత్మా, న, శోచతి, న, కాంక్షతి, సమః, సర్వేషు, భూతేషు, మద్భక్తిం, లభతే, పరాం,

టీ॥ బ్రహ్మభూతః - బ్రహ్మభావమును పొందినట్టివాడు, ప్రసన్నాత్మా-నిర్మలమైన మనస్సుగలవాడై, న + శోచతి-దుఃఖింపడు, న + కాంక్షతి-దేనిని కోరడు, సర్వేషు - సమస్తమైన, భూతేషు-ప్రాణులయందు, సమః - సమబుద్ధి గలవాడై, పరాం-శ్రేష్ఠమైన, మద్భక్తిం-నాయందలి భక్తిని, లభతే-పొందుచున్నాడు

గీ॥ అర్జునా బ్రహ్మభావమును పొందినవాడు, నిర్మలమైమనస్సు గలవాడై, దేనికొరకు దుఃఖింపడు, యేవస్తువును కోరడు, సర్వప్రాణులయందును, సమబుద్ధిగలవాడై, శ్రేష్ఠమైన నాభక్తినిపొందుచున్నాడు .

వ॥తే॥ బ్రహ్మభావంబు పొందిన-వాడు, శుద్ధ
మైన, మనస్సుగలిగి, దుఃఖ-మందకుండు
కోరదెద్దాని, సమబుద్ధిఃగూడి, సర్వ
ప్రాణులందు, శ్రేష్ఠమగు, నా-భక్తిపొందు ..

గే॥ బ్రహ్మనిష్ఠుండైన యాతడు
పావనంబగు మనసుతో
కోరకేమియు దుఃఖమొందక
కూడియు సమత్వంబుతో
పరమశ్రేష్ఠంబైన నాదగు
భక్తిపొందును భారతా...

అని కిరీటికి ॥శ్రీహరిని

౮౫) శ్లో॥ భక్త్యా మామభిజానాతి
యావాన్ యశ్చాఽస్మితత్వతః
తతోమాం తత్వతో జ్ఞాత్వా
విశతే తదనంతరమ్ .

ప.వి. భక్త్యా, మామ్, అభిజానాతి, యావాన్, యః, చ, అస్మి, తత్వతః, తతః, మామ్, తత్వతః, జ్ఞాత్వా, విశతే, తదనంతరమ్,

టీ॥ అహం-నేను, యవాన్-ఎంతటివాడను, యశ్చ - యెట్టి వాడను, అస్మి-అగుచున్నానో, మాం-అట్టినన్ను, భక్త్యా-భక్తిచేత, తత్వతః-యధార్థముగా, అభిజానాతి - యెరుంగుచున్నాడు, తతః-అతరువాత, మాం-నన్ను, తత్వతః-యదార్థముగా, జ్ఞాత్వా-తెలిసికొని, తదనంతరం-అపిమ్మట, విశతే-నాయందే ప్రవేశించుచున్నాడు

గ॥ అర్జునా భక్తిచేత, నేనెంతవాడను, యెట్టివాడనగుదునో యదార్థముగా తెలిసికొనుచున్నాడు, అతరువాత నన్ను యదార్థముగా నెరింగినవాడై, నన్నే ప్రవేశించుచున్నాడు

ప॥తే॥ ఏనెవండనో, నిజముగ-నెంతవాడో,
తెలిసికొనుచుండు భక్తిచే-తెల్లముగను
యెరిగినను యదార్థంబుగా-నెల్లగతుల,
చేరుచుండును నాయందు-సిద్ధుడగుచు

గే॥ ఎంతవాడనొ యెట్టివాడనో
యెరిగి నన్ను నిజంబుగా
భక్తిచేతను పిదప నాలో
ప్రవేశించు ధనంజయా ..

అని కిరీటికి ॥శ్రీహరిని

56) శ్లో॥ సర్వకర్మాణ్యపి సదా
కుర్వాణో మద్వ్యపాశ్రయః
మత్ప్రసాదాదవాప్నోతి
శాశ్వతం పదమవ్యయమ్....

ప.వి. సర్వకర్మాణి, అపి, సదా, కుర్వాణః, మద్వ్యపాశ్రయః, మత్ప్రసాదాత్, అవాప్నోతి, శాశ్వతమ్, పదం, అవ్యయం,

టీ॥ సర్వకర్మాణి + అపి-సమస్త కర్మములను, సదా - యెల్లప్పుడును, కుర్వాణః + అపి-చేయుచున్నవాడైనను, మద్వ్యపాశ్రయః-నన్నేశరణుపొందినవాడు, మత్ప్రసాదాత్—నాయనుగ్రహమువలనను,

అవ్యయం — నాశరహితమైనదియును, శాశ్వతం-శాశ్వతమైనదియును (అగు) పదం—స్థానమును, అవాప్నోతి-పొందుచున్నాడు

గ॥ అర్జునా సమస్త కర్మములనెల్లప్పుడు చేయుచున్నవాడై, నన్నే శరణుపొంది, నాయనుగ్రహామువలన నాశరహితమైన, శాశ్వతమైన, స్థానమును (మోక్షమును) పొందుచున్నాడు

ప॥తే॥ సర్వకర్మలనెప్పుడు-సలుపుచుండి
నన్ను శరణంబు పొందుచు-నాదుకరుణ
అవ్యయంబైన శాశ్వత-మైనయట్టి
మోక్షపదమును ఫల్గునా-పొందునతడు

గే॥ విహితంబైన నిత్యకర్మలు
విడువకుండ యొనర్చుచు॥
నన్ను శరణము పొందినవాడై
నాయనుగ్రహ మహిమచే
నాశరహితంబైన స్థానము
శాశ్వతముగ పొందుపిదప॥
అని కిరీటికి ॥శ్రీహరిని

57) శ్లో॥ చేతసా సర్వకర్మాణి
మయి సన్యస్య మత్పరః
బుద్ధియోగ ముపాశ్రిత్య
మచ్చిత్తః సతతంభవ

ప.వి. చేతసా, సర్వకర్మాణి, మయి, సన్యస్య, మత్పరః, బుద్ధియోగం, ఉపాశ్రిత్య, మచ్చిత్తః, సతతమ్, భవ,

టీ॥ చేతసా-సంకల్పముచేతను, సర్వకర్మాణి - సమస్తకర్మములను, మయి-నాయందు, సన్యస్య-ఉంచి, మత్పరః - నాయందాసక్తుడవై, బుద్ధియోగం-బుద్ధియోగమును, ఉపాశ్రిత్య-ఆశ్రయించి, సతతం-యెల్లప్పుడును, మచ్చిత్తః-నాయందు చిత్తముగలవాడవు, భవ-కమ్ము

గ॥ అర్జునా నీవు సంకల్పముచేత సమస్త కర్మములను నాయందుంచి, నాయందాసక్తుడవై బుద్ధియోగమవలంబించి, యెల్లప్పుడు నాయందు మనస్సు కలవాడవై యుండుము ..

ప॥తే॥ జ్ఞానయోగంబుచే నీవు-సర్వకర్మ
ములను, నాయందునుంచుచు-తలచి నన్నె
బుద్ధియోగంబు నెప్పుడు-పూనియుండ
నిలుపు మనసును నాయందు-నిశ్చలముగ

గే॥ జ్ఞానయోగముచేత నిరతము
సర్వకర్మము లెప్పుడుఁగా
నాకు వదలుము నన్నె నమ్ముము
నాయందు మనసుంచుమా
బుద్ధియోగము పూనియుండుము
పూర్ణముగ నెల్లప్పుడుఁగా
అని కిరీటికి ॥శ్రీహరిని

58) శ్లో॥ మచ్చిత్త సర్వదుర్గాణి
మత్ప్రసాదాత్తరిష్యసి
అథచేత్వ మహంకారా
న్నశ్రోష్యసి వినంక్ష్యసి....

వ.వి. మచ్చిత్తః, సర్వదుర్గాణి, మత్ప్రసాదాత్, తరిష్యసి, అథ. చేత్, త్వమ్, అహంకారాత్, న. శ్రోష్యసి, వినంక్ష్యసి .

టీ॥ మచ్చిత్తః-నాయందే మనసుగలిగిన, త్వం-నీవు, మత్ప్రసాదాత్-నాయనుగ్రహము వలన, సర్వదుర్గాణి-సమస్తాటంకములను, తరిష్యసి-దాటగలవు, అథ-ఆతర్వాత, త్వం-నీవు, అహంకారాత్-గర్వముచేత, నశ్రోష్యసిచేత్-వినవైతివేని, వినంక్ష్యసి-చెడిపోగలవు.

గ॥ అర్జునా నాయందు మనసుగలిగిననీవు, నాయనుగ్రహము వలన, సమస్తాటంకములను, దాటిపోగలవు, అట్లుగాక, గర్వము వలన, నీవు, నామాటలను వినవైతివేని, చెడిపోగలవు .

ప॥తే॥ నిలిపి మనసును నాయందు-నీవు-దాట
గలవు దుర్గంబులెల్ల, నా-కరుణవలన
అట్లుగాకను గర్వంబు-నంది నీవు
నాదుమాటలు వినకున్న-నాశనమగుదు....

గే॥ నాలో నీమనసు లయించిన
నాయనుగ్రహ బలముచే
తొలగిపోవును యాటంకములు
కలుగు సుఖము, నామాటచే

చెందిగర్వము వినకయుండిన
చెడిపోగలవు ఫల్గునా
అని కిరీటికి ॥శ్రీహరిని

59) శ్లో॥ యద్యహంకార మాశ్రిత్య
నయోత్స్య ఇతి మన్యసే
మిథ్యైష వ్యవసాయస్తే
ప్రకృతిస్త్వాం నియోక్ష్యతి

ప.వి. యత్, అహంకారం, ఆశ్రిత్య, న, యోత్స్య, ఇతి, మన్యసే, మిథ్య, ఏషః, వ్యవసాయః, తే, ప్రకృతిః, త్వామ్, నియోక్ష్యతి

టీ॥ అహంకారం - అహంకారమును, ఆశ్రిత్య - ఆశ్రయించి, నయోత్స్యఇతి-యుద్ధముచేయనని, మన్యసేయది-తలంచితివేని, తే-నీయొక్క-. ఏషః-ఈ, వ్యవసాయః-ప్రయత్నము, మిథ్యా-వ్యర్థము, త్వాం-నిన్ను, ప్రకృతిః-స్వభావము, నియోక్ష్యతి-నియమింపగలదు.

గ॥ అర్జునా నీవు గర్వముపొంది యుద్ధముచేయనని తలంచితివేని, అట్టి నీప్రయత్నము వ్యర్థమగును, నీస్వభావమే, నీచేయుద్ధము చేయించును....

ప॥తే॥ అవిధంబుగ గర్వంబు-నంది నీవు
యుద్ధమొనరింపననుచు, -నీవుంటివేని
నీప్రయత్నము ఫల్గునా-నిలువదెపుడు
బవరమొనరింప నినుబంపు-ప్రకృతి నీదు

గే॥ నీవు గర్వముబొంది యుద్ధము
నేను చేయనటన్నచో
నీదుపలుకులు వ్యర్థంబగును
నీదుప్రకృతి గుణంబులే
చేయించును నీచే సమరము
సిద్ధాంతమిది భారతా
అని కిరీటికి ॥శ్రీహరిని

60) శ్లో॥ స్వభావజేన కౌంతేయ
నిబద్ధస్స్వేన కర్మణా
కర్తుం నేచ్ఛసి యన్మోహా
త్కరిష్యస్యవశోఽపితత్...

ప.వి స్వ భా వ జే న, కౌంతేయ, నిబద్ధః, స్వేన, కర్మణా, కర్తుం, న, ఇచ్ఛసి, యత్, మోహాత్, కరిష్యసి, అవశః, అపి, తత్

టీ॥ హేకౌంతేయ - ఓయర్జునా, స్వభావజేన-స్వభావమువలన బుట్టిన, స్వేనకర్మణా-స్వకీయకర్మముచేత, నిబద్ధః-కట్టబడినవాడవై, యత్-యేకర్మమును, కర్తు-చేయుటకొరకు, నేచ్ఛసి-ఇచ్ఛగింపవో, తత్-ఆకర్మమును, మోహాత్ - అవివేకమువలన, అవశః + అపి- పరవశుడవయ్యును, కరిష్యసి-చేయగలవు

గ॥ అర్జునా స్వభావమువలన పుట్టిన గుణములకు లోబడి, నీవు యేకర్మమును చేయగూడదని అవివేకముచేత నిశ్చయించెదవో, ఆకర్మము నీకు తెలియకనే, నీస్వభావగుణము, నిన్ను మరపించి నీచేత చేయించును

ప॥తే॥ నీస్వభావ గుణములకు-నీవు వశుడ
వగుచు, నెట్టికర్మంబు, నీ-వాచరింప
ననితలచితివో, భ్రాంతిచే-నట్టికర్మ
నిన్ను మరపించి, నీచేత-నీస్వభావ
మైన, గుణములు, చేయించు-నది, నిజంబు

గే॥ ఎట్టికర్మను చేయరాదని
యెంచి యవివేకంబుచే
నీవు మానిన యాకర్మమును
నీస్వభావ గుణంబులే
నిన్ను మరపున ముంచిచేయగ
నియమించును ధనంజయా

అని కిరీటికి ॥శ్రీహరిని

61) శ్లో॥ ఈశ్వరః సర్వభూతానాం
హృద్దేశేஉర్జున తిష్ఠతి
భ్రామయన్ సర్వభూతాని
యంత్రారూఢాని మాయయా

ప.వి. ఈశ్వరః, సర్వభూతానాం, హృద్దేశే, అర్జున, తిష్ఠతి, భ్రామయన్, సర్వభూతాని, యంత్రారూఢాని, మాయయా

టీ॥ హే అర్జునా ఓయర్జునా, ఈశ్వరః-ఈశ్వరుడు, సర్వభూతానాం-సమస్తప్రాణులయొక్క, హృద్దేశే - హృదయప్రదేశమందు, యంత్రరూఢాని - శరీరరూపయంత్రముల నధిష్ఠించియున్న, సర్వభూతాని-సమస్తజీవులను, మాయయా-మాయాశక్తిచేతను, భ్రామయన్-భ్రమింపజేయుచున్నవాడై, తిష్ఠతి-ఉన్నాడు .

గ॥ అర్జునా. అన్నిప్రాణులకు నియామకుడైన ఈశ్వరుడు సర్వ ప్రాణుల హృదయములందున్నవాడై జంత్రగాడు బొమ్మ నాడించు రీతిగా తన మాయాశక్తిచేత, ప్రాణులను భ్రమింపజేయుచున్నాడు

ప॥తే॥ అన్నిప్రాణుల హృదయంబు-లందువెలసి
ఈశ్వరుడు మాయచేత, తా-నెల్లప్రాణి
భ్రాంతి బొందించుచున్నాడు-జంత్రగాడు
బొమ్మలను త్రిప్పురీతిగా-పుణ్యచరిత...

గే॥ ఎల్లప్రాణుల హృదయమునగల
ఈశ్వరుడు తనమాయచే
జంత్రగాడాడించు బొమ్మల
ఛాయప్రాణుల నందరిన్
భ్రాంతిబొందగ జేయుచుండెను
పరబ్రహ్మ స్వశక్తిచే
అని కిరీటికి ॥శ్రీహరిని

62) శ్లో॥ తమేవ శరణంగచ్ఛ
సర్వభావేన భారత
తత్ప్రసాదాత్పరాం శాంతిం
స్థానం ప్రాప్యసి శాశ్వతమ్

ప.వి. తం, ఏవ, శరణం, గచ్ఛ, సర్వభావేన, భారత, తత్ప్రసాదాత్, పరామ్, శాంతిం, స్థానం, ప్రాప్యసి, శాశ్వతమ్..

టీ॥ హేభారత-ఓయర్జునా. 'సర్వభావేన - సమస్తభావముల చేతను, తమేవ-ఆయీశ్వరునినే. శరణం-ఆశ్రయమును,(రక్షకునిగా) గచ్ఛ-పొందుము, తత్ప్రసాదాత్-ఆయీశ్వరుని 'యనుగ్రహమువలన, పరాం-ఉత్తమమైన, శాంతిం-శాంతిని, శాశ్వతం - శాశ్వతమైన, స్థానం-మోక్షమును, ప్రాప్యసి-పొందగలవు .

గ॥ అర్జునా సర్వవిషయములయందును, ఆయీశ్వరునినే శరణము పొందుము, ఆయన యనుగ్రహముచే, శ్రేష్ఠమైనశాంతిని, శాశ్వతమైన మోక్షమును, నీవు పొందగలవు

ప॥తే॥ సర్వభావంబులందున-శరణమనుచు
అట్టిపరమాత్మనెపుడు నీ-వాశ్రయించు
మతని కరుణచేతను, శ్రేష్ఠ-మైన, శాంతి,
మోక్షపదమును ఫల్గునా-పొందవచ్చు

గే॥ సర్వవిషయములందు నీవా
సర్వేశ్వరుని నమ్ముచుతా
పొందు మాపరమాత్మ శరణము
పొందు శాంతిని మోక్షముతా....

అని కిరీటికి ॥శ్రీహరిని

63) శ్లో॥ ఇతితేజ్ఞానమాఖ్యాతం
గుహ్యాద్గుహ్యతరం మయా
విమృశ్యైతదశేషేణ
యథేచ్ఛసితథా కురు...

ప.వి. ఇతి, తే. జ్ఞానం, అఖ్యాతం, గుహ్యాత్, గుహ్యతరం, మయా, విమృశ్య, ఏతత్, అశేషేణ, యథా, ఇచ్ఛసి, తథా, కురు

టీ॥ ఇతి-ఈప్రకారముగా, తే-నీకొరకు, మయా - నాచేత, గుహ్యాత్ - గోప్యమునకంటె, గుహ్యతరం - మిక్కిలి గోప్యమైన జ్ఞానం-జ్ఞానము, అఖ్యాతం-చెప్పబడెను, తత్-యీజ్ఞానశాస్త్రమును, అశేషేణ-పూర్తిగాను, విమృశ్య-విచారించి, యథా-యేప్రకారముగా, ఇచ్ఛసి-కోరుచున్నావో, తథా-ఆప్రకారముగా, కురు-చేయుము

గ॥ అర్జునా నీకొరకు రహస్యములన్నింటికంటె, పరమరహస్య మైన, జ్ఞానమును, నీకు తెలియజేసితిని. దానిని పూర్తిగా చక్కగా యోచించి నీయిష్టప్రకారము చేయుము

ప॥తే॥ గోప్యములయందు మిక్కిలి-గోప్యమైన
జ్ఞానము తెలియజేసితి-సవ్యసాచి
చక్కగా దీనియోజించి-సర్వమీవు
అవల సలుపుము, నీయిష్ట-మనుసరించి .

గే॥ ఈప్రకారము నీకుకొరకై
యెంతయును గోప్యంబునౌ
జ్ఞానమును నేతెలియజేసితి
సర్వమాలోచించియుకా
నీకుతోచిన రీతి చేయుము
నిశ్చయించి మనస్సులో. .

అని కిరీటికి　　॥శ్రీహరిని

64) శ్లో॥ సర్వగుహ్యతమం, భూయః
శృణు మే పరమం వచః
ఇష్టోఽసి మే దృఢమితి
తతో వక్ష్యామి తే హితమ్...

ప.వి. సర్వగుహ్యతమం, భూయః, శృణు, మే, పరమం, వచః, ఇష్టః, అసి, మే, దృఢం, ఇతి, తతః, వక్ష్యామి, తే, హితః,.

టీ॥ భూయః-మరలను, సర్వగుహ్యతమం-పరమ రహస్యమైన దియును, పరమం-ఉత్తమమైనదియునునగు, మే-నాయొక్క, వచః-వాక్యమును, శృణు-వినుము, మే-నాకు, దృఢం-నిశ్చయముగాను, ఇష్టః-ప్రియుడవు, అసి + ఇతి-అయియున్నావని, తతః-అందువలనను, తే-నీకొరకు, హితం-హితమును, వక్ష్యామి-చెప్పుచున్నాను.

గ॥ అర్జునా నీవు నాకు మిక్కిలి ప్రియుడవు కావున నీక్షేమమునుగోరి, మరియొక పరమరహస్యమైన మాట తెలిపెద వినుము.

ప॥తే॥ అధిక ప్రేమమైన వాడవీ-వగుట వలన
నీదు క్షేమము గోరుచు-నిశ్చయముగ
నతిరహస్యము, శ్రేష్ఠమై-యలరు దాని
వినుము తెలిపెద, మరియొక్క-విషయమేను

గే॥ నీవు నాకతి ప్రియుడవు కావ
నేను నీక్షేమంబునే
కోరి తెలిపెద వినుమింకొకటి
గూఢమైనది మిక్కిలిగా

అని కిరీటికి ॥శ్రీహరిని

౬౫) శ్లో॥ మన్మనాభవ మద్భక్తో
మద్యాజీ మాం నమస్కురు
మామేవైష్యసి సత్యంతే
ప్రతిజానే ప్రియోఽసిమే.

ప.వి. మన్మనాః, భవ, మద్భక్తః, మద్యాజీ, మాం, నమస్కురు, మామ్, ఏవ, ఏష్యసి, సత్యం, తే, ప్రతిజానే, ప్రియః, అసి, మే.

టీ॥ మన్మనాః-నాయందు మనస్సు కలవాడవును, మద్భక్తః-నాయందు భక్తిగలవాడవును, మద్యాజీ-నన్నారాధించువాడవును, భవ-కమ్ము, మాం-నన్ను, నమస్కురు-నమస్కరింపుము, మాం + ఏవ-నన్నే, ఏష్యసి-పొందగలవు మే - నాకు, ప్రియః - ఇష్టుడవు, అసి-అయియున్నావు, తే - నీకు, సత్యం - సత్యమును, ప్రతిజానే-ప్రతిజ్ఞజేసి చెప్పుచున్నాను

గ॥ అర్జునా నాయందు మనస్సుగలవాడవును, నాయందు భక్తి గలవడవగుచు, నన్నే పూజించుచు, నాకు నమస్కారము చేయుము, అట్లు చేసితివేని, నీవు నన్నే పొందగలవు. నాకు ప్రియుడవగుట వలన సత్యము చెప్పితినని ప్రతిజ్ఞ చేయుచున్నాను

ప॥తే॥ నిలిపి నాయందు మనసును-నిశ్చలముగ
సలుపుచుండుము నాపూజ-సలుపు భక్తి
సలుపుచుండు మెపుడు నమ-స్కారములను
పొందగలవట్లు చేసిన-మోక్షమీవు
ప్రతిన సలుపుచు తెలిపితి-పార్థ నిజము

గే॥ నిలిపి నాపై మనసు నిత్యము
సలిపి భక్తిచె పూజలు

నాకుచేయుము వందనంబులు
నన్ను పొందెదు మీదటన్
ప్రతిన సలిపి వచించుచుంటిని
పరమ సత్యము భారతా
అని కిరీటికి ॥శ్రీహరిని

66) శ్లో॥ సర్వధర్మాన్ పరిత్యజ్య
మామేకం శరణం వ్రజ
అహంత్వా సర్వపాపేభ్యో
మోక్షయిష్యామి మా శుచః

ప.వి. సర్వధర్మాన్, పరిత్యజ్య. మామ్. ఏకమ్. శరణం, వ్రజ, అహం. త్వా. సర్వపాపేభ్యః, మోక్షయిష్యామి. మా. శుచః

టీ॥ సర్వధర్మాన్ - సమస్త ధర్మములను (కామ్యకర్మలను), పరిత్యజ్య-విడిచిపెట్టి, మాంఏకం-నన్నొక్కనినే, శరణం-శరణమును, వ్రజ-పొందుము, అహం - నేను, త్వాం - నిన్ను, సర్వపాపేభ్యః- సకల పాపముల నుండియు, మోక్షయిష్యామి - విడిపింపగలను, మాశుచః-దుఃఖపడకుము ....

గ॥ అర్జునా సర్వధర్మములను వదలి, నన్నొక్కనినే శరణు పొందుము, నేను నిన్ను సమస్త పాపములనుండి విముక్తుని జేసెదను, నీవు శోకింపకుము ..

ప॥తే॥ సర్వవిధముల ధర్మముల్-సన్యసించి
శరణుపొందుము నను నీవు-సవ్యసాచి

సకల పాపవిముక్తుని-సలుపగలను
విడిచియుండుము దుఃఖంబు-వీరవర్య

గే॥ అన్ని ధర్మములను త్యజింపుము
నన్నె శరణము పొందుమా
నిన్ను పాపవిముక్తు జేసెద
నీవు మానుము దుఃఖము॥
అని కిరీటికి ॥శ్రీహరిని

67) శ్లో॥ ఇదం తే నాతపస్కాయ
నాభక్తాయ కదాచన
న చాశుశ్రూషవే వాచ్యం
న చ మాంయోఽభ్యసూయతి

ప.వి. ఇదం, తే, న, అతపస్కాయ, న, అభక్తాయ, కదాచన. న, చ, అశుశ్రూషవే. వాచ్యం, న, చ, మాం, యః అభ్యసూయతి, .

టీ॥ తే-నీకొఱకు, ఇదం - చెప్పబడిన ఈజ్ఞానము, కదాచన-ఒకప్పుడును, అతపస్కాయ-తపశ్శీలుడు కానివాడికి, న + వాచ్యం-ఉపదేశింపదగదు, అభక్తాయ-భక్తుడు కానివానికి, అశుశ్రూషవే + చ-శుశ్రూషచేయనివానికి, (వినుట కిష్టము లేనివాడికి) నవాచ్యం-చెప్పతగదు, యః-ఎవడు, మాం - నన్ను, అభ్యసూయతి + చ - ద్వేషించుచున్నాడో,(తస్మై) చ-వానికిని, నవాచ్యం-చెప్పగూడదు.

గ॥ అర్జునా నీకు చెప్పిన యీగీతాశాస్త్రము తపస్సు చేయని వానికి, భక్తిలేనివానికి, వినుటకిష్టములేనివానికి, నన్ను ద్వేషించు వానికిని యెప్పుడు చెప్పకూడదు ..

ప॥తే॥ భక్తితపములు లేనట్టి-వారలకును
నన్ను నిందించు వారల-కెన్నడేని
వినుట కిష్టము లేనట్టి-వానికీవు
నీకు జ్ఞానంబు బోధింప-నేను తలచి
తెలిపియుండిన గీతను-తెలుపతగదు

గే॥ నీకు జ్ఞానము తెలుపుకొరకై
నేను మిక్కిలి ప్రియముతో
శ్రేష్ఠమైన గీతా శాస్త్రము
చెప్పియుంటిని పాండవా ॥శ్రీ॥
లేనివానికి భక్తిశ్రద్ధయు
వినతలంపని వానికిా
సలుపని వానికి తపమొకింత
తెలుపదగదు ధనంజయా
అని కిరీటికి ॥శ్రీహరిని

68) శ్లో॥ య ఇదం పరమం గుహ్యం
మద్భక్తేష్వభిదాస్యతి
భక్తిం మయి పరాంకృత్వా
మామేవైష్యత్యసంశయః

ప.వి. యః, ఇదం, పరమం, గుహ్యం, మద్భక్తేషు. అభిధాస్యతి, భక్తిం, మయి పరాం, కృత్వా. మామ్. ఏవ. ఏష్యతి. అసంశయః

టీ॥ యః-యెవ్వడు, పరమం-శ్రేష్ఠమైన, గుహ్యం-రహస్యమైనటువంటి, ఇదం-ఈగీతాశాస్త్రమును, మద్భక్తేషు-నా భక్తులయందు.

అభిధాస్యతి-చెప్పగలడో, సః - వాడు, మయి-నాయందు, పరాం-ఉత్తమమైన, భక్తిం-భక్తిని, కృత్వా-చేసి, అసంశయః-సంశయము లేనివాడై, మాం + ఏవ-నన్నే, ఏష్యతి-పొందగలడు

గ॥ అర్జునా శ్రేష్ఠమైన, రహస్యమైన, ఈ గీతాశాస్త్రమును నాభక్తులకెవడు చెప్పగలడో, వాడు నాయందుత్తమ భక్తి గలిగి, సంశయము లేనివాడై నన్నే పొందుచున్నాడు

ప॥తే॥　పరమగోప్యమౌ గీతను-భక్తిగలిగి
నాదుభక్తుల కెవ్వాడు-బోధజేయు
నాతడుత్తమ నాభక్తు-డగుచు, నన్నె
సంశయరహితుడై పొందు-సవ్యసాచి...

గే॥　పరమగోప్యము బహుశ్రేష్ఠమై
పరగు గీతా శాస్త్రముకా
నాభక్తులకు బోధజేసిన
నాకు మిక్కిలి భక్తుడై　॥అని॥
లేనివాడై సంశయంబును
లేశమైన మనస్సులో
పొందు నన్నే వాడు మీదట
పూర్ణ ప్రజ్ఞావంతుడై
అని కిరీటికి　॥శ్రీహరిని

69) శ్లో॥　న చ తస్మాన్మనుష్యేషు
కశ్చిన్మేప్రియకృత్తమః

భవితా న చమే తస్మా
దన్యః ప్రియతరో భువి

ప.వి. న, చ, తస్మాత్, మనుష్యేషు, కశ్చిత్, మే, ప్రియ కృత్తమః, భవితా, న, చ, మే, తస్మాత్, అన్యః, ప్రియతరః, భువి, ..

టీ॥ మనుష్యేషు - మనుష్యులయందు, తస్మాత్ - వానికంటె, మే - నాకు, ప్రియకృత్తమః - మిక్కిలి యిష్టము చేయువాడు, కశ్చిత్-ఒకడును, న + చ-లేడు, మే-నాకు, తస్మాత్-వానికంటె, అన్యః - ఇతరుడు, ప్రియతరః - మిక్కిలి ప్రియమైనవాడు, భువి-భూమియందు, న + చ + భవితా-కలుగబోడు

గ॥ అర్జునా యీగీతాశాస్త్రమును, నాభక్తుల కుపదేశించువాని కంటె, మానవులయందు, నాకు ప్రియము చేయువాడు వేరొకడు లేడు, వానికంటే ప్రియమైనవాడు భూమియందు ముందు కలుగబోడు

ప॥తే॥ ఆతనికంటె నాకిక ప్రియ-మాచరించు
వాడు, మానవులందున-లేడు భువిని
వానికంటెను ప్రియమైన-వాడు జగతి
ముందుకాలాన ఫల్గునా-పుట్టబోడు. .

గే॥ ఇట్టి గీతను నాదుభక్తుల
కెవడు తెలుపునో శ్రద్ధతో
వానికంటెను నాకు హితమును
వఱలజేసెడి వాడిలన్ ॥అ॥

మనుజులందున లేడు భారత
వానికంటెను ప్రియుడునౌ
వాడు పుట్టడు మనుజులందున
భావికాలమునందునుజా

అని కిరీటికి ॥శ్రీహరిని

70) శ్లో॥ అధ్యేష్యతే చ య ఇమం
ధర్మ్యం సంవాదమావయోః
జ్ఞానయజ్ఞేన తేనాఽహ
మిష్టఃస్యామితి మే మతిః

ప వి. అధ్యేష్యతే, చ, యః, ఇమం, ధర్మ్యం, సంవాదం, ఆవయోః, జ్ఞానయజ్ఞేన, తేన, అహం, ఇష్టః, స్యామ్, ఇతి, మే, మతిః,

టీ॥ ఆవయోః-మనయిద్దరియొక్క, ధర్మ్యం—ధర్మప్రయోజనమైన, ఇమం-ఈ, సంవాదం—సంవాదమును, యః-యెవడు, అధ్యేష్యతే + చ-అధ్యయనము చేయుచున్నాడో, తేన-వానిచేత, జ్ఞానయజ్ఞేన-జ్ఞానయజ్ఞముచేతను, అహం-నేను, ఇష్టః - పూజింపబడినవాడను, స్యాం-అగుదును, ఇతి-అని, మే - నాయొక్క, మతిః—నిశ్చయము

గ॥ అర్జునా యెవడు ధర్మయుక్తమైన మన యిరువురి సంవాదరూపమైన, యీగొప్ప గీతాశాస్త్రమును పఠించగలడో, అట్టివాడు జ్ఞానయజ్ఞముచేత నన్ను పూజించినవాడని నాయభిప్రాయము

[ 111

తే॥ పార్థ ధర్మయుక్తంబునై-పరగుచున్న
మన యిరువురి సంవాదంబు-నై నయట్టి
గ్రంథమెవరు పఠనచేయ-గలరో, వారు
జ్ఞానయజ్ఞాననను పూజ-సలిపినట్లె

గే॥ ధర్మయుక్తంబైన దగుచును
తనరు దీవిని నరులలో
నెవరు మనసంభాషణంబగు
యిట్టి గీతా శాస్త్రము॥
ప్రతిదినంబును పారాయణము
పరమభక్తితొ సలిపిన॥
జ్ఞానయజ్ఞముచేత పూజలు
సలిపిరనినను తలచెద॥

అని కిరీటికి ॥శ్రీహరిని

యజ్ఞములు నాల్గువిధములు .

1) విధియజ్ఞము.— శరీరముచే చేయఎగిన బ్రహ్మయజ్ఞాదులు.
2) జపయజ్ఞము.— నోటితో నుచ్చరించుట మొదలగు పారాయణాదులు ..
3) ఉపాంశుయజ్ఞము;— ఇతరులకు వినబడకుండ నోటితో యుచ్చరించుకొనుట .
4) మానసయజ్ఞము.— మనస్సుచే ధ్యానించుట యిదియే జ్ఞానయజ్ఞము. ఇది చాల శ్రేష్ఠమని పెద్దలు చెప్పుదురు

71) శ్లో॥ శ్రద్ధావాననసూయశ్చ
శృణుయాదపియో నరః
సోఽపి ముక్తశ్శుభాన్లోకాన్
ప్రాప్నుయాత్పుణ్యకర్మణామ్

ప.వి. శ్రద్ధావాన్, అనసూయః, చ, శృణుయాత్, అపి, యః, నరః, సః, అపి, ముక్తః, సుభాన్, లోకాన్, ప్రాప్నుయాత్, పుణ్యకర్మణామ్ .

టీ॥ యః-ఏ, నరః-మనుష్యుడు, శ్రద్ధావాన్-శ్రద్ధకలవాడును అనసూయః + చ-అసూయలేనివాడై, శృణుయాత్ + అపి-వినునో, సః + అపి — వాడును, ముక్తః - పాపకర్మములచేత విడువబడిన వాడునై, పుణ్యకర్మణాం - పుణ్యకర్మములను చేసిన వారియొక్క, శుభాన్ — పుణ్యమైన, లోకాన్ - లోకములను, ప్రాప్నుయాత్— పొందుచున్నాడు

గ॥ అర్జునా యెవడసూయలేక, భక్తిశ్రద్ధలతో యీగీతాశాస్త్రమును వినుచున్నాడో వాడు సర్వపాపవిముక్తుడై పుణ్యకర్మములొనరించిన వారియొక్క పుణ్యలోకము పొందుచున్నాడు

ప॥ తే॥ భక్తిగలిగి, యసూయను-పారద్రోలి
శ్రద్ధతోడను గీతను-సవ్యసాచి
వినినవాడు విముక్తుడౌ-వివిధ
ములచె, పుణ్యలోకంబును-పొందుచుండు

గే॥ ఏ మనుజుం డసూయలేకను
యిట్టి గీతా శాస్త్రమున్
భక్తిశ్రద్ధలతోడ వినినను

పావములు సంశూన్యమై
పుణ్యపురుషులు పొందులోకము
పొందునాతడు ఫల్గునా...
అని కిరీటికి ॥శ్రీహరిని

72) శ్లో॥ కచ్చిదేతచ్ఛ్రుతం పార్థ
త్వయైకాగ్రేణ చేతసా
కశ్చిదజ్ఞానసమ్మోహః
ప్రణష్టస్తే ధనంజయ

వ.వి. కచ్చిత్, ఏతత్, శ్రుతం, పార్థ, త్వయా, ఏకాగ్రేణ, చేతసా. కచ్చిత్, అజ్ఞానసమ్మోహః, ప్రణష్టః, తే, ధనంజయ

టీ॥ హేపార్థ - ఓయర్జునా ఏతత్—ఈనాచెప్పినది, త్వయా—నీచేతను, ఏకాగ్రేణ-నిశ్చలమైన, చేతసా-మనస్సుతో, శ్రుతం + కచ్చిత్-వినబడినదిగదా? హేధనంజయా-ఓయర్జునా, తే-నీయొక్క, అజ్ఞానసమ్మోహః-అజ్ఞానమువలన కలిగిన సమ్మోహము, ప్రణష్టః + కశ్చిత్-పోయినదిగదా?

గ॥ అర్జునా నాచేత చెప్పబడిన, గీతాశాస్త్రమును, నిశ్చలమైన మనస్సుతో, నీవు వినియున్నావుకదా? నీయజ్ఞానము వలన కలిగిన సమ్మోహము తొలగిపోయినదా? తెలుపుము

ప॥తే॥ నిలిపి నీదగు మనసును-నిశ్చలముగ
వింటివాపార్థ గీత, స-వి స్తరముగ
జ్ఞానలోపాన కలుగు, య-జ్ఞానమెల్ల
తొలగిపోయినదాయేమి-తెలుపు నాకు ..

గే॥ ఏకాగ్రమైన మనసుచేత
యిట్టి గీతా శాస్త్రముఁ
నీవు వింటివ సంపూర్ణముగ
నీదు యజ్ఞానంబుచే
కలిగియుండిన మోహమెల్లను
తొలగెనాయది తెలుపుమా

అనుచునడిగెను శ్రీకృష్ణుండు శ్రీహరిని శ్రీ

✳ అర్జునుని రణభూమిలో ✳

✳ అర్జున ఉవాచ — అర్జునుడు చెప్పుచున్నాడు ✳

73) శ్లో॥ నష్టో మోహఃస్మృతి ర్లబ్ధా
త్వత్ప్రసాదాన్మయాఽచ్యుత
స్థితోఽస్మి గతసందేహః
కరిష్యే వచనం తవ

ప.వి. నష్టం, మోహః, స్మృతిః, లబ్ధా, త్వత్ప్రసాదాత్, మయా, అచ్యుత స్థితః, అస్మి. గతసందేహః, కరిష్యే, వచనం తవ

టీ॥ హేఅచ్యుత - ఓ శ్రీకృష్ణపరమాత్మా, త్వత్ప్రసాదాత్- నీయనుగ్రహమువలన, మోహః - అజ్ఞానము, నష్టః - నశించినది, మయా-నాచేతను, స్మృతిః-ఎరుక, (జ్ఞానము) లబ్ధా—పొందబడినది, గతసందేహః-సందేహనివృత్తి గలవాడనై స్థితః — ఉన్నవాడను. అస్మి—అగుచున్నాను. తవ-నీయొక్క. వచనం-వాక్యమును, (ఆజ్ఞను) కరిష్యే-చేయుదును .

గ॥ ఓశ్రీకృష్ణా నీయనుగ్రహమువలన నాయవివేకము తొలగి పోయెను. జ్ఞానము కలిగినది సంశయము తొలగినది. నీయాజ్ఞను నెరవేర్చెదను

ప॥తే॥ పరమపూరుష జగదీశ-పద్మనాభ
నీదు కరుణచే తొలగెను-నిఖిలమైన
సంశయము, అవివేకము-జ్ఞానమొదవె
నీదుయాజ్ఞను నెలవేర్తు-నీరజాక్ష.

గే॥ నాయజ్ఞానము తొలగిపోయెను
నీయనుగ్రహ మహిమచే
సందేహములు తొలగిపోయెను
పొందితిని నేజ్ఞానముగా
నీయాజ్ఞను శిరసావహించి
చేయనుంటిని సిద్ధుడై
అనివచించెను కృష్ణమూర్తితో—అర్జు శ్రీహరిని శ్రీ...

✱ సంజయ ఉవాచ — సంజయుడు చెప్పుచున్నాడు ✱

74) శ్లో॥ ఇత్యహం వాసుదేవస్య
పార్థస్య చ మహాత్మనః
సంవాదమిమమశ్రౌష
మద్భుతంరోమ హర్షణమ్...

ప.వి. ఇతి, అహం, వాసుదేవస్య, పార్థస్య, చ, మహాత్మనః, సంవాదం, ఇమం, అశ్రౌషం, అద్భుతమ్, రోమహర్షణమ్

టీ॥ అహం-నేను, ఇతి-ఇట్లు, మహాత్మనః - మహాత్ముడగు, వాసుదేవస్య - శ్రీకృష్ణుని యొక్కయు, పార్థస్య + చ - అర్జుని యొక్కయు, అద్భుతం - ఆశ్చర్యకరమైనదియును, రోమహర్షణం-పులకింపజేయునదియునగు, ఇమం-ఈ, సంవాదం-సంభాషణమును. అశ్రౌషం-వింటిని.

గ॥ ఓధృతరాష్ట్ర మహారాజా, అద్భుతమైనట్టదియును, పులకాంకురములు కలుగజేయునట్టిదియును, మహాత్ముడగు శ్రీకృష్ణుని యొక్కయు, అర్జునియొక్కయు, సంవాదరూపమైన గీతాశాస్త్రమును నేను వింటిని

ప॥తే॥ అద్భుతంబైనయది, రోమహర్షణమును
కలుగజేసెడిదై నట్టి,-కమలనాభు,
డర్జునులయొక్క, సంవాద-మంత నేను
వింటి గీతను, వీనుల-విందుగాను...

గే॥ ఈప్రకారము కృష్ణార్జునుల
యీయద్భుత సంవాదమ్
యేనువింటి గీతాశాస్త్రము
మేను పులకితమొందగా
అనుచు ధృదరాష్ట్రునికి తెలిపెను
అచట సంజయు డంతయు॥

॥శ్రీహరిని శ్రీ ..

76) శ్లో॥ వ్యాసప్రసాదా చ్ఛుతవా

యోగం యోగేశ్వరాత్కృష్ణా
త్సాక్షాత్కథయతః స్వయమ్

ప వి. వ్యాసప్రసాదాత్, శ్రుతవాన్, ఏతత్, గుహ్యం, అహం, పరం యోగం, యోగేశ్వరాత్, కృష్ణాత్, సాక్షాత్, కథయతః, స్వయమ్

టీ॥ వ్యాసప్రసాదాత్-వ్యాసానుగ్రహము వలనను, గుహ్యం_రహస్యమైనదియును, పరం-శ్రేష్ఠమైనదియును అగు, ఏతత్_ఈ, యోగం_యోగశాస్త్రమును, స్వయం - స్వయముగను, కథయతః_చెప్పినటువంటియు, యోగేశ్వరాత్-యోగేశ్వరుడైనట్టియు, కృష్ణాత్-కృష్ణునివలన, అహం-నేను, సాక్షాత్-ప్రత్యక్షముగను, శ్రుతవాన్-విన్నవాడనైతిని .

గ॥ ఓరాజా యోగేశ్వరుడును, శ్రీభగవంతుడగు, శ్రీకృష్ణ పరమాత్మ స్వయముగా చెప్పిన, అతిరహస్యమైన శ్రేష్ఠమైన, యోగశాస్త్రమును శ్రీవేదవ్యాసుని అనుగ్రహమువలన నేను స్వయముగా వింటిని

ప॥తే॥ పరమగోప్యంబు, శ్రేష్ఠమై-పరగుచున్న
యోగశాస్త్రంబు వింటిని-బాగుగాను
పరమ పురుషుండు కృష్ణుండు-పలుకుచుండ
వ్యాసభగవాను కరుణచే-స్వయముగాను

గే॥ శ్రీభగవంతుడు యోగీశుడు
శ్రీకృష్ణుండు స్వయముగా
చెప్పియుండిన యోగశాస్త్రము
శ్రేష్ఠమై గుహ్యంబునౌ

పరిపూర్ణంబుగ స్వయముగా
పరమ పురుషుడు పలుకగా
వేదవ్యాసమహాత్మ కృపచే
వింటి గీతను పూర్తిగా

అనుచు ధృతరాష్ట్రునికి తెలిపెను — అచట సంజయుడు.

శ్రీహరిని శ్రీ

76) శ్లో॥ రాజం సంస్మృత్య సంస్మృత్య
సంవాదమిమమద్భుతం
కేశవార్జునయోః పుణ్యం
హృష్యామిచ ముహుర్ముహుః

ప వి. రాజం, సంస్మృత్య, సంస్మృత్య, సంవాదం, ఇమం, అద్భుతం, కేశవార్జునయోః, పుణ్యం, హృష్యామి, చ, ముహుర్ముహుః,

టీ॥ హేరాజన్-ఓధృతరాష్ట్ర మహారాజ, పుణ్యం-పుణ్యప్రదమైనటువంటి, ఇమం-ఈ, అద్భుతం-ఆశ్చర్యకరమైన, కేశవార్జునయోః-శ్రీకృష్ణార్జునులయొక్క, సంవాదం-సంవాదమును, సంస్మృత్య-సంస్మృత్య - తలచి, తలచి, ముహుర్ముహుః - మాటమాటకిని, హృష్యామి + చ-సంతోషించుచున్నాను

గ॥ ఓధృతరాష్ట్ర మహారాజా, ఆశ్చర్యకరమైనదియు, పావనమైనదియునగు శ్రీకృష్ణార్జునులయొక్క యీసంవాదమును, తలచి, తలచి, మాటిమాటికి, నేనానందమును పొందుచున్నాను

ప॥తే॥ అద్భుతంబును పావనమైనదైన
ఫల్గునుండు శ్రీకృష్ణసం-భాషణంబు
మాటిమాటికి తలచుచు,-మనసునందు
పొందుచుంటి నానందము-పూర్తి రాజ

గే॥ అద్భుతంబును పవిత్రంబును
యయిన శ్రీకృష్ణార్జునుల
యీసంవాదము తలచి తలచి
యేను సంతోషించెదఞ

అనుచు ధృ ॥శ్రీహరిని

77) శ్లో॥ తచ్చ సంస్మృత్య సంస్మృత్య
రూపమత్యద్భుతం హరేః
విస్మయోమే మహాన్ రాజన్
హృష్యామి చ పునః పునః ..

ప.వి. తత్. చ, సంస్మృత్య, సంస్మృత్య, రూపం, అతి, అద్భుతం, హరేః, విస్మయః, మే, మహాన్, రాజం, హృష్యామి, చ, పునః, పునః, ..

టీ॥ హేరాజం - ఓధృతరాష్ట్ర మహారాజా, హరేః - శ్రీకృష్ణుని యొక్క, అత్యద్భుతం-మిక్కిలియద్భుతమైన తత్-ఆ, రూపం + చ-విశ్వరూపమును, సంస్మృత్య, సంస్మృత్య - తలచితలచియును, మే-నాకు, మహాన్-అత్యంతమైన, విస్మయం-ఆశ్చర్యముకలుగుచు, పునః పునః + చ-మాటిమాటికిని, హృష్యామిచ-సంతసించుచున్నాను,

గ॥ ఓరాజా శ్రీకృష్ణమూర్తియొక్క అద్భుతమైన విశ్వరూప మును, తలచినకొలది, నాకు అధికమైన ఆశ్చర్యము కలుగుచున్నది, మాటిమాటికి సంతసము కలుగుచున్నది .

ప॥తే॥　మాధవుని విశ్వరూపంబు-మరల మరల
తలప నాశ్చర్యమగుచుండు-ధారుణీశ
మానసంబున తలచుచు-మరల నేను
పొందుచుంటిని హర్షంబు-పూర్తిగాను

గే॥　శ్రీభగవానుని విశ్వరూపము
చేయసారెకు ధ్యానముఁజా
కలుగుచున్నది యాశ్చర్యంబును
కలుగుచున్నది సంతసమ్....

78) శ్లో॥　యత్రయోగేశ్వరః కృష్ణో
యత్ర పార్థో ధనుర్ధరః
తత్ర శ్రీర్విజయోభూతి
ర్ధ్రువా నీతిర్మతిర్మమ

ప.వి. యత్రయోగేశ్వరః కృష్ణః, యత్ర, పార్థః, ధనుర్ధరః, తత్ర, శ్రీః, విజయః, భూతిః, ధ్రువా, నీతిః, మతిః, మమ,

టీ॥ యత్ర-ఎచ్చట, యోగేశ్వరః-యోగేశ్వరుడగు, కృష్ణః-శ్రీకృష్ణమూర్తి, (ఉండునో) యత్ర-ఎచ్చట, ధనుర్ధరః-ధనస్సును,

ధరించిన, పార్థః-అర్జునుడు. (ఉండునో) తత్ర - అచ్చట, శ్రీః - లక్ష్మియు, విజయః - విజయము, భూతి - ఐశ్వర్యము, ధ్రువా - స్థిరమగు, నీతిః-నీతియును.(ఉండును) ఇతి-అని, మమ-నాయొక్క, మతిః-అభిప్రాయము .

గ॥ రాజా యెచ్చట యోగేశ్వరుడగు శ్రీకృష్ణపరమాత్మయు, ధనుర్ధరుడైన అర్జునుడు యున్నారో, అచ్చట సంపదయు, జయము, ఐశ్వర్యము, స్థిరమగు నీతియు, యుండునని నాయభిప్రాయము.

ప॥తే॥ ఎచట యోగేశ్వరుండగు-కృష్ణమూర్తి
ధమవు ధరియించి, విజయుండు-దనరుచుండు
అచట భూతియు, నీతి, జ-యంబు, శ్రీయు
నిశ్చలముగ నిలుచునని-నేను దలతు

గే॥ ఎచ్చోట యోగీశ్వరుడగు
ఈ శ్రీకృష్ణమూర్తియు॥
ధనుర్ధరుడగు పార్థుడుండునో
తప్పదక్కడ విజయము॥
ఐశ్వర్యము శ్రీయును నీతియు
యచలమై యలరారెడి॥

అనుచు ధృతరాష్ట్రునికి తెలిపెను-అచట సంజయుడంతయు॥

శ్రీహరిః శ్రీ

గ॥ ఇది శ్రీ కవిరత్న రత్నాకరము వెంకటేశ్వర కవి విరచితమై, గద్య పద్య గేయరూపంబును, శ్రీ కృష్ణార్జునుల సంవాదంబగు, శ్రీ భగవద్గీతా గద్య పద్య గేయామృతము నందు మోక్ష సన్న్యాస యోగమను పదునెనిమిదవ అధ్యాయము సంపూర్ణము.

హరిః ఓమ్ తత్సత్ హరిః ఓమ్

శాంతిః శాంతిః శాంతిః



# ఫలశ్రుతి

గే॥ శ్రీయుతు శ్రీ హొమ్మాబ్రాజుకు
శేషమాంబకు పుత్రుడౌ
వెంకటేశ్వర కవి రచితమై
వెలయు శ్రీభగవద్గీత
గద్య పద్య గేయామృతమును
కలిగి శ్రద్ధాభక్తితో
అనుదినంబు పఠింప తొలగును
ఆపదలు పాపంబులుగా శ్రీ.
అశుభమగు సంసారబంధము
లన్నియును పరిహారమౌ
తామసంబు తొలంగిపోవును
తాపములు తెగి ముక్తుడౌ శ్రీ.
మాసతీమణితోడ కృష్ణుడు
మంగళము చేకూర్చుచుగా
కదలకుండును మీగృహంబును
కరుణతో కలకాలముగా
శ్రీహరిని శ్రీకృష్ణమూర్తిని
చిత్తమందు భజించెదగా
అశుభమగు సంసారబంధము
లన్నియును తొలగింపగా...

కం॥ అనయము గీతాశాస్త్రము
వినిన, పఠించినను ముక్తి-విభవము కలుగుఁ
ఘనభవ భయము తొలంగును
మనమున కానంద మొదవు మాధవు కృపచే

## భరత వాక్యము

భరతదేశము పాలకులు ద్విజ
బ్రాహ్మణులు గోగణములుఁ
ఆయురారోగ్యంబు సుఖముగ
నందరును వర్ధిల్లగా
గంగా యమున కావేరియును
తుంగభద్రా కృష్ణయుఁ
బ్రహ్మపుత్రయు గోదావరియు
ప్రబలుచును ప్రవహించుచుఁ
సస్యశ్యామలమై దేశము
సంపదల విలసిల్లగా
కాచి సంరక్షించు కృష్ణుడు
కరుణతో కలకాలముఁ

## మంగళము

మంగళం శ్రీవిశ్వరూపా
మంగళము చిత్స్వరూపా
మంగళము శ్రీకృష్ణమూర్తికి

మంగళము శ్రీశౌరికిన్
మంగళము వైకుంఠవాసికి
మంగళము భువనాళికిన్
మంగళము శ్రీమధురవాసికి
మంగళము మాధవునకున్
మంగళము జయమంగళము జయ
మంగళము జయమంగళం....

కం॥ మంగళము నందనందన
మంగళ మహిరాజశయన-మధుమదదమనా
మంగళమిందు నిభానన
మంగళ మరవిందనయన-మాధవకృష్ణా
శ్రీహరిని.

హరిః ఓమ్ తత్సత్ హరి ఓమ్
శాంతిః శాంతిఃశాంతిః



## ము



## మూ

హరిః ఓమ్ తత్సత్

హరిఃఓమ్ శాంతిః శాంతిః శాంతిః

సూచన:— ఈ శ్లోకానుక్రమణిక భగవద్గీతలో ప్రతి శ్లోకమునకు నాలుగు పాదములుండును. ఈ నాలుగు పాదముల యందుగల అకారాద్యక్షరముల నారంభించి, రచింపబడియున్నందున, అనుక్రమణికను చూచువారే శ్లోకములో యే పాదమునైనను, యే వాక్యములోనైనను చూడవచ్చును. ఏ శ్లోకములో యే పాదము జ్ఞాపకమున్న ఆకారాద్యక్షర క్రమములో అనుక్రమణికను చూచిన యేయధ్యాయము యెన్నవ శ్లోకమని గుర్తించి ఆశ్లోకము అపాదమును గద్యము, పద్యము, గేయములన్నిటిని చూడవచ్చును ...

సంపూర్ణము

హరిః ఓమ్ తత్సత్

హరిఃఓమ్ శాంతిః శాంతిః శాంతిః

